# కవీయ భావప్రకాశిక

(ప్పకవీయ తృతీయాశ్వాస వళిప్రాస పరిచ్ఛేద వివరణము)

విద్వాన్

రావూరి దొరసామిశర్మ, ఎం. ఏ. బి. ఓ. ఎల్.

ఆంధ్రోపన్యాసకులు, వైష్ణవ కళాశాల, మదరాసు



త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్

# అప్పకవీయ భావప్రకాశిక

(అప్పకవీయ తృతీయాశ్వాస వళిప్రాస పరిచ్ఛేద వివరణము)

1464

విద్వాన్
రావూరి దొరసామిశర్మ, ఎం. ఏ., బి. ఓ. ఎల్.
ఆంధ్రోపన్యాసకులు, వైష్ణవ కళాశాల, మదరాసు



త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్
మచిలీపట్నం - 521 001

# సమీక్ష

Dr. D. VENKATAVADHANI, M.A. (Hons.), Ph. D.
Prof. and Head of the Dept. of Telugu
Osmania University
HYDERABAD

ఆంధ్ర లక్షణ గ్రంథములలోనికెల్ల మిక్కిలి ప్రచారము నందినది అప్పకవీయము. దీనిని రచించినవాఁడు కాకునూరి అప్పకవి. ఇతని నివాసస్థలమును గూర్చి రెండు భిన్నవాదము లున్నవి. కొందఱితఁడు గుంటూరు మండలము నందలి పల్నాడు తాలూకాకుఁ జెందినవాఁడని చెప్పుచుండ మఱి కొందఱు తెలంగాణము నందలి మహబూబునగరమండలమునకుఁ జెందినవాఁడని భావించుచున్నారు. ఇందేది నిజమో నిశ్చయించుట కష్టము. ఇతఁ డప్పకవీయమును తంగెడుసీమయందలి కామెపల్లి గ్రామమున వెలసినవాఁడును, దన కిష్ట దైవము నైన గోపాలస్వామి కంకితము కావించెను. ఇతఁడు శాలివాహన శకమునకుఁ జెందిన 1578వ సంవత్సరమునకు సరియైన మన్మథ సంవత్సరమున శ్రావణ బహుళదశమినాఁ (5-8-1656) డీ గ్రంథమును రచింప నారంభించినట్లు గ్రంథ పీఠికలోఁ జెప్పుకొని యున్నాఁడు.

అప్పకవి రచించిన గ్రంథమగుటచే దీని కప్పకవీయ మనియే లోకమున విశేష ప్రచారమున్నది. కాని ఆశ్వాసాంత గద్యలలో దీనిపే రాంధ్ర శబ్ద చింతామణియను వ్యాకరణశాస్త్ర మని చెప్పఁబడియున్నది. భగవంతుఁ డప్పకవికి స్వప్నమునఁ గనఁబడి ఆంధ్ర శబ్ద చింతామణిని దెనిఁగింపు మని యానతిచ్చెనఁట. తరువాత బాలసరస్వతి రచించిన టీకతోఁ గూడిన ఆంధ్ర శబ్ద చింతామణిని బ్రాహ్మణుఁ డొకఁడు గొనివచ్చి అప్పకవి కిచ్చి యుండెను. అప్పకవి యా టీక నాధారముగాఁ జేసికొని ఆంధ్రశబ్ద చింతామణిని దెనిఁగింప నారంభించెను. ఆంధ్రశబ్ద చింతామణి సంస్కృతమున నార్యావృత్తములలో వ్రాయఁబడిన తెలుఁగు వ్యాకరణము. దీని కర్తృత్వమును గూర్చి వాదోపవాదములున్నవి. అప్పకవికి మాత్రమిది నన్నయభట్టు కృతమేయని నిశ్చితమైన యభిప్రాయము. ఇందు మొత్త మైదు పరిచ్ఛేదము లున్నవి. అప్పకవి దీనిని బూర్తిగా ననువదించెనో లేదో తెలియదు. ప్రస్తుతము లభ్యమగుచున్న అప్పకవీయమున నిందలి సంజ్ఞా సంధి పరిచ్ఛేదములు రెండింటికే అనువాదము కనఁబడుచున్నది. సంజ్ఞా పరిచ్ఛేదమునందలి "ఆద్యోవళిః ద్వితీయోవర్ణః ప్రాసః" అనునొక ఆర్యయందలి భాగమును బెంచి అప్పకవి యతిప్రాస భేద వివరణముతోఁ గూడిన తృతీయాశ్వాసమును రచించెను. 'ఇమ్ముగ వర్ణ పరిచ్ఛేదంబునఁ జెప్పంగఁబడియెఁదగనేక శ్లోకంబున ముఖ్యవళి ప్రాసంబులు సంక్షేపములుగ, నని అప్పకవి తృతీయాశ్వాసమందలి 3 వ పద్యమున నాంధ్రశబ్ద చింతామణి యందలి వర్ణ పరిచ్ఛేదము నందొక శ్లోకమున ముఖ్య యతిప్రాస

ములు సంక్షేపముగఁ జెప్పఁబడినవని సూచించియున్నాఁడు. కాని యా శ్లోకమున వళిప్రాసముల నిర్వచనము మాత్రమే యున్నది. అందు వళిప్రాసభేదములు వివరింపఁబడి యుండలేదు. అప్పకవీయమునందలి చతుర్థాశ్వాసము పద్యపరిచ్ఛేదము. అప్పకవి తన గ్రంథమును వ్యాకరణశాస్త్రమనియే పేర్కొన్నను యతిప్రాస పద్య వివరణాదులను బట్టి దీనికి ఛందోగ్రంథమనియే లోకమున ప్రాచుర్యము కలిగినది.

అప్పకవీయమందలి వళిప్రాసపరిచ్ఛేదముతోఁ గూడిన తృతీయాశ్వాసము నాంధ్ర పండితులందఱును దప్పక పఠింతురు. యతిప్రాసలను గూర్చి యింత వివరముగా, స్పష్టముగా, లక్ష్య లక్షణ సమన్వితముగాఁ జెప్పిన గ్రంథము తెలుఁగున నింకొకటి లేకపోవుటయే యిందుకుఁ గారణము. అప్పకవి తనకు ముందున్న ఛందోగ్రంథములన్నియు వెదకి సంపాదించి వాని సారమెల్ల నిందుఁ జొప్పించి యున్నాఁడు. అందుచేతనే యతఁడు తన గ్రంథము చదివిన పిమ్మటఁ బండితులకు మఱియొక గ్రంథమును జదువవలెనను బుద్ధి పొడదమని ధైర్య ప్రత్యయములతోఁ జెప్పుకొని యున్నాఁడు. సర్వ పండితజన పఠనీయమైన యీ వళిప్రాస పరిచ్ఛేదమునకు బ్ర. శ్రీ వేదుల రామశాస్త్రి గారొక వివరణము రచించి యింతకుముందే ప్రచురించి యున్నారు. పండితాగ్రగణ్యులును ఆంధ్రచ్ఛందో గ్రంథములను గూర్చి విశేష పరిశోధన చేసినవారునగు శ్రీరావూరి దొరస్వామి శర్మగారు మఱల నా పరిచ్ఛేదమునకే యనేక నూత్న విషయములతోఁ గూడిన 'అప్పకవీయ భావ ప్రకాశిక' యను నీ వివరణమును రచించియున్నారు. విద్వాంసులకును విద్యార్థులకును ననేక విధముల నుపయోగ పడఁగల యీ వివరణము కూలంకషమై, వివిధ విషయ విన్యాసవిరాజమానమై శ్రీదొరస్వామి శర్మగారి పాండిత్య ప్రతిభలను బరిశోధన పాటవమును జక్కఁగా వెల్లడి చేయుచున్నది.

అప్పకవీయ తృతీయాశ్వాసమున లక్ష్య లక్షణ వివరణాత్మకములైన గద్య పద్యములు సుమారు నాలుగువందలున్నవి. అందు లక్షణభాగమంతయు నప్పకవి చెప్పినదే. అతఁడు పెక్కుచోట్ల లక్ష్యములను గూడ తానే చెప్పియుఁ బ్రామాణికులైన పూర్వకవుల గ్రంథములనుండి యనేక పద్యములను లక్ష్యములుగాఁ జూపియున్నాఁడు. అతఁ డుదాహరించిన పద్యము లేయే గ్రంథములనుండి గ్రహింపబడినవో వానిపట్టిక యీ వివరణము చివర నొసంగబడియున్నది. పూర్వకవి గ్రంథములనుండి గ్రహింపఁబడిన యీ లక్ష్య సముదాయము మూలముననే అప్పకవి లక్షణ గ్రంథమున కధికమైన ప్రామాణికత్వము చేకూరినది. శ్రీదొరస్వామి శర్మగా రప్పకవి యొసంగిన లక్ష్య లక్షణ పద్యములన్నింటికిని వివరణ మొసంగి పరిశోధనాత్మకములైన విశేషములను గూడఁ జూపియున్నారు. అవసరమని తోఁచిన చోట్లఁ గొన్ని పద్యములకు టీకయనుపేరఁ బ్రతిపదార్థమును సైతము వ్రాసియున్నారు. అందుచే నీ వివరణము విద్యార్థులకుఁ గూడ నప్ప

కవీయమునందలి వళిప్రాస భేదములను సుబోధములును గరతలామలకములును గావించుచున్నది. నిజమునకు దాని నోపికతోఁ జదివినచో నింత గురుసన్నిధిని గూర్చుండి వానిని జదువవలసిన యావశ్యకముండదు.

అప్పకవి యీ యాశ్వాసమున 41 యతిభేదములను 17 ప్రాసభేదములను చెప్పి యున్నాఁడు. పూర్వ లాక్షణికులలో వేములవాడ భీమకవి 10 యతి భేదములను, అనంతామాత్యుఁడు 24 యతిభేదములను, చిత్రకవి పెద్దన లక్షణ సార సంగ్రహమున 27 యతిభేదములను జెప్పియున్నారు. అప్పకవి యవి యన్నియుఁ బరిశీలించి వానికి మఱికొన్ని భేదములను జేర్చి మొత్తము 41 యతి భేదములను వివరించి యున్నాఁడు. అట్లే ప్రాసవిషయమునఁ గూడ నతఁడు సంఖ్యను బెంచియున్నాఁడు. నిజము పరిశీలించినచో నన్ని యతి ప్రాసభేదములను జెప్పవలసిన యవసరములేదు. వానిలో నన్యములచే గతార్థములగు వానిని గొన్నింటిని దొలగింపవచ్చును. అప్పకవి స్పష్టతకై వానిని వేఱు వేఱుగా జెప్పియుండును. శ్రీ దొరస్వామి శర్మగారు లెస్సగాఁ బరిశీలనచేసి యప్పకవి చెప్పిన యేయే భేదము లనవసరములో, యేవి యెందంతర్భవించునో, వేనిని దొలఁగింప వచ్చునో తమ వివరణమునఁ దెల్పియున్నారు. కొన్నిచోట్ల అప్పకవి చెప్పని విశేషములనుగూడ వారు సూచించి యున్నారు. మవర్ణ విరామమున పూర్ణబిందు పూర్వకములైన యరలవశషసహ లకును మకారముతో యతి చెల్లునని అప్పకవి చెప్పియున్నాఁడు. దీనినిబట్టి యచ్చటి పూర్ణబిందువు మకారముతో సమానమని యూహింపవచ్చును. అందుచే శ్రీ శర్మగారీ పూర్ణానుస్వార సంబంధమును బట్టి బిందుపూర్వకములైన యంతస్థోష్మముల కెల్ల యతి చెల్లవచ్చునని సూచించి స్వకల్పితమైన లక్ష్య మొసంగియున్నారు. ఈ సూచన యెంతయు సమంజసమై శ్రీ శర్మగారి పరిశీలన పాటవమును సూచించుచున్నది. నిజమునకు బిందుపూర్వకములైన యంతస్థోష్మములకే కాక బిందుపూర్వకములైన పఫబభలకును ఒండొంటితో యతి చెల్లునని చెప్పవచ్చును.

ప్రత్యేకయతి సందర్భమున 'చేతిది' ఇత్యాదులందు గూఢమైన అకారమునకు యతిచెల్లుట యుక్తమని శ్రీ శర్మగారు సూచించుట మిక్కిలి యుచితముగా నున్నది. అట్టిచోట్ల నుభయయతి చెల్లునని సింహాసన ద్వాత్రింశికలో కొఱవి గోపరాజు చెప్పుట దీనికి బలము చేకూర్చుచున్నది. "అనఁగఁదన్మూలమె-ట్టిదియొ యనఁగ" అని సూరన ప్రయోగమును జూపి యది తరువాత దిద్ది వేయఁబడినదని వారు తెల్పినారు. అట్లే భిన్నయతి, పెఱయతి అను యతి భేదములను జెప్పుటలో నావశ్యకము లేదనియు, ఇంచుగాగమము వచ్చునప్పుడు కూడ నుభయయతిని జెప్పుట యుక్తమనియు వారు సూచించుట యౌచిత్య శోభితమై యున్నది. స్వరయతులలో వృద్ధివళి సందర్భమున అఆ లకు ఐఔలు పరములగునపు డుభయస్వరయతికి ప్రసక్తిలేదని వారు హెచ్చరించుట వారి విషయపరిశీలన నైశిత్యమును జాటుచున్నది.

అప్పకవి అంత్యోష్మ సంధివిరమణమును వికల్పయతిని వేఱువేఱుగాఁ జెప్పియుండెను. వాక్ + హరి అనువానికి సంధిచేసినచో వాగ్ఘరి, వాగ్హరి అని రెండు రూపములును వచ్చుట కవకాశమున్నది. అట్లే ఏతత్ + మురారి అను వానిని కలుపునప్పుడు ఏతన్మురారి, ఏతద్మురారి అను రెండు రూపములును రావచ్చును. ఈ రెండును వికల్ప సంధులే కావున అప్పకవి అంత్యోష్మ విరమణ మునుగూడ వికల్పయతిలోనే అంతర్భవింపఁజేసి యుండవలసినదని శ్రీ శర్మగారు సూచించియుండిరి. చిత్రకవి పెద్దన, కూచిమంచి తిమ్మకవి మున్నగు వారట్లే చేసియుండిరి. అనంతామాత్యుఁడు వానిని వేఱువేఱుగాఁ జెప్పియుండుటచేతను, స్పష్టముగా నుండునను హేతువుచేతను అప్పకవి వానిని గలుపక పృథక్కరించి యుండెను. అప్పకవి వికల్పయతిలో తకారమున కాదేశమైన నకారమునకు మాత్రమే లక్ష్యములు చూపియుండెను. శ్రీ శర్మగారు ఙకారమున కాదేశమైన ఙకారమునకుఁ గూడ పూర్వకవి లక్ష్యములు చూపియుండిరి. ఇట్లప్పకవి తనకు జ్ఞప్తికి రాకయో, పెక్కులక్ష్యము లెందుకనియో, పరిశీలన కవకాశము లేకయో పూర్వ కవిలక్ష్యములు చూపని చోట్ల శ్రీ శర్మగారు వానిని జూపి తమ ప్రయోగ పరిజ్ఞాన పాటవమును ప్రదర్శించియుండిరి. విశేషయతి కప్పకవి తిక్కనగారి ప్రయోగ మొక్కటియే చూపెను. శ్రీ శర్మగారు కాశీఖండము, పండితారాధ్య చరిత్రము, రుక్మాంగద చరిత్రము మున్నగు గ్రంథములనుండి కూడ నుదాహరణ ముల నొసంగి యున్నారు. తిక్కనగారి పద్యమునకు పాఠాంతరమును జూచి విశేషయతి నంగీకరింపనివారు కొందఱుండుటచే నిట నవ్యకవుల గ్రంథములనుండి లక్ష్యముల లొసంగవలసిన యావశ్యక మెంతైన నున్నది. అట్లే లఘుద్విత్వ ప్రాసమున నప్పకవి స్వీయ లక్ష్యమును మాత్రమే చూప శ్రీ శర్మగారు నాచన సోమనాథుని యుత్తరహరివంశము నందలి లక్ష్యము నుదాహరించి దానికి ప్రామా ణికత్వము చేకూర్చిరి.

శ్రీ శర్మగా రప్పకవి యతిప్రాసభేదముల కిచ్చిన నామములు సార్థకము లుగా లేనప్పు డతని పొరపాటు తెల్పి సరియైన పేరు సూచించియున్నారు. పఫ బభమ లొకే వర్గమునకుఁ జెందినవి. అయ్యును మకారమున కితర వర్గాక్షర ములతో యతి చెల్లదు. కొందఱట్టి యతి నంగీకరించిరి. అప్పకవి దానికి సమ్మ తింపక దానికి అగ్రాహ్యభేదవర్గయతి యని పేర్కొనెను. అది యుక్తమే కాని రలలయతిని గూడ నతఁడిందే చేర్చెను. రల లొకే వర్గమునకుఁ జెందినవి కావు. అందుచే శ్రీ శర్మగారు దీని నగ్రాహ్యభేదయతి యనవలె నని సూచించి నారు. అట్లే వారగ్రాహ్య వర్ణచతుష్టయవళియనుదాని నగ్రాహ్యాంతస్థోష్మ యతి యనుట సముచితముగా నుండునని తెల్పియున్నారు. ప్రాసభేదము లలో లఘుయకార ప్రాసమును లఘ్వలఘు యకార ప్రాసమని పేర్కొనుట యుక్తతరమని వారు తమ యభిప్రాయము వ్యక్తముచేసి యున్నారు. అగ్రాహ్య సంబంధ వళులలో నప్పకవి "దడలకు భేదము లెంచక" యను పద్యమున

దొడిఁబడి యనుపదము నందలి 'దొ' కును డులి యనుపదమునందలి 'డు' కును యతి సమ్మతము కాదని వివరించెను. శబ్దకల్పద్రుమ నిఘంటువులో డులి యను దానికి దులి యను దాదేశ రూపము చెప్పఁబడి యుండుటచే నిందలి యతి గ్రాహ్యమే యనియు, నప్పకవి దులియను రూపమును జూచి యుండని కారణమున నట్లు చెప్పియుండుననియు శ్రీ శర్మగారు సూచించి యున్నారు. ఈ సందర్భముననే అప్పకవి తాను యతిభేదములలోఁ బేర్కొని యుండని ఆదేశ యతిని బేర్కొని యుండుటకు వారు విస్మయము వెలిబుచ్చియున్నారు. సంయుతాసంయుత ప్రాస సందర్భమున నప్పకవి "పాఁడి-తండ్రి-వేఁడు-పండ్లు" అనువానిని లక్ష్యముగా నిచ్చియుండెను. ఇట సంయుతాసంయుత ప్రాస కుదాహరణమున్నది కాని ఒకచోట నఱసున్నయు నొకచోట నిండుసున్నయు నుండుటచే నసమప్రాసయగుచున్న దనియు, దీని నప్పకవియే యంగీకరించి యుండలేదనియు, లకార సంయుక్తమునకు పూర్వకవి ప్రయోగములు మృగ్యమనియు శ్రీ శర్మగారు విమర్శించి యుండిరి. ప్రాసకును ప్రాసయతికిని గొన్ని లక్షణములు సమానముగా నున్నను ప్రాసల సందర్భమున నప్పకవి ప్రాసయుండవలసిన అక్కఱలేని ఆటవెలఁది పద్యముల నుదాహరణముగా నొసంగుట సమంజసము కాదని శ్రీ శర్మగారు వెల్లడించియుండిరి. భాషాక్లృప్తయను పద్యము నందలి క్లృప్తశబ్దమును లకారశ్లిష్టముగా నప్పకవి గ్రహించుట పొరపాటని వారు ప్రకటించి యుండిరి. ఈ విధముగా నప్పకవి పొరపాటు పడిన సందర్భములన్నియు వారెత్తిచూపి సరసముగా విమర్శించి యుండిరి.

అఖండయతి తనకు సమ్మతము కాకపోవుటచే నప్పకవి ఉభయయతి భేదములను జెప్పవలసి వచ్చినది ఈ సందర్భమున శ్రీ శర్మగారు కావించిన విమర్శ వారి పాండితీ వైభవమును; నిశిత పరిశీలనమును బ్రకటించు చున్నది. కర్కంధు, అలక్తక, స్వాంత, విశ్వామిత్ర శబ్దముల సందర్భమున వారు కావించిన విమర్శ యిందుకు నిదర్శనము. ప్రాదియతి సందర్భమున 'పరా,అపి' అనునవి ఆంధ్రమున లేవని చెప్పిన అప్పకవి అభిప్రాయమును వారు ఖండించి వానితోఁగూడిన ప్రయోగములు చూపియుండిరి. అజ్ ఉపసర్గ విషయమున నుభయయతి చెల్లదని వారు కావించిన సూచన సమంజసముగానున్నది. ఇట్లే నఞ్ సమాసయతిని అప్పకవి ప్రత్యేకముగాఁ జెప్పియుండవలసినదని వారు కావించిన సూచనయు యుక్తముగా నున్నది. నిత్యసమాస యతులలోనే అప్పకవి ఉపసర్గ సంధియతిని గూడఁ జేర్చి భీమన చెప్పిన 'అఖండవడి' నంగీకరింపక వేరుమార్గమును ద్రొక్కెను. ప్రాదియతులకును ఉపసర్గ సంధియతులకును గలభేదమును దెల్పి శ్రీ శర్మగారు ఆ రెండింటిని అప్పకవి ప్రాదియతులలోనే చేర్చిన యుక్తతరముగా నుండునని చేసిన విమర్శ చక్కగా నున్నది.

ఖండాఖండ ప్రాసవిషయమున అప్పకవి సార్ధబిందుకములై కచటతపలకే (పరుషములకే) యది చెల్లునని లక్షణ పద్యమునఁ జెప్పె "తీఁగ

యుయ్యెల" అను పద్యము నాదిపర్వమునందలి దని లక్ష్యముగా నిచ్చియుండెను. ఇందు సార్ధకబిందుకమైన గకారమున కర్ధబిందువు లేని గకారముతోఁ బ్రాస వేయఁబడినది. గకారము కచటతపలలోనిది కాదు. అది సరళము. అందుచే నప్పకవి యీ విషయమున సరిగాఁ బరిశీలన చేయలేదని తెల్పి శర్మగారది పరుష సరళములు రెండింటికిని జెల్లునని వ్యక్తీకరించి యున్నారు. ఈ సందర్భమున సార్ధబిందుకములైన శబ్దములను గూర్చి వారు చేసిన చర్చ పరిశీలనాత్మకమై యున్నది. అనంతుఁడు రేఫయుత యతిని వేఱుగాఁ జెప్పియుండుటచేఁ గాఁబోలు నప్పకవి రేఫయుత ప్రాసమని యొక ప్రాసభేదమును ప్రత్యేకముగాఁ జెప్పి యున్నాఁడు. దీనినిఱట్టి సుడులతోఁ గూడిన యక్షరములకును గ్రారతోఁగూడిన యక్షరములకును బ్రాసమైత్రి చెల్లదు. కాని సంయుతాసంయుతప్రాసమునుబట్టి యిట్టి ప్రాసచెల్లుట కెట్టి యాక్షేపమును లేదు. అందుచే శ్రీ శర్మగారప్పకవి చెప్పిన యీ ప్రాసభేద మవసరమని సూచించినారు. అనంతుఁడు రేఫయుతయతిని జెప్పుట యావశ్యకమే. ఉభయప్రాస సందర్భమున శ్రీ శర్మగారు త్రిణయన శబ్దమును గూర్చి గిడుగువారు కావించిన విమర్శను బరిశీలించి, దాని సాధుత్వమును నిరూపించి, ఆదేశ షణలకే కాక సహజ షణ లకుం గూడ ననలతో ప్రాసమైత్రి పాటింప వచ్చునని వెల్లడించి యున్నారు. ఇందుకు వారు పూర్వకావ్యములనుండి ప్రయోగములను గూడ సూచించి యున్నారు. అప్పకవి అనంతు ననుసరించి ప్రాసమైత్రి ప్రాసమను నొకభేదమును జెప్పియున్నాఁడు. ఈ పేరంత సమంజసముగా లేదని శ్రీ శర్మగారు చెప్పుట యుక్తముగానే యున్నది. ఇదేకాక ప్రతిప్రాసభేదమును ప్రాసమైత్రిని గలిగియే యుండుట యిందుకుఁ గారణము.

శ్రీ శర్మగారధసూచికలలో సూర్యాలోక ముద్రాక్షరశాలలో ముద్రితమైన అప్పకవీయ ప్రతియందలి పాఠాంతరము లొసంగి యున్నారు. గ్రంథము చివర అఖండయతి గూర్చియు, యతిప్రాసల ప్రయోజనములందును గూర్చియు, అప్పకవి చెప్పిన యతిభేదములను గూర్చియు. చెప్పని యతి ప్రాస విశేషములను గూర్చియు, యతి ప్రాసభేదముల సంగ్రహ వివరణమును గూర్చియుఁ దెల్పు ననుబంధములను జేర్చియున్నారు. ఇవి విద్యార్థులకును విద్వాంసులకును గూడఁ జాల నుపయోగకరములుగా నుండును.

ఈ వివరణము వ్రాయుటలో శ్రీ శర్మగారు చూపిన ప్రతిభయు, పాండిత్యమును, పరిశీలన నైపుణ్యమును, ఓర్పును మిక్కిలి ప్రశంసింపఁదగియున్నవి. వారి వివరణము విపులమును విస్పష్టమునై పఠితల కప్పకవి చెప్పిన యతిప్రాస భేదములను గరతలామలకముల నొనరించుచున్నది. వివరణము వ్రాయు సందర్భమున పాణినీయవ్యాకరణ సూత్రములను గూర్చియు, అమరకోశమునందలి శబ్దముల వ్యుత్పత్తులనుగూర్చియు, నితర లాక్షణికులు చెప్పిన యతి ప్రాసభేదములను గూర్చియు, భాషాశాస్త్ర సిద్ధాంతములను గూర్చియు వారు కావించిన

వ్యాఖ్యానములు వారి పాండితీ శౌండీర్యమును, పరిశోధన పారంగతత్వమును సూచించుచున్నవి. ఈ వివరణముద్వారా వారప్పకవీయమునందలి తృతీయాశ్వాసమునకు జీవము పోసిరారని చెప్పవచ్చును. నిజమునకువారిందుఁ బ్రదర్శించిన పరిశోధన పాతమునకు వారి కే పిహెచ్. డి. పట్టమో యీయవచ్చునని నాకుఁ దోఁచినది. ఇంత చక్కని కూలంకషమైన వివరణము వ్రాసినందుకు శ్రీ శర్మ గారిని దానిని బ్రచురింపఁ బూనినందుకు త్రివేణి ప్రచురణ సంస్థవారిని అభినందించుచు దిఙ్మాత్రమైన యీ సమీక్షను ముగించుచున్నాను.

ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు

దివాకర్ల వేంకటావధాని
30-8-66

# పండితాభిప్రాయము

Dr. G. N. Reddy, M. A, M. Litt., Ph. D.,
Professor and Head of the Department of Telugu
Sri Venkateswara University, Tirupati

సుబోధకమైన వివరణము అపేక్షించే తెలుగు లక్షణగ్రంథం అప్పకవీయం. అప్పకవీయానికున్న ప్రసిద్ధి, ముఖ్యంగా అందు ఛందో విభాగానికి చెందిన మూడు, నాలుగు పరిచ్ఛేదాలనుబట్టి, విశ్వవిద్యాలయాలు, ఇతర సంస్థలు నిర్వహించే తెలుగుభాషాసాహిత్య పరీక్షలకు అప్పకవీయ తృతీయాశ్వాస పద్మ్రాస పరిచ్ఛేదం అనివార్యమైన పాఠ్యభాగం. ఈ పద్మ్రాస పరిచ్ఛేదానికి సరళమైన శైలిలో సుబోధకమైన వివరణ ఎంతేని అవసరం. ఆ కొరతను ఈ నాటికి శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు—తెలుగు ఛందో విషయంలో జగమెరిగిన ప్రామాణికులు—తీర్చినారు. శ్రీ రావూరివారి భావ ప్రకాశిక సులభ శైలిలో, విద్యార్థులు సైతం తమంతకు తామే చదువుకొని అర్థంచేసుకొనేరీతిలో ఉండడం గొప్పవిశేషం. పాఠప్రవచనంచేసే అధ్యాపకులకు కూడా ఇది చాల ఉపయోగకరం. అనేక విషయాలను శ్రీ శర్మగారు ఇందు పొందుపరచి వివరించియున్నారు. ఈ భావప్రకాశికను రచించిన శ్రీ శర్మగారు, గ్రంథాన్ని ప్రచురించిన త్రివేణి సంస్థవారు మిక్కిలి అభినందనీయులు.

జి. ఎన్. రెడ్డి
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి

# పండితాభిప్రాయము

DR. K. V. R. NARASIMHAM, M. A., Ph. D.
Professor and Head of the Department of Telugu
Andhra University, Waltair.

అప్పకవీయ భావప్రకాశికను ఆద్యంతము చదివితిని. ఆంధ్ర వాఙ్మయమునఁ గల లక్షణగ్రంథములలో అప్పకవీయము తలమానిక మనఁదగిన గ్రంథము. పఠనపాఠనాదులందు అప్పకవీయమునకు ప్రత్యేక స్థానమున్నది. అందును యతిప్రాస ప్రకరణమైన అప్పకవీయ తృతీయాశ్వాసము ఉన్నత కక్ష్యలకు అవశ్యపఠనీయమై యున్నది. ఇట్టి అప్పకవీయమునకు ఇదివఱ కొక వివరణ గ్రంథము వెలువడినది. ఈ భావప్రకాశిక మఱొక వ్యాఖ్యానము. దీనిని రచించిన శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు ఛందశ్శాస్త్ర విషయమున బహుకాలముగ పరిశ్రమ చేయుచు అనేక వ్యాసములను ప్రకటించుటయే గాక, "తెలుగుభాషలో ఛందో రీతులు" అను చక్కని విమర్శ గ్రంథమును ప్రచురించి యున్నారు. వీరి వ్యాఖ్యానము సరళముగ, బహు విషయ సంభరితముగ నున్నది. పద్యములకు ప్రతిపదార్థమే గాక విశేషార్థములు సయితము వివరింపఁబడినవి. ఆవశ్యకమైన సంస్కృత వ్యాకరణ విశేషములును సుబోధకములుగఁ దెలుపఁబడినవి. కొన్ని లక్షణములయెడ విమర్శ సహేతుకముగ సాగినది. లక్ష్యనిరూపణమున పాఠాంతరము లెన్నో సంప్రతించుట ప్రశంసార్హమైన విషయము. అభిప్రాయభేదములు గల అఖండయతి మొదలైన స్థలములందు ఆవశ్యకమైన జాగరూకత చాలవఱకుఁ గైకొనఁబడినది. అనేక సంవత్సరములుగ ఛందశ్శాస్త్ర విషయమున పరిశ్రమ చేయుచున్న శ్రీ శర్మగారి కృషి ఇందు సఫలమైనది. కేవలము విద్యార్థులకు మాత్రమే గాక, ఛందశ్శాస్త్ర పరిశీలకులకుఁ గూడ ఈ వ్యాఖ్యానము ఉపయుక్తమగుననుట కెట్టి సందేహమును లేదు. పరిశోధనాత్మకము ప్రయోజనాత్మకము నైన అప్పకవీయ భావ ప్రకాశిక రచనమున శ్రీ శర్మగారు కృతకృత్యులని నిర్ధారణగఁ జెప్పవచ్చును. వీరి భావప్రకాశిక ఆంధ్రలక్షణ వాఙ్మయమునకు అపూర్వమైన అలంకారము

**కాకర్ల వెంకట రామనరసింహము**
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు

# పీఠిక

ఆంధ్ర లక్షణగ్రంథ ప్రపంచములో అప్పకవీయమునకున్న పఠనపాఠన వ్యాప్తి మఱి యే యితర లక్షణ కృతికి లేదనుట యతిశయోక్తి కాదు. ఆంధ్ర లక్షణమును, అందుఁ బ్రధానముగ ఛందోవిషయమును నెఱుఁగఁగోరు విద్వాంసులకు నేఁడు దీనికి మించిన పఠనీయ గ్రంథ మింకొకటి గానరాదు. కవిజనాశ్రయము. కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, కావ్యచింతామణి, లక్షణసారసంగ్రహము, కవిజనసంజీవని, సులక్షణసారము, సర్వలక్షణ సారసంగ్రహము, రంగరాట్ఛందము మున్నగునవి ఛందోలక్షణమును దెలుపుచున్నవి; గాని వానిలో నేదియుఁ గూలంకషముగ విస్పష్టముగ సవిస్తరముగ సక్రమముగ లక్ష్యసాకల్యముతో లక్షణములఁ బ్రపంచించునట్టిదిగాదు.

ఈ కృతికర్త అప్పకవియే యిట్టి యభిప్రాయముతోనే తన గ్రంథమును జదివిన పిమ్మట నితర లక్షణగ్రంథములఁ బఠింప నవసరముండదని యీ క్రింది రీతి నుగ్గడించినాఁడు:

'ఇది చదివిన పిమ్మట మఱి
యెదియేనియుఁ జదువు బుద్ధి । యేలా వాదమున్
బదపడి గ్రంథము లన్నియు
వెదకి వెదకి సారమెల్ల । వివరింపంగన్'

(అప్పకవీయము: 1-7)

అప్పకవీయము రచితమయిననాఁటినుండి తత్పూర్వము వెలసిన లక్షణ గ్రంథములకుఁ బఠనపాఠన వ్యాప్తి తగ్గినది. నాఁటిమాట యెట్లున్నను నేఁడు విద్వాంసులలో దీనిఁ జదువనివారు మచ్చునకే నుండరనుట యెల్లరకుఁ దెల్లమయిన విషయము. నేఁటి యత్యున్నత ప్రాచ్యభాషా పరీక్షల కెల్ల నియ్యది యవశ్యపాఠ్యగ్రంథముగా రాణించుచున్నది.

దీని కింతటి ప్రచారమునకుఁ గారణ మా రచనలోని వైశిష్ట్యము. అప్పకవి తనకుఁ బూర్వమున్న లక్ష్యలక్షణగ్రంథములఁ బరిశీలించి, యందు శిష్టసమ్మతములైన లక్ష్యలక్షణముల సంగ్రహించి, లక్షణములను విస్పష్టముగ నసందిగ్ధముగ సూత్రపద్ధతిలోఁ బౌర్వాపర్యక్రమ విచక్షణతతో వ్రాయుటయు, స్వీయ లక్ష్యముల నానుపూర్విగఁ గూర్చుటయు, నందఱకన్న నధిక విషయములఁ దెలుపుటయు, మీఁదుమిక్కిలి లక్షణప్రామాణ్యమునకై పూర్వమహాకవుల గ్రంథములనుండి లక్ష్యములఁ బ్రదర్శించుటయు, ఆ లక్ష్యలక్షణము

లెంతటి వారివైనను గుణము గుణముగ దోషము దోషముగ నిశ్శంకముగ వక్కాణించుటయు, స్వీయపద్యములను మృదు మధుర శబ్దగుంఫితముగను శబ్దాలంకార ప్రాసభాసురముగను రచించుటయు మున్నగు కారణములచే అప్పకవీయమున కాంధ్ర లక్షణ వాఙ్మయములో నింతటి ప్రాచుర్యము ప్రాశస్త్యము ప్రాధాన్యము చేకూరెనని చెప్పవలెను.

నన్నయభట్టీయ బాలసరస్వతీ యహోబలపండితీ యాదులవలె అప్పకవీయము గ్రంథకర్తయగు అప్పకవిపేరితో వ్యవహరింపఁబడుచున్నది. కవి దీనికిఁ బెట్టినపేరు ఆంధ్రశబ్దచింతామణి 'కాకునూర్యప్పకవివర్య విరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రంబునందు' అని గద్యలో వ్రాసికొన్నాఁడు. నన్నయభట్టారకునిచే సంస్కృతభాషలో రచితమైన యాంధ్రశబ్దచింతామణి యను తెనుఁగు వ్యాకరణమున కియ్యది విస్తరరూపమైన తెనుఁగు పద్యానువాదము.

అప్పకవి వైదికబ్రాహ్మణుఁడు ఇంటిపేరు కాకునూరివారు. వీరిది పండిత వంశము. అప్పకవి సంస్కృత ప్రాకృతాంధ్రభాషలందు క్షుణ్ణమైన పాండిత్యవైభవ ప్రాభవములు గలవాఁడు. వేదవేదాంగములఁ బ్రవేశముగలవాఁడు. అప్పకవీయమునకు ముందు మఱికొన్ని గ్రంథముల సంతరించినవాఁడు. ఇతని నివాసస్థలము కామెపల్లి. ఇది గుంటూరుజిల్లా పల్నాడుతాలూకాలో నున్నది. ఈ గ్రంథము కామెపల్లిలో వెలసియున్న కవి కిష్టదైవమగు గోపాలస్వామి కంకితము.

భగవంతుడు కవికి స్వప్నమునఁ గనఁబడి యాంధ్రశబ్దచింతామణిని దెనిఁగింపుమని యానతిచ్చెనఁట. నన్నయ యాంధ్రశబ్దచింతామణిని యొకానొక కారణమున భీమకవిచే నణఁగియుండి తరువాతఁ జిరకాలమునకు ఆ గ్రంథ సూత్రములను బాఠముచేసియున్న రాజరాజ నరేంద్రుని కుమారుఁడగు సారంగధరునిచే మరల వ్యాప్తిలోనికి వచ్చినదని, సిద్ధుఁడైన సారంగధరుని వలన నా గ్రంథమును బడసి బాలసరస్వతి మహోపాధ్యాయుఁడు దానికిఁ టీక వ్రాసెనని, యా సటీక చింతామణి నప్పకవి కొక విప్రుఁడు తెచ్చియిచ్చెనని, యాటీక యాధారముగఁ జింతామణిని దాను దెనిఁగించుచున్నానని, కవి కృత్యాద్యవతారికలోఁ బేర్కొన్నాఁడు. ఈ గ్రంథ రచనోపక్రమము శా. శ. 1578 మన్మథశ్రావణ బహుళ దశమి. అనఁగా నేటి క్రీ.శ. లెక్కలో 5-8-1656 అగును. (చూ. అప్పకవీయ పీఠిక 97 పద్యము) దీనింబట్టి కవి 17-వ శతాబ్ది లోనివాఁడని తెలియుచున్నది.

చింతామణి కర్తృత్వవిషయములో నేఁడు వాదప్రతివాదము లున్నవి. కొన్ని యప్పకవి యయ్యది నన్నయభట్టీయమను నప్రతిహతాభిప్రాయము గలవాఁడై యున్నాఁడు.

ఆంధ్ర శబ్ద చింతామణి పంచ పరిచ్ఛేదాత్మక వ్యాకరణ గ్రంథము. ఇంద్రాంధ్రభాషా వ్యాకరణ లక్షణసూత్రములు 82 ఆర్యాఖ్య పద్యభేదములలో రచింపఁబడెను.

అప్పకవీయ గ్రంథము సమగ్రముగా లభింపలేదు. కవి పూర్తిగా రచించెనో లేదో యెఱుఁగరాదు. ఇప్పుడిందు 5 ఆశ్వాసములే యున్నవి. ఇందుఁ జింతామణిలోని సంజ్ఞా సంధినామక పరిచ్ఛేదద్వయమునకే యనువాదముగలదు. తక్కిన యాశ్వాసములలోఁ దరువాతి మూఁడు పరిచ్ఛేదము లుండవలయు. అప్పకవీయము వ్యాకరణగ్రంథముగా నుద్దేశింపఁబడినదయ్యును వ్యాకరణ భాగము పూర్తిగాక సగమునకును దక్కువగా నిలిచిపోవుటయు, నానుషంగికమైన ఛందోలక్షణము పర్యాప్తముగా రచితమైయుంటయుఁ గారణముగా నియ్యది ఛందోగ్రంథమను పేరఁ బ్రచారమునకు వచ్చినది. వ్యాకరణగ్రంథమైన చింతామణిలో ఛందోవిషయములగు శ్లోకము లేడు మాత్రమే యున్నవి. అందు 'ఆద్యోవళిః ద్వితీయోవర్ణః ప్రాసః' అను నొక్క శ్లోకమందలి యేకదేశమునకు ఆంధ్రానువాదము అప్పకవీయ తృతీయాశ్వాసము (సుమారు 400 పద్యములు). ఇందువలనఁ జింతామణి సూత్రము నిమిత్తమాత్ర మనియు నప్పకవి వ్యాకరణశాస్త్ర వ్యాజమున విపుల చ్ఛందశ్శాస్త్రమును రచింపఁదలఁచినవాఁడనియు నెఱుకపడుచున్నది.

ఈ గ్రంథమునఁ దృతీయాశ్వాసము వళిప్రాస పరిచ్ఛేదము. చతుర్థాశ్వాసము పద్యపరిచ్ఛేదము. ఈ రెండు ఛందోవిషయ సంబంధులు అందు వళిప్రాస పరిచ్ఛేదము తెనుఁగు ఛందశ్శాస్త్రమునకు జీవగఱ్ఱ. ఆద్యభాషయగు సంస్కృతమున లేని వళిప్రాసలు తెలుఁగుభాషలో వెలయుచున్నవి. ఆంధ్ర కవి విశిష్టాలంకారములు. తెనుంగునకుఁ బ్రాల్పొఖ్ఖం గడు న్వన్నియ లని కవిసూక్తి. అప్పకవి యితరులకన్న నెక్కువచేసి 41 యతిభేదములను, 17 ప్రాసభేదములను జెప్పెను. ఈ వళిప్రాస లక్షణ ప్రకారము భాషా విద్యార్థిలోకమునకు వివరణ సాపేక్షమైయున్నది.

అప్పకవీయమును సర్వలక్షణసారసంగ్రహకర్త కూచిమంచి తిమ్మకవి పేర్కొన్నాఁడు. కూచిమంచి తిమ్మన మునుమనుమఁడు కూచిమంచి వెంకట్రాయకవి యప్పకవీయమును విమర్శించుచు సుకవి మనోరంజని యను గ్రంథమును రచించెను. (క్రీ. శ. 1850) ఈ గ్రంథము నేఁడు సమగ్రముగ లభ్యమగుటలేదు. ముందు వెనుకలులేని కొంతభాగము లిఖితరూపమునఁ బ్రాచ్య లిఖిత గ్రంథాలయము (మదరాసు)లో నుండెడిది. ఇప్పుడదియు నందలేదు. స్థలాంతరమునకుఁ దరలింపఁబడినది. ఉన్నభాగమేని ముద్రించి ప్రకటించుట యవశ్యకర్తవ్యము.

అప్పకవి కించుమించు సమకాలికుఁడయిన యహోబల పండితుఁ డప్పకవిని పేర్కొని యతని గ్రంథమును దన కవిశిరోభూషణ కృతిరచనలో నుపయోగించుకొనెను. తర్వాతఁ బుట్టిన లక్షణ గ్రంథములన్నియు నప్పకవీయము ననుసరించినవే.

అప్పకవీయ తృతీయాశ్వాస వివరణమును వేదుల రామశాస్త్రిగారు రచించి 1950 సం॥లో ప్రకటించిరి. అప్పటికే నేను నందలి కొంతభాగమునకు వ్యాఖ్యరచించి యుంటినిగాని శాస్త్రిగారి వివరణము ప్రకటితమగుటచే నావ్యాఖ్యారచన యప్పటికి నిలిపివైచితి.

1960లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారేర్పఱిచిన బహుమతి పోటీలోఁ బాల్గొని 'తెలుఁగుభాషలో ఛందోరీతులు' అను గ్రంథమును సంతరించితిని. ఆ గ్రంథ ముద్రణార్థము అకాడెమీవారు వేయిరూప్యములు బహూకరించిరి. ఆ గ్రంథము 1962 లో ముద్రితము. అందు ఛందో విషయములన్నియుఁ గూలంకషముగ వివరింపఁబడెను. అందలి యతిప్రాస ప్రకరణములలో అప్పకవీయమునకు మున్ను నారచించియుంచిన వ్యాఖ్యలోని పెక్కు విషయములు సంగ్రహింపఁబడెను. 1962 లో వావిళ్ళ సంస్థవారు అప్పకవీయమును నాచేఁ బరిష్కరింపించి నా విపుల సమీక్షతో ఆఱవ ముద్రణము వెలయించిరి.

ప్రస్తుతము అప్పకవీయ యతిప్రాస పరిచ్ఛేద మెల్ల విశ్వవిద్యాలయములందును బ్రాచీన భాషావాఙ్మయ పట్టపరీక్షల కవశ్య పాఠ్యమగుటచే దీనికి సుగమముగ వలసినంత నాతి విస్తరమైన వివరణము విరచించి యీయవలసినదని పూజ్యమిత్రులు త్రివేణీ ప్రకాశక సంస్థ (త్రివేణి పబ్లిషర్సు) యజమానులు శ్రీ భావరాజు నరసింహరావుగారు నన్నుఁ గోరుటచేతను, వారి మిత్రులు సహృదయులు శ్రీ భాగవతుల కుటుంబరావుగారు ప్రభృతులు ప్రోత్సహించుటచేతను సాహసించి, యీ యప్పకవీయ భావప్రకాశికాఖ్య వివరణ రచనాకార్యమునకు సంసిద్ధుఁడనై యిప్పటికినిఁ గృతార్థుఁడనయితిని.

ఈ వివరణము ప్రధానముగ నేఁటి యున్నతాంధ్రభాషా విద్యార్థుల కుపకరింపవలెనను నాశయముతోఁ దదనుగుణముగ సంతరింపఁబడినది. ఇయ్యది యప్పకవీయములోని యతిప్రాస పరిచ్ఛేదమను తృతీయాశ్వాసమునకు మాత్రము వివరణము. ఇందుఁ బ్రతిలక్షణపద్యములోని భావము విశదీకరింపఁబడినది.

అందొసఁగబడిన లక్ష్యములకు లక్షణ సమన్వయము చేయఁబడినది. కవి లక్ష్య లక్షణ పద్యములలో వలసిన పదములకు నర్థము దెలుపఁబడినది. ఇంతవఱ కప్ప కవి చెప్పిన లక్షణములకుఁ గావలసిన వివరణమగును.

అప్పకవీయ లక్షణములోని యుక్తాయుక్తతలు, ఇతర లాక్షణికుల సంవాదములు, ఆయా లక్షణములకు సంబంధించిన యితరాంశములు, అందు లేకున్నను దెలిసికోఁదగిన లక్ష్యలక్షణ విశేషములు - 'విశేషములను' - శీర్షిక క్రిందఁ బ్రతిపద్య వివరణము తర్వాత వ్రాయఁబడెను. ఈ విశేషములు పరిశోధకులకు, విద్వాంసులకు నత్యంతావశ్యకములను తలంపునఁ గూర్పఁబడెను. గ్రంథాంతమున యతిప్రాసల ప్రయోజనము ఇత్యాది ముఖ్యాంశములఁ బ్రత్యేకముగఁ బ్రదర్శించు అనుబంధములు కొన్ని చేర్పఁబడెను.

ఇంకను వళి ప్రాసములఁగూర్చి సర్వంకషముగ నెఱుఁగఁ గోరువారును ఈ గ్రంథమును జదివినవారును నా 'తెలుఁగు భాషలోని ఛందోరీతులు' అను గ్రంథమును బఠింపఁ గోరుచున్నాఁడను. ఆ గ్రంథము సైతము త్రివేణి పబ్లిషర్సువద్ద లభించును.

'కాళిదాస మయూరాది కవులకైనఁగలవు తప్పులనంగ నన్యులకు లేవె' యని యప్పకవియే చెప్పినాఁడు. 'ప్రమాదో ధీమతామపి' అను నార్యోక్తి ప్రసిద్ధము కాన నీ గ్రంథమున నెందేనిఁ బ్రమాదము లుండవచ్చు.

'దృష్టం కిమపి లోకేఽస్మిన్ ననిర్దోషం ననిర్గుణమ్
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః'

అన్న యభియుక్తోక్తి కలదుగదా! అట్టివానిని సహృదయులు సూచించిన నప్రశ్రయముగా గ్రహించి మున్ముందు సవరించుకొందునని విన్నవించుచున్నాఁడను.

ఈ వివరణకృతి భాషా విద్యార్థుల విద్వాంసుల యాదరాభిమానములకుఁ బాత్రమగునేని ధన్యుఁడఁ గాఁగలను.

మదరాసు
10-2-1966

రావూరి దొరసామిశర్మ



# విషయసూచిక


| విషయము | పుట |
|---|---|
| **యతినిర్వచనము** | 4 |
| **యతిభేదము** | 11 |
| **I స్వరవళులు** | 12 |
| 1. స్వరమైత్రివళులు | 12 |
| 2. స్వరప్రధానవళులు | 16 |
| 3. లుప్త విసర్గ స్వరవళులు | 17 |
| 4. ఋవళి | 22 |
| 5. ఋత్వసంబంధవళులు | 25 |
| 6. ఋత్వసామ్యవళులు | 28 |
| 7. వృద్ధివళులు | 30 |
| **II వ్యంజనాక్షరవిరతులు** | 33 |
| 8. ప్రాణి విరామములు | 34 |
| 9. వర్గజయతులు | 38 |
| 10. బిందుయతులు | 40 |
| 11. తద్భవవ్యాజ విశ్రమములు | 43 |
| 12. విశేషవళులు | 45 |
| 13. అనుస్వారసంబంధయతులు | 47 |
| 14. అనునాసికాక్షరయతులు | 49 |
| 15. మువిభక్తి యతులు | 51 |
| 16. ముకారయతులు | 53 |
| 17. మవర్ణ విరామములు | 56 |
| 18. ఋజు యతులు | 58 |
| 19. ప్రత్యేక యతులు | 59 |
| 20. భిన్నయతులు | 60 |
| 21. ఏకతరయతులు | 63 |
| 22. అభేదవిరతులు | 67 |
| 23. అభేదవర్గయతులు | 73 |
| 24. ఊష్మవిశ్రాంతులు | 76 |
| 25. సరసవళులు | 77 |
| 26. సంయుక్త విశ్రామములు | 79 |
| 27. అంత్యోష్మసంధివడులు | 85 |
| 28. వికల్ప విరమణములు | 88 |
| **III ఉభయవళులు** | 92 |
| 29. యుష్మదస్మచ్ఛబ్దయతులు | 93 |
| 30. పరరూపవిరతులు | 95 |
| 31. ప్రాదియతులు | 103 |
| 32. నిత్యసమాసవిశ్రాంతులు | 107 |
| 33. వైకల్పికనిత్యసమాసవిశ్రాంతులు | 133 |
| 34. నిత్యయతులు | 153 |
| 35. రాగమసంధివళులు | 156 |
| 36. విభాగవళులు | 157 |
| 37. నామాఖండ విశ్రమములు | 159 |
| 38. పంచమీవిభక్తివిరామము | 165 |
| 39. కాకుస్వరవళులు | 168 |
| 40. ప్లుతయుగ విశ్రామములు | 176 |
| 41. ప్రాసయతులు | 176 |
| అగ్రాహ్యవిరామంబులు | 180 |
| అగ్రాహ్యవర్గవళులు | 181 |
| అగ్రాహ్యసంబంధవళులు | 182 |
| అగ్రాహ్యవర్ణ చతుష్టయవళులు | 184 |
| అగ్రాహ్యభేదవర్గయతులు | 186 |
| **IV ప్రాసము** | 194 |
| ప్రాసస్వభావము | 194 |
| ప్రాసపూర్వాక్షరనిర్ణయము | 196 |
| ప్రాసాక్షరమైత్రి | 201 |
| ప్రాసభేదంబులు | 207 |
| సమప్రాసములు | 208 |

| విషయము | పుట |
|---|---|
| 1. సమప్రాసములం దర్ధబిందు ప్రాసము | 209 |
| 2. పూర్ణబిందు(సమ)ప్రాసము | 209 |
| 3. ఖండాఖండప్రాసము | 210 |
| 4. సంయుతాక్షర ప్రాసము | 213 |
| 5. సంయుతాసంయుతప్రాసము | 218 |
| 6. రేఫయుతప్రాసము | 225 |
| 7. లఘుద్విత్వప్రాసము | 227 |
| 8. వికల్పప్రాసము | 228 |
| 9. ఉభయప్రాసము | 230 |
| 10. అనునాసికప్రాసము | 235 |
| 11. ప్రాసమైత్రిప్రాసము | 227 |
| 12. ప్రాసవైరము | 238 |
| 13. స్వవర్గజప్రాసము | 239 |
| 14. ఋ ప్రాసము | 245 |
| 15. లఘు యకారప్రాసము | 247 |
| 16. అభేదప్రాసము | 249 |
| 17. సంధిగతప్రాసము | 253 |
| అప్రశస్తప్రాసము | 257 |
| శబ్దాలంకార ప్రాసములు | 259 |
| సుకరప్రాసము | 261 |
| దుష్కరప్రాసము | 261 |
| ద్వంద్వప్రాసము | 261 |
| త్ర్యక్షరప్రాసము | 262 |
| చతుష్ప్రాసము | 262 |
| అంత్యప్రాసము | 262 |
| అనుప్రాసము | 268 |
| మత్తేభవృత్తకందగీతగర్భసీసము | 264 |
| గర్భమత్తేభము | 265 |
| గర్భకందము | 265 |


## అనుబంధములు


| విషయము | పుట |
|---|---|
| 1. అఖండయతి | 267 |
| 2. యతిప్రాసముల ప్రయోజనము | 273 |
| 3 అప్పకవి చెప్పిన యతిభేదముల పరిశీలనము | 281 |
| 4. ప్రాసభేద పరిశీలనము | 284 |
| 5. అప్పకవి చెప్పని యతిప్రాస విశేషములు | 285 |
| 6. యతిభేదములసంగ్రహవివరణ | 290 |
| 7. ప్రాసభేదముల సంగ్రహవివరణ | 293 |
| 8. యతుల పట్టిక | 294 |
| 9. ప్రాసభేదముల పట్టిక | 297 |
| 10. అప్పకవి ఉదాహరించిన గ్రంథములు | 298 |
| 11. అప్పకవీయ భావప్రకాశికలో నుదాహరించిన గ్రంథములు | 300 |




శ్రీ ర స్తు

# అప్పకవీయ భావప్రకాశిక

## అప్పకవీయవళిప్రాస పరిచ్ఛేదవివరణము

### అప్పకవీయము : తృతీయాశ్వాసము

శ్రీశైలభ్రమరాంబా
ధీశై శానీ విదిజ్మ । హీతల విలస
త్కాశీసమతంగెడ నగ
రీ శమనాశా నివేశ । రిపుజననాశా! 1

వివరణము - శ్రీశైలభ్రమరాంబాపతియగుమల్లికార్జునస్వామికి (అనఁగా అతని యాలయమునకు) ఈశాన్యదిక్కున నున్న కాశీక్షేత్రముతో సమానమైన తంగెడ పురమందు (తంగేడుసీమలో) దక్షిణదిక్కున వెలయుచున్న యో గోపాలస్వామీ !

ఇది యాశ్వాసాదిసంబోధనాంత పద్యము. ప్రత్యాశ్వాసాదిలోఁ గృతి భర్తను సంబోధించుచు సంబోధనాంతముగా నొక పద్యము వ్రాయుట తెలుఁగు కవుల సంప్రదాయము. తంగెడుసీమలోఁ గామెపల్లి గ్రామమున నెలకొనియున్న గోపాలదేవునకు అప్పకవి యీ గ్రంథ మంకితముచేసెను.

క. అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమునకాది । నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాం
ధ్రవచోవ్యాకరణసూత్ర । తతిఁ దెనుఁగింతున్. 2

టీ. అవధారు - అవధరింపుము, వినుము. శబ్దశాసనుఁడు-నన్నయభట్టు.

వివ. ఓ గోపాలస్వామీ ! కలియుగాదిలో అనఁగా అత్యంత ప్రాచీన కాలమున శబ్దశాసనబిరుదాంచితుఁడగు నన్నయభట్టారకుఁడు ఆ రాజమహేంద్ర వరమునయందే రచించిన ఆంధ్రశబ్దచింతామణీవ్యాకరణసూత్రములఁ దెనిఁగించెదను. (ఇది కవి వాక్యము)

చిరకాలము క్రిందట నన్నయభట్టారకుఁడు రాజమహేంద్రవరములో వసించుచు సంస్కృతభాషలో ఆంధ్రవ్యాకరణము రచించెననియు నా వ్యాకరణ సూత్రములఁ దాను దెనిఁగించెదననియు నప్పకవి చెప్పుచున్నాఁడు.

విశేషము—నన్నయ కలియుగాదిలో నుండిన ట్లప్పకవి చెప్పినాఁడు. ఇం దేకాక యప్పకవి గ్రంథాదిలోను 'ఎన్నఁగ నన్నయాఖ్యకవి కలికాదిని జెప్ప దాని భీమన్న హరించె' (పీఠిక 9) అని వ్రాసియున్నాఁడు. నన్నయ 11-వ శతాబ్దమువాఁడు; అప్పకవి 17-వ శతాబ్దమువాఁడు. నేఁటి యాచారిత్రక విజ్ఞానము తత్సాధనసంపత్తి పూర్వకాలమున లేకపోవుటచే నిట్టి వ్రాఁతలు వెలసినవి. అప్పకవి యిట్లు వ్రాయుటకు బాలసరస్వతి మహోపాధ్యాయుని చింతామణి టీకలోని యీ క్రిందిపంక్తులే మూలమనవచ్చును; చూ:

'ఏమి మహాద్భుతం బిది హరీహరి! యెక్కడి యాంధ్రశబ్ద చింతామణి ఫక్కి యెక్కడి మతంగ నగంబు యుగాది సంభవుండై మని చన్న నన్నయ మహాకవి యెవ్వఁడు...' పయిరీతిగానే వికృతి వివేకటీకాకర్త ద్వితింత్రిణీ సీతారామకవియు 'ఇక్కలికాదిలోన రచియించెను నన్నయభట్టు సూత్రముల్' అని గతానుగతికముగ వ్రాసెను.

అవధారు-అవధరింపుము. చిత్తగింపుము. 'అవధారయ' అను సంస్కృత శబ్దమున కిది వైకృతము: అనింద్య గ్రామ్యమని కొందఱమతము. ఇది నిపాత రూపముగా నిఘంటువుల నొసఁగబడియున్నది. ఇందులకుఁ గొన్ని పూర్వప్రయోగములు :

అవధారు దేవ మధ్యాహ్న సంధ్యావేళ దినయౌవనంబు దోఁతెంచె నిపుడు (నైషధము 8-91)

మ్రొక్కులిడి స్వామి పరాకవధారు దేవ హెచ్చరిక యటంచు(దశా.1-238)
అవధారయ్య దశాననుండు సబలుండై (ఉ-రా. 4-281)

క. ఇమ్ముగ వర్ణపరిచ్ఛే
దమ్మునఁ జెప్పంగఁబడియెఁ। దగ నేకశ్లో
కమ్మున ముఖ్యవళి ప్రా
సమ్ములు సంక్షేపములుగ। సామజవరదా! 3

వివ. ఆంధ్రశబ్దచింతామణిలోని వర్ణపరిచ్ఛేదము తుదిలో నొకశ్లోకములో ముఖ్యములగు యతి ప్రాసములు సంగ్రహముగఁ జెప్పఁబడెను.

చింతామణి సూత్రములో ముఖ్యవళిప్రాసములు చెప్పఁబడిన ట్లప్పకవి జెప్పెనుగాని యందు వళిప్రాస నిర్వచనము మాత్రమే కలదు: వళి ప్రాసభేదముల

విషయమించుకయుఁ జెప్పఁబడలేదు. ఆశ్లోక మీతరువాత నొసంగఁబడియున్నది.

టీ. వళి = యతి, సామజవరదా—సామజమనఁగా ఏనుఁగు-గజవరదా-గజేంద్రమునకు మోక్షమిచ్చినవాఁడా, శ్రీ విష్ణుమూర్తి.

**మూ-సూ.** ఆద్యోవళిర్ద్వితీయోవర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్.

వ. ఈ శ్లోకం బొక్కటి యొక సూత్రంబయ్యె నది యెల్ల నిందు
వివరించెద. 4

సూ-టీ. అత్ర-ఇందు ఈ యాంధ్రభాషయందు, పాదపాదేషు-ప్రతిపాదమునను, అద్యఃవర్ణః—మొదటి యక్షరము, వళిః-వళియనఁబడును. ద్వితీయః వర్ణః - రెండవయక్షరము, ప్రాసః-ప్రాస మనఁబడును. స్వస్వచరణేషు-తమతమ పాదములందు, పూర్వఃప్రాసః - పూర్వమందలి ప్రాసాక్షరము, అనఁగా మొదటిపాద మందలి ప్రాసవర్ణమే, సర్వేషుచ-అన్ని పాదములందును, ఏకః ఏవస్యాత్ - ఒక్కటే యై యుండవలయును.

వివ. ఈయాంధ్రభాషలో పద్యములందుఁ బ్రతిపాదము మొదటియక్షరము వళి; రెండవ యక్షరము ప్రాసను. మొదటి పాదములో నున్న ప్రాసాక్షరమే తక్కిన యన్ని పాదములలోఁ బ్రాసాక్షరమై యుండవలయును. అనఁగా మొదటి పాదములోని రెండవయక్షరమే తక్కిన పాదములలోను రెండవ యక్షరముగా నిల్పవలయు.

విశే. 'అత్ర' అనుటచేఁ దెనుఁగులో మాత్రమే వళి ప్రాసలున్నవని భావము. సంస్కృతభాషలోఁ బద్యములలోఁ దెలుఁగులో నున్నట్టి వళిప్రాసలు లేవు. పైయార్యాశ్లోక మొక సూత్రమయ్యె. ఇదియే చింతామణిలో యతి ప్రాసముల గూర్చి సంక్షేపముగాఁ జెప్పఁబడిన యేకైక శ్లోకము

ఈ యొక శ్లోక మాధారముగా జేసికొనిఁ యప్పకవి సుమారు 400 పద్యములు గల వళి ప్రాసపరిచ్ఛేదమను తృతీయాశ్వాసము రచించెను.

బాలసరస్వతీయములోను అహోబల పండితీయములోను ఈ చింతామణీ శ్లోకమునకు మాఱు 'వళిరాద్య మనంతరాక్షరం ప్రాసః' అను పాదముగలదు. బాలసరస్వతీయ చింతామణికిని అప్పకవీయ చింతామణికిని బాఠభేదములు పెక్కులున్నవని యహోబలపండితీయమునఁ జెప్పఁబడియున్నది. శ్లోక సంఖ్యలోను భేదము గలదు.

## యతినిర్వచనము

క. చరణచరణమున కాద్య
క్షరములు వళులయ్యె, నవియె । క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన
యిరవులఁ బొందింపవలయు । నెల్లకృతులలోన్. 5

వివ. పద్యములోఁ బ్రతిపాదము మొదటి యక్షరము వళి యనఁబడును. ఆ ప్రథమాక్షరములే మఱల ఆయాపాదములలో లక్షణములో నియమింపఁబడిన స్థానములలోఁ గూర్పవలయును.

తెనుఁగు పద్యములలో నన్నిటియందును యతిస్థానము లక్షణములందుఁ జెప్పఁబడియున్నది. వళియను పేరఁబరఁగు పాదాద్యక్షరమును ఆ పాదములో యతిస్థానమున మఱల నిలుపవలయును. ఆ యక్షరమునే కాక తన్మైత్రమైన యక్షరమునుగూడ నిలుపవచ్చునని తెలియవలయును. ఈ యంశము ముందు చెప్పఁబడును. ప్రాసములో మాత్ర మా యక్షరమే నిలుపవలయును. యతిలో నట్టి నియమములేదు. యతిలోఁగొన్ని కొన్ని యక్షరము లొకదాని కొకటి చెల్లును.

మూలములో లేకున్నను స్పష్టతకై యిందుల కుదాహరణము చూపఁబడుచున్నది.

ఉ. నిండుమనంబు నవ్యనవ । నీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్ర తుల్యము జ । గన్నుత విప్రులయందు...

(నన్నయ భారతము)

ఇది యుత్పలమాల-దీనికి 10-వ యక్షరము యతిస్థానము - పై పద్యముఁ బ్రథమపాదము మొదటియక్షరము (వళి) 'ని'. ఈ నివర్ణమే (నీ) పదియవ యతిస్థానమున నిలుపఁబడియున్నది. ఇఁక రెండవపాదములో వళి 'ఖ' వర్ణము. యతిస్థానమున 'గ'కారమున్నది. ఖకారమునకు గకారమునకు యతి మైత్రిగలదని యెఱుంగునది. ఏ యక్షరము కేయక్షరము చెల్లునో యా విషయము యతిభేదములలో నిఁకముందు వివరింపఁబడును.

విశే. 'ఆద్యోవళి' అను సూత్రమున కీ పద్యము వివరణము. ప్రతిపద్యభేదమునకును దాని లక్షణములో యతిస్థానము నిర్దేశింపఁ బడియుండును. ఉత్పలమాలాదివృత్తముల కిన్నవయక్షరము యతియనియు, కందము ద్విపద తేటగీతి ఆఁటవెలఁది సీసము మున్నగు జాత్యుపజాతిపద్యములందు ఇన్నవగణముమీఁద యతియనియు లక్షణమునఁ జెప్పఁబడును. స్రగ్ధర క్రౌంచపదము మున్నగు

కొన్ని పద్యములలో రెండుమూఁడు యతిస్థానములుండును. అట్టి పద్యములలోఁ బాదాద్యక్షరము నా రెండుమూఁడుచోట్ల నిలుపవలసియుండునని యెఱుంగునది.

ఉదా. స్రగ్ధరావృత్తము.

గాండీవారావశంపా + ఘటితభయదివౌ + కః పురాంతఃపురంధ్రీ
(ఉత్తర హరివంశము)

స్రగ్ధరకు ఏడేసియక్షరములపై రెండు యతు లుండవలయునని లక్షణము. ఇందుఁ బాదాద్యక్షరమగు గకారమునకు నేడేసి యక్షరములపై ఘకార కకారములతో మైత్రి చేయఁబడెను.

ఇట్లే కంద సీసాది పద్యములందు యతిమైత్రి నెఱుఁగునది.

**తే. విరతి, విశ్రాంతి, విశ్రామ, । విశ్రమములు,**
**శ్రాంతి, విరమణ, విరమ, వి । రామ, యతులు**
**ననఁగ నివి తొమ్మిదియు వళి । కాఖ్యలయ్యె,**
**భవ్యసక్తుఫలాయామ్య । భాగగేహ!** 6

విప. ఈ పద్యమున వళికిఁ బర్యాయపదములు చెప్పఁబడినవి. విరతి, విశ్రాంతి, విశ్రామము, విశ్రమము, శ్రాంతి, విరమణము, విరమము, విరామము, యతి-అను నీ తొమ్మిదిశబ్దములును వళియనునర్థమున ఛందశ్శాస్త్రములో నుపయోగింపఁబడు సంజ్ఞాపదములు. వళిసంజ్ఞతోఁ గలిపిన మొత్తము పది పర్యాయపదములగును. ఇట్లు చెప్పుటచే వళియన్నను యతియన్నను సమానార్థకమే యని తెలియనగుచున్నది.

టీ. భవ్యసక్తుఫలా ... గేహ = సక్తుఫల-జమ్మిచెట్టు, యామ్యభాగము-దక్షిణదిక్కు-, మనోహరమైన, (కామెపల్లి యందలి సుప్రసిద్ధమైన) శమీవృక్షమునకు దక్షిణ దిక్కున నివాసముగలవాఁడా । అనగా అక్కడ వెలసిన గోపాలా యని యర్థము.

విశే. విరతి. విశ్రాంతి ఇత్యాది శబ్దములు తొమ్మిది యతికిఁ బర్యాయ పదములుగా సంస్కృతచ్ఛందములో వాడఁబడియున్నవి. విరతి విశ్రాంతి విశ్రామ విరామాది శబ్దములకు నియతస్థలమున విరమించునది విశ్రమించునది యని యర్థము. 'యమ ఉపరమే' అను ధాతువునుండి యతిశబ్దముత్పన్నమగును. కాన యతికి విశ్రమస్థలమనియే యర్థ మేర్పడును.

'యతి ర్విచ్ఛేద సంజ్ఞకః' అని సంస్కృత వృత్తరత్నాకర నిర్వచనము. విచ్ఛేద మనగా బదచ్ఛేదము. పద్యములోఁ బ్రతిపాదమునను యతిస్థాన

ముండును. అచ్చోటఁ బదచ్ఛేదము కావలెను. పదమధ్యమున యతిరాదు. యతి స్థానమున నట్టి పదవిచ్ఛేదము లేకుండెనేని సంస్కృతములో యతిభంగదోషము గలుగునని లాక్షణికులు శాసించిరి. 'శ్లోకేషు నియమస్థానం బదచ్ఛేదం యతిం విదుః' అని కావ్యాదర్శము. సంస్కృతములో యతిస్థానమునఁ బదవిచ్ఛేదమున్నఁ జాలును. తెలుగులో యతిస్థానమునఁ బాదాద్యక్షర మైత్రి యుండవలయును. సంస్కృత యతి కుదాహరణము :

'యాస్యత్యద్య శకుంతలేతి హృదయం + సంస్పృష్టముత్కంఠయా' ఇది శార్దూలవృత్తము. దీనికిఁ బండ్రెండవచోట యతి. పైపాదమున 12 అక్షరములకుఁ బదచ్ఛేదమున్నది. 'హృదయం' 13వ అక్షరమునుండి వేరే పదమారంభమగు చున్నది.

'యాచ్ఞాదైన్య పరాంచియస్య కలహో + యంతే మిథస్త్వంపృణు' ఇందు యతి స్థానమునఁ బదచ్ఛేదము కాలేదు. కాన యతిభంగమని లాక్షణి కాభిప్రాయము.

తెలుఁగు పద్యములందు యతిస్థానమునఁ బదచ్ఛేద మక్కఱలేదు. పాదాద్యక్షరమునో తన్మైత్ర్యక్షరమునో యతిస్థానముమీఁద నిలుపవలయును. తెనుఁగులో యతి యక్షరమైత్రిగలది.

ఉదా. 'లావొక్కింతయు లేదు ధైర్యము విలో + లంబయ్యెఁ బ్రాణంబు లున్' -ఇది శార్దూలము. 12వ అక్షరముపైఁ బదచ్ఛేదములేదు. 12 పై అనఁగా 13-వ చోటఁ బాదానిలో నున్న లకారము కూర్పఁబడినది. దీనినే అక్షర మైత్రి యందురు.

సంస్కృత వృత్తములను దెనుఁగున నుపయోగించునపుడు సంస్కృతములో నెన్నవచోట యతి చెప్పఁబడినదో తెనుఁగున ఆచోటఁ బాదాద్యక్షరమును నిలుప వలయును. అనంతుని ఛందమున నీ యతి విషయమిట్లు స్పష్టము చేయ బడినది.

ఎన్నిట యతి రావలెనని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలెనని
రన్నిటఁ దెలుగునకు మొదలి యక్షరమమరున్.

(ఛందో-1-129)

అప్పకవియు నీపరిచ్ఛేదమునఁ జెప్పలేదు గాని నాల్గవయాశ్వాసమున నిట్లు సంస్కృతాంధ్ర యతిలక్షణము నిర్వచించెను.

ఆ. వె. పంక్తినుండి వృత్తపంక్తికిన్నవ్రాయి
పడియటంచుఁ జెప్పఁబడియె నిచట,
సంస్కృతంబునందుఁ జనుఁ బదవిచ్ఛేద
మడుగుమొదలి వర్ణమగుఁ జెనుఁగున (4-177)

విశే. యతి వడి శబ్దద్వయమును అప్పకవి పర్యాయ పదములుగా సమానార్థకములుగా వాడియున్నాఁడు. కాని ప్రాచీనకాలమున నివి భిన్నార్థకములుగా నుద్దేశింపఁబడినవని తోఁచెడు.

ఈ క్రింది చిత్రకవి పెద్దన లక్షణ మీయంశమును వ్యక్తము చేయుచున్నది.

'వడియగుఁ బాదాదులయం
దిడునక్షరమేది యదియె యనచేసుక యె
య్యెడ యతిరావలెనని రట
నిడుటయు విరతులకు సంజ్ఞ యినసుత మంత్రీ'

(లక్షణసారసంగ్రహము)

పాదాద్యక్షరము వళి యని యెల్ల లాక్షణికులు పేర్కొనిరి:

చరణాద్యక్షరమే వడి (కవిజనాశ్రయము)
పాద ప్రథమాక్షర ముత్పాదితమగు వళి యనంగ (కావ్యా...మణి)
వాసనగల మొదలివ్రాయి వడి యనఁబరఁగున్ (ఛందోదర్పణము)
చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె (అప్పకవీయము)

వడికి మాఱుగా యతి, విరతి, యను పదములను పర్యాయముగా వాడరాదని తోఁచును. సంస్కృతములో యతి విషయమునఁ ప్రథమాక్షర ప్రసక్తి లేదు. తెలుఁగులో నీ ప్రథమాక్షరమునకు యతితో సంబంధమున్నది గానఁ బాదాద్యక్షరమునకు వళియను క్రొత్త పేరు తెలుఁగు లాక్షణికులు పెట్టియుందురు. కాలక్రమమున వళినే (ఆద్యక్షరమునే) యతిస్థానమున నిలపుటనుబట్టి 'వళి-యతి' సమానార్థకములుగా బర్యాయపదములుగా వాడుకలోనికి వచ్చియుండును. కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులలో యతి పర్యాయపదములలో వళి శబ్దము చేర్చఁబడలేదు.

అనంతామాత్యుఁడు 'యతి, వడి' పర్యాయపదములుగాఁ జూపెను. (విరతులు-విశ్రాంతులు—విరమంబులు యతులనఁగా విరమణములు నాఁగవళ్ళు వెలయు మురారీ - ఛందో-1-78) అనంతుని కాలమునుండి వడి-యతి సమానార్థకములై పర్యాయపదము లయ్యెనని యూహింపవచ్చును. అప్పకవి యనంతు

ననుసరించినాఁడు కావలెను. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో 'ప్రాసమైనను యతిపై వడియైన దేసిగా నిలిపి' యని యున్నది. ఇందు యతిపై వడి నిలుపుట యనఁగా యతిస్థానమునఁ బాదాద్యక్షరము నిలుపుట యని యర్థము. యతి-వడి సోమన మతమున భిన్నార్థకములనుట తెల్లము.

**వడిశబ్దవ్యుత్పత్తి :**

వడిశబ్దమునకు వ్యుత్పత్తి యూహ్యము. 'అడ్యోర్వళిః' అను చింతామణి సూత్రముఁబట్టి వళిశబ్దము సంస్కృతమని, వడిశబ్దము తద్భవమని కొందఱి మతము. వళికి వడి రూపాంతరమని డలయోరభేదమని కొందఱి వాదము. ఏది యెట్లున్నను ఇది తెలుఁగు లాక్షణికులు కల్పించిన దనుటలో సందియములేదు. శ్రీ గిడుగు సీతాపతిగారు ఛందోదర్పణోపోద్ఘాతములో వడిశబ్ద వ్యుత్పత్తి నిట్లూహించిరి. 'వడు, అను అరవపదముతో దీనికి సంబంధము కలదు. వడు అంటే మార్గమని అర్థము. పద్యపాదము విశ్రాంతి ననుసరించి రెండుభాగములు కాగా ఆభాగముల మొదటి అక్షరములు పాదములను మార్గము చూపించి నట్లుండుటచేతను, మొదటి భాగముయొక్క ప్రథమాక్షరముతో (అనగా పాదా ద్యక్షరముతో) రెండవ భాగము మొదటి అక్షరము మైత్రిగలదిగా ఉండవలెనన్న నియమము ఆచారమై ఉన్నది గనుకను, వడి (వళి) అని మీదచూపించిన స్థలములో లాక్షణికులు ప్రయోగించి ఉందురని నాఅభిప్రాయము'.

(ఛందోదర్పణ ఉపోద్ఘాతము-6 పుట, తృతీయముద్రణము)

తమిళ 'వడు' శబ్దమునుండి తెనుఁగు 'వడి' శబ్దము పచ్చినదని గిడుగువారి యూహ. ఈ వ్యుత్పత్తి స్వరసముగాఁ దోఁపకున్నది. వడు శబ్దము తమిళమున లేదు. గిడుగువారు పొరపాటున వ్రాసిరి 'వరి' 'వఴి' యను శబ్దము కాభాషలో మార్గము. పరంపర ఇత్యాద్యర్థములు గలవు. తెలుఁగునందువలె తమిళ పద్యము లందు యతిప్రాసలు గలవు. ఆ భాషలో యతికి 'మోనై' అనియు, 'ప్రాస'కు యదుగై' యనియు వ్యవహారము. తమిళమున యతి తెలుఁగునందువలె వర్ణ మైత్రిగలదై యున్నది. తమిళమున యతికి 'మోనై' అను పేరుండఁగా దానిని విడనాడి యా భాషలో యత్యర్థమునఁ బ్రయుక్తము కాని వడిశబ్దమును దెలుఁగునఁ గల్పించుట యసహజమనక తప్పదు. తెనుఁగు వడికివలె 'మోనై' అను తమిళ శబ్దమునకునుఁ బాదాద్యక్షరమని యర్థము.

ఇటీవల అప్పకవీయ వివరణకర్తలు శ్రీ వేదుల రామశాస్త్రిగారు గిడుగు వారి వడి వ్యుత్పత్తిని నిరాకరించి సంస్కృతభాషా వ్యుత్పత్తి నొకటి సృష్టించి యిట్లు పరామర్శించిరి. 'వళి' యనగా మడత (కాంతకు ఉదరమున నుండు మడతలు) అవి యెట్లు కాంత యుదరమునకు సహజాలంకారములై (శోభను కలి గించు నవియై) స్పష్టముగ (విభాగముతో) కానవచ్చునో అట్లే పద్యపాదమునకు సహజాలంకారములై విభాగముతో పాదాదియందును నియతవిశ్రమ స్థలమందును

స్పష్టముగా కానవచ్చునవి...లడలకు లళలకు అభేదము సుప్రసిద్ధమే. కావున వడియను దానికి పునః ప్రయత్న మక్కఱలేదు. ఇట్లు యతి, వళి, వడి యను వానికి వ్యుత్పత్త్యర్థములు కుదురును...వాస్తవమున ఇట్టి పదములలో నాయభిప్రాయము చొప్పున వ్యుత్పత్తు లవసరములే కనుక వడి, వళి అను వానితోపాటు తక్కిన ఇంపలి పదములన్నియు అవ్యుత్పన్నములగు సంజ్ఞాపదములే అయి వాడఁబడెననియు నెఱుఁగునది.' (పుట 12)

పారిభాషికపదము లవ్యుత్పన్నములని వేదులవారు వ్రాయుట సాహసము. సంజ్ఞాపదము లవ్యుత్పన్నములు కావు. ఏకారణములేక సంజ్ఞ లేర్పడవు. మనకు గొన్ని తెలియకపోవచ్చు.

ఈ వడి శబ్దమునకు నాకు స్ఫురించెడు వ్యుత్పత్తిఁ దెల్పెదను. 'వడి-విభాజనే, అని ధాతుపాఠము. విభాజనార్థము. కలదగుటచే వడి యతికిఁ బర్యాయపదమయ్యెను గాఁబోలు. లడయోరభేద యను న్యాయమున వడికి వళి రూపాంతరమగు. ఇట్టి వ్యుత్పత్తి వేదులవారన్నట్లు క్లిష్టమార్గసాధ్యమనక తప్పదు. దీనికన్న నీక్రింది వ్యుత్పత్తి కొంత యనురూపముగా నుండునని తోఁచెడు.

* అనుప్రాసమను సంస్కృత సంజ్ఞకుఁ దమిళభాషలో 'వఱియెదుగై' 'వఱి (ళి) యెదుగై' శబ్దములోని 'వళి' నే తెనుఁగు వారు సంగ్రహించిరేమో? ఇది యొక యూహ మాత్రమే.

క. భీమన పదిచెప్పె, ననం
తామాత్యుఁడు చేసె వెనుక । యతు లిరువదినా,
ల్గామీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియునేడు । గావించి రొగిన్. 7

ఆ. పూర్వకవుల లక్ష్య । ములుగూర్చి సత్కవి
జనము లవునటంచు । సమ్మతింప
విశ్రమంబు లేను । విరచింతు నాలుగు
పదులమీఁదనొకటి । విదితముగను. 8

వివ. ఇందప్పకవి తనకు ముందున్న లక్షణకర్త లెన్నెన్ని యతిభేదములు చెప్పిరో తెల్పి తరువాతఁ దాఁజెప్పఁగడఁగిన యతుల సంఖ్యను బేర్కొనుచున్నాఁడు.

భీమన (వేములవాడ భీమకవి) కవిజనాశ్రయమను ఛందములో 10 యతిభేదములను, అనంతామాత్యుఁడు ఛందోదర్పణములో 24 యతి భేదములను,

---

* (అనుప్రాస మెన్నుంవడ మొఱియై వఱి యెదుగై ఎన్బదు తమిళ్ వఱక్కు. యాప్పరుంగల క్కారిక.)

దరువాతఁ గొందఁఱు కవులు 27 యతులను జెప్పిరి. అప్పకవి 41 యతి భేదములఁ జెప్పఁబోవుచున్నాఁడు. *27 యతులఁ జెప్పిన కవులెవరో పైపద్యమునఁ దెలుపఁబడలేదు. లక్షణసారసంగ్రహకర్త యగు చిత్రకవి పెద్దన 27 యతుల చెప్పినాఁడు. అప్పకవి చిత్రకవి పెద్దన్న లక్షణసార సంగ్రహమునుండి రెండు పద్యము లుదాహరించియు నున్నాడు. కాన అప్పకవి భావములో 27 యతులు చెప్పిన కవి యీ చిత్రకవి పెద్దన్నయే కావలయును. కొందరు కవిగ్రామణులని వ్రాయుటచే నింక నొకరిద్ద ఱుండవచ్చునేమో?

విశే. కాలానుక్రమముగా నీయతిభేదముల సంఖ్య పెరిగినట్లు తెలియుచున్నది. వాఙ్మయము నానాఁటి కభివృద్ధినందుటచే వివిధ కవుల మతభేదములఁ బట్టి యతిభేదము లెక్కువగుట సహజము. భీమనానంతామాత్యాదులు యతుల లక్ష్యలక్షణములు దామే రచించిరి. ఇతర కవి లక్ష్యములఁ బ్రదర్శింపరైరి. లక్షణములకుఁ బూర్వకవి లక్ష్యములు చూపుట సరియైన పద్ధతి. కాన అప్పకవి తన యతిలక్షణములకుఁ దన లక్ష్యములనే కాక పూర్వకవిలక్ష్యములఁ జూపినాఁడు.

ఆదిలో నీయతిమైత్రి యేవర్ణమున కావర్ణమేయైయుండి కాలక్రమమునఁ బెక్కుభేదములేర్పడి యతిసంఖ్య పెరుగుటకుఁ గారణమైయుండును. మనకుఁ దెలియవచ్చినంతలో అప్పకవియే యతిభేదముల నధికముగా జెప్పినవాఁడు.

ఈ యతిమైత్రి యక్షరసాజాత్యమునుబట్టి యేర్పడినది. ఈ యతిమైత్రి క్రింది కారణములచే నేర్పడియుండునని తలంపనగును.

1. సారూప్యసంబంధము:నెపము-నెపము (ప-వ), జలధి-జడధి(ల-డ), హరుసము-అరుసము (అ-హ).

2. స్థానసామ్యము : కఖగఘలు కంఠ్యములు, చఛజఝలు తాలవ్యములు, టఠడఢణలు మూర్ధన్యములు, తథదధలు దంత్యములు, పఫబభలు ఓష్ఠ్యములు—ఇవి తమలోఁదాము యతిమైత్రి నందును.

3. తత్సమ తద్భవ సంబంధము :
అజ్ఞ-ఆన (జ్ఞ-న), గుణము-గొనము (ణ-న)
హంస-అంచ (స-చ) దిశ-దెస (శ-స)

4. వ్యాకరణశాస్త్రసిద్ధములగు ఆగమాదేశ సంబంధము :
పాపము + మాట-పాపపుమాట (ము-పు)
అతఁడు + పతికె అతడువలికె (ప-వ)
మేన + అత్త-మేనయత్త (అ-య)

---

* భీమనాదులు చెప్పిన యతులను అప్పకవీయ యతులతోఁబోల్చి యొక పట్టికలో అనుబంధమునఁ జూపియున్నాను.

ఇట్లే యింకను మరికొన్ని కారణములఁ జెప్పవచ్చును.

అప్పకవి చెప్పిన 41 యతులలోఁ బెక్కులు పూర్వలాక్షణికులు చెప్పిన కొలఁది యతిభేదములలోనే గతార్థమగును. కొన్ని యతులలోని యంతర్భేదము లను స్పష్టార్థము విడగడించి యతులసంఖ్యను బెంచినాఁ డప్పకవి. అతఁడు చెప్పిన వానిలోఁ గొన్ని క్రొత్తవి లేకపోలేదు. ఈ యతిభేదముల నప్పకవి పెంచిన విధము, అందు అవసరములు అనవసరములు మున్నగువాని వివరములు ఆయా యతిభేదముల క్రిందను అనుబంధమునను సవిమర్శముగఁ దెలుపఁబడును.

## యతిభేదములు

క. స్వరయతులు, వ్యంజనాక్షర
విరతు, లుభయవళులు, ప్రాస విశ్రాంతులు నాఁ
బరికింప నాల్గు తెఱఁగుల
విరమణములు వఱలుచుండు విహగతురంగా. 9

వివ. (1) సర్వయతులు, (2) వ్యంజనయతులు, (3) ఉభయయతులు, (4) ప్రాసయతులు-అని యతులు సామాన్యంగా నాలుగు తెఱఁగులు.

స్వరయతులు : అచ్చులలోని మైత్రి - ఏయచ్చులు పరస్పరము యతికిఁ జెల్లునో తెలియఁజేయును.

వ్యంజనయతులు : హల్లులలోని మైత్రి-ఏ హల్లులు పరస్పరము యతికి మిత్రములగునో తెలియఁజేయును.

ఉభయయతులు : అచ్చంధిగల నిత్యసమాసాదిశబ్దములందుఁ బరపదాది స్వరమునకుఁ గాని సంధిస్థానమున నున్న హల్లునకుఁగాని యతి గూర్చుట. ఇవి స్వరవ్యంజనముల యుభయములో దేనికేని యతి చెల్లునని తెల్పును.

ప్రాసయతులు : సీసము గీతము మున్నగు పద్యములందు యతికి మాఱుగాఁ బ్రాసమైత్రి గూర్చుట.

వీనిలోని యంతర్భేదములు క్రిందఁ దెలుపఁబడును. ఈ నాల్గు సామాన్య యతిభేదములలోని యంతర్భేదము లన్నియుఁ గలసి 41 యతిభేదములగును.

విశే. ప్రాసయతి నొక యతిభేదముగాఁ బేర్కొనన క్కఱలేదు. గీత సీసాది కతిపయ పద్యవిశేషములందు మాత్రము దీని కుపయోగము కలిమిచేతను, దీనికి యతిలక్షణము పట్టక ప్రాసమైత్రీ లక్షణమే చెల్లుటచేతను దీనిని యతిభేద ములలో నొకటిగా గ్రహించుట యనవసరము.

అందు స్వరవళు లెట్టివనిన :-

## 1. స్వరవళులు

తే. రసను స్వరమైత్రివళులు, స్వ । ర ప్రధాన
వళులు, లుప్తవిసర్గక । స్వరవళులును,
ఋవళి, ఋత్వసంబంధంబు, ఋత్వసామ్య,
వృద్ధులన స్వరవళు లేడు । విధములయ్యె. 10

టీ. రసను-భూమియందు (ఈ శబ్ద మనవసరము: గద్యగణపూరణార్థము వాడఁబడినది. ఇట్టి యనవసర పదములు లక్షణగ్రంథ పద్యరచనలో ననివార్యము లగుచుండును.)

వి. స్వరయతు లేడువిధములు:-

(1) స్వరమైత్రివళి. (2) స్వరప్రధానవళి, (3) లుప్తవిసర్గకస్వరవళి, (4) ఋవళి, (5) ఋత్వసంబంధవళి, (6) ఋత్వసామ్యవళి, (7) వృద్ధివళి.

ఈ స్వరయతిభేదములు వరుసగ లక్ష్యలక్షణములతోఁ గ్రింద వివరింపబడును.

## 1. స్వరమైత్రివళులు

తే. అద్వయమునకు వక్రత । మద్వయంబు
నిద్వయమునకు ఋయుగంబు । నెద్వయంబు
నుద్వయమునకు నంత్యవ । క్రద్వయంబుఁ
జెల్లు స్వరమైత్రివళులన । శేషశయన. 11

టీ. అద్వయము-అకారములజంట అనఁగా అ ఆ లు, ఇట్లే ఇద్వయము ఇ ఈ లు, ఉద్వయము ఉ ఊ లు, ఎద్వయము ఎ ఏ లు అని యరయవలెను. వక్రతమ ద్వయంబు ఐ ఔ లు (ఐ ఔ లకు వక్రతమములని సంజ్ఞ-వక్రతమ ఐచ్-అని, చింతామణి), అంత్యవక్రద్వయంబు-ఒ ఓలు (ఎ ఏ ఒ ఓలు వక్రములు. ఏ జ థో వక్రః- అని చింతామణి, అందు అంత్యవక్రద్వయము ఒ ఓ లగును), శేషశయన-గోపాలస్వామికి సంబోధన.

వివ. స్వరములలో (1) అ ఆ ఐ ఔ లు, (2) ఇ ఈ ఋ ౠ ఎ ఏ లు, (3) ఉ ఊ ఒ ఓ లు తమలోఁదాము యతికి మిత్రములు.

సాధారణముగ స్వరములలో దేనికేది చెల్లునో యనుటను దెలుపును గాన దీనికి స్వరమైత్రి వళి యని పేరిడఁబడినది.

**విశే.** యతిమైత్రిలో అచ్చులందు మూఁడు వర్గము లున్నవి. అయ్యవి: అకారవర్గము, ఇకారవర్గము, ఉకారవర్గము, 'అ, ఇ, ఉ లు' భిన్నస్థాన జనిత మగుటచే నయ్యవి వేర్వేఱయినవి. అనఁగా 'అ, ఇ, ఉ' లు పరస్పరము చెల్లవని యర్థము. అఆలు, ఇఈలు, ఉఊ ఋౠలు, ఎఏలూ, ఒఓలు, హ్రస్వ దీర్ఘస్వరము, లగుటచే నిఱంట లేకజాతికిఁ జెందినవై పరస్పరము చెల్లును. 'ఐ-ఔలలో' 'అయి-అవు' అను నుచ్చారణ యుండుటచే అకారమునకు ఐ ఔ లు చెల్లుబడి యయ్యెను.

తెలుఁగులో 'అయిన - ఐన, అయిదు - ఐదు, అవుర - ఔర, అవును- ఔను' అను రీతి రూపాంతరములు గలవు. (అచ్చికంబులం దయియవులకు వక్రత మంబులు బహుళంబుగా నగు-బాల వ్యా-క్రియ-103)

ఎ ఏ లకు ఇకారమునకు వలెఁ దాలవ్యోచ్చారణ, ఒఓలకు ఉకారమునకు వలె ఓష్ఠ్యోచ్చారణ గలదు గాన ఇఈ లకు ఎఏలు ఉఊలకు ఒఓలు యతిలోఁ జెల్లుబడియైనవని తలంపనగును. అకారమునకు ఇకార సంయోగముచే ఏకారమును ఉకార సంయోగముచే ఓకారమును గుణవిధానముచే నేర్పడుచున్నను అందు అకార శ్రుతికన్న వరుసగ ఇ-ఉల శ్రుతియే వినఁబడుటచే ఏఓలకు అకారముతో మైత్రి సమకూరదయ్యెనని యెఱుంగునది.

వృథ-విత, గృహము-గీము, మృగము-మెకము, హృది-ఎద ఇత్యాది తత్సమ తద్భవ రూపములందు ఋకార స్వరమునకు ఇకార ఎకార స్వరములు వచ్చును.

'ఋత్వమునకు ఇత్వమ్మును ఎత్వమును సిద్ధించు' నని కవి సంశయ విచ్ఛేదమునఁ దద్భవలక్షణము జెప్పఁబడినది. (3-తరంగ 8-పద్యము)

ఇట్టి తద్భవవ్యాజమున ఇఈ ఎఏలకు ఋకారముతో యతిమైత్రి యేర్పడి యుండునని యూహింపనగును.

ఈ క్రింది మూఁడు పద్యములలో వరుసగ అ ఇ ఉ ల యతిమైత్రికి అప్పకవి లక్ష్యములఁ జూపుచున్నాఁడు :

## అకారయతులు

ఆ. అబ్జపత్ర నేత్ర ! ఆర్తావన చరిత్ర
ఆతతాయిజైత్ర ! ఐంద్రమిత్ర
ఐందవప్రగోత్ర ! ఔర్వశేయస్తోత్ర
యనుచుఁ జెప్పనొప్పు ! యతులు కృష్ణ

వివ. ఇందు మూఁడు పాదములలో వరుసగ అ-ఆలకు, ఆ-ఐలకు, ఐ-ఔలకు యతిమైత్రి చూపఁబడినది, దీనివలన 'అ ఆ ఐ ఔ'లలో నొకయచ్చు మఱొక యచ్చునకు యతి చెల్లునని తెలిసికోవలెను.

టీ. ఆతతాయి జైత్ర-ఆతతాయి యనఁగా జంప నుద్యుక్తుఁడయిన వాఁడు, దుష్టుఁడు; అట్టి దుష్టులను జయించినవాడుఁ అనఁగా దుష్టసంహారకుఁడని భావము. ఇంద్రమిత్ర - ఇంద్రసుతుఁడయిన యర్జునునకు మిత్రుఁడా! ఐందవ ప్రగోత్ర-చంద్రవంశమునఁ బుట్టినవాఁడా! ఔర్వశేయనోత్ర - ఊర్వశీపుత్రుఁడయిన యగస్త్యుని స్తుతులు గలవాఁడా!

విశే. తెలుఁగుభాషలో వాక్యమధ్యమునఁగాని, పద్యపాదమధ్యమునఁగాని విసంధి యుండదు. 'అబ్జపత్ర నేత్ర-యార్తావన చరిత్ర' అనురీతి యకారాగమ యుక్తముగా నుండవలయును. కాని యతిలో స్వరసంధి యున్నపుడు పర పదాది స్వరమునకే మైత్రి గూర్పవలయునని నియమము. ఆ ప్రకారమిందు సంధి కలియక యకారాగమము వచ్చియున్నను బరపదాది స్వరమునకే యతి చెల్లును గావున స్పష్టార్థము కవిచే అచ్చుతోడి రూపమే నిలుపఁబడియున్నది. ఇట్లే క్రింది రెండు పద్యములందును గాననగును.

## ఇత్వవళులు

ఆ. ఇందువంశసోమ । ఈశ్వరీనుతనామ
ఈడితాంగధామ । ఋషభభీమ
ఋషజాభిరామ । ఎటులైన మాభామ
ఎడఁగటాక్షముంచి । ఏలుమనఁగ. 13

వివ. ఇందు నాలుగు పాదములలో వరుసగ 'ఇ ఈ' లకు, 'ఈ-ఋ' లకు 'ఋ-ఎ'లకు ఎ-ఏలకు యతిమైత్రి చూపఁబడినది.

టీ. ఈశ్వరీనుతనామ-పార్వతిచేఁ గొనియాడఁబడిన నామము గలవాఁడా! ఈడిత + అంగధామ - పొగడఁబడిన దేహకాంతి గలవాడా! ఋషభ భీమ = వృషభాసురునకు భయంకరుఁ డయినవాఁడా, వృషాసుర సంహారకుఁడా! ఋషజా + అభిరామ - (ఋషము-ఎలుఁగుబంటి, జాంబవంతుఁడు) జాంబవతీ ప్రియుఁడా!

ఇందలి లక్ష్యములు కృష్ణ కథాసంబోధనపరములని యరయునది. మఱియు నీ కవిలక్ష్యములన్నియు నంత్యాను ప్రాస శోభితములయి శ్రావ్యములుగా నుండును.

## ఉ ద్వి రా మ ము

ఆ. ఉరగరాజశాయి । ఊర్ధ్వ విష్టపదాయి
ఊర్జి తోరుకీర్తి । ఒడలికార్తి
ఒదవకుండఁ బోచి । ఓలిదాసునిఁగాచి
చేరి కనకశిపుఁ । జీరితనఁగ 14

విన. ఇందు వరుసగ 'ఉ-ఊ' లకు, 'ఊ-ఒ' లకు 'ఒ-ఓ' లకు, యతి మైత్రి చూపఁబడినది.

టీ. ఊర్ధ్వవిష్టపదాయి - (భక్తులకు) పుణ్యలోకముల నిచ్చువాఁడా! ఊర్జిత + ఉరుకీర్తి - శాశ్వతమయిన విస్తార కీర్తి గలవాఁడా! ఇందుఁ బ్రహ్లాద రక్షణకథ గైకొనఁబడినది.

విశే. లక్షణమున (11-పద్యము) ఋ యుగంబని యున్నదికాని యప్ప కవి ఇత్వవళులందో (13-పద్యము) హ్రస్వ ఋకారమునే యుదహరించెను. ౠ కారముతోడి ప్రసిద్ధశబ్దము వాఙ్మయములో లేమిచేఁ ద్యజింపఁబడినది కాఁబోలును.

కావ్యాలంకారచూడామణిలో ౠకార స్వరోదాహృతి యొసఁగఁబడి యున్నది :

'ఏకవీరుఁడాజి + ఋజుతయందు
ౠజరిపుఁడు సిరి స + హీనుండు' (7-34)

ఇందలి ౠజ శబ్ద మప్రసిద్ధము. ఏకాక్షర శబ్దముగ ౠకారము గ్రహింపఁబడినది. నానార్థ రత్నమాలలో నేకాక్షర కాండమున ౠకారమునకు దితియను నర్థముగలదు. 'ౠకార శ్చకు రే సర్పదృష్ట్యా విగతసంపది, హేమ ...దితి స్వర్గ ధన భూషా భుజాంబుషు'). ౠజరిపుఁ డనఁగా దితిసుత (దైత్య) ...నర్థము. అప్పకవి యచ్చులలో ఌ కారము నిందు గ్రహింపలేదు. ...కారాది పదములుండుటచే (ఋణము, ఋక్షము, ఋషి - మొ.) మాత్రము గ్రహించెను. ౠకారముతోఁగాని ఌ కారముతో గాని శబ్దములు వాఙ్మయమున మృగ్యములగుటచే అప్పకవి ౠకారము ...చూపలేదు. ఌ కారమును జెప్పనేలేదు. అప్పకవియేకాదు. అతనికి ...లాక్షణికు లెవ్వరును స్వరయతులలో ఌ కారమును స్పృశింప ...మొక్కటియే సంస్కృతభాషలో ఌ కార స్వరవిశిష్టమై కానవచ్చు ...కవి దీనినిగూడఁ దడవలేదు. ఈ క్లప్తశబ్దస్థ ఌ కార యతి ...కాంతమున విస్తరింపబడును.

## 2. స్వరప్రధానవళులు

క. తెలిసి పదాంతగతాక్షర
ములతోఁ బైశబ్దములకు మొదలఁగలుగు న
చ్చులుగూర్చిన సంధుల క
వ్వలస్వరములె నిలుచు నుభయవళులను దక్కన్. 15

తే. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ
ఇనతనూభవమిత్ర లంకేశజైత్ర
ఉరుగుణకలాప శకలీకృతోగ్రచాప
నాఁగ నిట్లు స్వరప్రధానవళు లొప్పు. 16

వివ. సంధి యనఁగా రెండుశబ్దముల కలయిక. అవ్యవహితోచ్చారణమున రెండు శబ్దముల యాద్యంతవర్ణములకుఁ గలయిక యేర్పడును. 'ఆద్యంత వర్ణయోరైక్యం సంధి రిత్యుచ్యతే బుధైః, అని యథర్వణకారిక. అందు అచ్చుతో నచ్చు గలియుట యచ్సంధి యనఁబడును. ఈ యతి యచ్సంధికి సంబంధించినది. అచ్సంధియందు మొదటిపదము తుదియందును రెండవపదము మొదటను అచ్చుండును. ఆ రెండచ్చుల కలయికయే యచ్సంధి యగును. ఇట్టి యచ్సంధిగల శబ్దములో రెండవ పదము మొదటనున్న యచ్చునకే యతిమైత్రి చెల్లును.

వంశ + అబ్ధి = వంశాబ్ధి - ఇది సవర్ణదీర్ఘ సంధి. ఈ సంధిగత శబ్దములోని మధ్యాక్షరమునకు యతిగూర్పవలయునన్నచో నందు సంధివశమున గూడియున్న పరపదాది స్వరమునకు (అకారమునకు) మైత్రి ఘటింపవలయును గాని పూర్వ పదాంత హల్లునకు (శవర్ణమునకు) మైత్రి చేయరాదు. పరపదాది స్వరముతోఁ గూడిన పూర్వపదాంత హల్లునకు యతి గూర్చుట *యుభయ యతులందు మాత్రమే చెల్లును. నిత్యసమాసాది శబ్దములందే యుభయయతి చెల్లును. సాధారణ స్వరసంధి గత శబ్దములం దుభయయతి చెల్లదు. వంశాబ్ధివంటి స్వరసంధి గత శబ్దములందుఁ బరపదాది స్వరమునకే ప్రాధాన్యమగుటచే నీ యతికి స్వరప్రధాన వళి యను పేరొసఁగబడినది.

16-వ పద్యమందు అ, ఇ, ఉ లకు వరుసగ స్వరప్రధానవళుల ఉ
హరణములు చూపఁబడినవి.

అతుల ... వం + శాబ్ధి (వంశ + అబ్ధి)
ఇన ... లం + కేశ (లంకా + ఈశ)
ఉరు ... శకలీకృ + తోగ్ర (శకలీకృత + ఉగ్ర

* ఉభయ యతి విభాగమును దీనింగూర్చి ముందు

విశే. అప్పకవి చూపిన యుదాహృతులన్నియు సంస్కృత స్వరసంధులై యున్నవి. సంస్కృత స్వరసంధులే యీ యతికి విషయములని భ్రమింపరాదు. సంస్కృతాంధ్ర స్వరసంధుల రెంటను స్వరప్రధానవడి పాటింపవలయునని యెఱుంగునది.

ఉ. ఎవ్వనిచే జనించు జగ + మెవ్వని లోపలనుండు లీనమై (భాగవతము)
ఎవ్వని...జగము + ఎవ్వని (జగమెవ్వని) = ఇది తెలుఁగు ఉకారసంధి, మఱి యీ సంధిగతశబ్దము యతిస్థానములోనే యుండవలయునని తలంపరాదు: పాదాది నుండవచ్చు.

ఉ. ఉత్తమాశ్రమ నిష్ఠితు + దూర్ధ్వరేతుఁ
దైన కణ్వమహాముని + యనఘచరితు (భారతము-ఆది-4-32)

ఇందు మొదటిపాదమున యతిస్థానములోను రెండవ పాదమునఁ బాదాది లోను స్వరసంధిగత శబ్దములున్నవి.

టీ. అతులగుణధామ-సాటిలేని సద్గుణములకు స్థానమైనవాఁడా!, భాను వంశాబ్ధిసోమ - సూర్యవంశమనెడు సముద్రమునకుఁ జంద్రునివంటివాడా!, ఇన తనూభవ మిత్ర - సూర్యసుతుఁడగు సుగ్రీవుని స్నేహితుఁడా!, లంకేశ జైత్ర-రావణుని జయించినవాఁడా!, ఉరు గుణ కలాప - గొప్పగుణముల సమూహము గలవాఁడా!, శకలీకృత + ఉగ్రచాప - తునియలుగాఁ జేయఁబడిన శివధనుస్సు గలవాఁడా.

ఇందలి సంబోధనలు రామపరములు. గ్రంథము కృష్ణాంకితమగుటచేఁ గృష్ణసంబోధనలే కవి సాధారణముగా నుపయోగించును. విష్ణుని యవతారములే కాన రామకృష్ణుల కభేదము కవిచేఁ బాటింపఁబడినదని యరయ నగును.

## 3. లుప్తవిసర్గకస్వరవళులు

తే. దైవభాష నదంతసాం। తములమీఁద
న (అ)త్తు మొదలనుగల శబ్ద। మతుకువేళ
నమరునోత్వంబునకుఁ జెల్లు। న (అ) యహలిపులు
జగతి లుప్తవిసర్గక। స్వరవళులన. 17

తే. అంబుదశ్యామ తవ కింక। రోహ మనఁగ
యామినీచరగర్వత। మోర్కయనఁగ
హరిసుతుండును నీవు న। న్యోన్యమిత్రు
లయి ప్రవర్తింతు రనఁగ ల। క్ష్యంబులయ్యె. 18

vi. సంస్కృతభాషయందు అనంతమైన (అస్) శబ్దమునకు హ్రస్వంబగు అకారము పరమగుచో, ఆ రెంటికిఁ జేరి ఓకార మాదేశమగును. ఇట్లు వచ్చిన ఓ కారమునకు 'అ, య, హ' లు యతి మైత్రి నందును. దీనికి లుప్తవిసర్గక స్వరవళి యని పేరు.

తమస్ + అర్క -తమ్-అస్ + అర్క = తమోర్క, ఇందు 'అస్-అ' లకు మాఱు ఓత్వము వచ్చెను. ఇట్టి ఓత్వమునకు అకారముతో యతిచెల్లునని పై లక్షణము చెప్పుచున్నది.

సంస్కృతమున అనంతమైన శబ్దమనుటచే, 'రామస్' 'కింకిరస్' వంటి ప్రథమావిభక్త్యంతశబ్దములును, 'తమస్' 'యశస్' వంటి సకారాంత శబ్దములును గ్రాహ్యములు.

లక్షణమున విసర్గకాని విసర్గకు లోపముగాని చెప్పఁబడలేదు. విసర్గ ప్రసక్తియే చేయఁబడలేదు. కాని యతి పేరులో విసర్గ శబ్దమున్నది (లుప్తవిసర్గక స్వరవళి). ఈ విసర్గ యెట నుండి వచ్చినది యని సందేహముగలుగును. పదాంత సకారము విసర్గగాఁ బలుకఁబడును (రామస్-రామః, తమస్-తమః), అట్లే పదాంత విసర్గము సకారమగును (విసర్జనీయస్యసః). సకార విసర్గముల కభేదము పాటింపఁబడును. అకారముమీఁది విసర్గమున్నను అకారముమీఁది సకారమున్నను నొకటే కావునను ఈ సంధియందు విసర్గ (సకారము) లోపించి ఓత్వము వచ్చును. దానికిఁ బరమందున్న అత్వము సయితము లోపించును. ఇట్లు లోపించిన అకారమునుబట్టి 'అ, య, హ' లు యతి చెందునుగాన, దీనికి లుప్తవిసర్గక స్వరవళినామము సార్థకము. అకారమునకు ముందు చెప్పబోవు సరసవళిచే 'య - హ' లు చెల్లునుగాన 'అ య హ' లని మూఁడు వర్ణములు చేర్చి చెప్పఁబడినదని యెఱుంగునది.

అనంతామాత్యుఁడు దీనినే గూఢస్వర యతి యని పేర్కొనెను. 'తమ + అర్క-తమోర్క' అను నిట్టి సంధిలో నిలుచునది ఓకారమే యైనను గూఢముగానున్న (లోపించియున్న) పరంబయిన అకారస్వరమునకే యతి చెల్లుటచే అనంతుఁడు పెట్టిన పేరు సముచితముగా నున్నది. కాని యీ గూఢస్వర యతి లక్షణమున

'స్వరము తుదనుండి లుప్తవిసర్గ కోత్వ
మైన స్వరవిరామంబు దా - సోహమనఁగ
అచ్యుతాశ్రితు లర్చి న-నోర్చన్న మిత్రు
లనఁగ నమ్మకుందుండు య-శోర్థి యనఁగ' (ఛందో-1-86)

అని రచించుటచే నందలి 'లుప్తవిసర్గకోత్వమైన స్వర విరామంబు' అను దళమును గ్రహించి యప్పకవి యీ యతికి లుప్తవిసర్గక స్వరవడి యని నామకరణము చేసెఁ గావలయు. మఱియు ననంతుఁ డుదాహరించినట్లే యప్పకవియు

నుదాహరణము లొసఁగెను. (దాసోహమ్-కింకరోహమ్: యశోర్థి - తమోర్క; అన్యోన్యమిత్రులు)

ఇందొక విషయము గమనింపవలయు. 'కింకరోహమ్, తమోర్క' శబ్ద సంధులలో అకారముమీఁద సకారము (విసర్గ) గలదు. కాని అన్య + అన్య-అన్యోన్యశబ్దములో నట్టిది గానరాదు. ఇందు విసర్గ లేకున్నను సుడాగమప్రాప్తిచే వ్యాకరణశాస్త్రమున ఓత్వము నిపతింపఁబడియున్నది. అప్పకవి యుదహరింపని పరోక్షశబ్దములోఁగూడ (పర + అక్ష-పరోక్ష) ఓత్వము విసర్గ లేకయే వచ్చుచున్నది. 'అన్యోన్య' పరోక్షశబ్దములుగూడ స్వరయతిలక్షణమున అధర్వణ ఛ్చందములోఁ జెప్పఁబడినట్లు రంగరాట్ఛంద ముద్ధరించిన పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. (పుట 89), గూఢస్వర యతిక్రింద అన్యోన్యశబ్ద ముదాహరింపవచ్చునే కాని లుప్తవిసర్గక స్వరవడిక్రింద నుదాహరించుట సరిగాదు. ఇందు విసర్గ లేనప్పుడు దానికి లోప మెక్కడనుండి వచ్చును? అప్పకవి చెప్పిన యీ యతికి లక్షణదీపిక, లక్షణశిరోమణి, రంగరాట్ఛందము మున్నగువానియందు గూఢ స్వర యతి యను పేరొసఁగఁబడియున్నది. గూఢస్వర యతి యని పేర్కొన్నపుడు కింకరోహమ్, తమోర్క శబ్దములతో అన్యోన్య పరోక్షాది శబ్దములను నుదాహరణ యోగ్యములగును.

అప్పకవి అనంతముమీఁద అకారము పరంబగునపు డోత్వము వచ్చునని చెప్పెను. సంస్కృత వ్యాకరణమున నీ సంధి ప్రక్రియ యీ క్రింది విధముగ నుండును : 'విసర్జనీయస్యసః' అను సూత్రముచే 'దాసః + అహమ్' అన్నది 'దాసస్ + అహమ్' అని విసర్గకు సత్వమువచ్చి 'ససజుషోరుః' అను సూత్రము వలనఁ బదాంత సకారమునకు రుత్వమువచ్చి (దాసర్ + అహమ్) 'అతోరో రప్లుతా దప్లుతే' అను సూత్రముచే రేఫమున కుత్వమువచ్చి (దాసఉ + అహమ్) గుణసంధిచేఁ బదాంత అకార ఉకారములకు ఓకారము వచ్చి (దాసో + అహమ్), ఏఙః పదాంతాదతి' అను సూత్రముచే ఏ-ఓలమీఁది అత్వము లోపించి 'దాసోహమ్' అను రూపము సిద్ధించును. ఇంత విస్తరప్రక్రియ శాస్త్రానుగుణమైనను నాంధ్రలాక్షణికు లప్పకవి చెప్పిన మార్గముననే సులువుగఁ జెప్పిరి. చూడుఁడు- అనంతుని ఛందము (IV-75)

'ప్రకట విసర్గాదిస్వర, మకారమునఁగలసి యోత్వమగు సంధిఁ దపోధి కుఁడన'.

అనంతుఁడుగూడ 'తపన్' ఇత్యాది శబ్దములందు 'తపః'అనురూపమును మనసునం దుంచుకొని విసర్గయని పేర్కొన్నాఁడు. దీనింబట్టి పదాంత సకార విసర్గల కభేదమనుట సిద్ధము.

అన్యోన్య ప్రభృతి శబ్దములందు గూఢస్వర యతి యని చెప్పినచో ఓకారముమీఁది అత్వమునకే కాక (తమస్ + అర్క-తమో + అర్క-తమోర్క),

ఏకారముమీఁది అత్వమునకును అయహలు యతి చెల్లుబడి యగును. లాక్షణికులు దీనిని జెప్పలేదుగాని యిందులకు నాచనసోముని యుత్తర హరివంశములో నీ క్రింది ప్రయోగము చూపబడెడి :

'ఆద్యరూపాయ విశ్వైక + ర్త్రేఽక్షరాయ' (3-210)

(కర్త్రే + అక్షరాయ - కర్త్రేఽక్షరాయ)

కొందఱు ఇం దప్పకవి 'అమరు నోత్వంబునకుఁ జెల్లు అ య హలిపులు' అని చెప్పుట సరియైన పద్ధతి కాదందురు. ఓకారమునకు అకారము చెల్లదని వారి భావము. సంధిలోఁ గానవచ్చునది ఓకారమైనను, అందుఁ బరంబైన అకార స్వరము లోపించి గూఢముగా నుండుటచే, అప్పకవి యిట్లు చెప్పినాఁడని సరి పెట్టుకోదగును. ఇదియు 'వంశాబ్ధి' ఇత్యాది సంధులందువలెఁ బరస్వరమునకే యతిమైత్రిగలిగి స్వరప్రధాన వడిలోనే యంతర్గత మగునుగానఁ బ్రత్యేకముగాఁ జెప్పనక్కఱలేదని కొందఱి తలంపు. స్వర ప్రధాన వడిలో నుదాహృతములగు శబ్దములలో సంధిలో సావర్ణ్యము సాజాత్య మున్నది. ఈ విసర్గసంధిలో భిన్న స్వర మాదేశమై యున్నది. కాన నిది వేఱుగాఁ జెప్పఁబడుట యుక్తమనక తప్పదు.

లుప్తవిసర్గక స్వరవళి లక్ష్యములో అన్యోన్యశబ్ద మొసఁగఁబడియున్నది. మఱి యీ గ్రంథమందే యీ శబ్ద ముభయ యతిలో నిత్యసమాస యతిక్రిందఁ జూపఁబడియున్నది (3-155). అన్యోన్యశబ్ద ముభయ యతిలోఁ బఠింపఁబడి యుండుటచే స్వరవ్యంజనముల రెంటి కిందు యతి చెల్లునని తెలియనగు. ఈలుప్త విసర్గకస్వరయతికిఁ గవివ్రాసిన స్వీయోదాహరణములు :

అంబుద...కింక + రోహ (కింకరః + అహమ్)

యామినీ...త + మోర్క (తమః + అర్క)

హరి...అ + న్యోన్య (అన్యః + అన్య)

పై మూఁడుదాహరణములందును అత్తు పరంబగునపుడు విసర్గ లోపించి వచ్చిన ఓత్వమునకు ఆఁదకారము గూఢముగా నున్నదిగాన 'అ-య-హ' లతో వరుసగ యతిమైత్రి చూపఁబడినది.

ఇఁక నీ యతి కితరకవుల లక్ష్యములు కవిచేఁ జూపఁబడినవి :

* మరున్నందన శతకమునందు—

శా. కోపాటోపము కుప్పిగంతులు నిజా । కుంభీభవచ్చౌర్యరే
ఖాపాండిత్యమయారె నీకును నమ । స్కారంబు లంకాపురీ

---

* మరున్నందన శతకకర్త-పట్టాభిరామకవి, క్రీ. శ. 1600 సంవత్సర ప్రాంతమువాఁడు. అప్పకవి యుదాహరించిన వజ్రపంజర-శతకముగూడ నీతని రచనయే యని శతకకవుల చరిత్ర దెల్పుచున్నది.

పాపగ్రంథి కులాంగనా కుచతటీ । పైతాపతద్గ్రాహ బా
హాపాటచ్చర రామదాస ! తవదా । సోహమ్మురున్నందనా. 19

వి. ఇందు నాల్గవపాదమున యతిస్థానములో దాసోహమ్మను విసర్గ సంధిలో (దాసః + అహమ్) ఓత్వములో గూఢమైయున్న అకారమునకుఁ బాదా దిలో నున్న హకారమునకు యతి చేయఁబడియున్నది.

టీ. అంబుదశ్యామ-మేఘమువలె నల్లని వన్నెగలవాఁడా ! - అహమ్ - నేను, తవ కింకరః - నీకు సేవకుఁడను, యామినీచర - రాక్షసుల, గర్వతమః - గర్వమనెడు చీఁకటికి, అర్క-సూర్యుడా !. హరిసుతుండు - అర్జునుఁడు,

* సుభద్రా పరిణయమునందు— (1-114)

శా. తా సైరింప కపర్ద యుండఁగ భవ । ద్గర్భంబునందాల్చి తే
జోసహ్యాన్ శరజన్ముఁగాంచి యలనీ। హారక్షమాభృత్కుమా
రీసాపత్న్యముగన్న మోహపుఁబురం । ధ్రీ రత్నమున్నీవకా
వే సర్వజ్ఞున కేలనిన్నుఁదలపై । నెక్కించుకోజాహ్నవీ? 20

వి. ఇందు రెండవపాదమున 'తేజోసహ్యా' అను శబ్దమున (తేజః + అసహ్యా) ఓత్వమునకుఁబరమైలోపించిన అకారమునకు యతిస్థానములో నిలిచి యున్న హకారమునకును యతి చెల్లింపఁబడినది. ముందు పద్యములో యతిస్థానములో విసర్గసంధి ! ఇందుఁ బాదాదిలో విసర్గసంధి యని యరయునది.

ఉద్యోగ పర్వమునందు— (1-32)

ఉ. దైన్యముదక్కిదూత యుచి । తంబుగఁబాండునృపాలుపాలురా
జన్యవరుండు ధర్మజుఁడు । సమ్మతివేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిందగంగ గరి । మంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము । లాడినఁ దత్ఫలమాతఁడందెడిన్ ! 21

వి. ఇందు నాల్గవపాదమునఁ బాదాదిలోనున్న అన్యోన్య (అన్య + అన్య) శబ్దములోని ఓకారము మీఁద వచ్చి లోపించిన అకారమునకు యతిస్థానముననున్న (భాషణములు + ఆడిన) ఆడిన శబ్దములోని అకారమునకు యతి చేయఁబడినది.

ఇందు 'భాషణము లాడిన, అనుచోట స్వర ప్రధానవళియని యెఱుంగునది.

* దీనికి విజయవిలాసమని నామాంతరము.

। రత్నామాదీప.

## 4. ఋ వ ళి

క. ఇత్వైత్వంబులఁ 2దొలగఁక
ఋత్వంబును ఋవళియనఁగ । రేఫముతో మి
త్రత్వంబు నెఱపు నెట్టి మ
హత్త్వమొ యట్లయగుఁ గాదు । లందున్నపుడున్. 22

క: రతివల్లభజనక విని
ర్జిత కనకవిలోచనాఖ్య । 3ఋగ్యజురాది
శ్రుతిచయగోచరవాహీ
కృతఖేచరకుల లలామ రిపుజనభీమా. 23

వి. ఇ ఈ ఎ ఏ లతోఁ గూడిన రేఫముతో ఋకారముయతి మైత్రినందును' అనఁగా రి రీ రె రే లకు ఋకారములో యతి చెల్లునని భావము. మఱియు హల్లులతోఁ జేరియున్న ఋకారము (వ్రటసుడి) సయితము రి రీ రె రే లతో యతి మైత్రి చెందును. కృ, శృ, ఇత్యాదులం దున్న వ్రటసుడితో రి, రీ, రె, రే లు చెల్లునని యెఱుఁగునది.

ఇందుల కప్పకవి చూపిన స్వీయోదాహరణ :
'రతివల్లభ' యను పద్యములో
రెండవ పాదమున 'ని, ర్జిత... + ఋగ్యజు' రి-ఋలకు యతి
నాల్గవ పాదమున 'కృత... + రిపు' వ్రటసుడికి రి తో యతి

విశే. ఋకారము స్వరము, రి వర్ణము వ్యంజనము. ఋవళి కేవలస్వర యతి గాదు. స్వరవ్యంజనముల మిశ్రయతి యనఁదగును. ఈ మైత్రి కాకర మిట్లు దోఁచుచున్నది :

ఋకారోచ్చారణమున స్వరవ్యంజనధర్మములు మిళితములై యున్నవి. ఇందు స్వరోచ్చారణమును రేఫోచ్చారణమును గలవు. *ఋ ర లు మూర్ధన్యములు. (స్యుర్మూర్ధన్యాః ఋటు రషాః- పాణినీయశిక్ష), ఏకస్థాన సంభవములు. ఋకారము రేఫద్వయ గర్భితమని సంస్కృత వ్యాకర్తల మతము.

* స్వరభక్తి స్వరూపంతు విస్పష్టం వ్యాచష్టే వరరుచిః 'ఋకారాది రణుమాత్రా, రేఫోఽర్ధమాత్రా, శేషాస్వరభక్తి రణుమాత్రా' ఇతి అస్యాయమర్థః - ఇంద్రియవిషయో యోసౌ, వణురిత్యుచ్యతే బుధైః, చతుర్భిరణు

2. గలయక : బెరయక, 3. ఋగ్యజుషాది - అని యుండనగు.

ద్విర్మాత్రా, పరిమాణ మితిస్మృతమ్, మాత్రికస్య ఋకారస్యాది రణుమాత్రః స్వర భాగః, మధ్యేరేఫ అర్ధమాత్రః, అంత్యేప్యణుమాత్రః స్వరభాగః, ఏతత్ ఋకార స్వరూపమ్ (తైత్తిరీయ ప్రాతిశాఖ్య-త్రిభాష్య రత్న వ్యాఖ్య).

తద్భవమున ఋవర్ణము రేఫ మగుచున్నది. ఋవర్ణమునకు రివర్ణోచ్చార ణము సహజముగా వినఁబడుచున్నది. ఉ॥ ఋక్షము - రిక్క (తత్సమ తద్భవ రూపములు.) మఱియు ఋత్వము తద్భవమున ఇత్వమగును. ఉ॥ మృత్యు-మిత్తి, గృహము-గీము, పృథ-విత, హృది-ఎద(రిత్వమగును ఋత్వంబు-కవిసంశయ-3 తరంగము-తద్భవ ప్రకరణము).

సంస్కృత ప్రాకృత కర్ణాట భాషలలోను ఋత్వము రిత్వమగుట కానఁబడుచున్నది:

(సం) కృ-క్రియతే, భృ-భ్రియతే, ధృ-ధ్రియతే

(ప్రా) ఋణం—రిణం

(క) ఋషీ—రిసి, ఋణ—రిణ

యణాదేశ సంధిలో ఋకారమునకు రేఫాదేశము కలుగును. ఉ॥ పితృ + అంశ—పిత్రంశ. మఱియు సంప్రసారణమున రేఫమునకు ఋత్వమగును.

తెలుఁగు వ్యాకరణమున ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యంబులని చెప్పఁ బడినది. తెలుఁగు సంధియందు ఋకారము రేఫ వంటిదగును. అనఁగా హల్లుతో సమానమని యెఱుంగునది అతఁడు + ఋషి—అతఁడు ఋషి : వచ్చెన్ + ఋషి-వచ్చెన్ ఋషి, ఇందుఁ బరమగు ఋ వర్ణము స్వరమైనను స్వరసంధి కార్యము జరుగదు.

ఇట్టి వివిధ కారణములఁబట్టి ఇత్వ విశిష్టరేఫకు ఋకారముతో యతిమైత్రి యేర్పడియుండునని యూహింపసగును.

అప్పకవి చూపిన యితరకవుల లక్ష్యములు :

సభాపర్వమునందు— (2-11)

సీ-పా. ఋత్విజుండని విచా । రించి పూజించి తే
ద్వైపాయనుండుండ । ధర్మయుక్తి. 24

వి. పై సీసపాద పూర్వార్ధమున 'ఋ-రి' వర్ణములకు యతి.

ఈ ఋ వళి యాదికవి నన్నయ్యచేతనే యాదిలోఁ బ్రయుక్తమై యున్నదని గమనింపఁదగును.

విజయవిలాసమునందు— (1-83)

ఉ. అణిమెఱుంగుముత్తెపుటొ । యారపుమ్రుగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు । హృద్యనిరంతర వాద్యఘోషముల్
రాణఁబొసంగఁ బ్రోలుమిగు । లం గనువిందొనరించు నిత్యక
ల్యాణముఁబచ్చతోరణము । నై జనులందఱు నుల్లసిల్లఁగాన్ 25

వి. ఇందు రెండవ పాదమున శ్రే లోని 'రే' కును (శ్రే-సంయుక్తాక్షరము: ఇందేదో నొక హల్లునకు యతి యుంచినఁ జాలును). 'హృ' లోని వట్రసుడికిని (కాదులమీఁది ఋత్వమునకును) యతి మైత్రి.

విశే. ఇందొక విషయము గమనింపఁదగును. సాధారణముగ స్వరము స్వరముతో యతి మైత్రినందును. ఋకారస్వరము వ్యంజనమగు రేఫతోఁ జెల్లుచున్నది. ఈ విధముగ నితర స్వరములకు వ్యంజనములతో యతి చెల్లదు. (అ య హ ల మాత్రము సరసవడిలోఁ జెల్లును.)

అకారమునకు క వర్ణముతో యతి చెల్లదు. అనఁగా కేవలము అకార స్వరము కకారముమీఁది అకారమునకు యతి చెల్లదు. వ్యంజన యతిలో హల్లునకును దానిమీఁద నిలుచు స్వరమునకును యతి మైత్రి చెల్లవలెను. ఈ విషయము ముందు చెప్పఁబడు ప్రాణి యతిలో నెఱుఁగనగును. అప్పకవి ఋ వ ళ లక్షణ పద్యములో 'ఋ వ ళ యనఁగ మిత్రత్వంబు నెఱపు నెట్టి మహత్త్వమొ యట్లయగుఁ గాదులందున్నపుడున్' అన్నాఁడు. రి వర్ణమునకు కేవల ఋ కారము చెల్లుట సామాన్య విషయము. మఱి యే హల్లుతో ఋకారము చేరియున్నను (వట్రసుడిగా నున్నను) ఆ హల్లుతోఁ బ్రమేయమేలేక యా వట్రసుడికి రి వర్ణము చెల్లుట మహత్త్వమనక తప్పదు. ఇందు మహత్త్వమనఁగా విశిష్టత. తక్కిన స్వరముల కిట్టి మహత్త్వము ప్రాప్తింపలేదు. ఋకార రేఫలకు సామ్యముంటచే వాని మైత్రి యంగీకరించుట సామాన్యమనియు, ఋత్వము హల్లుమీఁద నిలిచి యున్నపుడు హల్లునకు నచ్చునకుఁజేర్చి మైత్రి గూర్పవలసియున్నను హల్లునకుఁ బ్రాధాన్య మీయక ఋత్వమునకే రేఫముతో మైత్రిచెప్పుట విశేషమనియు నరయవలయును. ఇదియే యప్పకవి చెప్పఁదలచిన ఋత్వయతి మహత్త్వము.

'ఇచ్చెను—కేవలము' అనుచోట ఇత్వమునకును కకారముమీఁది ఇత్వమునకును యతి మైత్రి చెల్లఁజాలదు. కాని 'ఋషి - కృష్ణుడు' అనుచోటఁ గేవల ఋకారమునకును కకారముమీఁది ఋత్వమునకు యతి మైత్రిచేసినఁ జాలును.

ఈ ఋ వడినే అనంతామాత్యాది లాక్షణికులు రి వడి, రీ విరమమని పేరొక్కన్నారు. అనంతుఁడు ఛందోదర్పణమునఁ జెప్పినది. 'రు వడి' యని

యిటీవలి కొందరు పరిశోధకులు వాడి చెదరు. రు వడి యనఁగా 'ఱ-ఋ' ల యతి మైత్రి. అనంతుఁడు చెప్పినది రి వడియే, రు వడి గాదు. రు వడి యన్నది యే ఛందమునఁ గాన్పింపదు. 'రు-ఋ' లకు యతి కొన్ని పూర్వ ప్రయోగ ములఁ గానవచ్చుట యాధారముగాఁ గొని అనంతాదుల రి వడిని రు వడిగా సమర్థింపఁ గడఁగుట సరిగాదు. ఈ రు వడి చర్చ యీ గ్రంథాంతమునఁ బరామర్శింపఁబడును.

ఋ వర్ణమునకు రి వర్ణము చెల్లుటచే రివడి నామము సార్థకమే యగు. ఇందు ఋకార స్వరవిషయము ప్రధానమగుటచే దీనిని స్వర యతిలో ఋ వడి యని యప్పకవి పేర్కొనుట కడుంగడుఁ బొసఁగియున్నది.

టీ. ఇత్త్వైత్వంబులఁ దొలఁగక-(ఇత్వ + ఏత్వంబుల)-ఇత్వమును ఏత్వ మును వదలక, అనఁగా ఇకారముతోను ఏకారముతోను గూడినదై, రేఫముతో, ఋత్వఁబును - ఋకారము, ఋ వళి యనఁగ మిత్రత్వంబు నెఱపున్-ఋవళి యను పేరితో యతి మైత్రి చెందును. ఎట్టి మహత్త్వమొ- అదేమి మహిమయో- (ఇందు మహత్త్వ మన విశిష్టత). కాదులం దున్నపుడున్ - కకారాది హల్లు తో ఋకారము చేరియున్నపుడును (కృ, శృ అనురీతి వత్రసుడిగా నున్నప్పుడు), అట్లనగు రి రీ రె రే లతో యతి మైత్రినందును.

'ఇత్త్వైత్వఁబులఁ గలయక. బొరయక' అను పాఠాంతరము లప్పకవీ యాధస్సూచిలోఁ జూపఁబడినవి. ఈ పాఠము లేవియు సరిపడవు. ఇత్త్వైత్వంబు లతోఁ గూడనిచో రేఫకు ఋకారముతో యతి చెల్లుటకు వీలులేదు. 'ఋ-ర' లు చెల్లవు గదా? 'ఋ-రి' వర్ణములు మాత్రమే చెల్లును. కాన నీ పాఠాంతరము లసంగితములు, ఇప్పుడు గ్రహించిన పాఠమందు నన్వయము కొంచెము క్లిష్టమై యున్నది. ఇత్త్వైత్వంబులఁ దొలఁగక రేఫముతో ఋత్వంబును ఋవళియనఁగ మిత్రత్వంబు నెఱపు' అని యన్వయింపవలెను. ఇత్త్వైత్వంబులఁ దొలఁగని రేఫముతోనని యర్థము గ్రహింపవలెను.

టీ. రతివల్లభ జనక-మన్మథజనకుఁడా, వినిర్జిత...లోచనాఖ్య - హిరణ్య కశిపుని జయించినవాఁడా, ఋగ్యజు...గోచర - వేదములచేఁ దెలియఁదగిన వాఁడా, వాహీకృత ... లలామ - గరుడుని వాహనముగాఁ జేసికొన్నవాఁడా, రిపుజనభీమా-శత్రుజనులకు భయంకరుఁడా.

## 5. ఋత్వసంబంధవళులు

తే. సౌరిదిఁ గాదులఁ గల వ్రట । సుడులకెల్ల
ఋత్వమిత్రంబులగునచ్చు । లెనయనైదుఁ
జెల్లు హయలును స్వరమైత్రిఁ । జెందునపుడు
వెలయు నివి ఋత్వసంబంధ । వళులనంగ. 26

ఆ. ఇనతనూభవుండు । వృషదశ్వసుతునేసె,
ఋభునదీసుతుండు । కృష్ణునేసె,
నేమి చెప్పనవుడు । దృఢ శక్తి శల్యుండు
హీనబలునిజేసె । వృష్ణికులుని. 27

వి. శకారాది హల్లుంపై నిల్చిన ఋత్వమునకు (వ్రటసుడికి) ఋత్వమును దాని మిత్రములయిన ఇ ఈ ఋూ ఎ ఏ అను అయిదచ్చులును యతికిఁ జెల్లును. 'కృష్ణ' శబ్దములోని 'కృ' వర్ణమునకు యతి చేయునపుడు హల్లును విడనాడి వ్రటసుడికి మాత్రము యతి చెల్లింపవచ్చును. వ్రటసుడి ఋత్వము కాన దానికి స్వరమైత్రివశంఁబట్టి ఇ ఈ ఋ ఋూ ఎ ఏ అను అచ్చులు చెల్లునని తెలియవలెను. మఱియు 'య-హ' లు అకారముతోఁ జెల్లునని సరసవశి నిర్దేశించుటచే ఇకారాది స్వరవిశిష్టములయిన 'య-హ' లు ఋత్వమునకుఁ జెల్లునని యెఱుఁగనగును.

అనఁగా వ్రటసుడికి (ఋత్వమునకు) ఇ ఈ ఋ ఋూ ఎ ఏ లును, యియీ య్ృ య్ౄ యె యే, హి హీ హృ హౄ హె హేలును (ఋకారస్వరమైత్రిగల యహలు) యతి చెల్లునని భావము. ఋత్వము రేఫమువంటిదని మున్నే చెప్పఁబడినది గాన ఋత్వవిశిష్టహల్లు సంయుక్త వర్ణతుల్యమగును. సంయుక్తాక్షరమున నొక యక్షరమునకు యతి గూర్చినఁ జాలునని సంయుక్త యతి చెప్పుచున్నది. దానింబట్టి 'కృ' వంటి వానిలోని ఋకారమునకు మాత్రము యతి చెల్లినఁ జాలునను మత మేర్పడియుండును.

ఇందు హల్లుమీఁది ఋత్వమునకు ఋకారమే కాక ఋత్వసంబంధమయిన అనఁగా ఋత్వమిత్రములయిన ఇకార ఏకారములు చెల్లుటచే ఋత్వసంబంధ వళియను పేరు దీనికి సముచితము.

అప్పకవి చూపిన స్వీయలక్ష్యము :

ఇన + వృష (వ్రటసుడికి-ఇకారము)
ఋభు + కృష్ణు (వ్రటసుడికి-ఋకారము)
ఏమి + దృఢ (వ్రటసుడికి-ఎకారము)
హీన + వృష్ణి (వ్రటసుడికి-స్వరమైత్రిగల హకారము)

పై లక్ష్యపద్యమున ఇ, ఋ, ఏ అను అచ్చులకును ఇకారవిశిష్ట హకారమునకును ఋత్వముతో యతిమైత్రి చేయఁబడినది. ఇందు యకారమున కుదాహృతి చూపఁబడలేదు గాని యదియుఁ జెల్లునని లక్షణమును బట్టి యరయునది. యి, యీ, యె, యేలు పదాదియందు సాధారణముగా నుండవు, కాన అప్పకవి యుదాహరింపలేదు కాఁబోలు. యియక్ష, యియాస లోనగు కొన్ని శబ్దములు సంస్కృతమునఁగలవు. 'హరి యెవఁడు, అదియేమి, మున్నగు సంధుల

లోని యకారము స్వరప్రధానముచే ఎ, ఏలను స్వరములే యగును. 'అయితి' అయెను, ఊయెల' ఇత్యాదులందుఁ బదమధ్యములో ఇత్వవిశిష్టము ఎత్వవిశిష్టము నగు యకారముండును. ఇట్టి యకారములు ఋత్వమునకుఁ జెల్లును.

టీ. ఇనతనూభవుండు - కర్ణుఁడు, పృషదశ్వసుతు-భీముని, ఋభునదీ సుతుండు-గంగానదీసుతుండు-భీష్ముఁడు, వృష్ణికులుఁడు-కృష్ణుఁడు.

ఇతర గ్రంథస్థలక్ష్యములు :

జైమిని భారతమునందు—(2-109)

తే. తండ్రితరమునఁ బెనిమిటి । తరమునందు
వీసమంతయుఁ బుణ్యంబు । జేసి యెఱుఁగ
వార్ధకంబున నింకేల । వట్టి తొడుసు
కృష్ణ దర్శింపకున్న నా । కేమి చిక్కు. 28

వి. ఇందు నాల్గవపాదమున 'కృ' లోని వ్రటసుడికి యతిస్థానములో 'నాకు + ఏమి' అను పదచ్ఛేదమునఁ బరస్వరమైన ఏకారమునకు మైత్రిగావింపఁ బడినది. (నాకేమి - అనుచోట స్వరప్రధానముచే ఏకారమునకు యతి యని గ్రహించునది.)

మనుచరిత్రమునందు—(1-57)

సీ. తీర్థసంవాసులే । తెంచినారని విన్న
నెదురుగా నేఁగు ద । వ్వెంతయైన,
నేఁగి తత్పదముల । కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తినా । తిథ్యమిచ్చు,
ఇచ్చి యిష్టాన్నసం । తృప్తులఁగా జేయుఁ
జేసికూర్చున్నచోఁ । జేరవచ్చు
వచ్చియిద్ధరఁగల్లు । వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ । దెలియనడుగు. 29

వి. ఇందు మూఁడవపాదమున 'ఇ-తృ' లకు యతిమైత్రి.

వరసింహపురాణమున—(2-30)

సీ-పా. ఏ దేవులీలలై । యెసఁగు జగంబులు
సృష్టిరక్షాసమా । పేక్షఁబరఁగు, 30

వి. ఇందుత్తరార్థమున 'స్పృ'లోని ఋత్వమునకును అపేక్ష (అప + ఈక్ష) అను స్వరసంధి శబ్దములోని 'ఈ' కారమునకు యతిమైత్రి చేయఁబడినది.

ఆముక్తమాల్యదయందు—(4-273)

చ. హితులు భిషగ్గ్రహజ్ఞ బుధ । బృందకవీంద్రపురోహితుల్ హితా
హితులు ధనార్జనాదినృప । కృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పితస । మృద్ధరమాచర।¹ణెప్పులౌట నా
హితమును నట్లెకాఁజతుల । వృత్తిఁజరించుట నీతి ఱేనికిన్. 31

వి. హాయలను స్వరమైత్రిఁ జెందునపుడు వట్రసుడికిఁ జెల్లునను లక్షణమున కీపద్యము లక్ష్యమగును. ఇందు నాలుగు పాదములందును 'హి' కి వట్రసుడికి యతి గూర్పఁబడియున్నది. నాలుగుపాదములందును ఋత్వసంబంధ యతి గూర్పఁబడియుండుట చమత్కార విశేషము.

సుభద్రాపరిణయమునందు - (1-158)

తే. చెఱకు విలుకానిబారికి । వెఱచి నీదు
మఱుఁగుఁజొచ్చితిఁ జేపట్టి । మనుపు నన్నుఁ
బ్రాణదానంబుకన్నను । వ్రతము గలదె
యెఱుఁగవే ధర్మపరుఁడవు । నృపకుమార. 32

వి. ఇందు నాల్గవపాదమున 'ఎ-నృ' లకు యతి

ఎడపల్లి పర్వతన్నచాటుధార—

మ. రణరంగంబున నిశితాసి యరినో। రంబూరిగై కొన్నఁదా
నణుమాత్రంబును వానిపైని దెగదా । హాచిత్ర మూహింపఁగాఁ
దృణమే కానలె దారికట్టు మొనక । ట్టిద్ధారుణీమండలిన్
బ్రణుతప్రాభవ కందనోలిపురగో । పాలా క్షమావల్లభా. 33

వి. ఇందు మూడవపాదమున ట్ట-ఇ (కట్టు + ఇద్ధారుణీ) లకు యతి.

## 6. ఋత్వసామ్యవళులు

తే. వట్రువలు చెంది తమలోన । వ్యంజనంబు
లన్నియునుగూడు ఋత్వసా । మ్యవళులనఁగ,

1. ణెచ్చు.

వృష్ణివంశాబ్ధిసోముఁడై । పృథివిఁబుట్టి
మృతుని గావించెఁ గంసునిఁ । గృష్ణుఁడనఁగ. 34

వి. ఋత్వవిశిష్టములైన హల్లులన్నియుఁ బరస్పరము చెల్లును. ఆ హల్లు లొకదాని కొకటి చెల్లకున్నను వట్రసుడి రెంటికి నున్నచోఁ జెల్లును. ఇది వట్రసుడికి వట్రసుడి యతియని గ్రహింపవలెను. హల్లులు భిన్నములయ్యును ఋత్వము రెంటనున్నదను సామ్యముచే నీయతి చెల్లుబడి యగుచుండుటనుబట్టి దీనికి ఋత్వ సామ్యవళియను పేరు సార్థకమగును. ఋకారము రేఫతుల్యము గాన ఋత్వవిశిష్టత రేఫవిశిష్టతవంటిదై సంయుక్తవర్ణముం బోలినదై సంయుక్తమున నొక హల్లునకు మైత్రియున్నఁజాలుఁగాన హల్మైత్రి యక్కఱలేకయే యిందు ఋకారమైత్రి మాత్రము సరిపడినదని యెన్నునది.

లక్షణలక్ష్యముల రెంటి నప్పకవి పై యొక పద్యమందే చెప్పెను. అందుఁ బూర్వార్థము లక్షణము; ఉత్తరార్థము లక్ష్యము.

3-వ పాదమున 'వృ-పృ' లకు 4-వ పాదమున 'మృ-గృ' లకు యతి.

ఇందు నాలవ పాదమందలి యతియే దీనికి సరియైన యుదాహరణ మగును. 'మ-గ' వర్ణములు పరస్పరము చెల్లవు. రెంటియందును వట్రసుడి యుండుటచేఁ జెల్లినవి. మూఁడవపాదమున వ ప లు ఋత్వయుతములు గాని 'వ-ప' లు పరస్పరము అభేదవర్ణ యతిక్రింద జెల్లుబడి యగును వట్రసుడి లేకున్నను నివి చెల్లుట కడ్డంకి లేదుగదా?

దీని కితరుల లక్ష్యములు :

* విష్ణుచిత్తీయమునందు—(1-41)

సీ-గీ తిరుగుచురయారె సుర పురి । సురలమరిగి
బహుళ హలహలభరిత క । ల్బరిగనగర
సగరపుర వరపరివృఢ । జవనయవన
పృతన భవదసి ననిఁదెగి। కృష్ణరాయ. 35

వి ఇందు నాలవపాదమున 'పృ-కృ' లకు యతి.

అందే - (2-91)

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో । శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో । వాల్లభ్య[1]లభ్యధ్వజ

---

1, లార్ష్యధ్వజ.

* ఆముక్తమాల్యదకు నామాంతరము

గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో । ద్రాగ్దీపికారోపమో
నృహరీ వాదములేల లేరె యితరుల్। నీలీలకుం బాత్రముల్. 36

వి. ఇందు మొదటిపాదమున 'గృ-శృ' లకు యతి.

విశే. అప్పకవికిఁ బూర్వుఁడయిన యనంతుఁడీ ఋవడి భేదములఁ జెప్పినాఁడు. అనంతు ననుసరించియే యప్పకవి దీనినిట్లు వింగడించి వివరించినాఁడని చెప్పనగును. అప్పకవి ఋవళిని అనంతుఁడు రివడి (రీవిరమము) అని పేర్కొన్నాఁడు. ఋత్వసంబంధ ఋత్వసామ్యవళులు రెండు అనంతుని యొక్క ఋకార రూప స్వరయతిలోఁ జెప్పఁబడినవి.

'క్షితి ఋకారరూపస్వర యతులుపరఁగు
ఋగ్యజుస్సామ వినుతుండు—కృష్ణుఁడనఁగ
వృష్ణికులజుండు కరుణాస-మృద్ధుఁడనఁగ
హేమపీతాంబరుఁడు దేవ-వృషభుఁడనఁగ' (ఛందో. 1-87)

## 7. వృద్ధివళులు

క. తలకట్టులపై సంస్కృత
ములఁ గదియు పదాది వక్ర । ములకు వరుసతో
నెలకొను వక్రతమంబుల
కిల నుభయముఁ జెల్లుచుండు । వృద్ధివళులనన్. 37

తే. ఇభభయవిదార సర్వలో । కైకవీర
అఖిలభువన ప్రశస్త జి । తైణహస్త
ఉదధిజాశ్రితవక్ష భ । క్తౌఘరక్ష
హతపరానీక నందప్రవ । జౌకయనఁగ. 38

టీ. తలకట్టుపై-అత్వములపై, వక్రములు-ఎ ఏ ఒ ఓ లు (సంస్కృతము లోని వక్రములు ఏ ఓ లు, అందు హ్రస్వవక్రములు లేవు), వక్రతమంబులు-ఐ ఔ లు.

వి. సంస్కృతమున అకారమునకు ఏ ఓ లు(వక్రములు)పరమగుచో వరుసగ ఐ ఔ లు (వక్రతమములు) ఏకాదేశములగును. ఐ ఔ లకు సంస్కృతమున వృద్ధియని సంజ్ఞ గావున నీ సంధికి వృద్ధి సంధియని పేరు. (వృద్ధిరాదైచ్, వృద్ధిరేచి-అని పాణినీయ సూత్రములు) ఇట్టి సంధిలోఁ బరస్వరములయిన ఏ ఓ లకుఁ గాని, ఆదేశములయిన ఐ ఔ లకుఁగాని యతి చెల్లును.

లోక + ఏక-లోకైక-ఇందు ఏకారమునకుఁగాని ఐకారమునకుఁ గాని యతి చెల్లునని యెఱుఁగునది. ఇట్లే భక్త + ఓఘ-భక్తౌఘ అనుచోట ఓకారమునకుఁ గాని ఔకారమునకుఁ గాని యతి చెల్లును. 'లోకైక, భక్తౌఘ' అను సంధులలో స్వరప్రధానపడినిబట్టి ఏ ఓ లకు మాత్రమే యతి చెల్లును. కాని యిందు ఆదేశములయిన ఐఔలకును యతి చెల్లుట విశేషము. ఇందుభయాచ్చులకు యతి చేయనగును. 'లోకైక' అను సంధిలో నుత్తరపదాది స్వరము ఏకారము, ఆదేశస్వరము ఐకారము; ఈరెంటికి యతి చెల్లును. అనఁగా ఇ ఈ ఋ ౠ ఎ ఏ ఌ అ ఆ ఐ ఔ ౡ అను రెండు తెగల అచ్చులు చెల్లునని భావము. ఇట్లై 'భక్తౌఘ' అనుచోట ఓ ఔ లకుఁ జెల్లును. అనఁగా ఉ ఊ ఒ ఓ లు, అ ఆ ఐ ఔ లు చెల్లునని యెఱుఁగవలెను.

వృద్ధిసంధిలోఁజెల్లు విశేష యతి యగుటచే దీనికి వృద్ధివళియను పేరు సార్థకము.

ఇందుల కప్పకవి స్వీయోదాహరణము : 38-వ పద్యము.

ఇభ...లో + కైక (లోక + ఏక)-పరస్వరమైన ఏకారమునకు యతి.
అఖిల...జి + తైణ(జిత + ఏణ)-ఆదేశస్వరమైన ఐకారమునకు యతి.
ఉదధి...భ + క్తౌఘ (భక్త + ఓఘ)-పరస్వరమైన ఓకారమునకు యతి.
హత...వ్ర + జౌక (వ్రజ + ఓక) ఆదేశస్వరమైన ఔకారమునకు యతి.

ఇందు నాలవపాదమున ఔకారమునకు అకారమిశ్రితమయిన హకారమునకు యతి చేయఁబడినది.

టీ. ఇభభయవిదా-గజేంద్రభయమును బోఁగొట్టినవాఁడా, జిత + ఏణహస్త-ఏణహస్తుఁడు-జింకహస్తమందుఁగలవాఁడుశివుఁడు: ఆ శివుని బాణాసురయుద్ధమున జయించినవాఁడని యర్థము. ఉదధిజా + ఆశ్రితపక్ష-సముద్రమునకూఁతురగు లక్ష్మీదేవిచే నాశ్రయింపఁబడిన రొమ్ముగలవాఁడా, హత-పర + అనీక-శత్రుసేనల హతమార్చినవాఁడా, నందవ్రజ-ఓక-నందుని గొల్లపల్లెనివాసముగాఁగలవాఁడా.

విశే. వృద్ధిసంధిగత శబ్దములందే యీ యుభయస్వరయతి చెల్లును. తక్కిన యచ్సంధులందుఁ జెల్లదు. 'లంకేశ, అమరోత్తమ' ఇత్యాది గుణసంధులందుఁ బరస్వరములు 'ఇ,ఉ' లు. వానికి వరుసగ 'ఏ,ఓ' లాదేశములయ్యె. స్వరప్రధానపడిచే 'ఇ, ఉ' లకే యతి చెల్లుననవలె. ఆదేశమైన ఏ, ఓ లకు యతి చెల్లిన దనరాదాయని యడుగవచ్చు. ఇందు ఇ-ఏలు, ఉ-ఓ లు సజాతీయములై యున్నవి. ఎల్లెడల నిట్టి సాజాత్యము గుదురదు. 'తమః + అర్క-తమోర్క-.' ఇందు 'అ-ఓ' లకు సాజాత్యము లేదుగదా !

ఇఁక వృద్ధిసంధిచే అకారమునకు 'ఐ-ఔలు' పరమైన 'ఐ-ఔ' లే యాదేశములగు. ఉ. మహా + ఐశ్వర్యము-మహైశ్వర్యము; సిద్ధ + ఔషధము-

సిద్ధొపధము, ఇట్టిపట్టుల 'ఐ-ఔ' లకే యతి చెల్లును. ఇందుభయస్వర ప్రసక్తి లేదు. స్వర ప్రధానపడి యన్నను నిందు బాధకముగాదు. వృద్ధివళియని పేర్కొన్నను సరియే. ఇందు విశేషములేదు. మహైశ్వర్యశబ్దములో ఐకారమునకే యతి; ఏకారమునకు యతి చెల్లునని భ్రమింపరాదు. ఇట్లే సిద్ధౌపధశబ్దమందుఁగూడ.

అప్పకవీయ వితరణమున శ్రీ వేదుల రామశాస్త్రిగారు స్వరవళి భేద వివరణ సందర్భమున 'వృద్ధియతిని మాత్ర మప్పకవి స్వీయముగా కల్పించి (ఊహించి) చెప్పెను' అని వ్రాసిరి.

ఈ వ్రాత యవిచారమూలమగుట తప్పదు. వృద్ధివళి యప్పకవి నూతన సృష్టిగాదు. అతనికి ముందున్న ఛందః కర్తలు పలువురు చెప్పియున్నారు. భీమన ఛందములోను అనంతుని ఛందములోను వృద్ధివళి చెప్పఁబడలేదు. లక్ష్యములగు లక్షణగ్రంథములలోఁ దొల్తనిది కావ్యాలంకార చూడామణిలోఁ జెప్పఁబడియున్నది. (7-72) తరువాతఁ జిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహములోను ముద్దరాజు రామన కవిజన సంజీవనిలోను వృద్ధివళిని బేర్కొన్నారు. వీరందఱు అప్పకవికి ముందున్నవారేకదా? కాని వీరెవ్వరును వృద్ధివళిలో నుభయస్వరము లకుఁ జెల్లునని యప్పకవివలె స్పష్టముగఁ జెప్పినవారు గారు. ప్రాచీనములగు లక్షణసారము కవిరాక్షసచ్ఛందము అథర్వణచ్ఛందము మున్నగువానిలో వృద్ధివళి చెప్పఁబడినట్లు కస్తూరిరంగకవి ఛందమువలనఁ దెలియవచ్చు చున్నది. మఱి యప్పకవికిఁ బూర్వుఁడగు గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో వృద్ధివళిని బేర్కొన్నాఁడు. కాన వేదులవారి వ్రాఁత యసంగతమనఁదగు.

ఈ వళి కప్పకవి చూపిన యితరుల లక్ష్యములు :
ఏత్వమునకు విష్ణుచిత్తీయమునందు—(4—134)

మ॰ గురుగుంజెంచలితమ్మిలేదఁగిరిసా । కుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటినూనియలతోఁ । గట్టావికిట్టారికో
గిరము1 ల్మెక్కితమింబసుల్పాలమువోఁ గ్రేపుల్ మెయిన్నాకమేఁ
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తిరెడ్లజ్జడిన్. 89

వి॰ ఇందు నాల్గవపాదమున మొదటనున్న 'మేఁక + ఎరువు' అను సంధిలోనున్న ఎకారమునకు యతిస్థానములో 'ప్రభుత్వ + ఏకాప్తి' అను వృద్ధిసంధిలోని ఏకారమునకు మైత్రియని యెఱుంగునది.

ఐత్వమునకు విరాటపర్వమునందు—(3—32)

ఉ॰ ఆ కమలాక్షి రూపమహి । మాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణు ల్పురుష । లంగజుఁ డప్రతిమాన చేష్టిత

---

1. మేసి.

స్వీకృతలోకుఁడట్లగుటఁ । జేటుపురంబునవారి కెమ్మెయిన్
గా కెటులుండునిట్టి యవ । గాథవుఁబొత్తు మనంగవచ్చునే.

వి. ఇందు రెండవపాదమున 'భోగైక (భోగ+ఏక)' అను వృద్ధి సంధిలో నాదేశమైన ఐకారమునకు యతిస్థానములో 'పురుషుల + అంగజ' అను చోటనున్న అకారస్వరమునకును మైత్రి.

ఓకారమునకు భాస్కరరామాయణమునందు— (సుందర-448)

శా. నీకంఠార్పితకాలపాశము శిరో । నిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయకాళరాత్రి గళబ । ద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యు వీజనక క । న్య న్వేగనొప్పించి లో
కైకత్రాణుని రామునింగనుము నీ । కీబుద్ధిగాకుండినన్. 41

వి. ఇందు రెండవపాదాదిలో 'లంకౌక (లంకా+ఓక)' అను వృద్ధిసంధి లోని ఓకారమునకు యతిస్థానమున 'బద్ధోదగ్ర (బద్ధ+ఉదగ్ర)' అను గుణసంధి లోని ఉకారమునకు మైత్రి.

మఱియు నిందు నాల్గవపాదమునకు వృద్ధివశి ఏకారమునకుఁ గూర్పఁ బడియున్నది.

'లోక + ఏక...నీకు + ఈబుద్ధి.'

ఔకారమున కయ్యలరాజు రామభద్రుని చాటుధార—

క. రాజమనోజా విద్యా
భోజా దీనార్థి కల్ప + భూజా రిపుసం
ఙ్ఞాజా వైభవ విజిత బి
డౌజా రవితేజ గుత్తి + యప్పల రాజా. 42

వి. ఇందు నాల్గవ పాదము మొదట 'బిడౌజ (బిడ+ఓజ)' అను వృద్ధి సంధిలోని ఓకారమునకు యతిస్థానములో 'గుత్తి + అప్పల' అను సంధిలోని అకారమునకు మైత్రి.

ఇవి యేడును స్వరయతి భేదంబులు.

## 11. వ్యంజనాక్షరవిరతులు

సీ. క్రమమునఁ బ్రాణి, వర్గజ, బిందు, తద్భవ
వ్యాజ, విశేషసమాహ్వయములు,
మహి ననుస్వారసంబంధ, భానునాసికా
క్షర, మువిభక్తి, ముకారయతులు,

మొగి మవర్ణవిరామములు, ఋజు, ప్రత్యేక,
భి, న్నైకతరము, లభేదవిరతు,
లొలి నభేదవ, ర్గోష్మవిశ్రాంతులు
సరస, సంయుక్తవిశ్రామములును

**తే.** గరిమ నంత్యోష్మసంధి, వికల్పసంధి
విరమములునాఁగ వ్యంజనాక్షరవిరతులు
నిఖిలసుకవిప్రయోగముల్ నెమకిచూడ
నేక వింశతిభేదంబు లెఱుఁగవలయు. 43

వి. వ్యంజనాక్షరము లనఁగా హల్లులు, హల్లులలోని పరస్పరమైత్రిని దెలుపుచున్నాఁడు ఇం దిరువదొక్క భేదములు చెప్పఁబడినవి. అయ్యవి. 1. ప్రాణివిరామము, 2. వర్గజయతి, 3. బిందుయతి, 4. తద్భవవ్యాజవిశ్రమము, 5. విశేషవళి, 6. అనుస్వారసంబంధయతి 7. అనునాసికాక్షరయతి, 8. ముఖిక్షక్రి యతి, 9. ఋకారయతి, 10. మవర్ణవిరామము, 11. ఋజుయతి, 12. ప్రత్యేక యతి, 13. భిన్నయతి, 14. ఏకతరయతి 15. అభేదవిరతి, 16. అభేదవర్గయతి, 17. ఊష్మవిశ్రాంతి, 18. సరసవళి, 19. సంయుక్త విశ్రామము, 20. అంత్యోష్మ సంధి వడి, 21. వికల్పవిరమణము—ఇవి యప్పకవి చూపించిన వ్యంజన యతి భేదములు.

## 8. ప్రాణి విరామములు

**తే.** ప్రాణములు నాఁగ స్వర సమా । హ్వాయములయ్యె
నవి కలిమిఁజేసి హల్లులు । ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు । పొందకునికిఁ
బ్రాణులని పల్కఁగూడదు । వానినెందు. 44

**తే.** వ్యంజనంబులు స్వరమైత్రి । వలనఁ దమకు
దాము ప్రాణి విరామాభి । ధానములను
జెంది మూఁడు తెఱంగులై । చెల్లుచుండు
వాని నెఱుఁగక కృతిసేయు । వలనుగాదు. 45

క. చెలులు తలకట్లు నాచా
పులు నైత్వోత్వములు, మిత్ర । ములు గుడిగవయున్
[1]సుడిగవయు నేత్వయుగమును,
జెలువగు చుట్టములు ద్వివిధ । శృంగౌత్వమ్ముల్. 46

---
1. సుళిగవ - పాఠాంతరము, సుడిగవ యను పాఠమున లడాభేదప్రాస.

వి. 44-స్వరము లనఁగా అచ్చులు. స్వయముగాఁ బలుకఁజాలినవగుటచే స్వరములయ్యె. అచ్చులకుఁ బ్రాణములనియు నామాంతరము గలదు. హల్లులతోఁ జేరి వానికుచ్చారణము(ప్రాణము)గలిగింపఁజాలినవగుటచే అచ్చులకుఁబ్రాణములను పేరు కలిగెను. కకారాది హల్లులు అచ్చులతోఁ జేరియే పలుకఁబడును. క్, చ్, ట్, త్, ప్ మున్నగు హల్లులు తమంత పలుకఁబడవు. అకారాద్యచ్చులతోఁ జేరియే పలుకబడును. 'క చ ట త ప' అనురీతి హల్లులను మన ముచ్చరింతుము. ఇందు కకారాది హల్లులమీఁద అకారస్వరము చేరియున్నది. ప్రాణముతోఁజేరి యుండుటచే హల్లు ప్రాణి యనఁబడును. క, కా, కి, కీ ఇత్యాదులు ప్రాణులగును. క్, చ్ ఇత్యాదులలో నచ్చు చేరకుండుటచే వానికిఁ బొల్లు హల్లులని పేరు. వీనిని బ్రాణులనరాదు అప్పకవి కేవల హల్లునకుఁ బ్రాణికి భేదము స్పష్టపఱచినాఁడు.

సంస్కృతభాషలో బొల్లుహల్లులుండును. ఉ. దిక్, రాట్, కకుప్, మొ. తెనుఁగులో శబ్దములన్నియు నజంతములే. 'దిక్' వంటి సంస్కృత శబ్దము తత్సమమున 'దిక్కు' అని యజంతమగును. పొల్లుహల్లులు తత్సమమున నజంతములే యగును. 'వనముల్, చూచెదర్, వచ్చెన్' ఇత్యాదులందుఁ బొల్లుహల్లులు గాన నచ్చెడిఁ గదా యని సందేహింపనచ్చు. కాని 'వనములు, చూచెదరు' వచ్చెను' అన్నవి వీనికిఁ బ్రథమ రూపములు. అవసానస్వరలోపముచే హలంతములుగా సాధ్యములయ్యెను. ఇవి సాధ్యహలంతములే కాని సిద్ధహలంతములు గావు. దీనింబట్టి తెలుఁగులో శబ్దముల తుదలో హల్లులుండవని గ్రహింపవలెను. తెనుఁగులోని హల్లులు సాధారణముగాఁ బ్రాణులని ఫలితార్థము. చింతామణి అచ్చులకుఁ బ్రాణములని, హల్లులకుఁ బ్రాణులని సంజ్ఞ లేర్పఱచుట తెలుఁగు సంప్రదాయము ననుసరించియే యని యరయనగును.

ప్రాణాస్స్వమాసతోచః, హలస్స్యుసమాసతః ప్రాణినః-చింతామణి. ఈ సంజ్ఞలు సంస్కృత వ్యాకరణమునఁ జెప్పబడవు.

వి. 45-వ్యంజనములనఁగా హల్లులు. స్వరయోగముచే (అచ్చులచేర్పుచే) వ్యంజితములగును (ఉచ్చరింపఁబడును), గాన వ్యంజనములయ్యె. వ్యంజనములు. ప్రాణులు నామాంతరములు. హల్లులు స్వరసంయుతములై యుండుఁగాన వానికి యతి గూర్చునపుడు కేవల హల్లునకేకాక దానిమీఁద యచ్చునకును మైత్రి యావశ్యకము, కాన స్వరమైత్రి ననుసరించి ప్రాణియతులు మూఁడు తెఱఁగులగా నుండును.

(1) క-కా-కై-కౌ. (2) కి-కీ-కృ-కౄ-కె-కే. (3) కు-కూ-కొ-కో. ఇట్లే తక్కుంగల హల్లులకన్నిటికి స్వరమైత్రియుఁ బొసఁగవలయునని యెఱుఁగునది.

అచ్చుతోఁ జేరిన హల్లునకుఁ బ్రాణియని పేరు గానఁ గేవల హల్లునకును దానిమీఁది స్వరమునకు జేర్చి యతి యుంచవలయుటంజేసి దీనికిఁ బ్రాణి

యతి యని యప్పకవి నామకరణము చేసెను. ఏ హల్లునకేనియు స్వరమైత్రి చెందక యతి చెల్లనేరదు.

వి. 46-పై పద్యమునఁ జెప్పిన మూఁడుతెఱఁగుల ప్రాణి యతులను వివరించుచున్నాఁడు. హల్లు పరస్పరమైత్రి తరువాతఁ జెప్పఁబడును. గాన నిందు వానిమీఁద నిలుచు స్వరమైత్రిని స్పష్టపఱచుచున్నాఁడు. హల్లులమీఁద నిలుచు అకారాదులకుఁ దలకట్లిత్యాది సంజ్ఞలు వాడఁబడును.

తలకట్లు - హల్లులమీఁదిహ్రస్వ అకారస్వరములు, అత్వములు, ఆచాపులు - అకారదీర్ఘములు అనఁగా అకారములు - ఐత్వౌత్వములు, ఐత్వ + ఔత్వములు. చెలులు - మిత్రములు. ( ా ై ౌ — ఇవిహల్లులమీఁది అకారాది స్వరములకుఁ జిహ్నములు. ఈ నాలుగు మిత్రములు)

గుడిగవ - ఇత్వద్వయము, ఇ ఈ ఋ. సుడిగవ - వట్రసుడిజంట, ఋత్వము దాని దీర్ఘము. ఏతత్త్రయుగము-ఎ ఏ ఐః మిత్రములు.

(ి ీ ృ ౄ ె ే — ఇవి మిత్రములు)

ద్వివిధశృంగ + ఓత్వముల్ - కొమ్ము, కొమ్ముదీర్ఘము, ఒత్వము, ఓత్వము (రెండువిధముల కొమ్ములు ఓత్వములు), చెలిపగు చుట్టములు.

(ు ూ ొ ో — ఇవి మిత్రములు)

అద్వయమునకు ప్రకతపద్వయంబను స్వరమైత్రివళి లక్షణముచేతనే యీ విషయము గతార్థమగుచుండ "చెలులు తలక"ట్లను లక్షణము పునరుక్తికాదా యని సందేహింపవచ్చును. స్వరమైత్రివళిచేతఁ గేవల స్వరములకు యతి మైత్రి చెప్పఁబడెను. ఈ లక్షణము పొల్లు హల్లులమీఁద నిలుచు స్వరముల మైత్రిని దెల్పుచున్నది. ఇవి కేవల స్వరములు గావు. 'అమర' శబ్దములోని అకార స్వరమునకును 'కమల' శబ్దములోని కకారముమీఁది అత్వమునకును స్థితిభేదము గలదు. సందేహనివృత్తికై స్పష్టార్థ మప్పకవి ప్రాణియతి నిట్లు వివరించినాఁడు.

ఈ ప్రాణి స్వరమైత్రి వ్యంజనయతి భేదము లన్నింటి కన్వయించును గాన దీనిని ప్రత్యేకయతిభేదముక్రిందఁ బరిగణింపక వ్యంజన యతిమైత్రికి సామాన్య లక్షణముగా తొలుత నిర్వచించుట సముచితము ప్రాచీనలాక్షణికులు దీని నొక యతిభేదముగాఁ జెప్పలేదు. కవిజనాశ్రయమున నీ విషయము స్వరయతుల క్రిందను, కావ్యాలంకారచూడామణిలో వర్గవళి క్రిందను, జెప్పఁబడినది. (చూ. కవిజనాశ్రయము, సంజ్ఞ-64; కా-చూడామణి (7-33). చూడామణిలో కాదివర్గ

మునకు గణితస్వరవళి నిరూపణమని పేర్కొనఁబడినది. దీనినే కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశికలో వ్యంజన స్వరవడి యని పేర్కొన్నాఁడు.

ఇందుల కప్పకవి చూపిన స్వీయలక్ష్యము :

సీ. కలశాబ్ధిగంభీర। కాంచనాచలధీర
కాళియోరగవైరి। కైటభారి
కైలాసపతిమిత్ర। కౌశిక స్తుతిపాత్ర
కిల్బిషాద్రి సురేంద్ర। కీర్తి సాంద్ర
కీలాలరుహనాభ। కృష్ణజీమూతాభ
కృతవర్మతో నేఁగి। కెలఁకులాఁగి
కెరలిచైద్యుఁడు సూడఁ। గేకయుల్గొనియాడఁ
గుండినేశునిపట్టి। గూడముట్టి
తే. కూర్మి వలకేలసింగవుఁ గౌదమలీలఁ
గొనిశతాంగంబుపై నుంచి। కోర్కె మించి
ద్వారకకువచ్చు నీవైభ। వంబుఁ బొగడ
శక్యమేయనఁ గాకుల। క్ష్యంబులయ్యె. 47

వి. ఇందు అప్పకవి ప్రాణిసంబంధమగు త్రివిధ స్వరమైత్రి కొఱకు కకారమును నిలిపి యుదాహరణముఁ జూపినాఁడు.

పై సీసపద్యమున మొదటి మూఁడు పాదదళములందు
'క-కా, కా-కై, కై-కౌ' లకు యతి గూర్పఁబడినది.
తరువాతి 4, 5, 6, 7 పాదభాగములలో వరుసగ
కి-కీ, కీ-కృ, కృ-కె, కె-కే లకు యతి
తరువాతి 8, 9, 10 పాదభాగములలో
కు-కూ, కూ-కొ, కొ-కో లకు యతి
ఇట్లు మూఁడువర్గములు క్రమపద్ధతిలోఁ జూపఁబడినవి.
ఇందలి కకారమున కెట్లో తక్కిన హల్లులకు నట్లే యని యరయునది.

పై పద్యమున 'సింగంపుఁగౌదమ' ఇత్యాది స్థలములలోని గకారము ద్రుతముమీఁద నాదేశముగా వచ్చినది. సంధికిఁ బూర్వస్థితిలో నయ్యది పరుషాక్షరమే - అనఁగా కకారమే. స్వరయతిలో మాత్రమే సంధి వేర్పఱచి, పర స్వరమునకు యతి గూర్పవలెనను నియమముగలదుగాని హల్సంధులందు వ్యంజన

యతులం దీనియతి గానరాదు. ఇందు కకారమైనను గకారమైనను యతికి బాధకముగాదు. కాని యప్పకవి యొక కకారమునకు మాత్రమే యుదాహరణలు చూపఁదలచినాఁడు గాన నిట్టివానిలో కకారమును జెప్పికొనుట సముచిత మనం దగును. అథర్వణాది ప్రాచీన లాక్షణికుల మతమున నిందు నుగాగమము నిత్యము గాదందురు. ఆ పక్షమున 'సింగంపుకొండమ' అను రూపమునే గ్రహింప వీలగును.

టీ. కాంచనాచలము - మేరుపర్వతము, కైలాసపతిమిత్ర - శివుని మిత్రుఁడా, కౌశిక - ఇంద్ర, కిల్బిషాద్రిసురేంద్ర - పాపములను పర్వతములకు నింద్రుఁడా, కీలాలరుహనాథ - పద్మనాభ, కృష్ణజీమూత + ఆభ - నీల మేఘకాంతి గలవాఁడా, కుండినేశుపట్టి - భీష్మకుని కుమారుఁడగు రుక్మి (రుక్మిణియన్న). ఈ పద్యమున రుక్మిణీకల్యాణవృత్తాంతము గైకొనఁబడినది.

## 9. వర్గజయతులు

ఆ. శబ్ద సూత్రములను । జగతినేక స్థాన
సంభవంబులగుచు । సంధివేళఁ
గల సవర్ణ సంజ్ఞఁ । దలపోసి యతులకు,
గూర్పవచ్చు మఱియుఁ । గొన్ని కృతుల. 48

క. తమ తమ యనునాసిక వ
ర్ణములు విడిచి వెనుక లిపులు । నాల్గును దమలోఁ
దమకు [1]నరలేక నిలిచిన
నమరాహిత దమన ! వర్గ । యతులనఁ బరఁగున్. 49

ఆ. కంధిమధ్య గేహ । ఖండితారి సమూహ
ఖంజనాభదేహ । గానమోహ
గరుడపక్షివాహ । ఘనవాహజస్నేహ
భర్గవినుతి యనిన । వర్గయతులు. 50

వ. తక్కిన నాలుగు వర్ణములకు ఈలాగుననే తెలిసికొనునది. 51

వి. వ్యాకరణసూత్రములఁబట్టి యొకేస్థానమందుఁ బుట్టినట్టివై, సంధియందు నాదేశాదిరూపముల నెలకొన్నవై సవర్ణత నొప్పారుచున్న కొన్ని హల్లులకు యతిమైత్రి గూర్పవచ్చు.

1. నెరి.

శబ్దసూత్రములలో నేకస్థానసంభవములగు సవర్ణము లీక్రిందిరీతిఁ దెల్పఁబడియున్నవి :

తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్-తాల్వాదిస్థానమాభ్యంతర ప్రయత్నశ్చేత్యే తద్ద్వయం యస్యయేన తుల్యం తస్మిథ స్సవర్ణ సంజ్ఞంస్యాత్.

అ కు హ విసర్జనీయానాం కంఠః :
ఇ చు య శా నాం తాలు :
ఋ టు ర షా ణాం మూర్ధా :
ఌ తు ల సా నాం దంతాః :
ఉ పూ ప ధ్మా నీ యానా మోష్ఠౌ
ఞ మ ఙ ణ నా నాం నాసికాచ

స్థానప్రయత్న సామ్యముగల వర్ణములు, సవర్ణములు. సవర్ణములనఁగా సజాతీయములు. ఈ యక్షరములలో 'క' మొదలు 'మ' వరకుఁగల యక్షరములకు స్పర్శములని పేరు. ఈ స్పర్శములలో స్థానములుబట్టి ౫ వర్గములు:

ప్రతి వర్గములో ౫ అక్షరము లుండును.
క వర్గము....క ఖ గ ఘ ఙ (కంఠ్యములు)
చ వర్గము....చ ఛ జ ఝ ఞ (తాలవ్యములు)
ట వర్గము....ట ఠ డ ఢ ణ (మూర్ధన్యములు)
త వర్గము....త థ ద ధ న (దంత్యములు)
ప వర్గము....ప ఫ బ భ మ (ఓష్ఠ్యములు)

ఈ పంచవర్గములలోఁ గడపటి యక్షరము లనునాసికము లనఁబడును. ఈ వర్గపంచకమందు అనునాసికములను బాసి మొదటి నాల్గక్షరములు పరస్పరము యతి చెల్లును. కాదు లాయావర్గములలోని యనునాసికములతోఁ జెల్లవు. ఆయా వర్గములలోని యనునాసికములు తక్కిన నాల్గక్షరములవలె సమానోత్పత్తి స్థానము గలవయ్యును నాసికోచ్చారణ మధికముగ నుండుటచేఁ దొలి నాల్గక్షరములతో యతికిఁ జెల్లకబోయె. క ఖ గ ఘ లు ఙ కారముతో యతి చెల్లవు. ఇట్లే తక్కిన వర్గాక్షరములకని యరయునది. (కాదివర్గముల తొలి నాల్గక్షరములు బిందుపూర్వకములయ్యేనేని తత్తదనునాసికములతోఁ జెల్లునని క్రింది బిందు యతి చెప్పుచున్నది.)

కొన్ని సంస్కృతాంధ్ర సంధులం దీ వర్గాక్షరములలో నొకదాని కొకటి యాదేశమగును. వర్గాక్షరములు పరస్పరము సవర్ణములు.

వాక్ + ఈశ-వాగీశ, జగత్ + గురు-జగద్గురు;

పూచెను + కలువ - పూచెనుగలువ-ఇత్యాది సంధులందుఁ బరుషములకు సరళములాదేశములగును. దీనినే యప్పకవి సంధివేళఁగల సవర్ణ సంజ్ఞ యని తెలిపినాఁడు. వర్గాక్షరములకుఁ జెల్లు యతి గావున దీనికి వర్గజయతి, వర్గయతి యను పేళ్ళు సార్థకములు. ఈ యతి ప్రసిద్ధము సాధారణము గావున నప్పకవి స్వీయలక్ష్యమును మాత్రమే చూపెను అకఁడు వ్రాసిన లక్ష్యములో (51పద్యము) మొదటి మూఁడు పాదములలో వరుసగ

క-ఖ, ఖ-గా, గ-ఘ లకు యతి గూర్పఁబడినది.
దీనింబట్టి క ఖ గ ఘ లు మిత్రములని తెలియవలెను.
క వర్గమునకువలెఁ దక్కిన వర్గముల కుదాహరణముల నెఱుఁగవలెను.

50 ప. టీ. కంధి-సముద్రను, ఖంజనాభదేహ-కాటుక పిట్టవంటి నీల దేహము గలవాఁడా: ఘనవాహ-జ - స్నేహ - ఇంద్రనందనుఁడగు నర్జునుని స్నేహముగలవాఁడా.

## 10. బిందుయతులు

క. పనిఁబూని నిలుచుఁ దమతమ
యనునాసికములకు బిందు । యతులను వెనుకన్
గనుపట్టు నాల్గు లిపులను
బెను సున్నలు డాసి తమకుఁ । బిఱుదఁగదియుచోన్. 52

తే. జ్ఞాన వేద్యాయ తప్తకాం । చన విభూష
ణాయ మేచక వర్ణకం । ఠ ప్రియాయ
నగ ధరాయ నమోస్తు సౌం । దర్య విజిత
మనసిజాతాయ గోప డిం । భాయ యనఁగ 53

టీ. వెనుకన్-పూర్వమందు, లిపులు-అక్షరములు, పెనుసున్నలు-పూర్ణ బిందువులు. పిఱుఁదన్ - పూర్వమున.

మేచకవర్ణకంఠుఁడు - శివుఁడు : సౌందర్య ....జాతాయ - అందముచే జయింపఁబడిన మన్మథుని గలవాని కొఱకు: నమోస్తు-అనుదానితో నన్వయము.
గోపడింభుఁడు - గోపబాలుఁడు, బాలగోపాలుఁడు.

వి. ప్రతి వర్గములోని యనునాసికమునకు నాయాయి వర్గములో దానికిఁ బూర్వమందున్న నాలుగక్షరములు పూర్ణబిందుపూర్వకము లయ్యేనేని యతికి మిత్రములగును.

ముందు చెప్పఁబడిన వర్గయతిలో వర్గము తొలి నాలుగు వర్ణములు అనునాసికముతోఁ జెల్లవని చెప్పబడినది. ఆ యనునాసికమునకుఁ జెల్లవలయునన్నఁ బూర్ణబిందుపూర్వకములు కావలెనని యీ యతిభేదము దెలుపుచున్నది.

బిందుపూర్వకము లగుటచే వర్గాక్షరములు వర్గాంతానునాసికముతో యతి మైత్రినందుటచే నీ యతి భేదమునకు బిందుయతి యను పేరెంతయు యుక్తమయియున్నది. భీమన, చిత్రకవిపెద్దన దీనిని బిందుయతి యనియే పేర్కొనిరి. విన్నకోట పెద్దన దీనికి స బిందు వర్గవళి యని, యనంతుఁడు అనుస్వార యతి యని పేరిడినారు.

ఈ యతిమైత్రి యిట్లుండును :

ంక – ంఖ – ంగ – ంఘ ....ఙ

ంచ – ంఛ – ంజ – ంఝ ....ఞ

ంట – ంఠ – ండ – ంఢ ....ణ

ంత – ంథ – ంద – ంధ ....న

ంప – ంఫ – ంబ – ంభ ....మ

అప్పకవి యిందులకుఁ జూపిన స్వీయలక్ష్య పద్యములో నాలుగు పాదములలో వరుసగ - 'జ్ఞ - ంచ, ణ– ంఠ, న–ంద, మ–ంభ' లకు బిందు యతిమైత్రి ఘటింపఁబడెను.

కేవల ఞ కారముతోడి శబ్దము లేమిచే సంయుక్తమైన జ్ఞ కారము గైకొనఁబడినది. ఙ కారముతోడి పద మెందును గానరామిచే 'ఙ-ంక'ల యతి కుదాహరణము చూపఁబడలేదు కాబోలు.

ఞ కారమునకు సంయుక్త జ్ఞ కారమును గైకొన్నట్లు, ఙ కారమునకు నట్టి సంయుక్త వర్ణమును గ్రహించియుండవచ్చును. శార్ఙ్గ శబ్దములో ఙ కారము గలదు గదా?

ఙ ఞ లు ఏకాక్షర శబ్దములుగా సంస్కృత కోశములందు గ్రహింపఁబడి యనేకార్థము లొసఁగఁబడియున్నవి. కాని వానికిఁ గావ్యములందుఁ బ్రయోగము మృగ్యము.

వి శే. ఈ బిందు యతి యేర్పడుట కాకర మిట్లుండును :

సంస్కృతమున నేకపదమందు వర్గాక్షరములకు ముందు బిందువు వ్రాయుట లేదు. 'అనుస్వారస్య యయి పరసవర్ణః' అను పాణిని సూత్రము చొప్పున నాయా వర్గానునాసికమే బిందుస్థానమున వ్రాయుట సంప్రదాయము. ఇట్టి స్థితికిఁ బరసవర్ణానునాసికత్వమందురు. తెనుఁగు భాషలో సంస్కృత శబ్దములందును బిందువు వ్రాయుటే పరిపాటి. 'కాంత' అన్నది సంస్కృత

శబ్దము. సంస్కృత లిపిలో 'కాన్త' అని వ్రాయుదురు. తెలుఁగులో 'కాంత' అని వ్రాయఁబడును. ఇట్లే 'కణ్ఠ' మని సంస్కృత లిపిలోను 'కంఠ' మని తెలుఁగు లిపిలోను వ్రాయుదురు. సంస్కృత సంప్రదాయము చొప్పున 'కాన్త' అని వ్రాయుదుమేని 'న్త' కు యతి వేయవలసినపుడు సంయుక్త యతి నియమానుసారము న కారమునకు మైత్రి చేయవచ్చు. ఆ నకారమే తెలుఁగున బిందు రూపము దాల్చుటచే. ఆ బిందుపూర్వక త కారమునకు న కారము యతికిఁ జెల్లుబడి యయ్యెనని యీ తెనుఁగు వ్రాత సంప్రదాయముఁ బట్టి బిందుయతి యేర్పడి యుండునని యెన్న నగును.

ఈ యతి యతిప్రాచీనలక్షణ గ్రంథములందే చెప్పఁబడి యుండుటచేఁ బర సవర్ణానునాసిక స్థానమున బిందురచనా సంప్రదాయమును తెనుఁగున అనాది సిద్ధమని యొప్పక తప్పదు.

తత్సమ శబ్దములందు ననుస్వారమునకుఁ బరసవర్ణానునాసిక బిందురూపములు (అఙ్కము, అంకము) రెండును గలవని కొందఱి మతము. ప్రాచీనపుఁ దెనుఁగు శాసనములలో బిందువు ననునాసికము రెంటిని వ్రాయు నాచారము గానఁబడుచున్నది. చిన్నయసూరి బాలవ్యాకరణమున 'ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులం గూడి తెలుఁగున వ్యవహరింపబడు' (సంజ్ఞ -4) అను సూత్రము క్రింద 'కంఠము, షండము, పఙ్క్తి' అని బిందు పరసవర్ణానునాసికములు రెండు ప్రయోగించి యున్నాఁడు. తత్సమ శబ్దములందు బిందుస్థానమున ననునాసిక రచన సమీచీనమగును గాని 'వంక, చెంత' ఇత్యాది దేశ్యశబ్దములందుఁ బరసవర్ణానునాసిక రచన విరుద్ధమనక తీఱదుగదా? 'అంకముఁజేరి....వంక' అను పద్య ప్రాసస్థానమున సంస్కృత సమమగు 'అంకము' ను 'అఙ్కము' అని వ్రాసినచో దేశ్యమగు వంక' శబ్దమును 'వఙ్క' అని వ్రాయ వీలులేదు గదా! అచ్చ తెనుఁగున ఙకారముండదు. దీనింబట్టి 'అంకము' అని బిందుయుక్తరూపమే తెనుఁగున రచించుట యుక్తమనక తప్పదు. ఇవ్విషయము మెట్లున్నను బిందుయతియేర్పడుటకు సంస్కృత భాషలోని యీ యనుస్వార పరసవర్ణాదేశ విధానమే కారణమని యెఱుంగ నగును.

అప్పకవి యీ యతి కితరుల లక్ష్యములను జూపలేదు, ఇది ప్రసిద్ధమను భావమున మానెనేమో? ఇందులకుఁ గొన్ని యుదాహృతులఁ జూపెద :

నందనోద్దామ మం + దారకచ్ఛాయం (నైషధము)
మణిమయ స్తంభ శుం + భ ద్దీపకళికలు (రామాభ్యుదయము)

గమనిక:

ఈ క్రింది పద్యపాదమున యతిని గమనించునది:
భర్తృహరి సుభాషితములు (ఏనుగు లక్ష్మణకవి)
మ. పరహింసా పరకీయ.... వనితో దంతోక్తి మూకత్వమున్
బరతృష్ణా ఘురభంజనంబు గుసన+మత్వంబునన్.

ఇందు 'బ-మ' లకు యతిచెల్లదు. 'బ'కు ముందు బిందువులేదు. ఇది వ్రాతపొరపాటు. 'మూకత్వమున్ + పరతృష్ణా' అనుసంధిలో ద్రుత సరళా దేశానంతరము బిందురూపమును సయితము ధరించునుగాన నీయతి సంఘటితము గావలెనన్న, నిందుఁబొల్లు నకారము వ్రాయక 'మూకత్వముం బరతృష్ణా' అని బిందువును వ్రాసిన బిందు యతికి సరిపడును.(ంబర....న+మ)

## 11. తద్భవవ్యాజవిశ్రమములు

సీ. విజ్ఞానమునకు భా । వింప విన్నాణంబు,
విజ్ఞాపనమునకు । విన్నపంబు,
సంజ్ఞకు సన్న య । జ్ఞమునకు జన్నంబు,
నాజ్ఞప్తి కానతి । యాజ్ఞకాన,
యని యిట్లు సంస్కృత । 1వ్యవహార మధ్యావ
సానంబుల ద్వితీయ । సరళమునకు
నడుగునఁగల తాలు । జాను నాసికములు,
తద్భవంబున ద్రుత । త్వంబుగాంచి

తే. వెలయుటను దద్భవ వ్యాజ । విశ్రమమన
జరిగి నణలకు రెంటికి । జ్ఞా తనర్చు
జ్ఞానిచేతోంబుజాత శో । ణ కరయనఁగ
జ్ఞాతి విద్వేషి నృపనాళ । నకరయనఁగ. 54

వి. ద్వితీయసరళమునకు-జకారమునకు (గ జ డ ద బ-సరళములు).అడు గునఁగల - క్రిందఁగల - సంయుక్తమయిన-తాలు జానునాసికము-ఞకారము;

---

1. 'వ్యాహార' అను పాఠము వేదులవారు చూపిరి. వ్యాహార మనఁగా పలుకు. సంస్కృత వ్యాహారము - సంస్కృతోక్తి. వ్యవహారము — వాక్ప్రయోగము.

జకార ఞకార సంయుక్తమగు జ్ఞకారమని దీని కర్థము. ప్రదత్వము - నకారత్వము.

విజ్ఞానము తత్సమశబ్దము, విన్నాణము దానికిఁ దద్భవము.

ఇట్లె విజ్ఞాపనము-విన్నపము. సంజ్ఞ-సన్న. యజ్ఞము-జన్నము; ఆజ్ఞప్తి-ఆనతి, ఆజ్ఞ-ఆన అని తత్సమములలోని జ్ఞకారము తద్భవములో నకారమగును. ఈ తద్భవ సంబంధ కారణమున (తద్భవ వ్యాజమున) 'జ్ఞ-న' లకు యతిమైత్రి చెల్లుబడి యగును. మఱి నకార ణకారములు సరసపడిచే యతి చెల్లును గాన, జ్ఞకారమునకు 'న ణ'లు రెండును యతి మిత్రములయ్యె.

జ్ఞకారమునకు న ణ లు తద్భవ వ్యాజమున (సంబంధమున, కారణమున యతి మిత్రములయ్యెఁ గాన నీ యతికిఁ దద్భవవ్యాజ విశ్రమ మను పేరు తగియున్నది. అనంతఁడు దీనిని దద్భవవ్యాజ విరతియని పేర్కొనెను. చిత్రకవి పెద్దనాదులు దీనిని జ్ఞావడి యని పేర్కొనిరి. రంగకవి ప్రాకృతాదేశ యతి యని క్రొత్తగా నామకరణ మొనర్చె.

జ్ఞకారమునకుఁ దద్భవమున నత్వము గలుగునని మాత్రమే లాక్షణికులు వ్రాసిరి. నణలమైత్రినిబట్టి జ్ఞాతో నణలు చెల్లునని యెఱుఁగవలసి యున్నది. కాని క్వాచిత్కముగ జ్ఞ కారమునకుఁ దద్భవమున ణత్వముగూడఁ గలుగును. ఉ॥ రాజ్ఞీ-రాణి.

అప్పకవి పై లక్షణ పద్యమందే పాదములలో లక్ష్యములఁజూపెను.

'జ్ఞాని.... శో + ణ కర, జ్ఞాతి.... నాశ + న కర.'

అప్పకవి యొసఁగిన యితర లక్ష్యము :

గణితమునందుఁ బావులూరి మల్లన్న —

ఉ. శ్రీనిధియైన శివ్వనను । జిమ్మనమున్ మఱి సూర్యదేవునిన్
దీనిధిఁ బోలనార్యులను । దేశమునన్ రవితుల్యులైన యా
సూనుల నల్వురంబడసె । సూరిజన స్తుత సత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భ వద । నంబులు నాలుఁగుబోలె వారిలోన్.

వి. ఇందు నాలవపాదమున 'జ్ఞా-న' లకు యతి గూర్పఁబడియున్నది.

విశే. మఱి బిందుయతివలన నకారమునకు 'ంత-ంథ-ంద-ంధ'లు,టకారమునకు 'ంట-ంఠ-ండ-ంఢ' లుచెల్లును గాన జ్ఞ కారమునకు 'న-ణ' లతోఁబాటు బిందుపూర్వక ట ఠ డ ఢ లు త థ ద ధ లు మిత్రములగునని యెఱుఁగనగును. దీనిని ప్రత్యేకముగా నప్పకవి చెప్పలేదు. ఇందుఁ కొక యుదాహరణము:

'నాకూర్మినంబదన మేలాత్మఁదలంచి దేవరకు వి+జ్ఞాపింప నే వచ్చితిన్'
(ఇది వరాహపురాణములోనిదిగా రంగకవి యుదాహరించె)

జ్ఞకారము 'జ-ఞ' ల సంయుక్తము. సంయుక్తాక్షరములో నే యొక హల్లున కేని యతి యుండినఁ జాలునని సంయుక్త యతి చెప్పుచున్నది. జ్ఞకారమునకు జకారము (చ ఛ జ ఝ లు శ ష స లు) చెల్లుటలో సందియమక్కఱ లేదు. ఇట్టి సందేహనివృత్తికొఱకే కాఁబోలు అప్పకవి పై లక్షణములో

'జరిగి న ణ ల కు రెంటికి+జ్ఞానతనర్చు' అను పాదమున జకారముతో యతి గూర్చెను.

తద్భవవ్యాజమున 'న-ణ' లు. క్రింది విశేషవళివలన 'క ఖ గ ఘ' లు జ్ఞాకుఁజెల్లుట చెప్పకతప్పదు. జకారము సంయుక్తములో నుండుటచే దానిని ప్రత్యేకముగాఁ జెప్పనక్కఱలేదు.

## 12. విశేషవళులు

తే. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకా । రంబునకును
ప్రథమవర్గంబు తొలి యక్క । రములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్క । యెడ విశేష
వళులనుచు సోమయాజులు । వాడు కతన. 56

శాంతి పర్వమునందు (4-225)

క. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశ విధిఁబ్ర । కాశము సేయం
గానది సకల ధరిత్రీ
దానంబున కంటె నధిక । తర ఫలదముగున్. 57

వి. ప్రథమవర్గంబు తొలి యక్కరములు నాల్గు క ఖ గ ఘ లు.
తిక్కన సోమయాజి తన భారతమున (శాంతిపర్వమున—4-255)
నొక్కచోట జ్ఞకారమునకు కకారమునకు యతి గూర్చియున్న కారణముచేఁ బ్రౌఢకవులు కొంద ఱాతని ప్రయోగము ననుసరించి జ్ఞకారముతో క ఖ గ ఘ లకు యతిమైత్రి పాటించెదరని పై లక్షణ తాత్పర్యము. ఇట్లప్పకవి వ్రాయుటచే నీ యతి కాదాచిత్కమని యెఱయనగును. సాధారణముగ నిట్టి యతిమైత్రి గ్రంథములందుఁ సాధారణముగఁ గానరాదనియు నెందో ప్రౌఢకవులచే

విశేషముగఁ బ్రయుక్తమై యున్నదనియు దానంజేసి విశేషవళి యను నామ కరణము దీనికి సార్థకమనియు గ్రహింపవలయు.

అప్పకవి తిక్కన ప్రయోగము నొక్కదానినే విశేషవళి కుదాహరించెను. తక్కిన ప్రౌఢకవుల ప్రయోగములేవో తెలుపఁడయ్యె.

తిక్కన సోమయాజి కందము రెండవపాదమున
'జ్ఞా-కా' లకు యతి గూర్పఁబడియున్నది. (57 పద్యము)
ఈ విశేషవళి యప్పకవి తప్ప మఱే లాక్షణికుఁడును జెప్పినట్లు లేదు. ఈ విశేషవళి యప్పకవి పరిశీలనావిశేషమని చెప్పకతప్పదు.

విశే. భారతములో నన్నయ వాడలేదీ విశేషయతి. ఎఱ్ఱనయుఁ బ్రయోగింప లేదు. తిక్కనయు నీ యొక్క చోటనే ప్రయోగించెను. ఇటీవలి పండితు లిట్లు తిక్కన ప్రయోగించి యుండఁడని దీనికిఁ బాఠాంతరము పఠింతురు.

'అ, జ్ఞానికి నుపదేశ విధిఁ బ్ర+ జనితము సేయంగా' అను కృతక పాఠము ప్రజనితమయ్యె. అప్పకవి యీ ప్రయోగమును బరిశీలించి తిక్కన పేరు చెప్పి యతని గల్పించియుండఁగా నిట్టి సందేహమునకుఁ గాని పాఠాంతర కల్ప నకుఁ గాని ప్రసక్తిలేదు. తిక్కన పద్యములో 'ప్రకాశము సేయ' అను పాఠము లోని సారళ్యము సారస్యము 'ప్రజనితము' అను పాఠమున మున్నూటికి నాస్తి యని సహృదయులకుఁ దోఁపకమానదు.

జ్ఞాకుఁ దాలవ్యోచ్చారణయే కాక వ్యవహారమున 'గ్యా, గ్నా' అను కంఠోష్ఠ్యోచ్చారణ వినవచ్చును. ఆంగ్లాదిభాషలలో జ్ఞానమును 'గ్నాన' అనియే వ్రాయుదురు. మఱియు,' ప్రజ్ఞ-పగ్గె, 'సంజ్ఞ-సైగ' అను తత్సమ తద్భవముల లోను 'జ్ఞా-గా' యగుచున్నది.

అప్పకవి విశేషవళిని వాడిన ప్రౌఢకవుల నితరులఁ బేర్కొనలేదు గాని తిక్కనకుఁ బూర్వుఁడే పాల్కురికి సోమన యీ యతి విశేషమునుగూర్చిన ప్రయోగము గానవచ్చుచున్నది.

కర్మ మధర్మ మ+జ్ఞాన మాగడము-( పండిత-పురాతన-పుట-284). మఱికొన్ని ప్రయోగములు :

జ్ఞానేంద్రియ జ్ఞాన +కళ లౌదు సౌరుగా. (కాశీ-1.159)
అ'జ్ఞానంబునఁగడప మిగులఁ+గల్మషమొందన్. (రుక్మాంగ-2-68)
ఇది విశేషవళియని కాఁబోలు అప్పకవి స్వీయోదాహృతి యొసఁగలేదు.

## 13. అనుస్వారసంబంధయతులు

ఆ. ఆది పూర్ణ యుతము । లై టతవర్గాక్ష
రములు తుదకుఁ గలుగు । ప్రాలుదక్కఁ
బొసఁగునొకటి కొకటి । భువిననుస్వార సం
బంధ యతులు నాఁ ప్ర । బంధములను. 58

వి. పూర్ణబిందు పూర్వకములయిన ట ఠ డ ఢ లు త థ ద ధ లు పరస్వరము యతికి మిత్రములు. ట త వర్గాక్షరములు ట వర్గ త వర్గముల యక్షరములు. వానిలోఁ దుదనుగలుగు ప్రాలు 'ణ-న' లను అనునాసికములు. అనునాసికములు దక్కఁ దక్కిన ట త వర్గాక్షరములు ట ఠ డ ఢ లు నాలుగు. త థ ద ధ లు నాలుగు. ఇవి భిన్నవర్గములకుఁ జెందినవైనను బూర్ణబిందు పూర్వకములయినచో నొకదానికొకటి అనఁగా నీ వర్గములోనిదాని కా వర్గములోనిదానికి యతి చెల్లును. ఇట్టి భిన్నవర్గ వర్ణముల యతికి అనుస్వారసంబంధము ముఖ్యకారణ మగుటచే నీ యతి కీ పేరు సార్థకము.

అనుస్వారసంబంధ మున్నంతమాత్రమున నితర వర్గాక్షరములకు యతి చెల్లదని తెలియనగును. ఈ రెండు వర్గములకు మాత్రము చెల్లుటకుఁ గారణమిది

బిందుయతిచే బిందుపూర్వక త థ ద ధ లు నకారమునకు, బిందుపూర్వక ట ఠ డ ఢ లు ణకారమునకుఁ జెల్లును. సరసయతిచే 'న-ణ' లు పరస్పరమిత్రములు. బిందుసరసయతి యోగమున ంట-ంఠ-ండ-ంఢ లు నకారమునకు ంత-ంథ-ంద-ంధ లు ణకారమునకుఁ జెల్లుబడియగును. (ఇది యనునాసికాక్షరయతి యను పేర నప్పకవిచేఁ బ్రత్యేకముగా దీని తరువాత నొసఁగబడియున్నది.) నణమైత్రీమూలమున బిందుపూర్వక ట ఠ డ ఢ త థ ద ధ లు పరస్పరము మిత్రములగుచున్నవి. బిందు సరసానునాసికాక్షరయతులవలన నీ యనుస్వారసంబంధయతి సిద్ధించును.

ఈ యతిమైత్రీ విధానమును బరిశీలింపఁగా సరసయతి, బిందుయతి, అనునాసికాక్షరయతి, అనుస్వారసంబంధయతి యను క్రమమున అప్పకవి యతిభేదముల నిచ్చి యుండవలయును. అనునాసికాక్షరయతి (క్రింది యతి) బిందుయతికిఁ బరమును అనుస్వారసంబంధయతికిఁ బూర్వమును గాక తప్పదు.

బిందుసరస యతిద్వయముచేతనే యీ యతి గతార్థమగును గాని యప్పకవి స్పష్టార్థము వేఱుగా సంగ్రహించె ననవలె.

అప్పకవి స్వీయలక్ష్యము నొసఁగక ప్రసిద్ధమైన మనుచరిత్ర లక్ష్యమును, మఱిరెంటిని జూపియున్నాడు.

మనుచరిత్రమునందు—(1-56)

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం । జెల్వంబు
లేఁ బ్రాయమున్

బోలం జూచి యితండు పాత్రుఁ డని యే । భూపాలుఁడీ
వచ్చినన్

సాంగ్రామము మున్నుగాఁగొనఁడు మా । న్య క్షేత్రముల్
పెక్కు చం

దాలం బండు నొకప్పుడుం దఱుఁగ దిం । టం బాఁడియుం
బంటయున్.

వి. ఇందు నాల్గవపాదమున 'ందా-ంట' లకు యతి.
రావిపాటి తిప్పరాజు చాటుధార—

మ. సరిబేసై రిపుడేల భాస్కరులు భా । షా నాథపుత్రా! వసుం
ధ రయందొక్కఁడు మంత్రియయ్యె, వినుకొం । డన్
రామయామాత్య భా
స్కరుఁడో, యా, నయితే సహస్రకర శాఖల్ లే; వదేయున్న వే
తిరమై దానము సేయుచో రిపుల హే । త్రిన్వేయుచో
వ్రాయుచో.

వి. ఇందు రెండవపాదమున 'ంధ-ండ'లకు యతి.
ఆముక్తమాల్యదయందు — (2-48)

మ. దవ[1] ధూమంపుఁదమంబులోఁ దమరస । ద్రవ్యంబు పంకేజభాం
ధ వ భాను ప్రతుతుల్ హరింపఁగుయివెం । టన్ వెళ్ళ
శూన్యోరుకూ
పవితానంబులఁ జూడఁ జూడఁ బుడమిం । బాటిల్లి పై విప్పులై
యవసంబంచుల నాడఁగా నెగసె వా । త్యాశిన్రజశ్ఛ
క్రముల్.

వి. ఇందు రెండవపాదమున 'ంధ-ంట' లకు యతి.

1. ధూమంబుతమంబు.

## 14. అనునాసికాక్షరయతులు

తే. అల ద్రుతంబునకును మధ్య । మాను నాసి
కమునకును జెల్లు నను నాసి । క యతులనఁగ
డాపలను బూర్ణములు గల్గు । ట ఠ డ ఢ లును
త థ ద ధ లును గ్రమంబున । దానవారి. 62

క. మను సంతతి మండన భుం
దన్నిర్జిత కార్త వీర్య । నర నాయక ఖం
దన పంక్తి స్యందన నం
దన చందన [2]శక్రవార । ణ లసత్కీర్తీ. 63

వి. ద్రుతము-నకారము, మధ్యమానునాసికము-ణకారము, పూర్ణబిందు పూర్వకములయిన టఠడఢలు నకారమునకును, అట్లే పూర్ణబిందు పూర్వకములయిన తథదధలు ణకారమునకును యతి మిత్రములగును.

అనునాసికములకుఁ జెల్లు యతి గాన దీని కనునాసికయతి యను పేరొసఁగబడియె.

బిందుయతి సయిత మనునాసికమునకుఁ జెల్లునదే. అదియు ననునాసిక యతి గావచ్చు. కాని యందు బిందుత్వమునకుఁ బ్రాధాన్యము.

ఇందును బిందువు కలదు గాని భిన్న వర్గాక్షరములు భిన్న వర్గానునాసికములతో యతి చెల్లుట ఇందలి విశేషము.

ఈమైత్రి యిట్లుండును.

ంట-ంఠ-ండ-ంఢ—న

ంత-ంథ-ంద-ంధ—ణ

బిందు యతికిని దీనికిని భేదము గమనింపవలెను. బిందుయతిలో నా యా వర్గములోని తొలి నాలుగక్షరములు బిందుపూర్వకములయినచోఁ దత్తద్వర్గానునాసికమునకు మాత్రమే యతి చెల్లును. ఇందట్లుగాక నకారమునకుఁ జెల్లుబిందుపూర్వక త వర్గము ణకారమునకుఁ ణకారమునకుఁ జెల్లు బిందుపూర్వక ట వర్గము నకారమునకుఁ జెల్లుట విశేషము.

---

2. చక్రవారణ అని పూర్వముద్రణ పాఠము. అర్థము కుదురదు. ఇది పొరపాటు. 'శక్రవారణ' అని సవరింపఁబడినది.

బిందు సరసయతుల మేళనముచే నీ యతి సిద్ధించుచున్నది. స్పష్టప్రతిపత్తికై యీ యతి ప్రత్యేక భేదముగాఁ జెప్పఁబడినది.

అప్పకవి చూపిన స్వీయలక్ష్యము : 63-పద్యము.

రెండవపాదమున—ండ-న లకు యతి.

నాల్గవపాదమున—ంద-ణ లకు యతి.

టీ. మనుసంతతి మండన - మనువంశాభరణమా - భండన.... ఖండన-కార్తవీర్యార్జునుని యుద్ధమున జయించినవానిని (పరశురాముని) పరాభవించినవాఁడా, పంక్తి.... నందన-దశరథాత్మజా, చందనశక్రవారణ లసత్ కీర్తి-చందనము వలె నింద్రుని గజమువలె స్వచ్ఛముగఁ బ్రకాశించు కీర్తిగలవాఁడా. ఇవన్నియు రామపరములు ; రామకృష్ణుల కిందభేదమని యరయునది.

ఈ యనునాసికాక్షర యతిపై యనుస్వారసంబంధ యతికిఁ బూర్వమే యుండఁదగును. ఈ విషయ మనుస్వారసంబంధ యతిలోఁ జర్చింపఁబడినది. ఈ యనునాసికాక్షరానుస్వార సంబంధయతుల రెంటి నొక యతిగానే చెప్పినఁ జాలునని తోఁచెడి. అప్పకవి తర్వాతివాఁడగు కూచిమంచి తిమ్మకవి యనునాసిక వడిక్రిందనే రెంటిని జెప్పినాఁడు.

అప్పకవి యిచ్చిన యితర లక్ష్యములు:—

కిష్కింధా కాండమునందు—(614)

క. బలవంతుఁడైన వాలికిఁ
దలఁకుచుఁ గిష్కింధ వెడలి । త్వరలో నలు ది
క్కులకుం బాఱి మహిమం
డల మెల్లను జూచినాడ । నాఁడు నరేంద్రా. 64

వి. ఇందు నాల్గవపాదమున 'ండ-నా' యతి

రాజశేఖర చరిత్రమునందు—(2-127)

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండి వం
టలు పాలత్తేనియ జున్ను వెన్నయిడి యా । నాలుక్కెర ల్చక్కెరల్
ఫలముల్ పానకముల్ రసాయనము లం । బళ్ళూరుఁ బిండ్లూరుఁ గా
యలు బజ్జుల్దధి పిండఖండములు నం । దావిర్భవించె న్వెసన్.

వి. ఇందు రెండవపాదమున 'ంట-నా' యతి,

పరమయోగివిలాసమునందు — (2-104)

సీ. నిగమచోరకుని ఖం । డించిన యలంతయో
యబ్ధిలో గిరిమోచి । నట్టి యలంతొ 66

వి. ఇందు మొదటి సగము పాదమున 'ని-ండి' లకు యతి.

చిత్రభారతమునందు—

తే. నకుల సహదేవులార ఖం । డన పటిష్ఠ
లార సౌందర్య లక్ష్మికు । మారు లార
పోయితిరె మీరు నేఁడు నా । పొందు విడిచి
యనుచు విలపించు నలుదిక్కు । నాలకించు. 67

వి. ఇందు మొదటిపాదమున 'న—ండ' లకు యతి

హరిశ్చంద్రోపాఖ్యానమునందు—(1-8)

సీ. పా. పల్లవారుణ జటా । పటల భారముతోడ
నవ్య పలాశ దం । డంబు తోడ 68

వి. ఇందుత్తరార్థమున 'న-ండ' లకు యతి.

అప్పకవి చూపిన లక్ష్యములందెల్ల బిందుపూర్వక డకారమునకు నకారముతోడి మైత్రియే ప్రయుక్తమైయున్నది. బిందుపూర్వక తవర్గమునకు ణకారముతోడిమైత్రిగల ప్రయోగ మొసంగఁబడలేదు. అందులకుఁ బ్రయోగ మొకటి చూపెదను.

సం, త తమును హస్తకంకణరుచ + ణత్కారకృణనంబు

(కళా-8-282)

## 15. ము విభక్తియతులు

తే. వున్నపుంసక తత్సమం । బుల కడపలఁ
దత్సమానాంధ్రదేశ్య శ । బ్దముల తుదలఁ
గదిసిన మకార శృంగముల్ । కావ్యములను
బొసఁగు మువిభక్తి యతులని । పువుబుధులకు. 69

తే. పుష్కరము సూక్ష్మ మధ్యమ । ముగ నొనర్చె
ఫుల్ల పంకేరుహము వక్త్ర । ముగ నొనర్చె
బొండుమల్లెలు దరహాస। ముగ నొనర్చె
భోజనృపనందనకు నిక్క । ముగ నజుండు. 70

వి. తత్సమదేశ్య శబ్దముల తుదఁగలుగు ప్రథమావిభక్తి మువర్ణమునకు పు ఫు బు భు లు విభక్తి యతి యను పేరితోఁ జెల్లును. అమహత్తులయిన సంస్కృత పుంలింగ శబ్దములకును నపుంసకలింగ శబ్దములకును దత్సమమునఁ బ్రథమావిభక్తి ముప్రత్యయము చేరును. వృక్షః-ఇది సంస్కృతమున పుంలింగము, తత్సమమున 'వృక్షము' అగును. ఫలమ్-ఇది సంస్కృతమున నపుంసకలింగము, తత్సమమున 'ఫలము' అగును. అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు, (బాలవ్యా-తత్సమ-39) తత్సమశబ్దములంబోలిన కొన్ని తెనుఁగు శబ్దములకును మువిభక్తి యోగముగలదు; ఉ॥ నిక్కము, అందము, అక్కజము ఇట్టి మువర్ణకమునకు (మకారశృంగమునకు) 'పుఫుబుభు' అను వర్ణములకు యతి చెల్లును. మకారశృంగము-మకారమునకు కొమ్ము మువర్ణము.

మువర్ణము పఫబభ లతోఁ జెల్ల నేరదు. బిందుయతి ప్రకారము పూర్ణబిందుపూర్వకమైన పఫబభలు మకారముతోఁ జెల్లును. ఆ తెఱఁగున బిందుపూర్వక పుఫుబుభులే మువర్ణముతోఁ జెల్లవలసియుండగా, బిందుపూర్వకత్వము లేకున్నను పుఫుబుభు లు మువర్ణముతోఁ జెల్లునని యీ యతివలన విశేషముగా నేర్పడుచున్నది. విభక్తి ముకారమునకుఁ జెల్లు యతి గాన దీనికి పేరు సార్థకము.

విభక్తి ముకారమునకు పుఫుబుభులు చెల్లునని యీయతి చెప్పుచున్నను, పఫబభల మీఁదనున్న యుత్వమునకే కాక యాస్వరవర్గమునకుఁ జెందిన ఊత్వమునకు ఒత్వమునకు ఓత్వమునకు గూడ నీవిధి చెల్లుబడి యగునని యరయఁదగును, అనఁగా—

ము-పుఫుబుభు పూఫూబూభూ, పొఫొబొభొ, పోఫోబోభో లు యతి చెల్లును.

అప్పకవి యిచ్చిన స్వీయలక్ష్యము : (70 పద్యము)

1. పు-పుష్కర-మధ్యము + ముగ
2. ఫు-ఫుల్ల—వక్త్ర + ముగ
3. బొ-బొండు-హాస + ముగ
4. భో-భోజ-నిక్క + ముగ

ఇందు 3, 4 పాదములలో 'బు-భు' లకు మాఱు 'బొ - భో' లు గూర్చి ఉత్వయుగమునకే కాక ఒత్వయుగమునకును మువిభక్తి యతి చెల్లునని స్పష్ట పఱచినాఁడు.

మఱి యిందు మధ్యమము-పున్నపుంసకలింగము (ఇందు రెండు లింగములను చెప్పవచ్చు). వక్త్రిము - నపుంసకలింగము, దరహాసము - పుంలింగము, నిక్కము-దేశ్యశబ్దము. తత్సమదేశ్యములనే యప్పకవి పేర్కొన్నను నిందుఁ దద్భవములు గూడ గ్రాహ్యములేయగు. తద్భవము తత్సమసమానమైనదే.

ఉ॥ అక్కజము, బోనము, సాజము, జన్నము.

ఇందుల కప్పకవి చూపిన యితర లక్ష్యము—

ఆదిపర్వమునందు—(5–58)

క. ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టిన సదసద్వివేక । ములు గలిగినఁదాఁ
గట్టిన కర్మ ఫలంబులు
నెట్టన భోగింపకుండ । నేర్తురె మనుజుల్. 71

వి. ఇందు 2-వ పాదమున 'పు-ము' లకు యతి.

విశే. 'వనము - వనంబు' అను రూపాంతరములలో మువర్ణకమునకు బు వర్ణము వచ్చుటయు, 'సరసము + మాట-సరసపుమాట' అని యీ విధముగ సమాసములలో మువర్ణకమునకు పువర్ణాదేశము కలుగుటయుఁ గారణములుగా, విభక్తి ము ప్రత్యయమునకు పుపుబుభులతోడి మైత్రి యేర్పడియుండునని యూహింపనగును. ఈ యతికిఁ గవిజనాశ్రయాదులు 'పోలికవడి' యనినామకరణము గావించెను. మువర్ణకమునకు బు వర్ణము రూపాంతరమున వచ్చుట యను పోలికంబట్టి 'ము బు'లకు దన్మూలమున పుఫుబుభు ల కన్నిటికి వడి యేర్పడెనను హేతువునఁ బోలిక వడి యను పేరిడిరేమో? కాని పోలిక వడి యను పేరికన్న మువిభక్తియతి నామము సముచితము సార్థకమునై యున్నది.

## 16. ముకార యతులు

క. హెచ్చరికను పు ఫు బు భు లకు
నచ్చపు మా కొమ్ములే మ । హాకవులాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చటను ము కారయతుల । టంచును గృతులన్. 72

వి. కేవల మువర్ణముతో పుపుబుభు లకు యతిమైత్రి మహాకవు లక్క-డక్క-డ అనగాఁ గొన్నియెడల ము కార యతి యనుపేరఁ జేసియున్నారని పై లక్షణ తాత్పర్యము.

ఇంతకుముందు విభక్తి ముకారమునకు పుపుబుభు లతో యతిమైత్రి చెప్పఁబడినది. ఇందు సాధారణ ము వర్ణమునకు పుపుబుభు లతో మైత్రి సమ్మతింపఁబడినది.

ధనము, వంశము, వివేకము, నిక్క-ము, అందము-ఇత్యాది శబ్దములలోని ము వర్ణము విభక్తి ముకారము. పాము, ముని, సముద్ధతి - ఇత్యాదులందలి ము వర్ణము కేవల ముకారము, విభక్తి ముకారముగాదు. ఇట్టి ముకారములకు పుపుబుభు లతో మైత్రి ముకారయతి యనఁబడును.

మహాకవు లచ్చటచ్చట నిలిపిరని చెప్పుటచే నీ ముకార యతి కాదాచిత్క-మని యర్థము చేయనగు, అందుచేతనే కాఁబోలు దీని కప్పకవి స్వీయోదాహృతి నొసఁగఁడయ్యె. ఇంతకుముందు గూడనిట్లే విశేషవశియందు స్వీయోదాహృతి చూపఁబడలేదు.

ముకార యతికిఁ జూపఁబడిన లక్ష్యములు :

వసంతవిలాసమునందు —(నాచన సోమన)

క. అత్తటి విట నాగరకులు
చిత్తమున వసంతకేళి । చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి । బుట్టట కొమ్మల్. 73

వి. ఇందు నాల్గవపాదమున 'ము—బు' లకు యతి 'ముత్తెపు' అను శబ్దము మొదటనున్నది సాధారణ ముకారము.

శ్రీరంగమాహాత్మ్యమునందు—

చ. పరిచరుఁగాఁగనేలె నిర । పాయ చరిత్రునిఁ జాప కానన
స్ఫురదురు వీతిహోత్రుని స । ముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమ పవిత్రునిన్ మునిసు । పర్వవరస్తుతి పాత్రునిన్ మనో
హరఫల శేముషీ కబళి । తాంబుజ మిత్రుని వాయుపుత్రునిన్.

వి. ఇందు 2-వ పాదమున 'స్ఫు'-లోని పు వర్ణమునకు సముజ్జ్వల శబ్ద మధ్యగత ముకారమునకు యతిమైత్రి.

హరిశ్చంద్రకథయందు-

ద్విపద॥ ముందు మీరెఱింగిన । భూతలాధీశు
లందు రాజ్యంబుఁ బో । నాడిక్రమ్మఱను. 75

వి. ఇందు మొదటిపాదమున 'ము-భూ' లకు యతి.

విశే. కవిత్రయభారతమందును బ్రాచీన గ్రంథములందును మువిభక్తి యతియే సాధారణముగఁ బ్రయుక్తమైయున్నది. ముకార యతి ప్రయోగములు మృగ్యము లనఁదగును. అట్లెందేని నేటి ముద్రణలోఁ గానవచ్చిన దానికిఁ బాఠాంతరము వ్రాఁతప్రతులందుఁ గానవచ్చెడు. అరణ్యపర్వములో (ఎఱ్ఱన) నీ క్రింది పద్యము రెండవ పాదమున ముకార యతి గానవచ్చుచున్నది.

చ. ఉరమున రెండుగన్నులు పృ । థూతర దేశమునందు నోరు ప్ర
స్ఫురిత భుజద్వయంబును స । ముజ్జ్వల దున్నత భావమున్ (6-857)
అప్పకవియే యీ పద్యము మఱొకచోట నుదాహరించినాఁడు (3-219)

నేఁటి ముద్రిత భారతప్రతిలో 'భుజద్వయంబుఁ గుల-భూమిధరోన్నత భారము' అను పాఠము గానవచ్చుచున్నది. ఇందు ముకారయతి ప్రసక్తిలేదు.

తొలుత మువిభక్తి యతి యేర్పడెను. దాని పోలికంబట్టి తర్వాతి కవులు ముకారమునకును నీ యతిమైత్రి సమ్మతించి ప్రయోగించుటచే ముకార యతి లాక్షణికాంగీకృతమై ప్రత్యేక యతిభేదముగాఁ బరిగణింపఁబడినది. ము విభక్తి ముకారయతులు రెంటను ముకారమున్నది. ఆ ముకారమునకు పుఫుబుభు లు చెల్లును. ఇట్లుండ దీనిని రెండు భిన్నయతులుగాఁ జెప్పుట యవసరమని పెక్కుర తలంపు. ముకారయతిలోనే ముపర్ణమునకు పుఫుబుభు లు చెల్లునని చెప్పినఁ జాలును. సూక్ష్మముగాఁ బరికించినచో నిట్లు చెప్పుటకుఁ గారణము గలదని స్ఫురించును. మువిభక్తి యతిప్రాచీనము, ముకారయతి యర్వాచీనము. మఱి కాదాచిత్కము. ఉభయమత ప్రదర్శనార్థమిట్లు రెండురీతులఁ జెప్పఁబడినది కానోపును. ఇట్టి పద్ధతి యీ యప్పకవీయమందు నితర యతులందును జూపబ్టెడి (చూ. అభేదయతి-అభేదవర్గయతి, తద్భవవ్యాజయతి-విశేషవళి.)

ఈ క్రింది ప్రయోగములను జూడుడు :

పోకమ్రాకులఁల సొంపు । మురువు కొనఁగ (కాశీ)

భువనబీజంబు కై పెల్ల । మోక్షదాయి (భీమ)

మొనయఁ జక్కటి యతియండ్రు। పూర్వకవులు(లక్షణసారసంగ్రహము)

ఈ ప్రయోగములఁ బరికింప ముకారమునకే కాక 'ము-మూ-మొ-మో' లకు ఉఊఒఓలఁ గూడిన పఫబభలు యతిమైత్రి చెందునని తెలియనగును. ఈ విషయ మప్పకవిచే స్పష్టముగాఁ జెప్పఁబడలేదు.

ఇతర లాక్షణికులు మువిభక్తి యతిని 'పోలికవడి' యనియు, ముకార యతిని 'చక్కటివడి' యనియుఁ పేర్కొనిరి. చిత్రకవి పెద్దన, లింగమగుంట తిమ్మన, కూచిమంచి తిమ్మన, రంగకవి మున్నగువారు చక్కటి యతినిగూడఁ జెప్పిరి. పోలిక చక్కటి పేళ్ళకన్న అప్పకవి యిడిన మువిభక్తి ముకార నామములు సార్థకములు స్వరసములునై యున్నవి.

## 17. మవర్ణ విరామములు

సీ. మర్దితదైత్య సం । యమి మనోజ్ఞాదిత్య
మహితమేఘాభ సం । రక్షితేభ
మాయా ప్రవర్తి సం । లబ్ధ నిర్మలకీర్తి
మణిహార సుర వశం । వదవిహార
మందర ధైర్య వం । శనినాద చాతుర్య
మాభూవ యువతి షం । షండ రూప
మంజులస్వాంత కం । స ధరావర కృతాంత
స్మరహరారాధ్య సిం । హనిభమధ్య

తే. యనుచుఁ జరమాను నాసికం । బునకు నిట్లు
ప్రాలుఁ గృతుల మవర్ణ వి । రామములన
దండిసున్నలు దాపల । నుండెనేని
పెలుచ నంతస్థములు నూష్మ । ములును గృష్ణ. 76

వి. పై పద్యమున గీత భాగము లక్షణము; సీసభాగము లక్ష్యము. చరమానునాసికము-అనునాసికములందుఁ గడపటిది-మకారము. (ఙ ఞ ణ న మ లు అనునాసికములు), దండిసున్నలు-పూర్ణబిందువులు, అంతస్థములు-య ర ల వ లు, ఊష్మములు - శ ష స హ లు.

పూర్ణబిందు పూర్వకములయిన య ర ల వ శ ష స హలు (అంతస్థములు, ఊష్మములు) మకారముతో యతిచెల్లును. దీనికి మవర్ణవిరామమని పేరు. పై సీసపద్యములో మొదటి యెన్మిదిదళములందు, బాదాదిలోని మవర్ణమునకు వరుసగ యతిస్థానములందు నిండుసున్నలు పూర్వమందుఁగల 'య ర ల వ శ ష స హ' వర్ణములు నిలుపఁబడియున్నవి.

1. మ-ంయ 2. మ-ంర
3. మా-ంల 4. మ-ంవ

5. మ - ంశ 6. మా - ంష

7. మ - ంస 8. స్మ - ంహ (ఇందు స్మ లోని మ వర్ణము నకు యతి)

విశే. ఈ యతి విధానమునకుఁ గారణ మిట్లుండును!

మకారమునకు ననుస్వారోచ్చారణము సహజము. పదాంత మకార మను స్వార మగునని సంస్కృతమున శాస్త్రము చెప్పుచున్నది; మోఽనుస్వారః'— హరిమ్ + వన్దే—హరింవన్దే. వర్గాక్షరముల పూర్వమందలి యనుస్వారము తత్తద్వర్గాంతానునాసికము లగును (పరసవర్ణానునాసికము); అంతస్థోష్మముల దాపల నున్న యనుస్వారము మకారోచ్చారణగలది యగును. సంయమి, సంరక్ష, సంతాప, సంసారము అను శబ్దములలోని యనుస్వారము రమ్యము, స్మ్రమాట్టు అమ్లము అను శబ్దములలోని మకారమునంటి యుచ్చారణగలదై యున్నదిగదా? ఈ యుచ్చారణ సామ్యధర్మముంబట్టి బిందుపూర్వకాంతస్థోష్మములు మ వర్ణముతో యతికిఁ జెల్లుబడియయ్యె. దీనిని మకారయతి యని యనంతుఁడు, మావడి యని చిత్రకవి పెద్దనాదులు పేర్కొనిరి.

అప్పకవి యిచ్చిన యితర లక్ష్యములు:—

భీమన చాటుధార—

చ. గరళపు ముద్ద లోహ మవ-గాఢ మహాశని కోట్లు సమ్మేటల్
హరునయనాగ్ని కొల్మి యుర - గాధిపుకోరలు వట్టుకార్లుది
క్కరటి శిరంబు దాయి లయ-కాలుఁడు కమ్మరి వైరి వీర సం
హరణ [1]గుణాభిరాముఁడగు-[2]మైలము భీమన ఖడ్గసృష్టికిన్.

వి. ఇందు 4 వ పాదమున 'ంహ-మై' లకు యతి. ఈయతి యత్వ విశిష్ట మ వర్ణమునకే చెల్లుననుకొనుట పొరపాటు. మకారముమీఁది యచ్చు ననుసరించి బిందుపూర్వకాంత స్థోష్మములమీఁద స్వరములు నిలిపి యతి చెల్లింపవచ్చు.

'హం, సీ యాన యొకర్తువచ్చె + మిక్కిలి శీవిన్' అనురీతి యతి గూర్పవచ్చు.

అనంతుని ఛందమునందు. (1.117)

తే. యరలవలు శహసహలును । నాదిబిందు
యుతములై మకారవిరామ । యుక్తిఁదనరు

1. రణాభిరాముఁడగు 2. మైలమ.

మారు తాత్మజుఁడరిది సం । యమి యనంగ
మదన జనకుఁడు దనుజ సం । హారుఁడనఁగ. 78

వి. ఇది యనంతుని ఛందములో మకారయతి లక్ష్యలక్షణపద్యము.
3-వపా॥ మా-ంయ; 4-వ పా॥ మం-హా లకు యతి.

విశే. ఇందప్పకవి చూపిన యితర లక్ష్యములలో నొకటి చాటుధార, మఱి యొకటి లక్షణ గ్రంథములోనిది. ప్రాచీన ప్రసిద్ధ పద్యకావ్యములలో దీనికి లక్ష్య మప్పకవికి లభింపలేదేమో ?

రంగకవి మున్నగు లాక్షణికులు బ్రహ్మాండపురాణము మున్నగు గ్రంథ ములనుండి కొన్ని లక్ష్యములు మాపడికిఁ జూపియున్నారుగాని యాగ్రంథము లలభ్యములు.

బిందుయతి మవర్ణ విరామములఁబట్టి మకారమునకు బిందు పూర్వకము లగు ప ఫ బ భ లు, య ర ల వ లు, శ ష స హ లు చెల్లునని తెలియనగును. య ర ల వ లు శ ష సహ లు బిందుపూర్వకములై మకారమునకుఁ జెల్లుకారణము ననుసరించి బిందుపూర్వకములయిన య ర ల వ లు శ ష స హ లు తమలోఁ దాము చెల్లుటయు సమ్మతింపవచ్చునని తోఁచుచున్నది. ఇది యేలాక్షణికుఁడును జెప్పలేదు: ప్రయోగ మన్వేషణీయము. బింద్వనునాసికాక్షరయతుల ననుసరించి యనుస్వార సంబంధయతి యేర్పడియున్నది గదా! అట్లే బిందుపూర్వకములగు నంతస్థోష్మములు చెల్లుటలో నాక్షేపణయుండరాదు.

'సం యమివంద్య భక్త సం-రక్ష యనఁగ, ఇట్టి యతి గ్రాహ్యమని నా యభిప్రాయము (ఈ యుదాహృతి కల్పితము)

## 18. ఋజు యతులు

తే. మొదలియంతస్థ వర్ణంబు । తుదిని బొదలు
నూష్మమును ఋజుసంజ్ఞ చే । నొకటికొకటి
యతులగు నహారశూర సం । హార యనఁగ
హరముఖార్చితపాదతో । యజయనంగ. 79

వి. మొదలి యంతస్థ వర్ణంబు-యకారము : తుదిని బొదలు నూష్మము-హకారము. 'య హ' లు ఋజుయతి యనుపేర నొకదాని నొకటి చెల్లును. ఇది సుగమము.

పై పద్యోత్తరార్థము లక్ష్యము.

3-పా. య-హాలకు యతి.

4-పా. హ-యలకు యతి.

ఋజుయతి యనుపేరు దీని కుంచుటకుఁ గారణ మూహ్యము. ఈయతి సరళముగ ఋజుగతిలో నుంటచే నీ పేరువచ్చెనేమో! సరసయతిలో అయహాలు చెల్లునని చెప్పబడుటచే నీ ఋజుయతి ప్రత్యేకముగఁ జెప్పట యనవసరము. ఈ యతి యిట్లు వేఱుగా మఱే లక్షణగ్రంథమునను జెప్పఁబడలేదు. ఈ యతి యతిప్రసిద్ధము గావున దీనికి మహాకవుల లక్ష్యము లొసఁగబడవు. ఈ యతి మైత్రిఁగూర్చి సరసయతిలోఁ బరామర్శింపఁబడును.

## 19. ప్రత్యేకయతులు

తే. ఉత్తరపదాద్యలిపి లోప । మొదవకుండు
తఱిని ప్రత్యేక యతి నాఁగఁ । దనరుచుండు,
న రయశార్ఙ్గంబు హరిచేతి । యదియునాఁగ
దివ్యచాపంబు శూలిచే । తిది యనంగ. 80

వి. చేతి + అది - చేతిది, చేతియది యని రెండురూపములుండును.

అది అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగనగు- బాల సంధి — 45; శబ్దాత్తచ్ఛబ్దాతః - చింతామణి. అత్తునకులోపములేని పక్షమున (ఉత్తరపదాద్య లిపి లోప మొదవకుండు తఱిని) చేతియది యను రూపముండును. అత్తఱి అకారమునకు యతి గూర్పవలయు. లోపాభావ పక్షమున యకారాగమము వచ్చును. దీనినే యప్పకవి ప్రత్యేక యతియని పేర్కొనియె. అటుగాక యుత్తరపదాద్యలిపి అనఁగా అత్వము లోపించునేని (చేతిది) వ్యంజనయతి ఘటింపవలయును. గూఢస్వరయతియందువలె అకారమున కింద యతి గూర్పరాదని యప్పకవి మతము. అతఁడిచ్చిన యుదాహరణలచే నిది స్పష్టమగుచున్నది.

అరయ.... చేతి + యది
దివ్య.... చే + తిది

దీనికిఁ బ్రత్యేక యతియని పేరు పెట్టుటలోఁ గల ప్రత్యేకత యేమో తెలియకున్నది. మఱి యిందులోప మొదవకుండు నప్పుడే (చేతియది) ప్రత్యేక యతియని చెల్లును. లోపమొదవుచోఁ బ్రత్యేకయతిగాదని యప్పకవి భావమైనట్లు స్పష్టము. ఉత్తరపదాద్యలిపి లోపమొందక ప్రత్యేకము వేఱుగా

నున్నప్పుడు చెల్లు యతిగాన దీనికి పేరు వచ్చియుండునని కొందఱూహించెదరు. ఈ యూహ 'స్థిత స్వగతిచ్చింతసీయా' యను నభియుక్తోక్తినిబట్టి కల్పితమనవలెను.

**విశే.** 'చేతిది' అనుచోట అకారము గూఢముగానున్నది గాన అకారమునకు జెల్లునని చెప్పఁదలఁచిననే యీ ప్రత్యేక యతికిఁ బ్రయోజనముగలదు. అటుగాక 'చేతియది' 'యనుచో అకారమునకును, చేతిది' అనుచో వంజనమునకును(తి)యతి యతి చెల్లునని వేరుగాఁ జెప్పనక్కఱలేకయే సిద్ధించెడుఁగదా? "చేతిది" ఇత్యాదులం దుభయయతి చెల్లునని సింహాసనద్వాత్రింశికలో గోపరాజు నిర్దేశించినాడు (4-208). 'చేతిది'లో అకారమునకును యతి చెల్లునని సమ్మతించినపుడే యిది ప్రత్యేక యతి యనిపించుకొనఁగలదని మా యభిప్రాయము.

సూరన కళాపూర్ణోదయములో నీక్రింది ప్రయోగము ప్రత్యేక యతికుదాహరణము కాదగినది:

సీ-పా. అనఁగఁ దన్మూలమె+ట్టిదియొ యనఁగ (5-58)

ఎట్టి+అది-ఎట్టిది-ఇందు లోపించియున్న గూఢస్వరమునకు యతి. కాని నేఁటి ముద్రణలో నీపాఠము కానరాదు. ఇది యిట్లు సవరింపఁబడినది 'అనఁగఁ దన్మూల మె-య్యదియొ యనఁగ'-ఇందుఁ బ్రత్యేక యతిప్రసక్తి కాస్కారము లేకపోయె.

అహిత మాచరించి+నదియులేదు (భార, సభా-1-185) అనుచోట 'ఆచరించిన+అది' అనుసంధిలో నుత్తరపదాద్యలిపి లోపమొందియు దానికి యతి గూర్పబడినదని భావించమన్న అందు సాధారణమగు అత్వసంధి యని చెప్పనవకాశముండుటచే స్వరప్రధానవళి చెల్లెనన్నను సరిపడి యీ ప్రత్యేక యతికిఁ బ్రసక్తి లేకపోవుచున్నది. గూఢస్వరమునకు జెల్లునన్ననే యీప్రత్యేక యతికి బ్రయోజనము గలదని ఫలితార్థము. కాని యిది యప్పకవికి సమ్మతము గాదని యెన్నునది.

## 20. భిన్నయతులు

తే. గుడుసు పైఁ గ్రియనడుమ నా। గుడుసువచ్చి
భిన్నయతియగు, రానిచోఁ। బెఱయతియగు,
నెదను లచ్చిని హరిధరి। యించెననఁగ,
రిపులనెల్లను బోర హ। రించెననఁగ. 81

వి. 'ధరించు. హరించు' మున్నగు క్రియలలో ఇంచుగాగమమున నడుమ మఱియొక ఇకారము (గుడుసు)వచ్చి 'ధరియించు, హరియించు అనురూపములు

గలుగును. గుడుసు- ఇకారము, ఇత్వము, ధరియించు హరియించు అను రీతి రూపము లున్నపుడు ఇకారముతో యతి సేయవలెను. దీనికి భిన్నయతి యని పేరు. ధరించు, హరించు అనురీతి రూపము లున్నపుడు రివర్ణమునకు అనఁగా ౘ్రాణికి యతి గూర్పవలెనే కాని ఇత్వమునకు యతి చెల్లదు. ఇట్టిదానికి వెఱ యతి యని పేరు అప్పకవి భిన్నయతికిఁ వెఱయతి కుదాహరణములు పై లక్షణము సుత్రార్థమునఁ జూపినాఁడు.

ఎదను.... ధరి + యించె (భిన్నయతి)
రిపుల.... హ + రించె (వెఱయతి)
ఇందుల కప్పకవి చూపిన యితర లక్ష్యములు:

విజయవిలాసమునందు — (3-15)

ఉ. చిత్తజుఁడల్గి తూపుమొనఁ । జేసినఁ జేయగనిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచి । యించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరళాయతేక్షణ క । టాక్ష విలాసరసప్రవాహముల్
కుత్తుక బంటి తామరల। కుం దలమున్కలు గండుమీలకున్. 82

అందే—

ఉ. చెట్టతనంబునన్ జనకు । జీవనమంతయు వెల్లివుచ్చితోఁ
[1]బుట్టినయాపె [1]యుల్వ్రిఁజిచి । పుట్టినబిడ్డనికిం బగైననీ
యిట్టి నిశాటకృత్యముల । కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
వెట్టి ప్రదోషవేళ జని । యించిన వాఁడవొగాక చంద్రమా. 83

వి 82-వ పద్యము 2-వ పాదమున ఎ...వచి + యించ-భిన్నయతి.
83-వ పద్యము 4-వ పాదమున ఎ...జని + యించి-భిన్నయతి.
అగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు—

ఉ. గందపుఁగొండ నెత్తములఁ । గందువమేలిమితీవ యిండ్లలోఁ
గెందలిరాకుపాన్పునసు । ఖించి నితాంతరతిశ్రమంబునుం
జెందిన చెంచుగుబ్బెతల । చెక్కుల(జిమ్ము జవాదివాసనల్
విందులుసేయుచు న్మెలఁగు । వేఁకువఁ గోమలగంధవాహముల్.

1. చెఱచి.

వి. ఇందు 2-పా. కె—సు + ఖించి (పెఱయతి)

ఇందు 'సుఖియించు' అనురీతి ఇకారాగమము రాలేదు గాన నప్పకవి మతమున వ్యంజనయతి మాత్రమే చెల్లును.

విశే. ఈ యించుగాగమయతిని గూర్చి యించుక పరామర్శ:

గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించు గ్వ్రకంబుల కియుడాగమంబు విభావనగు [బాల-క్రియా-60] భుజ్ + ఇంచు-ఇయుడాగమము వచ్చినచో భుజియించు, రాకున్నచో భుజించు అని యగును. ఇట్లే నుతి + ఇంచు-నుతియించు, నుతించు అనురీతి రెండు రూపములుండును. వచ్ + ఇంచు-వచియించు, వచించు. ఈ యియుడాగమమునే యప్పకవి గుడుసుపై గుడుసు వచ్చుటయని వివరించె. సుఖించు- అన్నది సుఖియించు అనురీతి భిన్నమగుచున్నది. (మధ్యాక్షర విరళమగుచున్నది; భిన్నశబ్దమునకు విడియుండుట యని యర్థము) ఇంచు భిన్నరూపమున నున్నప్పు డచ్చునకు యతి చెల్లుబడి యగును గాన దీనికి భిన్నయతియను పేరొసంగబడెను. ఇట్లు భిన్నముగానియపుడు పెఱయతియని యప్పకవి పేర్కొనెను.

అప్పకవి యొసంగిన యదాహరణంలో ధరించు- ధరియించు, హరించు- హరియించు, వచించు-వచియించు జనించు-జనియించు సుఖించు-సుఖియించు అనురీతి భిన్నాభిన్నరూపములు రెండేసియున్నవి. ఇందెల్ల భిన్నరూపమున ఇత్వముతోను భిన్నము కానపుడు వ్యంజనముతోను యతి గూర్పవలయునని యప్పకవి మతము.

ఈ భిన్నయతి నిట్లే యనంతామాత్యుడును నిర్వచించినాడు.

పోషించు, పలికించు మున్నగు ధాతువులలో ఇంచుగాగమమున నియుడాగమము రాదు గాన నిందెల్ల వ్యంజనమునకే మైత్రియని గ్రహించునది.

అప్పకవి మత మిట్లున్నను నీ ధాతువులందెల్ల ఇంచుగాగమము పరమై యండుటచే భిన్నముగానపుడును (నుతించు, ధరించు, మొ) స్వరవ్యంజనముల కుభయయతి చెల్లుట న్యాయమనక తప్పదని మామతము.

ధరించు అన్నపుడు రీకిని, ధరియించు అన్నపుడు ఇత్వమునకును యతి చెప్పకయే తెలియుచున్నది. దీనిని భిన్నయతియని ప్రత్యేకముగాఁ జెప్పుటలోఁ బ్రయోజనము శూన్యము. అప్పకవి యిట్లే ప్రయోజన శూన్యముగాఁ బ్రత్యేక యతిని నిర్వచించె.

లక్షణ దీపిక, సులక్షణసారము, రంగరాట్ఛందము. గరళపురీఛందము, సుకవిజనమనోరంజనము మున్నగు లక్షణగ్రంథములలో ఇంచుగాగమముగల ధాతువులం దుభయయతి చెల్లునని నిరూపింపఁబడినది. ఇందులకుఁ బెక్కు ప్రయోగములును గానవచ్చుచున్నవి.

ఏనుదియ్యమున న + టించిన (నృసింహ-2-56)
ఏమఁట పాదుకలమఁట గ + జింపఁగ (భాగ-10-ఉ-585)
ఇష్టఫలసిద్ధి దొరహ + త్రింమ నింతి (పాండు-2-78)
ఎఱఁగి నిశ్శేషముగ నద + గించు టురవు (పంచ-సంధి-314)
ఎలమిఁ బికాలితోడ నెలఁ + గించుచు (నన్ని-కుమార-9-110)
ఇరవుగదా ధారగొని భు + జించుట యొప్పున్ (పద్మ-2-93)
ఇప్పుడిమ్మాడ్కి- ని + ద్రించుటేల (వేంకటాచల-4-295)
ఎట్లు సాధింతురని విచా + రించుటేల (శతకంఠరామా-1-101)
ఈ క్రియ సత్పుత్రకులు చ + రింతురు పుత్రా (ప్రబంధరాజ-688)
భారతములోను రెండుమూఁడు ప్రయోగములు గోచరించుచున్నవి.
సందియం, బీరమణీయకాంతి నుప + మింపఁగ (ఆది-5-151)
శయ, నించు యుధామన్యుఁ + డెటింఁగి (సౌప్తిక-1-179)

పోషించు, పలికించు మున్నగు ధాతువులందు ఇంచుక్కు- భిన్నముగాదు. కాని యిట్టివానియం దిత్వమునకు యతి యభిన్నయతి యనఁబడునని సులక్షణసార లక్షణదీపికాదులలోఁ జెప్పఁబడియున్నది. భిన్నయతి, అభిన్నయతి, పెఱయతి అనురీతిఁ జెప్పుటలో స్వారస్యములేదు. ఇంచుగాగమమున నుభయయతి చెల్లునని లక్షణము కల్పించుట యుక్తము.

## 21. ఏకతరయతులు

తే. మహిని రేఫాక్షరంబును । మఱిశతాంగ
నామక అకారమును సవ । ర్ణంబులయ్యుఁ
గావ్యములయందు నొకటి కొ । క్కటి గలయక
[1]తమకునుం దామయగు నేక । తరయతులన. 85

ఆ. రార బాలకృష్ణ । రచ్చలగమిఁగూడి
వాఁగయనుచు నిన్ను । అవ్వఁబెట్టు
వాండ్రయిండ్ల కేఁగి । వాదేల దెచ్చెద
వనిన నేకతరము । లైపొసంగు. 86

1. తమకుఁదామయగు- అని పూ. ముద్రణము. తాము + అ-తామ యగును: తామయగాదు. కాన సవరింపఁబడినది. 'తమకుఁదామయైతగు'నని కూడ సవరింపవచ్చు.

వి. లఘురేఫమును శకటరేఫమును సవర్ణములయ్యు నొకదానికొకటి యతి మైత్రి నందనేరవు. అవి తమకుఁదామె చెల్లును. అనఁగా లఘురేఫము లఘురేఫమునకును, శకటరేఫము శకటరేఫమునకును యతిచెల్లును. రఱలుపరస్పరము చెల్లకుండుటేకాక యని యేయితరాక్షరములతోను జెల్లవు. తమకుఁదామె ప్రత్యేకముగా నుంటచే నేకతరమయ్యెను. దానివలన నేకతరయతి యనఁ బరఁగెను.

విశే. రేఫాక్షరము-రవర్ణము. నిర్దేశవిధానోచ్చారణములఁ డఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును రవర్ణమిఫప్రత్యయాంతమునగు. (ప్రౌఢ-సంజ్ఞ-2) 'వర్ణాత్కారః రస్యేఫః' అని వార్తికము దీనికి మూలము. శకటాంగనామక ఱకారము-శకటరేఫము, బండిఱా అని యర్థము.

ఏకతరమనఁగా రెంటిలో నొకటి. ర ఱ ల ను రెండక్షరములలో నొక్కొక్కటి ప్రత్యేకముగఁ దనతనకే చెల్లుబడి యగుటచే నేకతరయతి యని దీనికి నామకరణము చేయఁబడియె. ఏకతరవళియని తొలుతఁ బేరొసఁగినవాఁడు విన్నకోట పెద్దన. అతని ననుసరించి యప్పకవియు నట్లే పేర్కొనియె. కాని భీమన, అనంతుఁడు చిత్రకవి పెద్దన, కూచిమంచి తిమ్మకవి మున్నగులాక్షణికు లెల్లరు దీని నెక్కటివడియని పేర్కొనిరి. ఎక్కటి శబ్దమునకు పరాపేక్షలేనిది. ప్రత్యేకమయినది, రెండవదానితోఁ గలియనిది యనునర్థమును చెప్పవచ్చును. కాన ఏకతరయతి, ఎక్కటివడి సమానార్థకములే యగును. మొదటిది తత్సమ శబ్దము. రెండవది దేశ్యశబ్దము. భీమనాదు లెక్కటివడిలోఁ జెప్పినదానికి నప్పకవి చెప్పినదానికి భేదము గలదు. అప్పకవి ర ఱ ల ను మాత్రమే దీనియందు జెప్పినాఁడు. భీమనాదులు మఱికొన్ని యక్షరముల నిందుఁజెప్పిరి. వారు చెప్పినవి యీ క్రిందివి-

మ ర ఱ ల వ-భీమన; మ ర ఱ ల వ-విన్నకోట పెద్దన;

శ ర మ ఱ వ-అనంతుఁడు, మ ర వ ఱ ల-చిత్రకవి పెద్దన, కూచిమంచి తిమ్మన.

వీరందఱి మతమున 'మ ర ఱ ల వ' లను నైదక్కరము లెక్కటివడిలో జేరును. ఇందలి మకారమునకు బిందు పూర్వక ప ఫ బ భ లును, బిందుపూర్వ కాంతస్థోష్మములు యతి చెల్లును. లకారమునకు శ డ లు, వకారమునకు ప ఫ బ భ లు అభేదయతిచే మిత్రములు. ఇట్లితరాక్షరములతోఁ జెల్లు 'మ ల వ' లు ఎక్కటివడిలోఁ జేర్చుటకుఁ గారణము విచారణీయము. అప్పకవి చెప్పిన చొప్పున ర ఱ లు మాత్రమే యేకతరయతులందు గ్రహించుట యుక్తము.

ఆది లాక్షణికకవి భీమనసుండి యించుమించందఱు మ ర ఱ ల వ లెక్కటివడియందుఁ జెప్పుటకు బొత్తిగా గారణము శూన్యమనుట సరిగాఁ దోఁపదు.

ఆ కారణ మిట్లూహ్యాము: మకారమునకుఁ గేవల హల్లు చెల్లదు. బిందు పూర్వకమైననే ప ఫ బ భాదులు చెల్లుబడియగును. ఆ బిందువు మకారతుల్యమగుటచే (చంపక, చమ్పక) సంయుక్తయతి బలమున మకారము చెల్లునని వీలున్నది. కాన మకార మెక్కటి వడిలోఁ జేరినదనవలె. ల ళ లకు సంస్కృతభాషలో నభేదము. మఱి యందు ళ కారము వర్ణసమామ్నాయమున గ్రహింపఁబడలేదు గూడ. కళంకమును కలంకమనియే సంస్కృత లిపిలో వ్రాయుదురు. ఇఁక ల డ ల మైత్రి సర్వసమ్మతము గాదు. కాన లకారమెక్కటి వడిలో స్థానము కలిగించుకొనెఁ గాఁబోలు. ప్రాచీనమతమున వబలమైత్రి నిషిద్ధమందురు. కవిజనాశ్రయ చూడామణు లభేదయతిని (వ-బ-ల యతిని) జెప్పలేదు. అనంతుఁడు అభేదవిరతియందు పవలమైత్రిని జెప్పెనే కాని యతఁడిచ్చిన యుదాహరణములో ప వ లరూప భేదము గల శబ్దము (నెపము-నెవము) గూర్పఁబడియుండుటచే పవలద్వైరూపముగల శబ్దములందే యాయతి చెల్లు ననవలె. ఇట్టికారణములఁ బట్టి మ,ల,వ, లు ర,ఱ లతో నెక్కటివడియందుఁ జేర్పఁబడెనని తలపనగును కాని యీ హేతువు లంతరమ్యముగాఁ దోఁపమిచేతఁ గాఁబోలు నప్పకవి నిర్బాధమయిన ర ఱ ల రెంటి నేకతరయతి యందుఁ జెప్పె. అప్పకవి మతము సమీచీనమని యొప్పుకొనక తప్పదు.

అప్పకవి మతమున ర ఱ లకు యతిమైత్రియే కాక ప్రాసమైత్రియు నిషిద్ధము. ఏకతరయతిచే ర ఱ ల యతిమైత్రియు, ప్రాసవైరమను ప్రాసభేదముచే (344-పద్యము) ర ఱ ప్రాసమైత్రియు నప్పకవిచే నిరాకరింపఁబడియె.

ఆంధ్రశబ్దచింతామణిలోని 'నాన్యోషాంవైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యా' త్తను సూత్ర మప్పకవి యీ రేఫద్వయమైత్రీ నిషేధమునకుఁ బరమాధార మనఁ జెల్లును.

అంతస్థములయిన య ర ల వ లు లఘువులు అలఘువులని రెండు విధములు. ఒక్క రేఫమునకుఁ దక్కఁ దక్కిన య ర ల వ లకు లఘ్వలఘువులకు యతిప్రాసములోఁ బరస్పరమైత్రి గలదు. లఘ్వలఘురేఫలకు మాత్రము (ర-ఱ లకు) యతిప్రాస యెన్నటికిని జెల్లదనుట.

అప్పకవియే పై చింతామణిసూత్రమును ద్వితీయాశ్వాసమున నిట్లు వివరించెను. :

గీ. జ్ఞాతివైరంబు నొంది ప్రాసంబులందు
విశ్రమములందుఁ దమలోన వేఱుగలిగి
దేవదానవులట్లన తెనుఁగులందు
మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ. (2-229)

ర ఱ **ల** సవర్ణములయ్యు జ్ఞాతివైరముగల దేవదానవులవలె యతిప్రాసలందు వైధర్మ్యము గలిగియున్నవని యప్పకవి నిర్వచించెను. రేఫద్వయ యతి-ప్రాసమైత్రీ విషయమున లాక్షణికులలోను మహాకవులలోను నేకీభావము గానరాదు. భీమనాది సర్వలాక్షణికులు ర ఱ ల నెక్కటి వళియందుఁ జెప్పిరి గాన వారి మతమున ర ఱ యతిమైత్రి నిషిద్ధమని నిర్ణయింపవలయు. భీమన, విన్నకోట పెద్దన, అనంతుఁడు ర ఱ ప్రాససాంకర్య విషయము స్పృశింపలేదు. చిత్రకవి పెద్దన ర ఱ ప్రాససాంకర్యమును నిరసించె (లక్షణసార సంగ్రహము 3-5). శారదాదర్పణమున రఱయతి యంగీకృతమై రఱప్రాస నిరాకృతమైనది.

కూచిమంచి తిమ్మకవియు నప్పకవివలె శకటరేఫ ప్రకరణాదిలో రేఫ అకారసాంకర్యము సేయరాదని వచించి యేతత్ప్రకరణాంతములో 'అలసాని పెద్దకవి, పింగళి సూరన, రామభద్రకవివర్యుఁడు పిల్లలమఱ్ఱి వీరభద్రుఁడు, గలిపిరిగద కృతుల జాలఁగ రేఫములన్' అని యుభయరేఫ సాంకర్యమును సమర్థించి పెద్దనాదుల ప్రయోగములను బ్రదర్శించినాఁడు (చూ. సర్వలక్షణ. సా. సం. 187 240-243 పుటలు) కవిచింతామణిలోఁ దాతంభట్టు 'ఇలరేఫ అకారమ్ములు వళిచెల్లింపఁ జెల్లుఁగాని వసుమతిఁ బ్రాసంబులు చెల్ల' వన్నాఁడు సులక్షణసారమున ఱావళిలో ర ఱ ల యతిమైత్రి చెప్పఁబడినది.

ఇది యిట్లుండగాఁ నే శబ్దము లఘురేఫఘటితము, ఏ శబ్దము శకటరేఫ ఘటితము అను నిర్ణయము సేయుట దుష్కరముగానున్నది. ఒకరు సాధురేఫ గలదన్న శబ్దమున మఱొకరు శకటరేఫ గలదనుచున్నారు. ఇట్లుభయవాదములు గల కొన్ని శబ్దములకుఁ దర్వాతివారు ద్వైరూప్య మంగీకరించిరి కవిత్రయ రచనలందే యీ రేఫవిషయమున ద్వైరూప్యము గానవచ్చుచున్నది. నన్నయభట్టు భారతభాగమున నుభయరేఫ సాంకర్యము చేయఁబడలేదని వజ్ఝలవారి యభిప్రాయము. నన్నయేతర కవిరచనలలో ర ఱ యతిప్రాససాంకర్యము కొంచెమో గొప్పయో యున్నదనక యొప్పుకొనక తప్పదు.

ర-ఱ యతి చూపట్టు ప్రయోగములు కొన్ని చూపబడును —

తివి. రెడు కవికి చ్చదువు తెఱఁగె + ఱింగిన కాక
(కవిజనాశ్రయ-సంజ్ఞ-5)

అంపమున బ్రచ్చుగతి + బ్రచ్చెనఖిలుల. (ఛందోదర్పణ—1-111)

ఱొమ్మును నిలుపంగ నీకు + రుచిగల్గిన. (కాళింది - 1-181)

భా, రవి మా నన్నయభటులుఁ దిక్కకవి నె + ఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్.
(జైమిని - 1-6)

రో వెఱయైన మె + ఱుంగుఁబోండ్లు. (కవికర్ణ - 6-45)

జా, ఱిన నునుఁ బైఁటకొంగు సవ + రించు. (కంకంటి ఉ. రామా. 1-3)

రమణన్నన్నయభట్టుఁ దిక్కనమఖి నె+ఱ్ఱాప్రెగ్గడన్.
(రాజశేఖర విలాస - 1-11)

మీ, అంగవటు క్రియన్ శివుఁడు+రాఁడు (సమీర - 3-22)
రవి యను దివ్యకేతువు చె+అంగన. (ఆముక్త - 2-7)
ఱెక్కలు గట్టుకొని దివిజ+రిపు మేడల (ప్రభావతి-4-86)
శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బా+ఱెం బక్షులు. (మను-3-12)
ఇంకను లెక్కలేని ప్రయోగములు చూపనగును

నణలు, రలలు, లడలు, చసలు, యహలు ఇత్యాది వర్ణములు భిన్నస్థాన జనితములు: సవర్ణములు కావు. ఇట్టివానికి యతిమైత్రి; మఱి యిందుఁ గొన్నిటికిఁ బ్రాసమైత్రియు వెలయుచుండఁగా. సవర్ణములై లఘ్వలఘూచ్చారణ మాత్రభేదముగల రఱలకేల యతిప్రాసమైత్రి ఘటింపరాదో? నేఁడీ రఱల భేద పరిగణనమే యంతరించిపోయెను. ఈ చర్చ యెట్లున్నను అప్పకవి మతమున నుభయరేఫ సాంకర్య మత్యంత దోషమని యరయనగు.

ఇందుల కప్పకవి స్వీయోదాహరణ మాత్రమే చూపెను.
86 పద్యము-1. పా. రా-ర, 2 పా.ఱా-అ (యతిమైత్రి చేయఁబడె)
టీ. ఱాఁగ ధూర్తుఁడు, అప్పఁబెట్టు- నిందపాలుసేయు.

## 22. అభేద విరతులు

తే. వేదముఖమున 'వబయోర । భేద' యనుట
వలన వబలొక్కటొక్కటి । నిలుచు విరతి
కవని లడ లకు, లళ లకు । నట్లు కలిమిఁ
జేసి తమలోన నివియును । జెల్లుచుండు. 87

ఆ. వసుమతీ కళత్ర । బక జైత్ర గానక
లాలసత్కలాప ! డంభ గోప
లలిత దేహ పింగ । ళ పుర దక్షిణగేహ
యన నభేద విరతు । లప్రమేయ. 88

వి. 'వబయోర భేదః' అను వ్యాకరణసూత్రముచే వ బ ల కు నభేదత్వము చెప్పఁబడును. దానంజేసి వ బ లకుఁ బరస్పరము యతి చెల్లుబడి యయ్యెను. వబలకే కాక, లడ లకు లళ లకు నయిత మిట్లే యభేదయతి చెల్లును. అభేద సూత్రమువలనఁ జెల్లుబడి యగుటచే దీని కభేదయతి యను పేరుగలిగె.

అప్పకవి యిచ్చిన స్వీయోదాహరణ పద్యములో (88)మొదటి మూఁడు పాదములలో వరుసగ, (1) వ బ లకు (2) ల డ లకు (3) ళళలకు యతిమైత్రి చేయఁబడియున్నది.

విశే. 'రలయోర్లడయో స్తద్వల్లళయోశ్శసయోరపి.

వబయోర్నణయోశ్చాంతే ....స్యాదభేదేనకల్పనమ్' అని ప్రమాణము.

ఈ ప్రమాణముననుసరించి వ బ లకు వలె రల, లడ, లళ, శస, నణ ఇత్యాద్యక్షరయుగము లభేదయతియందుఁ జేరవలయు. శస లూష్మయతిలోను, నణలు సరసయతి యందును జెప్పఁబడినవి.కాన వ బ లు, ల డ లు, ల ళ లు 'మాత్ర మీ యభేద విరతిలోఁ గ్రహింపఁబడినవి. ర ల యతి యప్పకవి కిష్టము గాదు గాన నిందు సంగ్రహింపఁబడలేదు-

బిభీషికా- విభీషికా, బలాహక-వలాహక (వ-బ):

జలధి-జడధి వ్రీడ - వ్రీళ (ల-డ), పరిమల-పరిమళ, కలంక-కళంక (ల-ళ)-ఇట్లు సంస్కృతభాషలో వ బ లకు, ల డ లకు, లళలకు అభేదము వర్తించుచున్నది. పవ్వడించు- పవ్వళించు, వడి-వళి, వెడలు-వెలలు, దళము-దడము. పవడము-పవళము అనురీతిఁ దెనుగునను లడ లకు. ల ళ లకు నభేదము గానవచ్చును. ఉ॥ ఊరు -ఊళలు, మల్లులు-మల్లురు, బాలుఁడు (లు)-బాలురు. వీరము-బీరము, బీభత్సుఁడు-విచ్చుఁడు ఇత్యాది తత్సమ తద్భవ రూపములందు వబల పరిణామము గానఁగును. మఱి యార్య ద్రావిడ భాషలలోను వ-బల కభేద పరిణామములు గానఁబడుచున్నవి. ఉ॥ విష్ణు-బిష్ణు, వంగ- బంగాళ, బిల్వ- విల్వ, వండి-బండి, వెల్లమ్-బెల్లము. మొ॥ ఈ యభేదస్థితి కారణమున వబ లకు; లడలకు లళల కభేద నామకయతిని లాక్షణికులు కల్పించియుందురు.

అప్పకవి చూపిన యితరుల లక్ష్యములు:-

ఆదిపర్వము సందు-(4-94)

చ. నుతజలపూరితంబులగు । నూతులు నూఱిటికంటె సూనృత
వ్రతయొక బావిమేలు మఱి । బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతువది మేలు నక్క్రతు శ । తంబునకంటె సుతుండుమేలు త
త్సుత శతకంబుకంటె నొక । సూనృతవాక్యము మేలు
చూడఁగన్.

వి. ఇందు 2-వ పాదమున 'వ బా' లకు యతి.

ఆరణ్య పర్వమునందు-(1-311)

క. ప్రతిబలదర్పభంజనుఁడు । పార్థుఁడు దారుణబాణ వర్షము
న్నతి నతిధీరుఁడై కురిసి । నం బరముండు మహాంబువృష్టిప
ర్వతము [1]గ్రసించునట్లు తన । బాహుల వానిఁ గ్రహించిపోర న
క్షత తనుఁడయ్యెవాని నతి । గర్వితుఁ బార్థుఁడు చూచి
యాత్మలోన్.

వి. ఇందు 3 పా. 'వ-బా' లకు యతి.
(పై రెండు నన్నయ భారత భాగములోనివి)
భీమన చాటుధార—

ఉ.* బిసరుహగర్భు వ్రాఁతయును । విష్ణుని చక్రము వజ్రివజ్రమున్
దెసలను రామబాణము యు । ధిష్ఠిరుకోపముఁ గాలుదండమున్
మసకపు పాముకాటును గు । మారునిశక్తియు మౌనిరోషమున్
బసవని రౌతుశూలమును । బండితవాక్యము రిత్తవోవునే. 91

వి. ఇందు మొదటిపాదమున 'బి-వి' లకు యతి.

చమత్కారమంజరి యందు—

ఉ. బంగరు దుప్పటంబు వలె । వాటుగ నొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁగోగల నమ । రించి తటాలునన్ద్రుంచెనా ధను
శ్శృంగుఁడుగోపయౌవతభు । జంగుడు మెచ్చితసంగుఁడుం గృపా
పాంగుడు దృప్తదర్పబల । భంజనయంత్రము మత్స్య
యంత్రమున్.

---

1. గ్రహించు.

* పాఠాంతరము—

చ. బిసరుహగర్భు వ్రాఁతయును । విష్ణునిచక్రము వజ్రివజ్రమున్
దశరథసూనుబాణమును । ధర్మజుకోపము మౌనిశాపమున్
మసకపు పాముకాటును గు । మారునిశక్తియుఁ గాలుదండమున్
బశుపతి కంటిమంటయును । బండితవాక్యము రిత్తవోవునే.

ఇందు శ-స లకుఁ బ్రాస గూర్చఁబడియున్నది. శ స ప్రాస సమ్మతింపని వారు ఈ పాఠమును మాని పై పాఠమును జేర్చియుందురు. శ స ప్రాస యప్ప కవి కిష్టముగాదు.

వి. ఇందు మొదటిపాదమున 'బ-వా' లకు యతి.

తే. పెద్ద లాకును దనకు న । భేదమగుట
ళళ లకు నభేద మట్లన । కలుగు కతన
క్షితిని మూఁడవ సరళంబు । యతులఁ బ్రాస
ములను లఘ్వలఘు లకార । ములకు నిలుచు. 93

టీ. పెద్ద లా-ళకారము. దీనికి దొడ్డ లకారమనియుఁ బేరు గలదు; తనకు- ఇందు డకారమునకని యర్థము, మూఁడవ సరళంబు-డకారము(గ జ డ ద బ లు-సరళములు), లఘు + అలఘు లకారములు-లకార ళకారములు.

వి. ళకారమునకు డకారమునకు అభేద ముండుటచేతను, మఱి యట్లే లళ లకు అభేదము కలుగుటచేతను డకారము లళలతో యతి ప్రాసలందుఁ జెల్లుబడి యగును. ళడల కభేదము; అట్లె లళల కభేదము. ఈ యభేద ద్వయముచే లళ డల మూఁటి కభేదయతి చెల్లునని భావము. యతియందే కాక ప్రాసలోను జెల్లునని యీ లక్షణము ప్రసక్తానుప్రసక్తముగాఁ జెప్పుచున్నది.

విశే. 'పెద్దళా' యని యప్పకవీయ ముద్రితపాఠము. 'ళా' అనిచెప్పినఁ జాలును లేదా 'పెద్దలా' యనవలెను. లకారమునఁ బెద్దది అనఁగా అలఘూచ్చారణము గలది ళకారమనుట. 'పెద్దళా' పొరపాటు.

సంస్కృతాంధ్రములలో పెద్ద లాకు (ళకారమునకు) డకారమునకు నభేదము కలదు. వ్రీడ-వ్రీళ, చోడ-చోళ, వ్యాళ-వ్యాడ, ఇత్యాది సంస్కృత శబ్దములందును, పవ్వడించు-పవ్వళించు, వళి-వడి మున్నగు తెనుఁగు పదము లందును ళడల కభేదము గలదు. మఱి యట్లే కలంక-కళంక, మిలిత-మిళిత, అలి-అళి మున్నగు సంస్కృత శబ్దములందు లళల కభేదము గలదు. ఇట్లుద్వైరూప్యము గల శబ్దములందే లళడల కభేదయతిప్రాసలు చెల్లునని భావింపరాదు. ఈ యభేదకారణమున లళడల కన్నింటికి యతిప్రాసలు చెల్లునని యెఱుఁగ జనును. అట్లుగాదేని యీ యతిభేదమునకు ప్రయోజనము లేక పోవును. 87వ లక్షణ పద్యమున లడలకు లళలకు నని మాత్రము యభేదయతి చెప్పుటచే నీ 93 వ లక్షణ పద్యమున ళడల మైత్రిని నిర్వచించినాఁడని తెలియుచున్నది.

ఇందుల కప్పకవి చూపిన యితరుల లక్ష్యములు :—

అనంతుని ఛందమునందు డ-శలకు - (1-95)

క. కాకు స్వర యతి యగు నితఁ
దే కదలక జలధిఁ బవ్వ। ళించె ననఁగఁ ప్రా
శ్నాకలిత దీర్ఘమున నితఁ
దే కవ్వడి రథముఁగడిపె। నిమ్ముల ననఁగన్ 94

వి. ఇందు 2 పా. డ-శ లకు యతి (దే-శి)

విశే. ఈ లక్ష్యమున నొకవిషయము గమనింపఁదగినది. ఈ పద్య మనంతుని ఛందమునఁ గాకుస్వరయతికి లక్ష్యముగా రచింపఁబడినది. కాకుస్వర స్థలమున నుభయయతి చెల్లును. అనంతుఁడు దీని నుభయయతిలోఁ జెప్పినాఁడు. 'ఇతఁడే' అనుచోటఁ గాకు స్వరముగలదు, గాన నందు 'దే' యను వ్యంజనమునకుఁ గాని, (ఇతఁడు+ఏ) దేలోని ఏకార స్వరమునకుఁ గాని యతి గూర్పవచ్చును. పై యనంతుని పద్యమున 2 వ పాదమున హల్లునకు (దే శి) ; 4 వ పాదమున స్వరమునకు (ఇతడు+ఏ... +ఇమ్ముల) వడిచెల్లింపఁబడినది. రెండవ పాదమున హల్లుతో యతి చేయఁబడుటలో 'డ-శ' లకు మైత్రి గలదు. అద్దాని నప్పకవి యిం దభేదయతి లక్ష్యముగా సంగ్రహించె. 'పవ్వళించు' అనుటకు 'పవ్వడించు' అను రూపాంతరము గలదు. గాన శడల మైత్రి కిది నిర్ధారక ప్రయోగము గానేరదు. 'పవ్వడించు' అను పాఠము పఠించినచో శడల మైత్రి కానస్కారము లేకపోవును. అనంతుని నిక్కమగు పాఠమేదో? అనంతుఁ డిం డభేదయతి చెప్పఁదలచినఁ వాడు గాఁడు. మఱి యనంతుఁ డభేదయతిలో శడలు చెప్పఁడయ్యె. ఇవియన్నియుఁ బరికించిన నప్పకవి యీ యనంతుని పద్యముదాహరించుట యిందులకుఁ ప్రామాణికముగాఁ గైకొనఁ వీలులేదని చెప్పవలసి యున్నది.

ల-శ లకు నాదిపర్వమునందు-(4-42)

చ. అలసత నోరగాఁ దరుణి। యమ్మునిపుంగవు ప్రోలనున్న నా
మిళిత సుగంధ బంధుర స।మీర వశంబునఁదూలి బాలపై
వలువెడల న్బయల్పడియె। వల్గకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దర। శ్రీతివళీయుత రోమరాజియున్. 95

వి. ఇందు 4వ పాదమున లశ లకు యతి గలదు.

విశే. మఱి యిందు లశ ప్రాస మైత్రియు నెలయుచున్నది. (అలసత మిళిత), కాని యిది ప్రాసప్రకరణము గాదు. అప్పకవి దీనిని ప్రాస ప్రకరణములో నభేదప్రాసలోఁ జెప్పుచున్నాఁడు.

నిర్వచనోత్తర రామాయణమునందు-(1-26)

శా. చేసేతం బృథివీశు లందుకొనఁ గా । శీ పుణ్య తోయంబునన్
జేసెన్మజ్జన ముంగుటంబున హరిం । చెన్ బల్ల వోర్వీశు ను
ల్లాసంబైతగ ఫాలలోచనము లీ । లంగట్టెఁ గావేరి వే
లాసాధ్యాఖిల దిఙ్ముఖుండు కలికా । శక్ష్మావిభుం డల్పుఁడే॥

ఇందు 4 వ పాదమున 'లా-శ' లకు యతి

పారిజాతాపహరణమునందు-(1-60)

మ॥ అలినీలాలక నీవు నీవతి రహ । స్యక్రీడ వర్తించు వే
శ లతాంతాయుధు సంగరంబునకు ను । ల్లాసంబు గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమ తనూ । సంజాత ధారాళ ఘ
ర్మ లవంబుల్ దొలఁగింపఁగా సురటియై । రంజిల్లు నిచ్చారతిన్.

వి. ఇందు 2 వ పాదమున 'శ ల'కు యతి.

విశే. అప్పకవి చూపిన లక్ష్యములందెల్ల శకారస్థానమున లకారము పఠింపవచ్చును. 95 ప. లో తరళ - తరల. 96 లో కాళ - కాల, 97 లో వేళ - వేల అనురీతి ద్వైరూప్యము గలదు. మీఁదు మిక్కిలి సంస్కృతలిపిలో వీనియందెల్ల లకారము వ్రాయుటే సంప్రదాయము. కాన నిట్టివి నిర్ధారక ప్రయోగములు కావుటకు సమర్థములు గావు; కూళ. దళవాయి. బళిర, సాళువము. మేళము. బెళుకు మున్నగు నచ్చతెనుఁగు పదములందు శకారము సిద్ధము. ఇట్టి శబ్దములం లోని శకారము లకారమునకు యతిచేసిన లళ యతికుదాహార్యమగుట యుక్తము. అప్పకవి స్వీయోదాహృతిలోఁగూడ శకారస్థానమున లకారమును పఠింపవచ్చు.

'లలితదేహ పింగ + శ (ల)పురపక్షిణగేహ.'(88-పద్యము)

88 ప. టీ. వసుమతీ కళత్ర-భూదేవిని భార్యగాఁ గలవాఁడా, బక జైత్ర-బకాసురుని జయించినవాఁడా (అనఁగా జంపినవాఁ డనుట), గాన కలాలసత్కలాప- వేణుగాన విద్యచే లేదా గానకళచేఁ బ్రకాశించు ప్రోడ. డంభగోప-కపట గోపాలుఁడా (కపటో-స్త్రీ వ్యాజదంభోప ధయశ్ఛద్మ కైతవే-అమరము: దంభ డంభ శబ్దములు రూపభేదములు గలవని యెఱయనగు. కాని సంస్కృతమున దంభధాతువు గలదు. డంభధాతువు గానరాదు. మఱి సంస్కృత నిఘంటువులలోఁగూడ డంభశబ్దము గనబడదు. కొంద రాంధ్ర కవులు మాత్రము డంభశబ్దము ప్రయోగించియున్నారు॥

డంభాచారము బుజ్జగించి రిపు గాఢ ప్రీతి నిర్జించి
(కావ్యా. చూడా-2-132)

డంభమయాస్య దర్శన వి. డంబను దష్టమదాపహారి (వృష-84).
అప్పకవియే డంభ దంభ శబ్దద్వైరూప్యమును జూపియున్నాఁడు.
'డంభ డిండీరడోలికా-డాడిమాది, శబ్దముల కాదివర్ణంబు సంస్కృతమున
మపరివర్గ తృతీయమై-యొప్పునట్లు, తెనుఁగున దకారము దవర్ణమొనరు
చుండు (1-148)

సీ. డంభ మిచ్చుటను గూఁ - డదు కృష్ణ నీవేఁగి
దంభంబు మిత్రమిం - ద కడఁజేయు (అప్ప-2-147)

## 23. అభేదవర్గయతులు

క. తన [1] కఱలేని బకారం
బునకు స్వవర్గజములైన । మొదలి లిపుల రెం
టను పైలిపినొకటను వా
యను వ్రాయి యభేదవర్గ । యతినా నెనయున్. 98

వి. అఱలేని భేదములేని, అభేదమైన, బకారంబునకు స్వవర్గములైన మొదలి లిపులు రెంటను ప ఫలు (ప ఫ బ భ మ-ప వర్గము). పైలిపి భకారము, వా యను వ్రాయి- 'వ' యను నక్షరము అనఁగా వకారము. వకారమునకు బకారము అభేద యతిచేఁ జెల్లును. ఆ బకారమునకుఁ దద్వర్గజములైన 'ప ఫ భ' లు చెల్లును గాన వకారమునకును బకారమే కాక ప ఫ భ లును జెల్లునని భావము. దీనికభేదవర్గ యతి యనిపేరు. ప ఫ బ భ లు నాలుగు వకారముతోఁ జెల్లునని ఫలితార్థము. అభేదయతి వ బలకు మాత్రము మైత్రిని జెప్పును. అభేదవర్గయతి ప ఫ బ భ వలకు మైత్రిని దెల్పును. ఇందు వర్గమున కభేదత కలుగుటచే దీని కభేదవర్గయతి యని నామకరణము చేయఁబడెను.

విశే. వబయోరభేదః. అన్నట్లు 'వపయోరభేదః' అనుటయుఁ గలదని కొన్ని ఛందములవలనఁ దెలియవచ్చెడు. (చూ. సులక్షణ-146. రంగరాట్ఛందము-3-285).

వ బ లకున్నట్లు 'వ ప' లకును రూపాంతర పరిణామములు తత్సమ తద్భవములం దార్యద్రావిడభాషలయందుఁ గానవగును. ఉ॥ ద్రౌపది ద్రోవది, ద్వీప దీవి, వాపి బావి, నెపము నెవము: పాపి-పావి (తమిళము). తెలుఁగు సంధి యందుఁగళలపైని పకారము వకారమగును. ఉ॥అతడు + పలికె-అతఁడు వలికె (గసడదవాదేశసంధి) ఈ కారణములచే నభేదయతితో నభేదవర్గయతియు నేర్పడెనని తలంపనగును.

---

1. తనకరలేని - పూర్వముద్రణ పాఠము.

అభేదయతి, అభేదవర్గయతి యని రెండుగాఁ జెప్పుటకన్న అభేదయతి యొక్క భేదముగానే చెప్పి, యందే ప ఫ బ భ వలు చెల్లునని పేర్కొన్నఁ జాలును. అప్పకవి యొక్కఁడే దీనిని రెండుగాఁ జెప్పినాఁడు.

ఈ యభేదవర్గయతి కప్పకవి స్వీయలక్ష్య మొసఁగలేదు. అతఁడు చూపిన యితరుల లక్ష్యములు.

ఆదిపర్వమునందు-(1-126)

ఉ. ప్రల్లదుఁడైన యొక్కకుల । హింసను చేసినదానఁ దల్కులం
బెల్లను దూషితంబగుట । యేమి యపూర్వము కావున న్మహీ
వల్లభ తక్షకాధము నె । వంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతి । ధీయుత సేయుము విప్రసమ్మతిన్.

వి. ఇందు 3-పా. 'వ-ప' లకు యతిమైత్రి.

అందే-(2-172)

క. ఉరగ కళేబర మంసాం
తరమునఁబడి వ్రేలుచునికిఁ । దలఁపక యచల
స్థిరుఁడై పరమధ్యానో
పర తేంద్రియవృత్తి నున్న । వాని శమీకున్. 100

వి. ఇందు 4పా. 'ప-వ' లకు యతి,

అరణ్యపర్వమునందు - (1-571)

క. కోరి యనేక యుగంబుల
పారతపోయుక్తులైన । వారికిఁ బడయన్
దూరము నీసభ మఱి నీ
కారుణ్యము నంతకంటెఁ । గడు దవ్వెందున్. 101

వి. ఇందు 2-పా, 'ప-వ' లకు యతి,

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు—

క. మురసంహరునాటోప
స్ఫురణమ్మునకున్ సదాశి । వుండైన రణ

స్థిర నిలువఁగలఁడె బాపా
సురునకుఁ దోడుపడవచ్చి । సొలయుట వినరే. 102

వి. ఇందు 2. పా.ప వ లకు (స్ఫులోని ఫు-వు లకు) యతి.
ఆదిపర్వమునందు (8-29)

మత్త. ధీరులీధృతరాష్ట్రపాండు ల । ప్రశస్తగుణప్రసి
ద్ధోరు కీర్తులు నాకు నిద్దఱు । నొక్క రూప తలంపఁగా
వీరువారనునట్టి బుద్ధి వి । భేద మెన్నడు లేదుఁ గాం
ధారిపుత్ర శతంబునందుఁ బృథాతనూజుల యందునున్. 103

వి. ఇందు 3-పా. వ-భ లకు యతి.

విశే. ప్రాచీనలక్షణగ్రంథములయిన కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణులలో అభేదయతి చెప్పఁబడలేదు గాన, నీయతి ప్రాచీనమతము గాదని నేఁడు గొందఱు భారతమునుండి యభేదయతి కొనఁగిన లక్ష్యములలో పాఠాంతరములు పఠించి యభేదయతి లేదందురు. ఆ పాఠభేదము లీక్రిందివి :

ప. 89 సూనృత : వ్రత యొక బావిమేలు మఱి - వావులు
(బావులు పూ. పా.)

ప. 90 పర్వతము గ్రసించునట్లు బల - వంతుఁడు
(తన బాహుల. పూ. పా.)

ప. 99 వల్లభ తక్షకాధము నె - వంబున (నెపంబున పూ. పా.)

ప. 100 ధ్యానా - వలతేంద్రియవృత్తి నున్న - వాని
(ధ్యానోపరతేంద్రియ పూ. పా.)

ప. 101 అ, వారతపోయుక్తులైన - వారికి (అపార-పూ. పా.)

ప. 103 వీరువారను నట్టి బుద్ధి వి । వేక మెన్నఁడు
(విభేద మెన్నఁడు. పూ. పా)

అభేదయతి నివారించుటకై చెప్పఁబడు పాఠాంతరములు సహజములుగ స్వరసములుగఁ జూపట్టకున్నవి. ఈ పాఠాంతర సామంజస్యమెట్లున్నను గవిత్రయేతరకవులెల్లరు ననంతాది లాక్షణికాగ్రణులందఱు అభేదయతి నంగీకరించిన వారనుటలో సందియములేదు.

## 24. ఊష్మవిశ్రాంతులు

తే. అంత్యవర్ణంబుఁబాసి యూ । ష్మాక్షరంబు
లూష్మవిశ్రాంతులనఁజెల్లు । నొకటి కొకటి;
శతమఖోపల భూషాను । షంగ యనఁగ
షడ్జయుత వేణునాద ప్ర । సంగయనఁగ. 104

వి. శ ష స హ లూష్మము లనఁబడును. ఇందుఁ దుదియక్షరమగు హకారము తక్కఁదక్కిన శ ష స లు మూఁడు పరస్పరము యతి చెల్లును. శ ష స లూష్మాక్షరములగుటచే నీ యతి కూష్మ విశ్రాంతులను పేరొసఁగబడినది.

కవి వ్రాసిన పై పద్యములో నుత్తరార్థము లక్ష్యమగును.
3-పా. శ-ష లకు; 4-పా. 'ష-స' లకు యతి చూపఁబడినది.

ఈ యతి యత్రప్రసిద్ధము నతిప్రచారమునను తలంపునఁ గాఁబోలు దీని కితరుల లక్ష్యములు చూపఁబడలేదు.

విశే. 'శ ష స క్' అని మహేశ్వరసూత్రము. శ స లకు హకారమున కుచ్చారణలో స్థానభేదమున్నది. అందుచేతనే యూష్మయతిలో హకారము చేరదయ్యె. ఆశ-ఆస. దిశ-దెస, భాష-బాస, వేషము-వేసము అని తత్సమతద్భవ రూపములలో శ ష లకు సత్వము వచ్చును. ప్రాకృతవ్యాకరణమున 'శషోస్సః' అను సూత్రము వీని యభేదతను దెల్పును. సంస్కృత సంధులలో శ్చుత్వష్టుత్వ విధానములందు సకారమునకు శ ష లాదేశములగును. రషస్ + చక్ర-రషశ్చక్ర ధనుస్ + టంకార-ధనుష్టంకార(వి + సమ-విషమ-ఇత్యాది స్థలములందు సత్వమునకు షత్వమువచ్చును. కొండఅమరమున శ సల కభేదముగలదు. (శసయోరపి)
ఈ కారణములచే శ ష స లకు యతిమైత్రి యేర్పడియుండునని దలంపనగును.

క్రింద సరసవళియందు శ ష స లు చ ఛ జ ఝ లతోఁ జెల్లునని చెప్పఁబడుటచే నీ యతిభేద మనవసరమనఁ జెల్లును. ఇతర లాక్షణికు లీ యూష్మయతి నిట్లు ప్రత్యేకముగాఁ జెప్పరైరి.

## 25. సరసవళులు

క. హయలత్వమునకు, శషసలు
నయనర్తన చఛజఝులకు, । నలి మధ్యమ వ
ర్గయుతానునాసికము ని
శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు । సరసవళులనన్. 106

వి. నయవర్తన (సంబుద్ధి) నీతియుక్తవర్తనముగలవాఁడా; మధ్యమవర్గయుతానునాసికము మధ్యమవర్గము, టవర్గము, టవర్గానునాసికము ణకారము; ద్రుతము-నకారము.

అకారమునకు హయలు చ ఛ జ ఝ లకు శ ష స లు, నకారమునకు ణకారము యతి చెల్లును.

ఇందు మూఁడు వర్గములు గలవు. అనఁగా మూఁడు యతిభేదములు గలవనుట.

(1) అ య హ లు. (2) చ ఛ జ ఝ శ ష సలు. (3) న ణలు.
ఇందొకదానికి మఱొకదానితో సంబంధములేదు. కాని యీ మూఁటిని జేర్చి లాక్షణికులెల్లరు సరసయతిలోనే చెప్పిరి.

ఈ యతిమైత్రి ప్రసిద్ధము గాన నితరకవుల లక్ష్యములు చూపఁబడలేదు. అప్పకవి చూపిన స్వీయోదాహృతులు;

తే. హరిహయాది సురాధ్యక్ష । అంబుజాక్ష
యతి జనమనోంబుజ విహార । అఘవిదూర
నరకదైత్యవిరోధి ఘృ । ణాపయోధి
యనఁగ సరసాఖ్యవళ్యుదా । హరణములగు. 106

తే. శకటదానవ సంహారి । చక్రధారి
షట్పదశ్యామమూర్తి స్వే । చ్ఛా ప్రవర్తి
స్వర్ణ పటపరిధాయి ఘ । జంగశాయి
కరుణననుఁ బ్రోవు మనవయ్యే । సరసవళులు. 107

106 పద్యములో 1-పా. 'హ-అ' లకు, 2-పా. 'య-అ' లకు యతి'
3-పా. 'న ణ' లకు యతి.

107 పద్యములో 1-పా. 'శ-చ' లకు, 2-పా. 'ష ఛ' లకు, 3పా. 'స(స్వ)-జ' లకు యతిమైత్రి.

ఈపద్యము మూఁడు పాదముల మొదట వరుసగ 'శ ష స' లున్నవి' యతిస్థానమున చవర్గాక్షరములున్నవి. దీనివలన శ ష స లన్నింటికి చ ఛ జ ఝ లన్నియుఁ జెల్లునని యెఱుఁగవలెను.

టీ. హరిహయాది సుర + అధ్యక్ష-ఇంద్రాదిదేవతలకుఁ బ్రభువా! ఘృణా పయోధి-కరుణాసముద్రుఁడా! షట్పదశ్యామమూర్తి - తుమ్మెదలంబోలి నల్లని వన్నెగల యాకారముగలవాఁడా.

విశే. ఈ యతిమైత్రి యేర్పడుటకుఁ గొన్ని కారణములు :

(1) అత్తనకు సంధి రానిచో యకారాగమము వచ్చును. ఉ॥ మేన + అత్త-మేనయత్త. హంస-అంచ, హర్షము-అరుసము-ఇత్యాదులలోఁ బ్రకృతిలోని హకారము వికృతిలో అకారమగును.

ఈ సంబంధముచే అ య లు, అ హ లు చెల్లును. ఋఱుయతిచే యహల మైత్రి చెప్పఁబడినది. కాన అయహలు మూఁడు పరస్పరము చెల్లుబడియయ్యె.

యహలు-హల్లులు : అకారము స్వరము. అచ్చులకచ్చులును హల్లులకు హల్లులును యతి చెల్లుట సహజము. కాని యిందు స్వరవ్యంజనములకు మైత్రి గమనింపఁదగును. ఇట్టి స్వరవ్యంజన మైత్రి ఋవళియందును గలదు. (ఋ-రి) యహలు స్వరవిశిష్టములగుఁ గాన అత్వవిశిష్టములగు యహలు అకారమునకుఁ జెల్లును. అనఁగా అ ఆ ఐ ఔ లతోఁ గూడిన యహలు అ ఆ ఐ ఔ లకుఁ జెల్లునని యెఱుఁగవలెను. అట్లే ఇకారాది స్వరవిశిష్ట యహలు ఇకారాది స్వరములకును, ఉకారాది స్వరవిశిష్ట యహలు ఉకారాది స్వరములకు జెల్లునని గ్రహింపఁదగును.

ఆ మైత్రి యిట్లుండును :

(1) అ ఆ ఐ ఔ - య యా యై యౌ - హ హా హై హౌ.

(2) ఇ ఈ ఋ ౠ ఎ ఏ-యి యీ య్ృ య్ౄ యె యే-హి హీ హృ హౄ హె హే.

(3) ఉ ఊ ఒ ఓ-యు యూ యొ యో-హు హూ హొ హో;

(2) చ ఛ జ ఝ లు వర్గయతిచేతను, శషసలూష్మ యతిచేతనుమిత్రములు. ఈ రెండు వర్గము లొండొంటికిఁ జెల్లుబడి యగుటకుఁ దెనుఁగునందలి గసడదవా దేశ సంధి విధానమును (వాఁడు + చనియె - వాఁడు సనియె; కాలు + చేయి-కాలుసేతులు), ప్రకృతి వికృతి పరిణామమును (హంస - అంచ, శంక -జంకు

శుక్ర-చుక్క, కలుష-కలుచ). సంస్కృతచ్ఛత్వసంధి ప్రకారమును (వాక్ + శివ వాక్ఛివ; తత్ + శబ్ద - తచ్ఛబ్ద) గొంతపజ కాకరములై యుండును.

(3) సంస్కృతమున నేకపదమందు ఋ ర ష ల మీఁది నకారము ణత్వమగును. (రషాభ్యాంనోణస్సమానపదే) నార + అయన నారాయణ, రామ + అయన - రామాయణ, ప్ర + అన - ప్రాణ-మొ. ణత్వవిధాయక సూత్రములు సంస్కృతమున మఱికొన్ని కలవు.

ప్రకృతి వికృతులందు నణల పరిణామము గానవచ్చును
ఉ॥ గుణము - గొనము, విజ్ఞానము - విన్నాణము;
ఈ కారణములచే నణయతి యేర్పడియుండును.

ఈ యొక్క సరసవళిలో నప్పకవి ప్రత్యేకముగాఁ జెప్పిన ఋజుయతి, వర్గయతి, ఊష్మయతి యంతర్గతములై యున్నవి. 'ఋజుయతి, ఊష్మయతి' సరసయతి చేతనే గతార్థములగుట గాన వానిని ప్రత్యేక యతిభేదములుగా నప్పకవి పేర్కొనుట యనవసరము.

సరసవళియను పేరు దీని కిడుటకుఁ గారణము స్పష్టముగాకున్నది.

ఈ యతిలో మూఁడు భిన్నవిషయము లొక్కచోఁ జేరుట సరసతయని యెన్ననగు. భిన్నవిషయము లనఁగాఁ ప్రతిగణమందును, భిన్నవర్గత.
అయహలు - అకారము స్వరము, యకారమంతస్థము, హకారమూష్మము.
చ - శ లు - చ వర్గము ఊష్మము.
న ణ లు - భిన్నవర్గానునాసికములు.
వీని కేకత్వము (మైత్రి) సరసముగా సాధింపఁబడిన గాన నిది సరస యతి యనఁ బరఁగెనదేమో?

భీమనాది సర్వలాక్షణికులు సరసవడి యనుపేరే చెప్పిరి - కావ్యాలంకార చూడామణిలో మాత్రము దీని కితరేతరవర్గజవళియను పేరుగలదు.
ఈ రెండవ పేరు సార్థకమనఁ జెల్లును.

## 26. సంయుక్త విశ్రామములు

ఆ. ఒకటిరెండు జడ్డ । లుండెడు వర్ణంబు
విశ్రమస్థలమున । వెలసెనేని
యవలదాని కెద్ది । యైన సంయుక్త వి
శ్రామసంజ్ఞ చేఁ బొ । సంగు చుండు. 108

తే. క్ష్మాధరం బాతపత్త్రింబు । గా ధరించె
క్ష్మా కుమారుని బోరను । సంహరించె
క్ష్మా రుహంబునకై నిలిం । పవతి నోంచెఁ
జక్రియనిన సంయుక్త విశ్రామములగు. 109

వి జడ్డయనఁగా సంయుక్తము. అనఁగా హల్లుతో మఱియొక హల్లు కూడియుండుట. రెండుగాని యంత కెక్కువగాని హల్లుల కూడిక సంయుక్త మగును. అట్టి సంయుక్తము పాదాదియందుఁగాని యతి స్థానమందుఁగాని యున్నచో నందేదే నొక్క హల్లునకు యతిమైత్రిఁ గూర్చినఁ జాలును. సంయుక్తములోని హల్లుల కన్నిటికి యతి చేయనక్కరలేదు.

109 వ పద్య మప్పకవి స్వీయలక్ష్యము. అందుఁ బాదాదిలో 'క్ష్మా' యను సంయుక్త మున్నది 'కషమ' లను మూఁడు హల్లు లందుఁ గలవు. కాన క్ష్మాకు యతిస్థానములలో వరుసగ 'క-ష-మ' వర్ణముల నిల్పి లక్ష్యసమన్వయము చేయఁబడినది.

1-పా లో 4క్ష్మాలోని కకారమునకు, 2-పా లో క్ష్మాలోని షకారమునకు
3-పా లో క్ష్మాలోని మకారమునకు యతి గూర్పఁబడినది.
1-పా. లో క్ష్మా-గా (వర్గయతి)
2-పా. లో క్ష్మా-స (ఊష్మయతి)
3-పా. లో క్ష్మా-ంప (బిందుయతి)
ఇందొక్కొక్క పాదములో నొక్కొక్క హల్లుతో మైత్రి చేయఁబడెను.

అప్పకవి యుదాహరణార్థము వ్రాయఁదలఁపకున్నను 108-ప. లో— 4-పా. 'శ్రా-స' లకు, 109లో 4-పా.లో 'చ-శ్రా' లకు సంయుక్తయతి గలదని యెన్నునది.

ఒకటి రెండు జడ్డలని యప్పకవి చెప్పినది, యుపలక్షణముగా గ్రహింప వలె. ఎన్ని హల్లుల సంయుక్తమే నుండవచ్చు. (కార్ష్ణ్య. కార్త్స్న్య-ము)

'క్ష్మా'లో మూఁడు హల్లు లున్నవి. రెండని భ్రమింపరాదు. కొందఱు క్షకారము ప్రత్యేకాక్షరముగాఁ దలంతురు. అయ్యది పొరపాటు. క్షకారము కషల సంయుక్తము. సంస్కృతవ్యాకర్తలు నిఘంటుకారులును క్షకారమును షాంతమందే పఠించిరి. పాణినియు వర్ణసమామ్నాయములో దీనిని గ్రహింప లేదు. తెనుఁగులో అనంతుఁడు మాత్రము క్షకారమును వర్ణాంతరముగా గ్రహించె అప్పకవి దాని నిట్లాక్షేపించినాఁడు;

'కాకుషా జడ్డయైన క్షకారముగుట, దలఁప కేఁబదిలిపులలో దానిఁగూర్చి తొలుత భిన్నాక్షరంబైన దొడ్డశాను, విడిచిపెట్టె ననంతుడ వెఱ్ఱిగాఁడె.

క్షకారము సంయుక్తాక్షరమగుటచే నప్పకవి దీనిని ప్రత్యేకముగాఁ బేర్కొనలేదు. 'క్షాకును క ఖ గ ఘ ల్ చ ఛ జ ఝ ల్ శ ష స లు' అని సులక్షణసారమున క్షకారయతి స్పష్టము చేయఁబడియె.

## బహుయతి నియతి

క. ఏకపదంబున విరతు ల
నేకంబులు గలిగియుండు । నేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ
బ్రాకటముగ నిలుచు సీస । పదములఁ దక్కన్. 110

ఆ. ఒక్కపదములోనఁ । బెక్కు విశ్రమములు
జఱుగుచోట మొదల । జడ్డలున్న
నడుగు వెడలు దనుక । నం దొక్కటియ కాని
యుండ దొకట నదియు । నొకట నిదియు. 111

జయభద్రదరగడ.

క్ష్మాపుత్రికాలోల । కమనీయ గుణజాల
ఘననీలయని చెప్పఁ । గా బహు విరతులొప్పు.
క్ష్మాపాలకలలామ । కంధిగర్వవిరామ
సంగ్రామ భీమ యన । మహిని రెంటికిఁదప్పు. 112

వి. ఒకపాదముననే పెక్కుయతులుగల పద్యములలో (స్రగ్ధరాదులలో) ఆదిలో సంయుక్తముండునేని దానిలో నేయక్షరమును మొదటి యతిస్థానమున నిలుపుదుమో యాయక్షరమునే యాపాదములోని తర్వాతి యతిస్థానములందు నిలుపవలయు, అనఁగా సంయుక్తములో నేయక్షరమునకుఁ బ్రథమ యతిస్థానమున మైత్రి చేయఁబడునో యా యక్షరమునకేకాని తక్కిన యక్షరములకుఁ దర్వాతి యతిస్థానములందు మైత్రి చేయరాదని యెఱుఁగవలెను, ఈ యతి నియతి స్రగ్ధరాదివృత్తములందుండును గాని సీసపద్యపాదమం దుండదు. అందు చేతనే సీసపదములఁ దక్కనని యప్పకవి చెప్పినాఁడు.

సీసపద్యపాదమునకు 8 గణములుండును (6 ఇంద్ర + 2 సూర్యగణములు) పాదమును రెండు సగములుగా గ్రహించి యందొక్కొక్క సగమునందు మొదటి యక్షరమునకు రెండు గణములమీఁద యతి నిలుపవలయు.

1-3 గణముల ప్రథమాక్షరముల కొకయతి, 5-7 గణముల ప్రథమాక్షరముల కొకయతియు నుండును. పూర్వదళ యతికి నుత్తరార్ధయతికి సంబంధములేదు. పాదప్రథమాక్షరమే పాదము పూర్తిగా యతి వేయఁబడవలెనను నియమములేదు.

'మందార మకరంద - మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే - మదనములకు'

అను పాదమందువలెఁ బాదాద్యక్షరమునకుఁ దక్కిన మూఁడుచోట్ల యతి చేయ నక్కరలేదు. ఇది కవి యనుప్రాసప్రీతిచేఁ గూర్చినది.

రెండు సగములందు విభిన్నయతికి భారత సీసపద్య పాదోదాహృతి ।
ఈతని వృద్ధిని । యెఱిఁగి పూజించితే,
వసుదేవుఁ డుండంగ ! వసుమతీశ.

పూర్వార్ధమున 'ఈ-ఎ' లకు, నుత్తరార్ధమున 'వ-వ' లకు వేర్వేఱు యతులు.

బహుయతులు గల పద్యములు- స్రగ్ధర, మహాస్రగ్ధర, మానిని, కవి రాజ విరాజితము, సరసిజము, క్రౌంచపదము, మంగళమహాశ్రీ, తరువోజ, విజయ భద్రరగడ, విజయమంగళరగడ మున్నగునవి.

బహుయతి నియతి తప్పకవి యొసఁగిన స్వీయోదాహృతి (112పద్యము) జయభద్రరగడ యని యిందున్నది; అప్పకవి రగడభేదములలో దీనిని విజయ భద్రరగడయని పేర్కొన్నాఁడు. విజయభద్రరగడలోఁ బ్రతిపాదమున 8 పంచ లఘుగణములుండును; రెండేసి గణములపై మూఁడుచోట్ల యతులుండును.

పై జయభద్రరగడ పాదద్వయము మొదట 'క్ష్మా' యను సంయుక్తము గలదు ప్రథమపాదమున 'క్ష్మా' లోని కకారమున కొక్కటికే తర్వాత మూఁడు యతిస్థానములందు మైత్రి చేయఁబడినది.

'క్ష్మా-క-ఖ-గా'

ఇందుచేత సర్వత్ర 'క్ష్మ' లోని కకారమున యతి. ఇది సరియైన పద్ధతి.

రెండవపాదమున 'క్ష్మ' యను సంయుక్తమునకుఁ బ్రథమయతిస్థానమున కకారము, ద్వితీయ యతిలో సకారము, తృతీయ యతిలో మకారము నిలుపఁబడియున్నవి.

ఇందు సర్వత్ర ఏకాక్షరమైత్రి పాటింపఁబడలేదు. గాన నిది తప్పు. పై లక్ష్యములోఁ బ్రథమపాదము బహుయతి నియతి కుదాహరణమును, ద్వితీయ పాదము ప్రత్యుదాహరణమునగును.

తే. ఒంటియడుగున బహుయతు । లుండునపుడు
నడుమ నొకదాన జమిలి వ । ర్ణంబుగదియ
నందుఁ జరణాదికి సవర్ణ । మయ్యె నెద్ది
[1]దాని కయనిల్చు విరతి ముం । దరను గృతుల. 118

వి. బహుయతులుండునపుడు పాదాదిసంయుక్తమునకు మైత్రి యెట్లు గూర్పవలయునో యింతకుముందు చెప్పఁబడినది. మఱి యిందుఁ బాదమధ్యమున సంయుక్తమున్న నెట్లు మైత్రిసేయవలెనో చెప్పఁబడుచున్నది.

బహుయతులుగల పద్యము పాదములో మధ్య యతిస్థానములో సంయుక్త ముండునేనిఁ బాదాద్యక్షరమునకు సవర్ణమైన యక్షరమే సర్వత్ర (అనఁగా ముందర వెనుకల) నిలుపవలెను. అనఁగా సర్వత్ర నేదో యొక యక్షరమునకే యతి గూర్పవలయును. సంయుక్తములోని యక్షరములో నీవలనొకటి యావల మఱొకటి నిలుపరాదని యెఱుఁగవలెను.

ఇందుల కప్పకవి యొసఁగిన స్వీయలక్ష్యము :

విజయమంగళరగడ.

వైరిమదతమఃపతంగ । స్వజనపోషితాంతరంగ
వ్రజవధూభుజంగ యనఁగ । నలయుఁబెక్కు వడులయెడల
దారితక్షమాకుమార । ద్వారకాపురీవిహార
వ్యాసనన్నుతప్రచార । యనఁగదప్పు కడకు వెడల.

ఇందుఁ బ్రథమపాదమున రెండవ మూఁడవ యతిస్థానములలో 'స్వ, వ్ర' అను సంయుక్తములున్నవి. పాదాదిలో వకారమున్నది. ఆ వకార మన్ని యతిస్థానముల లోనున్నది.

'వై + స్వ + వ్ర + వ' ఇది బహుయతి నియతి కుదాహరణము. ఇందు రెండవపాదమున యతిమైత్రి యిట్లున్నది :

'దా + ద్వా + వ్యా + య'

---

1. దానికే నిల్చు—అని యుండుట యుక్తము.

ఇందు 1, 2 స్థానములలో దకారమున్నది. 3, 4 స్థానములలోఁ బాదాది దకారమైత్రిలేదు. 2, 3 స్థానములలో వకారమున్నది. 3-4 స్థానములలో యకారమున్నది. ఈరీతి భిన్నభిన్నముగా యతిమైత్రి సంయుక్తయతి నియతిలోఁ బొసంగదు. పాదాద్యక్షరమున కన్నిట మైత్రి యుండవలయు. అట్లు లేకుంటచే నియతి ఘటన తప్పు.

ఇది ప్రత్యుదాహరణమని యరయునది.

**విజయమంగళరగడకుఁ** బ్రతిపాదమున 16 **సూర్యగణములు** నాల్గేసి గణములపై మూఁడుచోట్ల యతులుండును.

**విశే.** బహుయతినియతి నింత స్పష్టముగాఁ బ్రపంచించిన యప్పకవియే యీక్రింది పద్యములలోఁ బొరపడెనని తెలియుచున్నది.

క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నా + రఁగఁ బలుకుదు రిలఁ + గవివరులెల్లన్
(4 ఆ. 250 పుట)

క్రౌంచపదమునకు 11, 19 యతిస్థానములు.
ఇందు 'క్రౌ-ర-క' లకు యతిగూర్పఁబడినది. పాదాది సంయుక్త క్రవర్ణమునకు 11-వ చోట రేఫము, 19-వ చోట కకారము మైత్రిచేయఁబడినది. ఇట్టి యతిఘటన పొరపాటు.

తరువోజ॥

కృతులందుఁ దరువోజ + నియోజనెసఁగఁ + గృతకృత్యుఁడై చెప్పు + క్షితినెల్లసభల (4-274)

'కృ + ఈ + కృ + క్షి' ఇందును బాదాది కకారము అన్నిచోట్లలేదు. రెండవచోట ఈకారమున్నది. ఋత్వసంబంధవశిచేఁ బాదాదివ్యంజనమునకి యతి గూర్పఁబడెనని చెప్పుటకునుపీలులేదు. 'క్షి' వర్ణములో ఋత్వమైత్రి చెల్లదు గదా? కాన నిదియుఁ బొరపాటే.

'ప్రమాదో ధీమతామపి' అన్నదే దీనికి సమాధానము.

ఇట్టి బహుయతినియతి వ్యతిక్రమదోషము కొన్ని గ్రంథములోఁ గాన వచ్చెను. (చూ. నా ఛందోరీతులు - పుట 271)

బహుయతిని యతిభంగముగల కొన్ని ప్రయోగములు :
స్రగ్ధర॥బాలవృద్ధా, స్త్రీ శేషంబుగానం + దఱుఁ బొలిసిన
వె + న్కన్ జయంబేలఁనాకున్, (భాస్కరరామా-యు-880)

మహాస్రగ్ధర॥ క్షితిఁగూలన్ గోటిసంఖ్యల్ + గెడయఁగరివరా
+ శీతిసాహస్రసంఖ్యల్ (ఉ. హరి, 6-135)

స్రగ్ధర॥ స, న్మానాధీశుండుగా పై + ప్లవ సుఖదుఁడుగా
+ సత్కృపాపాత్ర (పాండు. 2-185)

మహాస్రగ్ధర॥ ప్లవబృందంబుల్ వనిన్ న + ల్గడఁబోడుపోడుమన్
+ వల్కులన్ (ఆముక్త. 7-11)

## 27. అంతోష్మసంధివడులు

పాణినీయసూత్రము.

సూ॥ ఝయోహో౽న్యతరస్యామ్.

వృ॥ ఝయః పరస్య హస్య పూర్వసవర్ణో వాస్యాత్ వాక్ హరిః,
హోషవత్త్వాదిగుణవతో హస్య వర్గచతుర్థః పూర్వసవర్ణస్స్యాత్ వాగ్ఘరిః

సీ. కైరవ కామదు । గ్ఘరవాహకవి కుంద
హైరణ్యగర్భ । వా । గ్ఘంసబృంద
డిండీరభోగి రా । డ్ఢమశైలకైలాస
హరిధవళాంబు రు । డ్ఢరినివాస
దేవాశ్వసురసరి । ద్ధీర ముక్తా కాశ
హరిచంద నైణభృ । ద్ధాౕదినీశ
పారద ప్రాకకుః బ్భస్తి కంబుక్షీర
హలధర శారదా । బ్భయపటీర

తే. పాండుసత్కీర్తి యని యిట్లు । వర్గహల్లు
పొల్లులకుఁబై హకారంబు । పొందునపుడు
కంధిబంధన । యంతోష్మ । సంధి విరమ
ణాఖ్యచే దానికెయ్యది । యైనఁజెల్లు. 115

వి. 'ఝయ్యులకంటెఁ బరమగు హకారమునకుఁ పూర్వసవర్ణము వికల్పముగా నగును' అని పాణినీయసూత్రార్థము.

1. వాగ్ఘంసబృంద—పూర్వపాఠము! పై పాఠము వేదులవారిచ్చినది.

'ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప' అను వర్ణములు ఝయ్యు లనఁబడును. అనఁగా దెనుఁగు వ్యాకరణపద్ధతిలో పరుష సరళవర్గయుగ్వర్ణములు ఝయ్యులగును. అనునాసికములఁ బాసిన వర్గాక్షరములు ఝయ్యులని చెప్పనగును.

'వాక్ + హరి' ఇట ఝయ్యులలోని కకారమునకు హకారము పరమయినది కాన హకారమునకు బూర్వవర్ణముతో సవర్ణ సంజ్ఞగల వర్ణ మాదేశమగును. సవర్ణసంజ్ఞ యనఁగా సమానస్థానము సమానప్రయత్నముగలిగి యుండుట. హకారమునకు సంవారము నాదము ఘోషము మహాప్రాణము అనునవి యత్నములు. ఇట్టి ప్రయత్నము లన్నియుఁగల వర్ణములు వర్గచతుర్థాక్షరములు-అనఁగా ఘ ఝ ఢ ధ భ లు. క చ ట త ప లకుఁ బరమైన హకారమునకు వరుసగ ఘ ఝ ఢ ధ భ లగునని ఫలితార్థము.

వాక్-హరి-వాక్ + ఘరి అని యేర్పడి 'ఝలాంజశోంతే' యను సూత్రవిధానమున క చ ట త ప లకు గ జ డ ద బ లాదేశమయి, వాగ్ + ఘరి వాగ్ఘరి యనురూపము సిద్ధించును.

ఇదియంతయు నప్పకవి యిచ్చిన పాణినిసూత్రార్థవివరణక్రమము. తెనుఁగున నీసంధి సుగమముగ సూత్రించుకొనవచ్చు; క చ ట త ప వర్ణములకుఁ బరమైన హకారమునకుఁ గ్రమముగ ఘ ఝ ఢ ధ భ వర్ణములు వికల్పముగ నగును. అగుచో క చ ట త ప లు గ జ డ ద బ లగును.

వాక్ + హరి వాగ్ఘరి, వికల్పపక్షమున వాగ్హరి; ఇట్లే తక్కిన హల్లుల కెఱుఁగునది.

ఇట్టి సంధిస్థలమున యతిలో లుప్తమైన హకారమునకుఁగాని యాదేశవ్యంజనమునకుఁగాని మైత్రి ఘటింపవచ్చునని యీయతి నిర్దేశించుచున్నది. ఊష్మములం దంత్యవర్ణమగు హకారము పరంబగునపుడు గలుగు సంధిస్థలమునఁ గూర్పఁబడు యతిగాన దీని కంఠ్యోష్మసంధియతి యని యప్పకవిచేఁ బేరొసఁగబడియె.

ఈ సంధి వికల్పముగాన హకారముతో మైత్రి గావింపవలెనన్న 'వాగ్హరి' అనురీతి వికల్పసంధిరూపమును గ్రహింపవీలున్నది. ఇట్టి వికల్పసంధిరూపమున సంయుక్తయతిచే నుభయహల్లులు (వాగ్హరి-గ,హ) చెల్లును. కాన నీ యతిభేద మావశ్యకము గాదనితోఁచు. కాని 'వాగ్ఘరి' మున్నగు రూపములే ప్రసిద్ధములు. గ్రాహ్యములు నగుటచేత వికల్పసంధివ్యాజమున నిందు హకారము చెల్లునని తెల్పుటకే యీ యతిభేదము చెప్పఁబడెనని యెన్ననగు.

అప్పకవి పై సీసము నాల్గుపాదములందు క ట త ప వర్ణములకుఁ బర మైన హకారమునకు నుభయవ్యంజనమైత్రి నుదాహరణములు క్రమముగఁ జూపి యున్నాఁడు. (ఇది కవి స్వీయోదాహృతి)

1. కైరవ—కామధుక్ + హర (దుగ్ఘర) ఇందు క చెల్లును.
   హైరణ్య—వాక్ + హంస (వాగ్ఘంస) " హ "
2. డిండీర—రాట్ + హిమ (రాడ్ఢిమ) " ట "
   హరి—రుట్ + హరి (రుడ్ఢరి) " హ "
3. దేవ—సరిత్ + హీర (సరిద్ధీర) " త "
   హరి—భృత్ + హ్రాదినీ (భృద్ధ్రాదినీ) " హ "
4. పారద—కకుప్ + హస్తి (కకుబ్భస్తి) " ప "
   హల-శారదాప్ + హయ (శారదాబ్భయ) " హ "

విశే. అప్పకవి యీ యుదాహరణలలో చకారమును జూపలేదు. 'చోఃకుః' అను పాణినీయసూత్రముచే చవర్గమునకు హకారము పరంబగునపుడు కవర్గమువచ్చును. దీనిచేఁ పదాంతమున చకారము (చ్) నిలువదు. 'అచ్' అను సంజ్ఞలోమాత్రము చకారము తుదఁ గానఁబడును. అట్టిపట్టున 'అచ్ + హల్లులు' అజ్ఝల్లులని యీ సూత్రముచే నేర్పడును. వ్యాకరణపరిభాషలో మాత్రమే యిది వచ్చునుగాన నప్పకవి యుదాహరింపలేదని యెన్నవలెను.

ఈ యతి కప్పకవి యితరకవుల లక్ష్యములు చూపలేదు. ఇట్టి విశిష్ట యతుల కితరలక్ష్యము లొసఁగుట యావశ్యకము.

ఇందులకు మా పరిశీలించిన కొన్ని లక్ష్యములు :
తరుణార్కకబళనో + ద్ధతిఁజూపె నెవ్వాఁడు(ఉత్ + హతి)(వసు. 1-8)
హరివీరభటమహో + ద్ధతి నబ్ధి గంపింప (వసు. 1-43)

115 ప టీక. కైరవాదులవంటి స్వచ్ఛసత్కీర్తిగలవాఁడు శ్రీరాముఁడని యీ పద్యభావము. ఇందు స్వచ్ఛ (తెల్లనికాంతిగల) వస్తువులు కైరవాదులు ; వాని నుపమానముగాఁ జెప్పినాఁడు.

కైరవ-తెల్లగలువ, కామధుక్-కామధేనువు: హరవాహ-నందీశ్వరుఁడు. వి-శుక్రుఁడు, కుంద-మల్లె, హైరణ్యగర్భ-బ్రహ్మ: వాక్-సరస్వతీ, హంస బృంద-హంసలసమూహము.

డిండీర - నురుగు, భోగిరాట్ - ఆదిశేషుఁడు, హిమశైలము, కైలాస-హరి-సింహము, ధవళాంబురుట్ - తెల్లఁదామర, హరినివాస - పాలసముద్రము

దేవాశ్వ - ఉచ్చైశ్శ్రవము, సురసరిత్ - గంగానది, హీర - వజ్రమణి, ముక్తా-ముత్యము. కాశ - తెల్లు, హరిచందన - కల్పవృక్షము ఏణభృత్-చంద్రుఁడు హ్రాదినీ – వజ్రాయుధము. ఈశ - శివుఁడు, పారద-పాదరసము, ప్రాక్కకుప్ + హస్తి-ఐరావతము, కంబు-శంఖము, క్షీర, హలధర-బలరామ; శారద + అప్ హయ-శరన్మేఘము (హయగతౌ అనుధాత్వర్థమునుబట్టి 'అప్ + హయ' అనఁగా నీటిని బొందునది-మేఘమని యర్థ మూహింపనగును. చూ. వేమలరామశాస్త్రి అప్పకవీయ వివరణము-పుట 124)

కంధిబంధన-సముద్రముపై సేతువునుగట్టినవాఁడు శ్రీరాముఁడనుట.

## 28. వికల్ప విరమణములు

పాణినీయసూత్రము :

సూ. యరోనునాసికేసునాసికోవా,

వృ. యరః పదాన్త స్యానునాసికే పరే అనునాసికో వాస్యాత్.

ఏతన్మురారిః, ఏతద్మురారిః; మయటి నిత్యమ్, వాచ్యమ్, చిన్మయః.

తే. వ్యాకరణ సూత్రముల సంధు । లతుకునపుడు
రెండు విధముల రూపంబు । లుండెనేని
వసుధ నయ్యక్కరముల క । వ్వల వికల్ప
సంధి విరమణ మన రెండు । సాగుచుండు. 116

తే. నందసుకుమార గూఢపా । న్మదవిహార
దళిత శిశుపాల గోత్రభి । న్మణి వినీల
నాగపర్యంకశాయి స । న్మార్గయాయి
ధాతృనుతనామ యోగి హృ । న్మధ్యధామ. 117

వి. పదాంతమగు యర్ ప్రత్యాహారములోని వర్ణములకు అనునాసికము పరమగుచోఁ బూర్వసవర్ణానునాసికము వికల్పముగ నగును.

'య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స' అనునవి యర్ ప్రత్యాహారవర్ణములు. దీనింబట్టి హకారముదప్ప, దక్కినఁ హల్లులన్నియు యర్లు అనఁబడునని తెల్లమగును. యర్లుల కనునాసికము పరమగునపుడు సవర్ణానునాసికము రావలయును. అనునాసికములతో సమానస్థాన ప్రయత్నములుగల సవర్ణములు క చ ట త ప లు.

పొల్లుహల్లులగు క చ ట త ప ల కు అనునాసికములు పరంబులగునపుడు వానికిఁ గ్రమముగఁ దత్తద్వర్గానునాసికము వికల్పముగా వచ్చును.

క చ ట త ప హల్లులకు ననునాసికములు పరంబులగునపుడు, ఙ ఞ ణ న మ లు క్రమముగ వికల్పముగ నాదేశములగునని పై సూత్రార్థమును దెలుఁగున వ్రాసికోవచ్చును.

ఏతత్ + మురారి-ఇందు తకారమునకు మకారానునాసికము పరమైనది. మొదట జశ్త్వవిధానముచే తకారమునకు దకారమగును. (ఏతత్ + మురారి). ఈ సంధివికల్పముగాన ఆదేశము వచ్చినపుడు 'ఏతన్మురారి' అనురూపమును, ఆదేశము రానపుడు, 'ఏతద్మురారి' అనురూపమును బొందును. దీని కనునాసిక సంధియని పేరు.

ఈ యనునాసికమునకుఁగాని సహజముగనున్న వర్గహల్లునకుఁగాని యతిని చేయవచ్చును. ఏతన్మురారి యనుసంధిలో సంధ్యక్షరమునకు ఆదేశ నకారముతోఁగాని యాదేశముగానపు డున్న సహజ తకారమునకుఁగాని యతి గూర్పవచ్చు. మకారమునకు నిందు సంయుక్తయతివలనఁ జెల్లునని యనయునది.

వికల్పసంధివలన నేర్పడినదిగాన దీనికి వికల్పవిరమణమని పేరు.

అప్పకవియొసఁగిన స్వీయోదాహృతి : (117 పద్యము)

నంద—గూఢపా + న్మద (గూఢపాత్ + మద)

ఆదేశ నకారానునాసికముతో యతి

దళిత—గోత్రభి + న్మణి (గోత్రభిత్ + మణి)

లోపించియున్న సహజతకారముతో యతి

నాగ—స + న్మార్గ (సత్ + మార్గ)

ఆదేశ నకారానునాసికముతో యతి

ధాతృ—హృ + న్మధ్య (హృత్ + మధ్య)

లోపించియున్న సహజ తకారమునకు యతి

టీ. గూఢపాన్మదవిహార – కాళియసర్పముయొక్క గర్వముపోఁగొట్టినవాఁడా, గోత్రభిన్మణివినీల–ఇంద్రనీలమణివంటి నీలకాంతిగలవాఁడా, నాగపర్యంకశాయి-పాముపాన్పునఁ బరుండువాఁడా, సన్మార్గయాయి-సన్మార్గమునఁ జరించువాఁడా, ధాతృనుతనామ-బ్రహ్మచేఁ గొనియాడఁబడు నామములుగలవాఁడా.

అప్పకవి చూపిన యితరుల లక్ష్యములు:
1 ఆదిపురాణమునందు....

మ. ఒకనాఁ డిందుధరుండు పార్వతియు లీ । లోద్యాన కేళీసరి
న్నికటానేక వనప్రదేశముల దై తేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాత కుసుమా । నీకంబుపైఁ జల్లద
ర్పక బాణంబుల కెల్ల నెల్లయగుసౌ।భాగ్యంబు శోభిల్లఁగాన్. 118

వి. 2-పా సరిత్ + నికట—దై + తేయ
ఇందు ఆదేశపూర్వము సహజముగానున్న తకారమునకు యతి.
మనుచరిత్రమునందు— (2-16)

మ. అకలం కౌషధ సత్త్వముందెలియ మా । యాద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయాప్రయాగముల నే । సేవింప కుద్దండగం
డక వేదండ వరాహవాహరిపు ఖ । డ్గ వ్యాఘ్ర మిమ్మంచు కొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితో । న్మాదుల్గదాశ్రోత్రియుల్.

వి. 4 పా. లో 'ండ-న్మా' ఆదేశ నకారమునకు బిందుపూర్వక డకారమునకు యతి.

ఇందు యతిస్థానమున వికల్పవిరమణము ; పాదాదిలో అనునాసికాక్షర యతి చెల్లునని యరయవలెను.

తే. హలధరానుజ మయటి ని । త్యమ్మటంచుఁ
బలుకు వాక్యంబుచే మయ । పదము గూడు
నప్పు డనునాసికంబె ని । త్యమయి నిల్చు
నలినలోచను మేను చిన్మయ మనంగ. 120

వి. మయట్ ప్రత్యయములోని మకారము పరంబగునపు డీయాదేశము నిత్యము.

చిత్ + మయము – చిన్మయము అనురూపముండునేకాని చిద్మయమని యుండదు. రెండువిధముల రూపములున్నపుడే యీయతి నప్పకవి యుపదేశించినాఁడుగాన నిత్యరూపమున నిందు సహజ తకారముతో యతిగూర్చరాదని

1. ఆదిత్యపురాణమని యొక ప్రతిలో నున్నది. కాని యీ పద్యము నాచనసోముని యుత్తర హరివంశములోనిదై కానవచ్చెడు. (5-48)

యెన్నఁగను. పై పద్యము నాలవపాదమున 'నలిన-చి+న్మయ' అనుచోట నాదేశ నకారమునకు యతి చూపఁబడినది. తకారమున కుదాహృతి చూపఁబడ లేదుగాన, తకారముతో యతి చెల్లదనుట స్పష్టము.

మరి 'ప్రత్యయేభాషాయాం నిత్య'మ్మనువార్తికముచే మాత్రమయట్ప్రభృతి ప్రత్యయములు పరములగునపుడు అనునాసికము నిత్యముగావచ్చును. అప్పకవి చెప్పిన మయట్ప్రత్యయమేకాక మాత్రాదులు నిందు గ్రాహ్యములు. (ఏతన్మాత్రము, తన్మాత్రము)

అంత్యోష్మసంధియు, అనునాసికసంధియు వికల్పసంధులే యగుచు. రెండువిధముల వికల్పరూపములుగల యీ సంధిద్వయము నొకేయతి క్రిందఁ జెప్పినఁజాలును. అప్పకవి యీ విషయమున ననంతు ననుసరించెఁగావలయు. అనంతుఁడు వేర్వేఱుగా వీనిని రెండు యతులుగాఁ జెప్పెను. కాని పేళ్ళలో మాత్రము భేదముగలదు.

అప్పకవి అంత్యోష్మసంధివడి-అనంతుఁడు వికల్పయతి
అప్పకవి వికల్పవిరమణము-అనంతుఁడు యుక్త వికల్పయతి

చిత్రకవి పెద్దన, కూచిమంచితిమ్మన, కస్తూరిరంగకవి మున్నగువారొక్క-వికల్పయతినే చెప్పి యీ రెండుభేదముల సంగ్రహించిరి. ఇది రమ్యమైన మార్గము.

ఈ వికల్పయతియందు తకారమున కాదేశమైన నకారమునకు మాత్రమే యప్పకవి లక్ష్యములఁ జూపెను. ఇతరవర్గహల్లులకు నితరానునాసికములకు లక్ష్యములు గలవు. అందుఁగొన్ని చూపెద.

జ్ఞానంబు పడయుటకు వా
ఙ్మానసములు సునిహతములు+గావింతురు (భార-శాంతి)

(వాక్+మానస-వాఙ్మానస-ఇందు సహజ కకారమునకు యతిచేయఁబడెను.)

దిఙ్నాగులు తారహారములు+గా (రామాభ్యు-6-16)

ఇవి వ్యంజనాక్షర విరతిభేదంబులు

---

## III ఉభయవళులు

ఇక నుభయవళు లెట్టి వనిన వివరించెద.

సీ. సర్వేశ ! యుష్మద । స్మచ్ఛబ్ద యతులును
బరరూప విరతులు, । ప్రాది యతులు,
వెండి నిత్య సమాస । విశ్రాంతి దేశ్య ని
త్యసమాస, నిత్యాభి । ధానములును,
రాగమసంధి, వి । భాగ, నామాఖండ,
పంచమీ వికృతి వి । భక్తి యతులు,
కాకుస్వర, ప్లుతా । క్షరయుగ విశ్రామ
ములు నన నుభయాఖ్య । వెలయు వళులు

తే. క్రమత శబ్దానుశాసన । ప్రభృతి పూర్వ
కవిజనంబుల కృతుల ల । క్ష్యముల కలిమిఁ
బదియు రెండు విధంబులై । పరఁగుచుండుఁ
దిద్ద్విధంబులు దెలియంగఁ । దగు ముకుంద. 121

వి. అచ్సంధిఁగూడిన శబ్దము లఖండశబ్దములవలె, దోఁచుచోట స్వర ప్రధానవడినిబట్టి పరస్వరమునకుఁగాని, పరస్వరముతోఁగూడిన పూర్వపదాంత వ్యంజనమునకుఁగాని యతిగూర్పవచ్చు. స్వరవ్యంజనములరెంటి కైచ్ఛికముగ యతిచెల్లునుగాన నిట్టియతుల కుభయయతులను పేరొసఁగబడియె.

ఉదాహరణముగ జనార్దనశబ్దమును గైకొందము. ఇందు 'జన + అర్దన' అనుశబ్దద్వయమునకు సంధి. ఇదియచ్సంధి. ఇది యేకపదమువలెఁ దోఁచెడుఁగాన సంధిలో నిలిచిన నకార వ్యంజనమునకుఁగాని స్వర ప్రధానవడిచే అకారమునకుఁ గాని యతి ఘటింపవచ్చు. స్వరప్రధానవడియుఁ బ్రాణియతియుఁ బర్యాయ మునఁ జెల్లు చోటులం దుభయయతి యనుపేరు పెట్టఁబడును.

సాధారణముగ నచ్సంధిగలశబ్దములలో స్వరప్రధానవడిచెల్లును! వ్యంజన యతి చెల్లుటయే యుభయయతిలోని ప్రత్యేకత. అప్పకవికిసమస్తస్వరసంధులందు నుభయయతి సమ్మతముకామిచేతఁ బ్రయోగములఁ గానవచ్చు నుభయయతుల బరిశీలించి. యందుఁ బండ్రెండు భేదముల నేర్పఱిచె. ఏకపదముగాఁ దోఁపని యచ్సంధి ఘటితశబ్దములందుఁ వ్యంజనయతి పాటించుట యఖండయతి య[illegible]బడును. అఖండయతి యప్పకవి సమ్మతముగాదు. కొందఱు లాక్షణికు

లఖండయతిని సమ్మతించిరి; కొందరు కవులు ప్రయోగించిరి. దానింగూర్చి తర్వాత చర్చింపఁబడును.

అఖండ యతికి విముఖుఁడయిన యప్పకవి 12 ఉభయయతి భేదములఁ గల్పించెను. ఆ యతిభేదము లీక్రిందివి :

1. యుష్మదస్మచ్ఛబ్దయతి
2. పరరూపయతి
3. ప్రాదియతి
4. నిత్యసమాసవిశ్రాంతి
5. వైకల్పికసమాసవిశ్రాంతి
6. నిత్యయతి
7. రాగమసంధివళి
8. విభాగవళి
9. నామాఖండవిశ్రమము
10. పంచమీవిభక్తి విరామము
11 కాకుస్వరవళి
12. ప్లుతయుగవిశ్రామము

ఈ యుభయ యతిభేదములకు లక్ష్యములు నన్నయాది మహాకవుల గ్రంథములలోఁ గలవు గాన వీని లక్షణములు దెలియఁదగునని యప్పకవి చెప్పుచున్నాఁడు.

## 29. యుష్మదస్మచ్ఛబ్దయతులు

క. క్షితి నస్మద్యుష్మత్పద
యతులనఁ గావ్యముల యుష్మ । దస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము
లతికిన నుభయంబుఁ జెల్లు । నభయవిహారా. 122

వి. 'అస్మద్, యుష్మద్' అనుశబ్దద్వయమునకు స్వరముపరమయి సంధి యగునపు డుభయయతి చెల్లును.

'అస్మద్ + అన్వయము - అస్మదన్వయము; యుష్మద్ + ఆగమనము - యుష్మదాగమనము' అనురీతి సంధిగూడినచోటఁ బరపదాదిస్వరమునకుఁగాని (అ, ఆలకు) పరస్వరముతోఁ గలిసిన పూర్వపదాంతవ్యంజనమునకుఁగాని (ద, దా లకు) యతి చేయవచ్చును.

ఇట్టి యచ్ఛంధులందుఁ జెల్లు వ్యంజనయతినే కొందఱు అఖండయతి యని పేర్కొనిరి.

యుష్మదస్మచ్ఛబ్దద్వయమునకు మాత్రమే యీ యుభయయతి చెల్లుబడి యగుటచే దీనికి పేరాసఁగఁబడినది.

విశే. చిత్రకవి పెద్దన్న దీని నుభయయతి యని పేర్కొనియె. పెద్దన యుభయయతిభేదముల నప్పకవివలెఁ జెప్పలేదు. అతని మతమున యుష్మదస్మ చ్ఛబ్దయతి యన్నది యుభయయతి యనఁబడును.

అప్పకవి దీనికి స్వీయోదాహృతి చూపలేదు. అతఁడు చూపిన యితర కవుల లక్ష్యములు :
సాంబోపాఖ్యానమునందు....

క. చతురానన నందన ది
వ్యతపోధన వర్య యుష్మ । దాగమనమునన్
గృతకృత్యుఁడనైతిని నే
నతిపావన మయ్యె నస్మ దన్వయ మెల్లన్. 123

వి. ఇందు 2 పా. దివ్య (యకారమునకు) ....యుష్మద్ + ఆగమనము (పరస్వరమైన ఆకారమునకు) స్వరప్రధానవడి

4. పా. అతి .... అస్మద్ + అన్వయ....ఇదియు స్వరప్రధానవడియే.

ఈ పద్యము స్వరయతి చెల్లుటకు లక్ష్యమగును.
అధర్వణాచార్యుల విరాటపర్వమునందు....

ఆ. ధర్మతనయ యుష్మ । దాజ్ఞానిగళ విని
బద్ధ మగుచుఁ జిక్కి । వడియెఁగాక
విజయమత్త గజము । విడివడ్డచో నడ్డ
పాటుగలదె విష్ట । పత్రయమున. 124

వి. 1 పా ధర్మ—యుష్మ + దాజ్ఞ (యుష్మద్ + ఆజ్ఞ)
ఇది వ్యంజనమైత్రి కుదాహరణము.

ఆదిపర్వమునందు (2-219)....

క. ప్రస్తుత ఫణిస్త్రతభయ
త్రస్తాత్ములమైన యస్మ । దాదుల కెల్లన్

స్వస్తి యని పలుక నవసర
మస్తికున కయ్యె నిప్పు డంబుజనేత్రా. 125

2 పా. త్రస్త—అస్మ + దాదులు (అస్మద్ + ఆదులు)
ఇందు 'త-ద' లకు వ్యంజన యతి గూర్చబడినది.

**విశే.** యుష్మదస్మచ్ఛబ్దద్వయమునకు మాత్రమే యిం దుభయయతి యుపదేశింపఁబడినది. దీనిం బోలిన తద్, ఏతద్, భవత్ ఇత్యాదులకు స్వరము పరంబగునపుడు నుభయయతి చెప్పవచ్చునని యీ క్రింది ప్రయోగములు దెల్పుచున్నవి.

తామరసేపకుండ భవ + దంఘ్రుల నేఁడు దాల్చవచ్చెదన్
(భాస్కరరామా. అయోధ్య. 143)
మాతంగమునేర్కి యింద్రమదు త + దాశ్రమవీథి (అహల్యా. 2-119)

## 20. పరరూపవిరతులు

వ్యాకరణసూత్రము :
సూ. అచోఽన్త్యాదిటి

వృ. అన్త్యాచ్ ప్రభృతిర్టిస్సంజ్ఞస్యాత్, శకంధ్వాదిషు (టేః) పరరూపం వాచ్యమ్ (వా)

శ్లో॥ శకంధు రథకర్కంధూః కుద్దాలోఽలక్తపర్కటీ,
లాంగలీషా హలీషాచ మనీషాచ పతంజలిః,
కుత్సిలోష్ఠీషమంజీర మస్తిప్యకులటాదయః,
తథాప్యకంపమసీమంతా శకంధ్వాదిగణేస్మృతాః.

శకానాం దేశానామంధుః కూపః శకంధుః, శకంధువనఁగాను శకదేశమందలి నూతిపేరు. కర్కస్యాంధూః కర్కంధూః 'కర్కంధూర్బదరీకోలీ' త్యమరః, కర్కంధువనఁగాను రేఁగుచెట్టు. కంశిరః ఉష్ణవీర్యత్వాదుద్దాలయతీతి కుద్దాలః కుం భూమి ముద్దాలయతీతివా, దళవిశరణే, ఉదిత్యుపసర్గః, కుద్దాలో ఙపహావారక ఇత్యమరః, కుద్దాల మనఁగాను పిరిగిచెట్టు, పాదమంతీత్యలక్తః, అలభూషణే, 'యావోఽలక్తోద్రుమామయ' ఇత్యమరః; అలక్తమనఁగాను లత్తుకపేరు పర్చ్యతే పరస్పరం స్పృజ్యత ఇతి పర్కటీ, పృచిసంసర్గే; 'ప్లక్షోజటీ పర్కటీస్యా' దిత్యమరః, పర్కటీ యనఁగాను జువ్విచెట్టు. లాంగలస్యేషాలాంగలీషా, 'ఈషాలాంగల దండస్స్యా'దిత్యమరః. హాలస్యేషాహలీషా. ఈ రెండును ఏడికోల పేళ్ళు. మనస ఈషా లాంగలదండవత్సంబద్ధామనీషా; బుద్ధిర్మనీషాధి

షణే' త్యమరః। మనీష యనఁగా బుద్ధి పేరు పతత్ అంజలిః పతంజలిః. పతంజలి యనఁగాను వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగము పేరు. కోర్వ్యా మేరుత్కీలః కుత్కీలః, 'అగకుత్కీల జీమూతసానుమన్నగాః పర్వతా' ఇత్యమరః. కుత్కీల మనఁగాను గట్టుపేరు. ఉష్ణస్య ఈషః ఉష్ణీషః 'ఉష్ణీష శ్శిరోవేష్ట కిరీటయో' రితి నానార్థే, ఉష్ణీష మనఁగా దలపాగ పేరు. మంజు రుచ్చమీరయతీతి మంజీరః, ఈరస్వనే; 'మంజీరోనూపురోస్త్రియా' మిత్య మరః. మంజీర మనఁగా గాలిగజ్జె. మస్తంశిర ఇష్యతి ప్రాప్నోతీతి మస్తిష్కం' ఇష గతౌ, 'తిలకంకోమ మస్తిష్క' మిత్యమరః. మస్తిష్క మనఁగాఁ దల మెదడు పేరు. కులం విటకుల మటతీతి కులటా. అటగతౌ; 'అసతీకులటేత్వరీ' త్యమరః కులట యనఁగా లంజె పేరు. ఆదిశబ్దముచేత వేదండసారంగములు మొదలైనవి మఱికొన్ని గలవు. వేదః సామవేదః అండః జనన కారణం యస్య సః వేదండః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః; 'సామజస్సింధురోపిస' ఇత్యమరః! వేదండ మనఁగా నేనుఁగు పేరు సారాణ్యంగాని యస్యసః సారంగః. సారంగ శ్చాతకే భృంగే కురంగే చ మతంగజ' ఇత్యమరః: సారంగ మనఁగాను చాత కాదుల పేరు. వృకస్య అంధుః వృకంధుః; వృకంధు వనఁగాను వృకదేశ మందున్న బావిపేరు. సీమ్నః అంతః సీమంతః; సీమంతమనఁగాఁ బాపట పేరు. ఇవి శకంధు శబ్దము మొదలుగాఁగలవి గనుకను శకంధ్వాదిగణ మనఁబడును.

౭. అచ్చులలో నేది చివరనుండునో యది యాదియందుఁగల భాగము టి సంజ్ఞకమగును. ఒక శబ్దములో నంత్యాచ్చు మొదలుకొని యున్న భాగము (అక్షరసమూహము) సంస్కృత వ్యాకరణ శాస్త్రమున టి సంజ్ఞచేఁ జెప్పఁబడును. 'పతత్' అనుచోట (తత్-అత్)అత్, 'మనస్' అనుచోట-అస్, టి సంజ్ఞకములగును. శక కర్క ఇత్యాదులలోఁ జివరి అకారస్వర మొక్కటే టి సంజ్ఞగలదియగును.

'శక + అంధు' ఇత్యాది శబ్దసంధులందు అంత్యముననున్న అకారస్వరమునకు (టి కి) పరరూపము వచ్చును. అనఁగా దుదినున్న అకారము లోపించి దానికి ముందున్న హల్లుతోఁ బరపదాద్యచ్చు చేరును.

శక + అంధు-శక్-అ + అంధు-శక్ + అందు-శకంధు.
పతత్ + అంజలి-పత్-అత్ + అంజలి-పత్ + అంజలి-పతంజలి.

(ఇందు 'అత్' టి సంజ్ఞకము! 'అత్' లోపించే పరస్వరము పూర్వవర్ణముతో గలియును.) ఇట్లే మనస్ + ఈషా, మన్-అస్ + ఈషా-మనీషా.

ఇందెల్ల బరరూపము వచ్చునే కాని శక + అంధు-శకాంధు, లాంగల + ఈషా-లాంగలేషా-పతత్ + అంజలి, పతదంజలి, ఇత్యాది విధముగా సవర్ణదీర్ఘ గుణాదిసంధులు ప్రవర్తింపవు. శకంధ్వాదిగణమునకు మాత్రమే పరరూపసంధి.

ఆ గణముపై శ్లోకముచేఁ జెప్పఁబడియున్నది. శకంధ్వాది శబ్దముల యర్థములు నందలి పదచ్ఛేదములు నప్పకవి పై వచనమునఁ దెలిపియున్నాఁడు. ఆ యర్థ వివరణమున కించుక పరామర్శ :

శకంధు-శక + అంధు; వనఁగా నూయి.

శకంధు వనఁగా శకదేశమందలి బావి. (శకంధువు-తత్సమరూపము)

కర్కంధూ-కర్క + అంధూ-రేఁగుచెట్టు(కర్కంధువు-తత్సమరూపము)

'కర్కంధూర్బదరీకోలీ' అని యమరము. గురుబాలప్రబోధిక (లింగాభట్టీయ మనఁబరగు అమరటీక) లో దీని వ్యుత్పత్తి యిట్లున్నది. 'కర్కాణి లోహితాని పర్ణాని ఫలానిచ ధత్త ఇతి కర్కంధూః, దుధాఞ్ ధారణ పోషణయోః. కర్క మనఁగా ఎఱుపు, అటువంటి ఆకులను పండ్లను గూడ. సిద్ధాంతకౌముదిలో 'కర్కం దధాతీతి కర్కంధూః' అని యున్నది. ఈ రెండు వ్యుత్పత్తుల ప్రకారము కర్కంధూ శబ్దమున స్వరసంధి (పరరూపసంధి) గానరాదు. అక్కారణమున నిందుభయయతికిఁ బ్రసక్తి లేకపోవును.

అప్పకవి పరరూపసంధి కనుగుణముగ 'కర్క స్యాంధూః కర్కంధూః' అను వ్యుత్పత్తి చెప్పి శబ్దవిభాగము గావించె. గురుబాల ప్రబోధికాదుల ననుసరించు 'కర్క + అంధు' అను విచ్ఛేదము సరికాదన్నచో నీశబ్దము శకంధ్వాదిగణపాఠ శ్లోకమునఁ జేరుటకు వీలుండదు. శకంధ్వాదిగణమున గ్రహింపఁబడి యుండుటచేతఁ గర్కంధూశబ్దమునఁ బరరూపసంధి యున్నదని చెప్పనక్కరలేదు అందుచేతనే సిద్ధాంతకౌముద్యాదులకు భిన్నముగ నప్పకవి యుభయయతి సిద్ధికొఱకు 'కర్కస్యాంధూః' అను వ్యుత్పత్తి కల్పించెనేమో?

గిడుగువారి యప్పకవీయ పీఠికలో *కూచిమంచి వేంకటరాయని సుకవి మనోరంజనములోని వాక్యము లీకర్కంధూ శబ్దమును గూర్చి యుద్ధరింపఁబడెను.

ఆ వాక్యములు : 'శకంధు కర్కంధులు ఆ యాయి దేశమందలి నూతుల కర్థముగాని, కర్కంధు రేగుచెట్టుకు అర్థము కాదు. కర్కస్య అంధూః' అని అప్పకవి వ్యాఖ్య వ్రాసి రేగుచెట్టు అర్థం వ్రాసినారు. అంధు శబ్దము ఉకారాంతముకాని ఊకారాంతము కాదు. అయినా, కర్క మనగా ఏమిటో అర్థము వ్రాయరయిరి....కొన్ని సమాసములలో అచ్చులు కనిపించుటలేదు.

కర్కంధూ శబ్దమునకు రేఁగుచెట్టను నర్థ మమరములోఁ జెప్పఁబడి యుండఁగా రేగుచెట్టున కర్థము కాదని వ్రాయుట సుకవి మనోరంజనము కాదు. కర్కదేశమందలి బావి యనుట కాధారమేమి? కర్కమనుదేశ

*కూచిమంచి వెంకట్రాయకవికృత సుకవిమనోరంజనము పూర్తిగ లభించుటలేదు. ఇది యముద్రితము

మున్నదా? అంధూ శబ్దము ఉకారాంతమని, ఊకారాంతము గాదని యందుఁ జెప్పఁ బడినది. కాని 'అంధు అంధూ' అని హ్రస్వాంత దీర్ఘాంతశబ్దములు రెండును గలవు. అంధు శబ్దమునకు నూయి యనియు, అంధూ శబ్దమునకు బంధనమనియు నర్థములు. కర్కన్ధూ-ఎఱుపురంగునకు, అంధూః-బంధనమైనది, అనఁగా ఆకుల యందును పండ్లయందును ఎఱుపురంగును బంధించునది. ఎఱ్ఱని యాకులును బండ్లును కలది' అనువ్యుత్పత్తిని జెప్పి కర్కంధూ శబ్దమున కప్పకవి చెప్పిన రేఁగు చెట్టను నర్థమును సమర్థించినారు. అప్పకవీయ వివరణములో వేదులవారు(పుట 140)

<u>కుద్దాలః</u> (కుద్దాలము) కు + ఉద్దాల.

'కుద్దాలో బహువారకః - ఇత్యమరః' అని యప్పకవి యాకరమును జూపెను బహువారక మనఁగా విరిగిచెట్టు

అమరములో 'ఉద్దాలో బహువారకః' అని యున్నది విరిగిచెట్టను నర్థమున శబ్దము ఉద్దాలమే కాని కుద్దాలము గాదు. అప్పకవి ఉద్దాలమును కుద్దాలముగ భ్రమించి ప్రమాదవశమున నిట్లు రచించియుండును. 'కోవిదారే చమరికః కుద్దాలో యుగపత్త్రికః' అని యమరమునఁ గలదు.

ఇందు కుద్దాలమనఁగా ఎఱ్ఱకాంచనపుచెట్టు. ఇచ్చోట గురుబాల ప్రబోధికా వ్యాఖ్యలో 'కుంభూమిం మూలైర్దళయతీతి కుద్దాలః దళవిశరణే, వేళ్ళచేత భూమిని ప్రక్కలించునది' అని వ్యుత్పత్త్యర్థము చెప్పఁబడినది.

అప్పకవి యిచ్చిన 'కుంభూమి ముద్దాలయతీతివా' యను రెండవ వ్యుత్పత్తి యీ గురుబాలప్రబోధికావ్యుత్పత్తి వంటిదే యగుచున్నది. 'కంఠిరః ఉష్ణపీడ్యత్వా దుద్దాలయతీతి' అని మఱియొక వ్యుత్పత్తియు దీని కప్పకవి యిచ్చియున్నాఁడు.

కుద్దాలమనఁగా ఎఱ్ఱకాంచనపుఁజెట్టను నర్థ మప్పకవి యిచ్చినది సరియే, కాని దీనికిఁ బ్రసిద్ధముగాఁ బ్రవృత్తినట్టి యొకానొక సాధనము(గుద్దలి)అను నర్థము గలదు. కుద్దాలశబ్దభవమే గుద్దలి గుద్దలియను నర్థమునకు 'కుం ఉద్దాలయతి-కుద్దాలః' అను వ్యుత్పత్తి పొందు పొసఁగియున్నది. సూర్యరాయ నిఘంటువులో-కుద్దాలము-భూమిని చీల్చునది; 1. గుద్దలి; 2. కోవిదారము (కాంచనము) అని యర్థములు చూపఁబడినవి. కాన కుద్దాలమునకుఁ గాంచనవృక్షమని కాని గుద్దలి యని కాని యర్థములు గ్రాహ్యములు.

<u>అలక్తః</u> - అల + అక్త - (అలక్తము-లత్తుక).

'పాదమలతీత్యలక్తః అల భూషణే' అని యప్పకవి వ్యుత్పత్తి చూపెను. అప్పకవి వ్యుత్పత్తిఁ బరికించిన నీశబ్దమందు సంధికిఁ బ్రసక్తి లేదనుట తెల్లము.

'అలతీత్యల_క్త' యనుచో నిందు( బదద్వయ విభాగమెట్లు గలుగును? ఆ వృక్ష మున( బరరూపసంధి గలదని చెప్పు శకంధ్వాదిగణమున(గాని పరరూపయతి యందు(గాని యా శబ్దము గ్రహించుటకు వలనుపడదు. గురుబాలప్రబోధికలో అల_క్తశబ్ద వ్యుత్పత్తి యిట్లున్నది—' అలతిపాదాదికం అలం అన_క్తి వస్త్రాదికం అ_క్తః అలశ్చాసావ_క్తశ్చ అల_క్తః. అలభూషణాదౌ, అంజూవ్య_క్తిమ్రక్షణకాంతి గతిషు. పాదాదుల నలంకరించునది గనుకను వస్త్రాదుల( బ్రకాశింప(జేయునది గనుకను అల_క్తము.' 'అం + అ_క్త' అను పదచ్ఛేదము పై వ్యుత్పత్తివలన నేర్పడుచున్నది గాన నయ్యది స్వీకరణీయము. అప్పకవి నిర్వచనము గ్రాహ్యము గా(జాలదు.

పర్కటీ-పర్క + అటి (పర్కటి - జువ్విచెట్టు)

అప్పకవి చూపిన దీని వ్యుత్పత్తిలో( బదద్వయవిభాగమున కాస్కారము లేదు.(పర్చ్యతే పరస్పరం స్పృజ్యతే)పదద్వయవిభాగమును స్వరసంధియులేకున్న నీశబ్దము పరరూపసంధి యతియందు స్థానము లేనిదగును. గురుబాలప్రబోధికలోను అప్పకవి నిర్వచనమువంటి వ్యుత్పత్తియే యున్నది. (పృచ్యతే పరస్పరంపర్కటీ, పృచసంపర్కే, అన్యోన్యము గూడియుండునది.) దీనికి వేదులవారు చెప్పిన వ్యుత్పత్తి సముచితమై యున్నది ఆ వ్యుత్పత్తి యిది : 'పర్కంఅన్యోన్య సంసర్గమ్' (జటాసు-ఊడలయందు) అటతీతి (పొందునది గావున) పర్కటి (పర్క + అటి) ఇట్టి యర్థకల్పనచే గణపాఠోభయయతులు రెండును గుదురును. జువ్వి చెట్టూడలుగలది; గాననే దానికి జటియను నామాంతరమును గలదు.

లాంగలీషా-లాంగల + ఈషా లాంగలీష-ఏ(డికోల)

హలీషా-హల + ఈషా హలీష-ఏ(డికోల)

లాంగల హల శబ్దములకు నా(గేలని యర్థము ఈష యన(గా లాంగల దండము. ఈ రెండు శకంధ్వాదిగణమున( జేరుటచే వీనియందు గుణసంధి (లాంగలేషా, హలేషా వంటిరూపము) గలుగదు.

మనీషా-మనస్ + ఈషా (మనీష-బుద్ధి)

'మనస్'లోని 'అస్'కు( బరరూపమగు 'ఈ'వచ్చి 'మన్ + ఈషా-మనీషా' అను రూపము సిద్ధించె.

పతంజలిః-పతత్ + అంజలిః(పతంజలి-సంస్కృత వ్యాకరణ మహాభాష్య క_ర్త. మునిత్రయములో నొకడు. పాణిని కాత్యాయన పతంజలులు మునిత్రయ మన(బడుదురు. 'పతన్అంజలిః, పతంజలిః, అని-యప్పకవి చూపిన విగ్రహము పతః పతన్ వా అంజలిః నమస్కార్యతయా యస్మిన్, శకంధ్వాదిత్వాసాధుః

మునివిశేషః. సతుపాతంజల దర్శనపాణిని టీకా మహాభాష్యగ్రంథకర్త. యని శబ్దకల్పద్రుమము. ఎవనియందు నమస్కారముతోడి యంజలి (దోసిలి) పొందఁబడునో యతఁడు పతంజలియని వ్యుత్పత్తి చెప్పవలెను. అనఁగా నెల్ల రతనిని జేయెత్తి నమస్కరింతురని భావము.)

కుత్కీలః-కు + ఉత్కీలః (కుత్కీలము-కొండ)

కూత్కీలమని సవర్ణదీర్ఘసంధి రాదు కోర్యామేరుత్కీలః కుత్కీలః భూమికి ఉన్నతమైన కీలమువంటిది (కీలము-చీల) కీలమువలె భూమిని స్థిరముగా నుండునట్లు చేయునది. 'అగ కుత్కీల జీమూతసానుమన్నగ పర్వతాః' ఇత్యమరః-అని యప్పకవి వ్రాసెను. అమరకోశములో నియ్యది గానరాదు. ఇది కోశాంతరములోనిది కానోపు. అప్పకవి పొరపాటున నమరమని వ్రాసియుండును.

ఉష్ణీషః-ఉష్ణ + ఈషః (ఉష్ణీషము-తలపాగ, కిరీటము)

దీనికి గురుబాల ప్రబోధికా వ్యుత్పత్తి నిర్వచన మిట్లున్నది....'ఉష్ణ నివారణ మిష్యతే ఉశ్యత ఇతివా ఉష్ణీషః. ఇషు ఇచ్ఛాయాం, వశకాంతౌ. ఉష్ణ నివారణార్థమై యిచింపఁబడునది'.

అప్పకవి వ్యుత్పత్తి-ఉష్ణస్య ఈషః అనఁగా ఎండవేఁడిమిని గ్రహించునది. ఎట్లు వ్యుత్పత్తి చెప్పినను నిందుఁ బదద్వయ విభాగము పరరూపసంధి గలదు.

మంజీరః-మంజు + ఈరః (మంజీరము-కాలిగజ్జె, అందె)

మంజురుచ్చమీరయతి ధ్వనతి-మనోహరముగ ధ్వనించునదియనియర్థము.

మస్తిష్కమ్ మస్త + ఇష్క-శిరస్సును బొందియుండునది-మెదడు.

కులటా-కుల + అటా (కులట) లంజె-అంకులాఁడి. కుల విటకుల మట తీతి కులటా-అటగతౌ-విటకులమునుగూర్చి పోవునది యని యర్థము. (స్వకులం విసృజ్య అటతి వ్యభిచరతి కులటా-తనకులమును వదలి వ్యభిచరించునది యనియు నర్థము చెప్పనగును.)

శకంధ్వాదులందలి ఆదిశబ్దముచే వేదండసారంగశబ్దములఁ జెప్పినాఁ డప్పకవి.

వేదండః-వేద + అండః (వేదండము) ఏనుగు. వేదము (సామవేదము) అండము (జనకారణము) గాఁ గలది. ఏనుగు సామవేదమువలనఁ బుట్టినదని ప్రమాణము కాననే దానికి సామజమని నామాంతరము.

సారంగః-సార + అంగః (సారంగము) చాతకము, భృంగము, కురంగము గజము అని దీనికి నానార్థములు గలవు. ఈ అర్థములందెల్ల సారాణి అంగాని యస్యసః (మంచి యవయవములు గలది) యను వ్యుత్పత్తి చెప్పవలెను. పశుపక్ష్యాద్యర్థములందే పరరూపసంధి; ఇతరత్ర అనఁగా పశుపక్ష్యాది భిన్నార్థము లందు 'సారాంగ' మని సవర్ణదీర్ఘ సంధిరూపము చెప్పవలెను. గురుబాల ప్రబోధికలో మఱియొక వ్యుత్పత్తియుఁగలదు. 'సజాతీయైస్సహ అరం అత్యర్థం గచ్ఛతీతి సారంగః' ఈవ్యుత్పత్త్యర్థమునఁ బరరూపసంధి గలుగనేరదు గాన నిందు గ్రాహ్యముగాదు. 'చాతకేహరిణేపుంసి సారంగశ్శబలేత్రిషు' అని యమరకోశమున నానార్థవర్గమునఁ జెప్పఁబడినది. కాని 'సారంగశ్చాతకే భృంగే కురంగేచ మతంగజ' ఇత్యమరః అని యప్పకవి వ్రాసినాఁడు. అమరకోశమున నిట్టి పాఠభేదములు పెక్కులుగలవు. అమరము చదువనివారు లేరు గాన నిట్లు బహువిధ పాఠభేదము లుప్పతిల్లినవి. గురుబాలప్రబోధికా ప్రకారము శబల వరమను నర్థమునను సారంగ శబ్దమునకుఁ బరరూపసంధి గలదని యెఱుంగనగును.

వృకంధుః—వృక + అంధుః (వృకంధువు) వృకదేశమందలి బావి

ఇది శకంధు శబ్దము వంటిది.

సీమంతః-సీమ + అంతః (సీమంతము) పాపట.

సీమ్నః అంతః సీమంతః-అని వ్యుత్పత్తి యమరకోశసుధావ్యాఖ్యలోను శబ్దకల్పద్రుమములోను జూపఁబడినది అప్పకవియు నట్లే వ్రాసినాఁడు.

సీమంతమని సవర్ణదీర్ఘ సంధిచేఁ గాక శకంధ్వాదిలోఁ బఠిత మగుటచే సీమంతమని పరరూపసంధిచే సిద్ధించును.

పరరూపసంధిగల యీ శబ్దములు సకంధు శబ్దము మొదలుగాఁగలవి గాన శకంధ్వాదిగణ మనఁబడుదు. ఇందుఁ జెప్పఁబడినవే కాక యీ గణమునఁ జేరఁదగినవి యింకను గలవని యెఱుంగునది.

క. విరతికి వ్యాకరణమునను
వరరుచిచేఁ జెప్పఁబడిన । వాక్యమువలనన్
బరరూపము నిత్యంబై
పరఁగు శకంధ్వాదులకు నుభయముంజెల్లున్. 126

వి. పాణిని రచించిన సంస్కృత వ్యాకరణమునకు వరరుచి వార్తికముల వ్రాసెను. వరరుచిని వాక్యకారుడందురు. 'వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిం, పాణినిం సూత్రకారంచ ప్రణతోస్మి మునిత్రయమ్' అన్న వ్యాకర్త మునిత్రయస్తుతి ప్రసిద్ధము.

శకంధ్వాదిషుపేః పరరూపం వాచ్యమ్మను సూత్రము వరరుచివార్తికము. ఈ వార్తికముచేఁ బరరూపసంధి నిత్యము గాఁగల శకంధ్వాదులకుఁ దెలుఁగున నుభయయతి చెల్లును. శకంధ్వాదులలో నచ్సంధి యుండుటచే స్వరప్రధాన వడియు, నయ్యవి ఋఖండశబ్దములవలెఁ గానవచ్చుటచే వ్యంజనయతియుఁ జెల్లునని గ్రహింపవలయు.

అప్పకవి యిందులకు స్వీయోదాహృతి నొసఁగక యితరుల పద్యము లుదాహరించెను. ఆ లక్ష్యములు :—

వేదండశబ్దమునకు నాదిపర్వమునందు (3-228)

మత్తకోకిల.

దండితాహిత వీర సూరిని । ధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమప్రియ । ధామ దిక్పరి పూరితా
ఖండపాండు యశోనిధీ పర । గండభైరవ వైరివే
దండదండవిదారి ఘోరత । రాసిభాసి భుజార్గళా. 127

వి. ఇందు 4 పా. లో, వేద + అండ - ఘోరతర + అసి. (స్వరమైత్రి)
భీష్మపర్వమునందు (1-234)

ఉ. పాండునృపాల నందనులు । పావని ముందుగఁ దాఁకనట్లు భీ
ష్ముండు గడంకమై నడుచు । చోటికిఁ జక్కటిగాఁగ్రదోచియొం
దొండ గడఁగి సేన తమ । యుబ్బున కుబ్బఁగ నన్యసైన్య వే
దండ ముఖాంగముల్ తృణ వి । తానముగాఁగొనినిర్వికారులై.

వి. ఇందు 4 పా. లో, వేదండ + తానము (వ్యంజనమైత్రి)
సారంగశబ్దమునకుఁ జంద్రికాపరిణయమునందు—

ఉ. జంగమరోహణాద్రి సదృ । శంబులు తత్పురిఁగల్గు భద్రసా
రంగవరేణ్యముల్ పయికి । హస్తము లించుకసాఁచి యవ్వియ
ద్గాంగఝరంబు పీల్చి మఱి । తద్వమథు ప్రకరంబు దప్పి వా
యంగ నొసంగు రంగుగ ని । జాఖ్య వహించిన చాతకాళికిన్.

వి. 2పా. సార + అంగ—హస్త (స్వరమైత్రి)

ద్రోణపర్వమునందు (1-17)

ఉ. అంగదనాథు ద్రిమ్మింగిన వృ। కావలి దన్వెసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుంజలింప బెగ।డందుచు దిక్కులుచూచుచున్న సా
రంగియపోలె నుండెఁగురు । రాజ భవత్సుతు సేన భీమ్మనా
జింగబళించి పాండవులు।జృంభిత విక్రమలీలఁ బొల్చుటన్. 130

వి. 3. పా. సా, రంగి-రాజ (వ్యంజనమైత్రి)

విశే ఇందప్పకవి శకంధ్వాదిగణముం జెప్పు శ్లోకములోని యొక శబ్ద మునకేని యుభయయతి లక్ష్యములు సూపక యాకృతిగణములోఁ జేర్పఁదగు వేదండ సారంగ శబ్దద్వయమునకే యుదాహృతులం బ్రదర్శించెను.

శకంధ్వాదులలోని మనీషాశబ్దమున కుభయయతికి లక్ష్యములఁ గ్రింద జూపట్టెడ—

మ, నీషి జనము చెప్పు మాన + నీయచరిత్రా (భార-శాంతి-3-401)
ఎప్పుడు వేరెదమొ యను మ + నీష (నిరంకుశ-4-68)

శకంధ్వాది పరరూప యతిభేదము ప్రాచీన లాక్షణికులు భీమనాదులు చెప్పలేదు. అప్పకవికి ముందు చిత్రకవి పెద్దన యొక్కఁడే చెప్పినాఁడు. కస్తూరి రంగకవి శకంధు యతియని పేరిడి దీనియందు మార్తండశబ్దమునుగూడ సంగ్రహించెను. 'మృత + అండ-మృతండ-మార్తండ' అనురీతిఁ బరరూపసంధి సిద్ధించును. 'మృతం బ్రహ్మాండం జీవయతీతి మార్తండః' అని వ్యుత్పత్తి యిందనుసంధించుకోవలెను మార్తండ మార్తాండ శబ్దద్వయము గలదని యెఱుంగవలయును.

మృతేంఽడే భవః-అని యమరకోశసుధావ్యాఖ్య.

## 13. ప్రాదియతులు

**ఉపసర్గలు :**

శ్లో॥ ప్రపరాప్రతిపర్యత్యధ్యభ్యవానూప నంస్వప
నివినిర్దురుదప్యాఙిత్యుపసర్గాస్తు వింశతిః॥

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆఙ్ - ఇవి యిరువదియును నుపసర్గలు.

వ. ప్రకారోపసర్గంబాది యగుటంజేసి ప్రాదు లనంబడును. 131

తే. ఆంధ్రమునకుఁ జేరని పరాఁజపులు మూఁడు
గాక తక్కిన యుపసర్గకముల తలల
స్వరము లతికిన వానికవ్వలను నిలుచు
నచ్చయిన హల్లయినఁ బ్రాదియతి యనంగ. 132

తే. అబ్జయోని రజోగుణప్రాప్తిఁదనరుఁ
బద్మనాభుఁడు సాత్త్విక ప్రాప్తిఁదనరు
రజతగిరి మందిరుఁడు తమః ప్రాప్తిఁదనరు
ననఁగ నిబ్బంగిఁ బ్రాదుల కమరు యతులు. 133

వ. కడమ యుపసర్గములకు అన్నిటికిని ఇటువలెనే రెండునుం
జెల్లునని తెలిసికొనునది. 134

వి. 'ప్ర, పరా' మున్నగు నిరువదింటికి సంస్కృత వ్యాకరణమున నుప
సర్గలని సంజ్ఞ. ఈ యుపసర్గలు ధాతువులకు మొదటఁ జేర్పఁబడి విశేషార్థముల
నిచ్చును. 'ఉపసర్గాః క్రియాయోగే' అని వ్యాకరణ సూత్రము. క్రియాయోగము
లేకయుఁ గొన్నియెడ నుపసర్గలు వాడఁబడును. 'ప్ర' మొదలుగాఁగల వగు
టచే నుపసర్గలకుఁ బ్రాదులనియు వ్యవహారము గలదు. ఉపసర్గలు సంస్కృత
మున 'నిస్ దుస్' అను రెంటితోఁజేరి యిరువదిరెండు. 'నిర్, నిస్, దుర్, దుస్'
అను జంటలలో మొదటి యుపసర్గచే రెండవది గతార్థమగునని యప్పకవి
యుపసర్గ వింశతినే చెప్పెనఁవాడయ్యె.

ఈ యిరువది యుపసర్గలలో 'పరా, ఆఙ్, అపి' అను మూఁడు తెనుఁ
గున - అనఁగాఁ దత్సమభాషలోఁ బ్రయోగింపఁబడవు గాన, నవిగాక తక్కిన
పదునేడింటికి స్వరము పరమయి సంధిగూడిన శబ్దములం దుభయయతి చెల్లును.

ప్ర + ఆప్తి-ప్రాప్తి. ఇందు 'ప్ర'అను నుపసర్గకు స్వరము పరమయి సంధి
కలిగినది. (ఇది సవర్ణదీర్ఘ సంధి) ఇచ్చోఁ బరపదాదిస్వరమునకుఁ గాని సంధి
యందుఁగూడిన వ్యంజనమునకుఁ గాని యతిగూర్పవచ్చు. అనఁగా నిందు అకా
రమునకుఁగాని, ప్రవర్ణమునకుఁగాని యతి చెల్లును.

133-వ పద్యము ప్రాదియతికి అప్పకవి స్వీయలక్ష్యము.

1. పా అబ్జ (ప్రఁ + ఆప్తి) ప్రాప్తి-(స్వరమైత్రి)

2. పా పద్మ ప్రాప్తి-(సంయుక్తము గాన పకారమున కొకదానికి
వ్యంజన మైత్రి)

3 పా. రజత-ప్రాప్తి— (సంయుక్తములో రేఫమునకు వ్యంజన మైత్రి)

ప్రవర్ణము సంయుక్తమగుటచే వ్యంజనమైత్రికి రెండు హల్లులఁ బ్రత్యేకముగా యతిచేసి చూపినాఁ డప్పకవి.

ఉపసర్గలలో మొదటిదగు 'ప్ర' కారమున కుభయయత్యుదాహృతులఁ జూపి తక్కినవానికట్లే స్వరవ్యంజనములు చెల్లునని తెలిసికొనవలయుననే యప్పకవి చెప్పుచున్నాఁడు.

విశే. ఈ ప్రాదియతుల కితర గ్రంథములనుండి లక్ష్యమొక్కటేని యప్పకవి చూపకపోవుట వింత. ప్రాదియతికి లక్ష్యములు కవిత్రయ భారతమునందే కోకొల్లలుగాఁ గలవు. ఇఁక నితర గ్రంథములఁగూర్చి చెప్పనేల! కస్తూరి రంగకవి యుపసర్గలన్నింటి కుభయయతి లక్ష్యముల నితర గ్రంథముల నుండి చూపి యున్నాఁడు.

ఉపసర్గ లిరువదిరెండని సంస్కృత వ్యాకరణములు చెప్పుచున్నను దెనుఁగు లాక్షణికు లిరువది యనియే వ్రాసినారు. అప్పకవి యిచ్చిన శ్లోకమందును 'ఉపసర్గాస్తు వింశతి' యనియే చెప్పఁబడియున్నది. ఈ శ్లోకమెందలిదో? అప్పకవియే స్వయముగ రచించెనా?

ఇఁక ఆంధ్రమునకుఁ జేరని పరాజపులఁగూర్చిన పరామర్శ:

కవిజనాశ్రయములో 'ఉపసర్గ వింశతికి వళ్ళుపరిస్వరయుక్తమైన నుభయము చెల్లున్' అని యే యుపసర్గకు నిషేధము చెప్పఁబడలేదు. అప్యాజ్ అను నిరూపణ సుప్రసిద్ధమని కావ్యాలంకారచూడామణి. పరాజపులు చొరవు తెలుఁగు బాసను నెందున్ అని యనంతుని ఛందము. అనంతు ననుసరించినాఁ డప్పకవి.

పరాజపులు మూఁడు తెలుఁగులో అనఁగాఁ దత్సమాంధ్ర భాషలో రావని యప్పకవ్యాదుల యభిప్రాయము. ఇది విమర్శనీయము.

పరాక్రమ (పరా + అక్రమ), పరేత (పరా + ఇత) పరోఢ, పరావృత్త పరామృష్ట, ఇత్యాది శబ్దములందు 'పరా' యను నుపసర్గ కలదు. ఇవియన్నియుఁ దెనుఁగునఁ బ్రయోగార్హములు. కావ్యాలంకార చూడామణిలోఁ బ్రాది యతిలోఁ బరేత పరోఢశబ్దము లుదాహృతములు.

రిపుల విశసించుచోటఁ బ + రేతనాథుఁ
డుర్విరక్షించుచోటఁబ + రోఢభుజుఁడు (7-49)

'అపి'తో నచ్చుచేరుట సాధారణముగఁ గానరాదు. కాని 'అప్యయ'శబ్ద మొకటి యున్నది. అపి + అయ-అప్యయము. అప్యయమనఁగా లయనిశ యర్థము. రంగరవి అప్యయశబ్దమున కుభయయతి లక్ష్యములఁ జూపెను.

భవా, ప్యయ సహిత విశుద్ధ సంవి + దాత్మక (స్వరమైత్రి).
జన్యా, ప్యయ దూరానందరూప + భాసురదత్తా (వ్యంజనమైత్రి)
(రంగరాట్ఛందము 3-339, 340)

'అజ్' అను ఉపసర్గములోని తుది జకార ముత్తరపదము పరంబగునపుడు లోపించును. ఆక్రాంతము, ఆరంభము ఆగమనము మున్నగు శబ్దములందు మొదటనున్నది 'అజ్'అను నుపసర్గ. 'అజ్' పైస్వరముపరమగునేని జకారము లోపించును గాన సంధిలో వ్యంజనము నిలువదు.

అజ్ + ఉదక-ఆ + ఉదక-ఓదకము. అజ్ + నంద-ఆనంద, సమ్, ఉత్, దుర్ ఇత్యాదులందువలె స్వరము పరముకాఁగాఁ బూర్వహల్లు పరస్వరము తోఁజేరుట కిందు వీలులేదు. 'సమ్ + అంచిత-సమంచిత'ఇందు సంధిలో మకార హల్లు నిలుచును; ఇట్లు అజ్ఞుపసర్గలో నిలువదు. 'అజ్ + ఉదక' అనుచోజ కారహల్లు లోపించును. ఆ + ఉదక-ఓదకమనురూపము సిద్ధించును. జకారము లోపించుటచే ఆకారస్వరము మాత్రమే పూర్వమున నిలుచును. కాన దీని నుభయ యతి యనుట కవకాశములేదు. వీనినెల్లఁ బరికింపగా ఒక్క 'అజ్' ఉపసర్గకు మాత్రమే ప్రాద్యుభయయతిలోఁ బ్రసక్తి గలుగదని స్పష్టమగును. ఉభయయతి యోగము లేదుగాని, అప్పయోగ మాంధ్రమునను గలదు. ఆంధ్రమునకుఁజేరని పరాజపులను నప్పకవి వాక్యము సరికాదు. మఱి 'పరా, అపి' అను రెంటి కుభయయతియుఁ జెల్లును. ప్రాదులలో 'అజ్' అనుదానికి మాత్ర ముభయయతి చెల్లుటకు వీలులేదని వ్రాయుట సమంజసము.

అప్పకవి యీ ప్రాదియతి కితరుల లక్ష్యములు చూపలేదు గాన భారతాదు లలోని కతిపయ ప్రయోగముల నొసఁగెద:—

ఆ విపినాంతరంబునని + రంతర నిష (భార-సభా-1-138) నిర్ + అంతర
ఇందు స్వరమైత్రి.
బా, రత్యమరాపగొఘము ని + రంతర (భార ఆది-1-73)
ఇందు వ్యంజనమైత్రి.
స, మున్నతత్వంబు పంశ్రయ + యోగ్య (భార-శాంతి-3-105)
స్వరమైత్రి
మునివర యేను భీతుఁడ స + ముజ్జ్వల (భార-శాంతి-3-359)
వ్యంజనమైత్రి.

యత్న విడిగదా స + మగ్రఫలత్వంబు (భార-శాంతి-3-217)స్వరమైత్రి;
మస్తకముచేర్చి భక్తి స + మగ్ర (భార-శాంతి-3-209)వ్యంజనమైత్రి.
ఈ వానంటరి పీడఁబొందు పసులన్ + వీక్షించి (హరి-పూ-7-181)
స్వరమైత్రి.
వెగవద్దేవుని నాశ్రయింపుఁడతనిన్ + వీక్షించి (హరి-పూ-8-95)
వ్యంజనమైత్రి,

## 32. నిత్యసమాస విశ్రాంతులు

తే. ఒక్క సమసనమున శబ్ద । యుగము గూడి
పదములేర్పాటుగాఁ గాన । బడని ప్రాణ
సంధులకు నిత్యసమసన । శ్రాంతులును న
ఖండ విశ్రమములునన । రెండుఁజెల్లు 135

క. లోకంబునఁ గర్ణాట వ
నౌకోద్వీపాంతరీప । నాస్తి పదార్థా
నేకాన్యోన్య జనార్దన
నాకాదులు నిత్యసమస । నము లంద్రు బుధుల్. 136

వ. ఆదిశబ్దముచేత మందార నారికేళ శబ్దాదులు మఱియు ననేక
ములు గలవు.

వి. పదవిభాగము సాధారణముగాఁదోఁపని సమాసములు నిత్యసమాస
ములు. ఒకే సమాసమున రెండు శబ్దములు స్వరసంధినేఁగూడి వేర్పాటుగాఁ
(వేర్వేరుగా) గానఁబడక యేకశబ్దమువలెఁ దోఁచునపు డా సంధ్యక్షరమున
కుభయయతి చెల్లును. దీనిని నిత్యసమాస విశ్రాంతియనియు, అఖండయతి
యనియుఁబేర్కొందురు.

అట్టి నిత్యసమాస శబ్దము లెవ్వియనిన:—

| | | | |
|---|---|---|---|
| కర్ణాట | (కర్ణ + అట), | వనౌక | (వన + ఓక) |
| ద్వీప | (ద్వి + అప్), | అంతరీప | (అంతర్ + అప్) |
| నాస్తి | (న + అస్తి), | పదార్థ | (పద + అర్థ) |
| అనేక | (న + ఏక), | అన్యోన్య | (అన్య + అన్య) |
| జనార్దన | (జన + అర్దన), | నాక | (న + అక) |

అడిశబ్దముచే నీ నిత్య సమాసములలోఁ జేరఁదగినవి యింకను నెన్నో కలవని యెఱుఁగవలెను. మందార (మంద + అర), నారికేళ (నారిక + ఈళ) శబ్దాదు లనేకములు గలవని యప్పకవి చెప్పుచున్నాడు.

నిత్యసమాసమనఁగా నేమో యించుక వివరింపఁబడును:-

విగ్రహ వాక్యములేని సమాసములును, స్వపదములతో విగ్రహములేని సమాసములను, నిత్య సమాసము లనఁబడును. (అవిగ్రహో అస్వపద విగ్రహో వా నిత్యసమాసః.*సమాసార్థమును బోధించు వాక్యము విగ్రహము. ఉ॥ రాజ సేవకుఁడు-రాజుయొక్క సేవకుఁడు (రాజసేవకః రాజ్ఞః సేవకః)

అవిగ్రహమున కుదాహృతి : ఉన్మత్తగంగము-ఇది యొకానొక దేశము పేరు. దీనికి విగ్రహముచెప్పు నలవాటులేదు. ఇందు విగ్రహము చెప్పినను దేశమున కర్థముగాదు.

అస్వపద విగ్రహమున కుదాహృతి : ప్రతి గృహము (గృహే గృహే-గృహమున గృహమున—ఇందు ప్రతిశబ్దము విగ్రహమునఁ జెప్పఁబడదు;) ఇట్లే కుంభకారుడు-మొ.

కుంభకారుఁడను సమాసమున విగ్రహమున కార శబ్దమును వేఱుగాఁ జెప్పుటలేదు. కారశబ్దము విడిగాఁ బ్రయోగింపఁబడదు.

సమాసమందలి యన్ని పదములు విగ్రహమునఁ జూపఁబడక యందొక పదమునకు మాఱుగా నా స్థానమున దాని యర్థము గలిగిన మఱొక పదము చెప్పఁబడుట యస్వపద విగ్రహమగును. ఇట్టి నిత్య సమాస శబ్దములందు స్వర సంధియున్నచోట నుభయయతి చెల్లునని యరయవలెను. మఱియు నిత్యసమాసములు గాకున్నను నిత్యసమాసములవలెఁ దోఁచు కొన్ని విశిష్టపదములం దీయతి చెల్లుబడి యగునని ప్రయోగములఁబట్టి యెఱుఁగఁజనును. ఆ విశిష్ట పదములు శబ్దద్వయిమేళనముచే నేకపదము (అఖండ శబ్దము) వలె భాసించుచుండుటంబట్టి నిత్యసమాసములవంటివిగా గ్రహింపవలయు.

అప్పకవి యొసఁగిన కర్ణాటవనౌకోద్వీప జనార్దనాది శబ్దములు సంజ్ఞా వాచకము లగుటచే సవిగ్రహములగు నిత్యసమాసములుగా చెప్పనగును.

---

* అనంతుని నిత్యసమాస నిర్వచనము :-

పదము విభజించి చెప్పఁ జొప్పడని యదియు
నన్య శబ్దంబుఁగొని విగ్రహంబుఁ జెప్పు
నదియు నిత్యసమాసమై యతిశయిల్లు
నట్టి సంధుల నచ్చు హల్లైన విరతి (ఛందో-1-98)

ఇఁక నప్పకవి నిత్యసమాసయతికిఁ జూపిన యితరకవి లక్ష్యములు:— కర్ణాటాది శబ్దములందు నందలి స్వరసంధినిబట్టి స్వరప్రధానవడిచే స్వరమునకేని, అఖండ శబ్దముగా భావించి హల్లునకేని యతి యుభయరీతులఁ గూర్పవచ్చును.

కర్ణాట శబ్దమునకు రామాయణమునందు (కిష్కింధ-826)

శా. లాటీచందనచర్చ చోళమహిళాలా । వణ్యసామగ్రి క
ర్ణాటీ గీత కళాసరస్వతి కళిం । గాంతఃపురీ మల్లికా
వాటీ మంజరి గౌళవామ నయనా । వక్షోజహారాళియై
పాటింపందగు నీదుకీర్తి రథినీ । పాలాగ్రణీ సాహిణీ. 138

వి. 2. పాదమున-కర్ణ + అటీ........కళింగ + అంతః (స్వరయతి)

శ్రీనాథుని వీథినాటకమునందు—

మ. కుసుమం బద్దిన చీరకొంగు వొలయం । గ్రొవ్వారు పాలిండ్లపైఁ
దిసరంబుల్ పొలుపార వేణియవటూ । దేశంబుపై రాయఁగాఁ
బసనెవ్వాఁడొ యొకండు రాత్రిరతులం । బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది క । ర్ణాటాంగనంగంటిరే.

వి 4-వ పా. లో. న్వసి (నకారమునకు)........క + ర్ణాట (వ్యంజనమైత్రి)

కర్ణ + అట-కర్ణాట-ఇది దేశవిశేషము. ఇది సంజ్ఞ గాన నిత్యసమాసమగును. కర్ణేషు అటతి ప్రభూత యశస్విన ఏతద్దేశస్థరాజ్ఞో గుణాది కీర్తనేన సర్వేషాం కర్ణేషు భ్రమతీతి 'కర్ణాటః' అని శబ్దకల్పద్రుమమున అర్థము నిర్వచింపఁబడినది. కర్ణాటభాషయను పర్థమునఁగూడఁ జెవులయందు సంచరించునది-యనఁగా వీనులవిందైనదని చెప్పుదురు.

వ. వనౌకశబ్దమునకు వనే కాననే ఓకఃస్థాన మస్యేతి వనౌకాః. 140

అథర్వణాచార్యుల విరాట పర్వమునందు

క. శ్రీకంఠుఁడెదురునపుడు వ
నౌకోద్ధ్వజ మింద్రమకుట । మర్జున తురగా
నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్న । నతఁడేమగునో. 141

వి. పా. 2 లో-వన + ఓక .......+ అర్జున (వృద్ధి స్వరయతి)

ఇందు వనౌకశబ్దము వృద్ధిసంధిచే నేర్పడినది గాన స్వరయతిభేదమగు వృద్ధియతి ననుసరించి యీ శబ్దమున (వన + ఓక-వనౌక) సహజముగనున్న ఓకారమునకు ఆదేశముగవచ్చిన ఔకారమునకును యతి చెల్లును (చూ. వృద్ధి యతి). ఇందు స్వరయతిలో ఔకారమునకు మైత్రి చేయఁబడినది. ఓకారమునకు మైత్రి చేయవచ్చును.

చ. దానియందు.

క. ఆకర్ణ దురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యా । మై ద్రోణునితో
నాకనదీసుతుఁడనియె వ
నౌకోధ్వజ మెఱుఁగవచ్చు । నరుఁజూపితగన్. 142

వి. 4. పా. ఔ-వనౌక...... + నరు (వ్యంజనమైత్రి)

వనే కాననే ఓకః స్థానమస్యేతి వనౌకాః-వనమనఁగా నరణ్యము, ఓక మనఁగా నివాసము; ఇది సకారాంత శబ్దము సంస్కృతమున నియ్యది వనౌక శ్శబ్దము. తత్సమమున వనౌకస్సు, వనౌకము అనురూపములఁ దాల్చును. వనము నివాసముగాఁ గలవి వనౌకసము; కోఁతి వనౌకశ్శబ్దమునకు 'వనమ్ ఓకః యస్యః' అను విగ్రహముకలదు గాని యియ్యది వానరమను నర్థమున సంజ్ఞయగుటచే నిత్యసమాసమనఁదగును. 'మర్కటో వానరః కీశో వనౌకాః' అని యమరము. ద్వీపశబ్దమునకుఁ గావ్యాలంకార చూడామణియందు-(7-65)

ఉ. ద్వీపులఁ ద్రుంచు విశ్వజగ । తీపతి యత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు । నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నయై
గోమతిధేను వవ్విభున । కుం దన వైభవ మిచ్చెఁగాక యే
భూపతు లీ వదాన్యగుణ । బుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్.

వి. 1 పా ద్వీపుల...... + తీపతి-(వ్యంజనమైత్రి)
2. ద్వీప (ద్వి + అప్-ద్వి + ఈప్)... + ఇమ్ముగ (స్వరమైత్రి)

(ఈ రూప నిష్పత్తి క్రింది వివరణమునఁగాంచనగును)
నైషధమునందు (1-44) 4

సీ. పా. వితత నవద్వీప । ద్వీపనానాయి
శ్రీవధూటీ సమాశ్లిష్ట భుజుఁడు. 144

వి. వితత...... + ద్వీప (వ్యంజనమైత్రి)

వ. అంతరీప ప్రతీప శబ్దములకును ఇటువలెనే. 145

వి. ద్విధాగతాః ఆపః అస్మిన్నితి ద్వీపః అని వ్యుత్పత్త్యర్థము. (దీనియందు జలము రెండు భాగములుగా నిరుప్రక్కల (బ్రవహించును) అపామంతః మధ్యే మంతరీపం (జల మధ్యమంతరీపము) అంతర్గతా ఆపః అస్మిన్నితివా- (దీనియందు జల మంతర్గతమై యుండును) అని రెండు విధములు వ్యుత్పత్తి గురుబాల ప్రబోధికలోఁ జూపఁబడినవి. ప్రతీపశబ్ద మమరమున నొసఁగఁబడ లేదు గాన వ్యుత్పత్తి గురుబాల ప్రబోధికలోఁ జెప్పఁబడలేదు. ద్వీపాదిశబ్దము లకు సమాసవిగ్రహములున్నను నవి సంజ్ఞలగుటచే నిత్యసమాసము లనఁ దగును. ఇందలి సంధిరూపము విలక్షణమైనది గాని దాని కించుక వివృతి చూపఁబడును 'ద్వ్యంతరుపసర్గేభ్యోప ఈత్' అను సూత్రమువలన ద్వి, అంతర్, ఉపసర్గలకుఁ బరమైన 'అప్' శబ్దము ప్రథమాక్షరంబగు అకారమునకు ఈకార మాదేశమగును.

ద్వి + అప్ - ద్వి + ఈప్ - ద్వీప, ఇట్లే అంతర్ + అప్ - అంతరీప, ప్రతి + అప్ ప్రతీప (ప్రతి - ఉపసర్గ) ఈ శబ్దముల సంధిలోఁ బరస్వరము అకారమే యయ్యును ఆదేశమగు ఈకారమునకే యతి ప్రయోగములందుఁ గానఁబడును. గూఢముగ నున్న అకార స్వరమైత్రికి లక్ష్యము మృగ్యము. ప్రతికూలా ఆపో యస్మిన్ ప్రతీపమ్ అని శబ్దకల్పద్రుమ వ్యుత్పత్తి.

నాస్తి పదమునకు శృంగార నైషధమునందు—

సీ గీ. తల్లియును దండ్రి దైవంబు । తలఁప గురుఁడ
కాఁడె యితఁడేమి చేసినఁ । గనలఁదగునె
నాస్తికాధమ యోరి య । న్యాయవృత్తి
'నాస్తి తత్త్వం గురోః పర' । మ్మనఁగ వినవె. 146

వి. 4 పా. లో - న + అస్తి, (నాస్తి)........పరమ్ము + అనఁగ (స్వరమైత్రి)

ఇందు మూఁడవ పాదమునను నాస్తి శబ్దమునకు యతిగలదు గాని యందు యతి స్థానములో 'న్య' కారముండుటచే న కార యకారములలో దేనికేనిఁ జెల్ల వచ్చుఁ గాన స్వరవ్యంజనములలో నేదో యొక్కటేయని నిరూపింప వీలు పడదు.

విష్ణుచిత్తీయమునందు (1-81)

శా. ఆ నిష్ఠానిధిగేహసీమ నడు రే । యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం । దివ్యప్రబంధాను సం

ధానధ్వానము 'నా స్తిశాకబహుతా, । నాస్త్యుష్ణతా, నా స్త్యపూ
పో; నాస్త్యోదనసౌష్ఠవంచ, కృపయా । భో క్తవ్య'మన్వల్కు లున్.

వి. ఇందు 3 పా; ంధా....——+నా స్తి (వ్యంజనమైత్రి-ఇది బిందుయతి యగునని యెఱుఁగనది).

నా స్తి శబ్దము సమాసముగాదు. 'అసభువి' యని ధాతుపాఠము (ఉండుట యని యర్థము), అసధాతువు యొక్క లడర్థ ప్రథమ పురుషైక వచనరూపము అ స్తియగును. ఇది క్రియయే యైనను తిఙంత ప్రతిరూప కార్యముగాఁ గ్రహింప బడును. న+అ స్తి-నా స్తి యగును. ఇదియు నవ్యయమే కాని దీనిని నిత్య సమాసముగాఁ జెప్ప వీలులేదని విజ్ఞుల యాశయము. కాని 'అస్తి' యన్నది యవ్యయ పదమగుటచేఁ దత్పూర్వము నఞర్థకనశబ్దము నిలిచి సమసించి నిత్య సమాసమగునని గ్రహింపఁబడును. నఞ్సమాసము అవిగ్రహంబగు నిత్యసమా సముగా నెన్నఁదగును. నా స్తిశబ్దమునుండియే నా స్తికత ఇత్యాది శబ్దము లుత్పన్నములైనవి. వీని కుభయయతి చెల్లును.

పదార్థ శబ్దమునకు సాంబ విలాసమునందు—

తే. హలికి నెదురేఁగి సకల ప । దార్థములు ను
పాయము వెట్టి నీముద్దు । పట్టితోడ
జాంబవంతుని దౌహిత్రు । శౌరిపుత్రు
సాంబు నొప్పించి బ్రతికించు । సకలజనుల. 148

వి. 1. పా. లో-హలి........పద+అర్థ (పదార్థ)-స్వరమైత్రి.

భాస్కరశతకమునందు—

ఉ. దక్షత లేనియింటికిఁ బదార్థము వేఱొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁగల్లగాదు ప్ర
త్యక్షమువాగులు న్వఱదలన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి దెగినట్టి తటాకములోన భాస్కరా.

వి. పా. లో-దక్షత——ప+దార్థము. (వ్యంజనమైత్రి) పదార్థశబ్దము నకు 'పదస్య అర్థః' అను విగ్రహము కలదు. గాని యిట్టి విగ్రహమునఁ పదార్థము నకు శబ్దార్థమని యర్థము చెప్పవలసివచ్చు. ఇందుఁ బదార్థ మనఁగా వస్తువు. పై విగ్రహమువలన వస్తువను నర్థము రాదు; కావున నిదియు నిత్యసమాసమనఁ దగును.

148 పద్యములో రెండవపాదము నాదిలో ఉపాయన శబ్దమున్నది. ఇదియు నుభయయతి చెల్లదగిన శబ్దము. ఇందు వ్యంజనమైత్రి చేయఁబడినది. ఇది ప్రాదియతి యగును. మఱి నాల్గవ పాదము మొదట సాంబశబ్దము గలదు. పద్యమును బద్ధార్థమునకై యుదాహరించె. మఱి రెండుచోట్ల నుభయయతి గలదని ప్రసక్తానుప్రసక్తముగాఁ జూపఁబడినది.

అనేక శబ్దమునకు విష్ణుచిత్తీయమునందు (1-85)

క. తునియలు తొమ్మిదియఁట పదు
నెనమండ్రఁట మోచువార । నేకపకిటి కూ
ర్మనగాహు లేటిలావరు
లని తావక బాహు వొకటి । యవని భరించెన్. 150

వి. 2. పా. పది. ఎనమండ్రు అ+నేకప (న+ఏకప) స్వరమైత్రి.

కాళహస్తి మాహాత్మ్యమునందు (1-42)

ఉ॥ తాను గుమారజంగమ సు । ధాకర మౌళియుఁగూడిమాడియిం
పైన రతిప్రసంగముల । నర్ధనిమీలిత నేత్రపద్మముల్
మానని చుంబనంబులర । [1]మాటలు సొక్కులు వీడి వీడిపో
నీని కవుంగలింతలు న। నేక విలాసములుం జెలంగఁగాన్. 151

వి. 4. పా. వీడిపోన్. ఈని....అ+నేక (న+ఏక)-స్వరమైత్రి.

కర్ణపర్వమునందు (2-355)

ఉ॥ క్రొగ్గెడు వాహనంబులును । మోములు ద్రెళ్ళఁగ జారువాజులు
న్దిగ్గి తొలంగు సైనికుల । నేకులు గష్టపుఁబాటు చొప్పడన్
*మ్రగ్గు సిడంబులుం గులముమాటికి నేటియెదిర్చియొంటిమై
మ్రగ్గెడు వారునై కురుధ । రావరుసైన్యము రూపుమాయఁగాన్.

వి. పా. న్దిగ్గి (సంయుక్తములోని నివర్ణమునకు)- అ+నేకులు (వ్యంజనమైత్రి)

---

1. మాటలసొమ్ములు

* మ్రొగ్గు.......మూఁటికి.........యదిర్చి.

ఆముక్తమాల్యద యందు (1-52)

చ. మలిచి పయోజకోశముల । మాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశవుఁబెట్టి డాల్పామిడి । కంబులతో నపరంజియోడు బి
శ్శల నలవై జయంతముఁ జ । లంబున గెల్వఁదదంశితంబులై
నిలిచినభంగి మాడువుల।నేకము లుల్లసిలుం బురంబునన్ 153

వి. 4. పా. ని......... అ + నేక (వ్యంజనమైత్రి)

వ. అనాది అనంత అనంగ అనూరుశబ్దములు మొదలయిన నఞ్
సమాసముల కన్నిటికిని ఇటువలెనే రెండునుం జెప్పవచ్చును.

వి. అనేక శబ్దాదులసంధిరూప ప్రక్రియ :

నఞ్ - నిషేధార్థకము. నఞ్ అనునది సుబంతముతో సమసించును. అప్పుడు ఞకారము లోపించును (ఞకారమిత్సంజ్ఞకము)

అచ్చుపరంబగుచో నఞ్ యొక్క నకారము 'అన్'గాను, హల్లు పరంబగుచో నకారము 'అ' గాను మారును

న + ఏక = అన్ + ఏక — అనేక
న + ఆది = అన్ + ఆది - అనాది
న + అంత = అన్ + అంత ... అనంత
న = అంగ = అన్ + అంగ — అనంగ
న = ఊరు = అన్ + ఊరు — అనూరు
} అచ్చుపరమైనవి.

న + సత్యము — అసత్యము
న + ధర్మము — అధర్మము
} హల్లుపరమైనవి.

వీనికి నఞ్ సమాసములని పేరు.

అచ్చుపరమగునపుడే యుభయయతికిఁ బ్రసక్తిగలదు గాన హల్పరక నఞ్సమాసముల విషయమిం దవసరముగాదు.

పై నఞ్సమాసవిధిని దెల్పు పాణిని సూత్రము లివి :

(1) నఞ్ - నఞ్ అను నవ్యయంబు సుబంతముతోడ వికల్పముగ సమసించును.

(2) నలోపోనఞః ఉత్తరపదంబు పరంబగుచో నఞ్‌యొక్క నకారమునకు లోపంబగు.

(3) తస్మాన్నుడచి - లుప్తనకారంబగు నఞ్ఞుకంటెఁ బరంబగు అజాద్యుత్తర పదంబునకు నుట్ (న్) ఆగమంబగును.
(1)నఞ్ + ఏక
(2)న + ఏక-అ + ఏక
(3) అ + న్ + ఏక-అనేక.

అనేక, అనంత ఇత్యాది నఞ్సమాసశబ్దములం దుత్తరపదాదిస్వరమునకుఁ గాని, సంధిలో నిలిచిన నకారవ్యంజనమునకుఁగాని యతి ఘటింపవచ్చును.

ప్రాదిసమాసములవలె నఞ్సమాసములును నిత్యసమాసములే. నిత్యసమాసయతిలోఁ జెప్పక ప్రాదియతులని ప్రత్యేక యతిభేదము చెప్పినట్లే నఞ్సమాసయతులని ప్రత్యేకముగఁ జెప్పియుండదగును. కర్ణాట జనార్దనాదులు ఏకైక శబ్దములు. నఞ్సమాసశబ్దము లట్టివిగావు. అనవసరముగ యతిభేదములఁ బెంచిన యప్పకవి 'అనాది అనంత అనూరు శబ్దములు మొదలైన నఞ్సమాసమున కన్నిటి కిటువలెనే తెలియునది' యని నిర్దేశించుటకన్న నఞ్సమాస యతిభేదమును గల్పించియుండవచ్చు. కూచిమంచి తిమ్మన, కస్తూరి రంగకవి నఞ్సమాసయతిని జెప్పియున్నారు.

అన్యోన్యశబ్దమునకుఁ గావ్యాలంకార చూడామణియందు : (7-68)

ఉ. ధన్యుఁడ విశ్వభూవిభుఁడు । ధారణినేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వ సంపదల । నొందిరి దంపతు లింపునింప న
న్యోన్య సుఖానుకూలతల । నోమిరి విప్రులు వేల్పుపిండు న
న్యోన్య సుపుష్టికుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్.

వి. అన్యోన్య శబ్దరూపమును గూర్చి లుప్త విసర్గ స్వరవళి క్రింద వివరింపఁ బడినది. అన్య + అన్య-అన్యోన్య-ఇది నిత్యసమాసమగుటంజేసి యుభయ యతి చెల్లును. అనఁగా స్వరమైత్రియుఁ గూర్చనగును.

అన్యోన్య శబ్దములో స్వరమైత్రికి లుప్త విసర్గక స్వరవళి ప్రకారము అకారము చెల్లుననుట. వ్యంజన మైత్రికి నకార యకారములు చెల్లును. ఇది సంయుక్తాక్షరము గాన సంయుక్త యతినిబట్టి యేదేని హల్లునకు యతి చేయవచ్చు.

పై పద్యము విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి యను లక్షణ గ్రంథములోనిది. అందలి. ఛందస్సును తెలుపు నుల్లాసములో ఆదేశవళి నిరూపణము క్రింద లక్ష్యముగా నొసఁగబడిన పద్యమిది.

2. పా. అ, న్యోన్య (అన్య+అన్య) - ఒండిరి (యోకారవ్యంజనము నకు మైత్రి)

3. పా. అ, న్యోన్య... + నొమరి (నకార వ్యంజనమైత్రి)

4. పా. - అ, న్యోన్య...కుశల + అమల (సర్వమైత్రి)

ఈ లక్ష్యమందు రెండవ మూఁడవ పాదములందు న్యో యను వ్యంజనము నకు యతి మైత్రి, అందొకచో సంయుక్త యతివలన యకారమునకు మరొ కచో నకారమునకును యతులుచేసి చూపఁబడినవి. నాల్గవపాదమున లుప్త విసర్గక స్వరయతియని గ్రహించునది.

జనార్దనశబ్దమునకు—

వ. జనార్దనయతి సుఖయతీతి జనార్దనః అర్దగతౌ యాచనేచ. 'విష్వక్సేనో జనార్దన' ఇత్యమరః.

సాంబవిలాసమునందు—

క. శరధి సుతాకళత్ర నవసారసనేత్ర బలాంతకాది ని
ర్జర సుతనామ పాతకవిరామ విహంగమ యాన చారుక
ర్బుర పరిధాన పాండవ విరోధి విభంజన నిర్మలాత్మ కా
యరుచి జితాబ్జభంజన జనార్దన కైటభదైత్యమర్దనా. 156

ఆరణ్యపర్వమునందు (397)

చ॥ నగినగి యేనియు న్నీను జనార్దన యెన్నఁడు బొంకునల్క మ
త్యగణిత విక్రమోరు బలధైర్య సమగ్రుల మట్లుగాక కా
లగతి దొలంగఁ ద్రోవఁగఁ దలంబగునే యగుఁగాక నీకు మె
చ్చుగనిదె ప్రాణమిచ్చెదము గ్రుక్కము చావున కాత్మ
నేమియున్. 157

వి. జనార్దన శబ్దమునకు జనార్దనయతి సుఖయతి - జనులను సుఖపెట్టు వాఁడను వ్యుత్పత్తిని జెప్పినాఁ డప్పకవి. కాని గురుబాలప్రబోధికలో నిట్టున్నది- సముద్రమధ్యవర్తినో జననామ్నోఽసురానర్దితవానితి జనార్దనః సముద్రమధ్యమందుండెడు జనులనెడు నసురులను బీడించినవాడు. ప్రళయ కాలే జనాన్సర్వానపి అర్దయతీతివా జనార్దనః — ప్రళయకాలమందు దెల్లజను లను బీడించువాఁడు. అర్దపీడనే, అప్పకవి వ్యుత్పత్తి గురబాలప్రబోధికా వ్యుత్పత్తి భిన్నమార్గముల నడచినవి.

ఎట్లు వ్యుత్పత్తి చెప్పినను అర్ద ధాతువున్నది: కాన స్వరసంధి గల దనుట తెల్లము. ఇది నిత్య సమాసము గాన (విఘ్నసకు సంజ్ఞ) నుభయయతి చెల్లును.

156 పద్యము-4. పా.

కా, య . . . జ + ార్దన (జన + అర్దన)-స్వర మైత్రి.

157 పద్యము - 1 పా.

గిసగి . . . జ + నార్దన-వ్యంజనమైత్రి.

వ. నాకశబ్దమునకు, నవిద్యతే అకం దుఃఖమిత్రేతి నాకః
'స్వరవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయా' ఇత్యమరః.

గౌరరాజు చాటుధార-

ఉ. ప్రాకటదర్పులై సకల । రాయని లక్క-నృపాలు నాజిలోఁ
దాఁకు విరోధిసైన్యము ము । దంబొదవన్వరియింప వచ్చుచో
నాకసమెల్లఁ గ్రమ్ముకొను । నంచిత దివ్యవిమాన సంచర
న్నాక విలాసినీ చరణ । హంసక భూరి ఝణం ఝణ ధ్వనుల్.

విరాటపర్వమునందు (5-124):

క. మును వెఱతునేయ మీరలు
నను నేసినఁగాని యనుడు । నా కేశసుతున్
ధనురాచార్యుఁడు డెబ్బది
సునిశిత బాణముల నేసెఁ । జూపఱు వొగడన్. 159

కావ్యాలంకార చూడామణియందు (7-66)

క. నీ కరవాలము పాలై
నాకంబునఁకేగి* రాజ । నారాయణ యా
భూకాంతు లెట్టిచనవో
నాక విటోత్తములఁ చూల । నడుతురు కడిమిన్. 160

వ. ఇట్టి సమాసశబ్దము లెన్ని యున్నను అన్నిటికిని ఇటువలెనే అని తెలిసికొనునది.

---

*నాకంబునకేఁగి రాజనారాయణ అప్పకవీయపాఠము ఇది సరికాదు.

వి: ఇంతకుముందు 'అనేక అనంత' మున్నగు నఞ్సమాసశబ్దములం దుభయయతి చూపఁబడెను. ఇందు నఞ్సమాసమగు నాకశబ్దమున కుభయయతి ప్రదర్శింపఁబడును.

అనేకాదిశబ్దములలో నఞ్లోని నకారలోపమును నుడాగమమును గాన నగును. నాకశబ్దములో నకారలోపము కాదు.

న + అక-'అన్ + అక-అనక' అనురీతి రూపము సిద్ధింపదు. కకార ముతో సంధిచేయఁబడి 'న + అక-నాక' (సవర్ణదీర్ఘసంధి) అను రూపము సిద్ధించును. అనేకాది నఞ్సమాసములలో నకారలోప నుడాగమముల కలిమియు, నాకాదులలో నకారలోపాదుల లేమియు భేదముగా నరయఁదగును అనేకాదుల కుభయయతి చెల్లుబడియగునట్లు నాకాదులకు నుభయయతి చెల్లుననిగ్రాహ్యము. నాకాది శబ్దరూపములు వ్యాకరణమున నిపాతములని యెఱుంగఁదగును. 'నభ్రాణ్ణపాన్న వేదా నాసత్యా నముచి నకుల నఖ నపుంసక నక్షత్ర నక్రనాకేషుప్రకృత్యా' అని పాణినీయసూత్రము. నభ్రాట్, నపాత్, నవేద నాసత్య, నముచి, నకుల నఖ, నపుంసక, నక్షత్ర, నక్ర, నాక, అను శబ్దములందు నకారలోపము లేదు. నభ్రాజతే ఇతి నభ్రాట్, నముంచతీతినముచిః, నవిద్యతే కులమస్య నకులమ్, నస్త్రీ నచపుమాన్ నపుంసకః, నక్షరతీతి నక్షత్రమ్, నక్రామతీతినక్రః, నఅకమస్మిన్నితినాకః-అనురీతి వ్యుత్పత్తులు చెప్పబడును. నభ్రాడిత్యాది శబ్దములలో అజాద్యుత్తరపదము లేదు. నాకనాసత్య శబ్దద్వయమందు మాత్రము అజాద్యుత్తరపదము గలదు.

న + అక-నాక (నాకము) అకమనఁగా దుఃఖము. అది లేనిది నాకమనఁ బడును. నాకమనఁగా స్వర్గము.

న + సత్య-అసత్య-న + అసత్య-నాసత్య.

నవిద్యతే అసత్యం యయోస్తౌ-నాసత్యౌ, అసత్యములేనివారని యర్థము నాసత్యులనఁగా నశ్వినీదేవతలు. 'స్వర్వైద్యావశ్వినీసుతౌ నాసత్యావశ్వినౌదస్రావాశ్వినేయౌచ తావుభౌ' అని యమరము.

నాసత్యులు దేవలోకపు వైద్యులు. అసత్యములేనివారనఁగా మిక్కిలి సత్యముగలవారు, అనఁగా మిక్కిలి సాధువులని భావము. తెనుఁగులో వీరిని అశ్వినీదేవతలని వాడుకలోఁ జెప్పుదురు. అశ్వినీదేవతలను రూపము సాధువుగాదు, అశ్వినీసుతులనవచ్చు, లేదా అశ్విదేవత లనవలె. నాకశబ్దమునకువలె నాసత్యశబ్దమునకు నుభయయతి పొసఁగును ఇట్టి భావముచేతనే కాఁబోలు నఞ్సమాసశబ్దములకన్నిటి కిటువలెనేయని తెలిసికొనునదియని యప్పకవి యుపదేశించె.

అప్పకవి యిచ్చిన ఐక్యప్రదర్శనము :

158 ప. 4 పా.

నాక (న + అక).... + హంసక-ఇందు స్వరమైత్రి.

159 ప 2 పా.

నను ... ... + నాకేశ-ఇందు వ్యంజనమైత్రి.

160 ప. 2 పా. నాకంబు ........ + నారాయణ-వ్యంజనమైత్రి.

4 పా. నాక (న + అక).... .. తూలన్ + అడుతురు, స్వరమైత్రి.

విశ్వామిత్ర శబ్దమునకు రంగనాథుని రామాయణమునందు-

ద్విపద. ఎక్కడా గురుఁడని । యెఱుఁగని నీకు
నక్కటా గురుఁడ వి । శ్వామిత్రుఁడయ్యె 161

(భాస్కర) రామాయణమునందు (సుందర-263)

మ. హరకోదండ విఖండనుండు జనక । క్ష్మాధీశు జామాత భా
స్కర వంశాగ్రణి జానకీప్రియుఁడు వి।శ్వామిత్ర యాగాహితా
సుర సంహారి విరాధకాలుఁడు ఖరా।సుధ్వంసి మారీచ సం
హరుఁ డన్య ప్రమదా పరాఙ్ముఖుఁడయో । ధ్యానాయకుం
డాదటన్. 162

వి. విశ్వామిత్రశబ్దమున నుభయయతి చెల్లునని పై ప్రయోగములు చూపఁబడినవి. 161 పద్యము స్వరయతికి, 162 పద్యము వ్యంజనయతికి లక్ష్యము లగును.

విశే॥ ఇప్పట్టునఁ బరిశీలింపవలసిన యంశమొకటి గలదు. విశ్వామిత్ర శబ్దము నిత్యసమాసము గావచ్చుఁగాని యందు స్వరసంధి గానఁబడదు, అనఁగాఁ 'విశ్వ + అమిత్ర' అని పదవిభాగము చేయరాదనుట యనయనగును. 'మిత్రే చర్షౌ' అను పాణినీయ సూత్రముచే విశ్వామిత్ర శబ్దరూపము సిద్ధించును. మిత్రే చర్షౌ-విశ్వామిత్రః, ఋషౌకిమ్, విశ్వమిత్రో మాణవకః (సిద్ధాంతకౌముది)

ఋషియను నర్థమున మిత్రశబ్దము పరమగునేని విశ్వశబ్దము తుది అకారమునకు దీర్ఘమగును. విశ్వ + మిత్ర (ఒక ఋషి) విశ్వామిత్ర, ఋషివాచకము గానిచో విశ్వమిత్రుఁ డనురూప ముండును. ఈ రూప విధానమునుబట్టి యీ విశ్వామిత్ర శబ్దములో అజాద్యుత్తరపదము లేదనుట తెల్లము, అట్టిచో నుభయ యతి కిందు బ్రసక్తి గానరాదు. ఇందలి పూర్వపదాంత హ్రస్వాకారమునకు

గలిగిన దీర్ఘము (అకారము) నుద్దేశించి స్వరమైత్రి చేయఁబడినదని కొందఱన్నుదురు, గాని యింక నుందిందే చెప్పబడు క్విజ్ ప్రత్యయాంతశబ్దయతి విధానము ననుసరించి (187-189 పద్యములు) యట్టిది చెల్లనేరదని తెలియుచున్నది. కుమారాయిత, భద్రాయిత శబ్దములలో సిద్ధే స్వరసంధి లేక పూర్వపదాంత స్వరములకు దీర్ఘములు వచ్చును. వీనికి క్యజ్ ప్రత్యయాంతములని సంజ్ఞ. ఇందు స్వరయతి చెల్లదని యప్పకవి నిషేధించె.

పూర్వపదాంత హ్రస్వాకారము దీర్ఘమైనంత మాత్రమున స్వరమైత్రి చెల్లదని యెఱుంగవలెను. విశ్వామిత్ర కుమారాయితే త్యాది శబ్దములందుఁ బూర్వశబ్దస్వరమునకు దీర్ఘము వచ్చెను. అందు స్వరసంధిలేదని తెలియవలెను. కాని సాధారణ వ్యంజనయతి తప్ప స్వరయతి నెల్లనేరదు.

అట్లేని రంగనాథరామాయణ ప్రయోగము (విశ్వామిత్రశబ్దములో స్వరమైత్రి) సాధువు గాదనవలె. దీనికి సాధుత్వకల్పనము సుసాధ్యముగాదు గాని యీ క్రిందివిధముగా నెట్లో సరిపెట్టుకొనవలెను. స్థూలదృష్టితో విశ్వ + అమిత్ర అను సంధి నూహించి స్వరమైత్రి చేయఁబడిన దనవలెను. హరిశ్చంద్రునిపైఁ జలముపూని మాయలుపన్ని పెక్కిడుములఁ గుడిపించి యా ఋషి విశ్వమున కమిత్రుడయ్యెనను భావము రంగనాథాదికవులకుఁ గలిగియుండి యీ శబ్దములో స్వరప్రధానవళి చేయఁబడియుండునని యూహింపనగునేమో?

విశ్వశబ్దమునకు వసు, రాట్, అనునవి పరములయినపుడు తుది యచ్చునకు దీర్ఘము వచ్చును. (విశ్వస్యవసురాటో-పాణిని సూత్రము) విశ్వ + వసు విశ్వావసు, విశ్వ + రాట్-విశ్వారాట్, ఇట్టిదే విశ్వానరుడుగూడ, విశ్వామిత్రశబ్దమునకువలె వీనియందు నుభయయతి చెప్పవలసివచ్చుఁగాని వీని కట్టి ప్రయోగములు మృగ్యములు, విశ్వామిత్ర శబ్దమందువలె వీనియందు అజాద్యుత్తర పదస్ఫురణ కవకాశము లేదుగదా?

క్రింది వసుచరిత్ర పద్యమున విశ్వామిత్రశబ్దము 'విశ్వ + అమిత్ర' అనునర్థమునఁ జిత్రముగాఁ గూర్పఁబడినది.

శా. విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁ డుర్వింజెందెఁ గల్యాణమున్
విశ్వామిత్రులు గొల్వ రాముఁ డితఁ డుర్విం జెందెఁ గల్యాణమున్
(1-46)

ఇందు కవి రామునికి రామరాజునకు శబ్ద చమత్కారముచేఁ దారతమ్యమును వర్ణించుచున్నాఁడు. విశ్వామిత్రుని(విశ్వామిత్రుని కమిత్రుఁడయిన వానిని) గొలిచి యనఁగా విశ్వామిత్రమహామునిని సేవించి శ్రీరాముఁడు కల్యాణమును బొందెను. సీతను బరిణయమాడెననుట. ఈ రామరాజు (రాముఁడు) విశ్వ +

అమిత్రులు-సమస్త శత్రువులు తన్నుఁగొల్వఁగా నుర్వీయుండుఁ గల్యాణము ను (కల్యాణ పట్టణమును) బొందెనని భావము.

విశ్వామిత్రశబ్దములో నిట్టి సంధిస్ఫురణ కవకాశ మెంతయుఁ గలదని నిరూపించుటకే యీ పద్య ముద్ధరింపఁబడినది.

161 ప. 2. పా॥ అక్కట—వి+శ్వామిత్ర - స్వరయతి

విశ్వ+అమిత్ర-అని భేదము చేసికోవలె)

162 ప. 2. పా॥

భా, స్కర—వి+శ్వామిత్ర వ్యంజనయతి.

(పాదాదిలో 'స్క'లో సకారము. యతిస్థానములో శకారమున్నది. ఇది సంయుక్త యతి విధానమునకుఁ జెందును.)

భాస్కరుఁడు వ్యంజనమునకు రంగనాథుఁడు స్వరమునకు నిందు యతి చేసినవారని గోచరించును కాని రంగనాథరామాయణమున వ్యంజనమైత్రి చేయఁబడ్డ ప్రయోగములును గలవు. అప్పకవి యుదాహరింపలేదు.

చని మహామహుని వి+శ్వామిత్రుఁగనిన (బాల)
జరిపిన బ్రహ్మ వి+శ్వామిత్రుఁగదిసి (బాల)
ఆపోశన శబ్దమునకుఁ జమత్కార రామాయణమునందు—

క. ఓ శశిముఖి లోపాము
ద్రేశుఁడు కలశభవుఁడుండు । నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మునుపా
పోశనముగఁగొనియె సాగ । రాంబువు లెల్లన్. 163

శృంగార షష్ఠమునందు

సీ. గీ. తత్తరంబున నాపోశన । మెత్తబోయి
భూసురుండెత్తు నుత్తరా । పోశనంబు. 164

వి. అప+అశన-ఆపోశనము. 'అపాంసమూహః ఆపమ్, ఆపస్య అశనమ్ అస్మిన్నితి ఆపోశనమ్' అని వ్యుత్పత్తి చెప్పికోవలెను.

పుడిసిట జలము పోసికొని త్రాగుట యను క్రియగలది యాపోశనము. భోజనాద్యంతములందుఁ బుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగా బుచ్చుకొనుట యాపోశన మనఁబడును. పృషోదరాదిగణమునఁ జేరుటచే ఆపోశనమను రూపము సిద్ధించెను.

163వ 4 పా॥ ఆప+అశన (ఆపోశన)...సాగర + అంబువు (సాగ
రాంబువు) ఇది స్వరమైత్రి.

164 ప. 2 పా॥ భూ....ఉత్తరా + పోశనంబు వ్యంజనమైత్రి.

స్వాంతశబ్దమునకు శృంగారనైషధమునందు (2-82)

గీ. అధికరోష కషాయిత । స్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు । నా యవస్థ
పైత్యదోషోదయంబునఁ । బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ । జేదుగాదె. 165

విరాటపర్వమునందు (2-331)

ఉ. స్వాంతము, మాహుగర్వమున । సంతమసాంధముగాఁగ శంకయా
వంతయు లేక కీచకుఁ డ । హంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరి । యంజని యారసి నెజ్జఁగాంచి య
త్యంతముదావహంబగుడు । నందు రయంబునఁ గేలు
సాఁపఁగాన్. 166

వి. అప్పకవి చూపిన లక్ష్యపద్యములలోని యతిమైత్రి.

165 ప-పా॥

అధిక... + స్వాంత-స్వరమైత్రి.

166 ప. 1పా॥ స్వాంతము.... + సంతమసా-వ్యంజనమైత్రి.

విశే॥ స్వాంతశబ్దమునకు గురుబాలబోధికా వ్యుత్పత్తి యిట్లున్నది :

స్వనతీతిస్వాంతం స్వనశబ్దే, తద్యోగాభావే వాగ్వ్యాపారాభావాద త్రోపచారః - పలుకునది. మనస్సంబంధము లేనపుడు వాగ్వ్యాపారము గలుగదు గనుక బలుకునది యని చెప్పుట యౌపచారికము.

ఈ వ్యుత్పత్తినిబట్టి చూచిన స్వాంతశబ్దమందుఁ బదద్వయ విభాగమును స్వరసంధియుఁ గలుగదు. గాన దీని కుభయయతి పొసఁగదు. కాని యుభయ యతిక్రింద నీ శబ్దము గ్రహింపబడియుండుటచేతను స్వరయతికి శృంగార నైషధ ప్రయోగ ముండుటచేతను దీనికిఁ బదద్వయమేళనము స్వరసంధి సంఘ టనముగల వేఱొక వ్యుత్పత్తి చెప్పక తప్పదు. 'స్వ + అంత-స్వాంత' యని విడఁదీయక తప్పదు. 'స్వస్మిన్ అస్యతే' సర్వేంద్రియ వ్యాపార ఇతి స్వాంతమ్'-అతి అదిబంధనే సర్వేంద్రియ వ్యాపారములును దనయందుఁ

గూర్పఁబడుచున్నది. అనఁగా సర్వేంద్రియ వ్యాపారమున కాధార మందినదిగాన మనస్సు స్వాంతమనఁబడును. (ఇది వేదులవారి వ్యుత్పత్తి) అప్పకవికిఁ బూర్వుఁడయిన ముద్దరాజు రామన తన కవిజన సంజీవనియందు,

'స్వాంతవేదండ మార్తాండ శబ్దములకు
యతులు నుభయంబులగు బుధ + స్వాంతములకు
నతిసుఖావహుఁ డెప్డు వే-దండవరదుఁ
డనఁగ హరిదైత్యతిమిరమార్తాండుఁడనగ. (1-55)

అను నీ లక్షణములో స్వాంతశబ్ద ముభయయతికిఁ జెల్లునని పఠించి రెండవపాదమున స్వరమైత్రి లక్ష్యమును గూర్చినాఁడు. ఇందులకు అప్పకవి చూపిన భారతనైషధలక్ష్యపద్యములు కవిజన సంజీవనిలోఁ జూపఁబడి యున్నవే. కవిజన సంజీవనిలో నీ లక్షణమున కెట్టి శీర్షికలేదు గాని సులక్షణ సార రంగరాట్ఛందములలో నీ పద్యము శకంధ్వాది యతిక్రింద సంగ్రహింపఁ బడినది. వేదండమార్తండ శబ్దములు శకంధ్వాది గణమునఁజేరును మార్తండ, మార్తాండశబ్దములు రూపాంతరములు. శకంధ్వాదిలో 'మార్తండ' అను రూపమే పఠింపఁబడును. మఱి యిందు స్వాంతశబ్దముచేరదు. ఈ లక్షణ ములో వేదండ మార్తండశబ్దములఁ జూచి పై లక్షణకారులు దీనిని శకంధ్వాదియతి లక్షణముగా భ్రమించి సంగ్రహించిరేమో? రంగరాట్ఛంద మున నీ లక్షణ పద్యము క్రింద వచనమున నియ్యది శకంధ్వాదియతియని స్పష్ట పఱుపఁబడి యున్నది.

"ఋద్ధస్వాంతధ్వాంత - అనే సూత్రాన నిపాతమైనప్పటికిన్ని లింగా భట్టీయమున వ్యాఖ్యానము చేసినందువల్లనున్న మహాకవి ప్రయోగపరంపరచేత నున్న శకంధు కర్కంధు కులటా సీమంత మనీషా హలీషా లాంగలీషా పతం జలి సారంగ శబ్దములకు నచ్చుహల్లు లీ రెండు యతులు చెల్లును." (3-239)

పరరూపసంధి కాదు కావున స్వాంతశబ్దము శకంధ్వాదిగణమునఁ జేరుట కవకాశములేదు. 'స + అంత-స్వంత' అను రీతిరూపమున్ననే శకంధ్వాదిగణ మునఁ బఠింపనగును. సొంతమను వికృతి రూపమునకు స్వంతశబ్దము ప్రకృతి యని కొంద అందురు. కాని స్వంతశబ్ద మెందు గోచరింపదు. అట్లున్నదను కొన్నను భారతాదులలోఁ ప్రయుక్తమైనది స్వాంతశబ్దములో సంధి యములేదు. స్వాంతమనఁగా మనస్సు స్వాంతమును నిత్యసమాసయతిలోఁ జెప్పిన యప్పకవి పద్ధతియే సమంజసము. శకంధ్వాదిలోఁ జేర్చుట ప్రమాద భూయిష్ఠము.

ఏకాంతశబ్దమునకుఁ బారిజాతాపహరణమునందు (1-43)

ఉ. అంతట నొక్కనాఁడు ధవ । ళాంబుజనేత్రుఁడు వచ్చిరుక్మిణీ
కాంత గృహంబులోన శశి । కాంతశిలామయ వేదిమీఁద నే
కాంతమునందుఁగొందఱు మృ । గాయతనేత్రలు గొల్వఁజూదమ
త్యంతవినోద కేళిమెయి । నాడుచునుండఁగ నద్భుతంబుగాన్.

ఆదిపర్వమునందు (8-24)

సీ.గీ. కామసుఖ సంగములకు నే । కాంతగృహము
పొలిచిపొలిచియు ధర్మార్థ । ములకు నిదియు
యాస్పదంబన వర్గత్ర । యానురమ్యు
లైన జనుల కెంతయు నొప్పు । నప్పురంబు. 168

వి. ఏక + అంత - ఏకాంత.

ఏకః అంతే సమీపే అస్మిన్నితి ఏకాంతం — దీనియం దొక్కఁడు మాత్రము సమీపమున నుండును అని యర్థము. లేదా ఏకః అంతః నిశ్చయో యత్ర తదేకాంతమ్ - ముఖ్యమైన నిశ్చయముగలది యని గురుబాలప్రబోధి కార్థము గ్రహింపఁదగును.

167 ప. 3 పా.

ఏ కాంత (ఏక + అంత)....మృ + గాయత (మృగ + ఆయత)

ఇందుఁ బాదాది యతిస్థానములలో రెంటను స్వరప్రధానమేయని యరయవలెను అఖండయతిని సమ్మతించువారు మృగాయత శబ్దములోని సంధ్యక్షరమగు గకారముతో ఏకాంతశబ్దములోని కకారమునకు మైత్రి చేయఁబడెనని చెప్పుదురు. అప్పకవి కంఖండయతి సమ్మతముగాదు గానను నిందు స్వరమైత్రి కుదాహరణాంతరము లేకపోవుటచేతను నీ పద్యపాదము స్వర మైత్రికి లక్ష్యమనుట నిశ్చయము.

158 ప. పా. కామ ఏ + కాంత - వ్యంజనమైత్రి.

వ. సిద్ధాంత, రాద్ధాంత, లతాంత, ప్రాంత, నిశాంతాది శబ్దముల
కన్నిటికిని ఇటువలెనే రెండును నడచును. 169

వి. ఏకాంత శబ్దమునకువలె సిద్ధాంతాది శబ్దములకెల్ల నుభయయతులు, చెల్లునని భావము. ఈ శబ్దములందెల్ల నుత్తరపదము అంత శబ్దము. ఇందెల్ల

స్వరసంధిగలదు. ఇవన్నియు నిత్యసమాసములే. వీనికిఁ బ్రయోగముల గ్రంథము లందుఁ జూచుకొనవలెనని కవి యభిప్రాయము.

సిద్ధాంతాదిశబ్దముల పదవిభాగార్థములు:

సిద్ధాంత-సిద్ధ + అంత సమౌ సిద్ధాంత రాద్ధాంతౌ అమరము.

రాద్ధాంత-రాద్ధ + అంత సిద్ధోరాద్ధః అంతః నిశ్చయః యస్మిన్ దీని యందు నిశ్చయముండును అని యర్థము.

రాధసాధ సంసిద్ధౌ అని ధాత్వర్థము.

లతాంత-లతా + అంత; లతాంతమనఁగా పుష్పము. లతయొక్క యగ్రమున నుండునది యని (లతాయా అంతః) వ్యుత్పత్తి.

ప్రాంత-ప్ర + అంత; ప్రకృష్టః అంతః - మిక్కిలి సమీపము. ప్రాంత శబ్దము ప్రాదియతిలోఁ జెప్పఁదగినది. ప్రాది సమాసములన్నియు నిత్య సమాసములే కాని ప్రాదియతి యని ప్రత్యేకించి చెప్పఁబడుటచేఁ బ్రాంతశబ్దము నిత్య సమాసయతిలోఁ జెప్పుట సరియైన పద్ధతిగాదు.

నిశాంత - నిశా + అంత; నిశాంతమనఁగా ఇల్లు. అవశ్యం నిశాయా మమ్యతే గమ్యతే ఇతి నిశాంతమ్ అమగతౌ - అవశ్యముగా రాత్రియందుఁ బొందఁబడునది. 'నిశాంత వస్త్యసదనం భవనాగారమందిరమ్'అని యమరము.

నారాయణశబ్దమునకు—

నారాః ఆపః అయనం స్థానమస్య నారాయణః. 'విష్ణుర్నారాయణః కృష్ణ' ఇత్యమరః.

ఆదిపర్వమునందు (1-25)

ఉ. పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దాసును ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడీ కృతి కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁదోడయినిర్వహింపగాన్.

వి నారాః ఆపః అయనం స్థానమస్య నారాయణః—నారమనఁగా జలము. అది స్థానముగాఁ గలవాఁడని యర్థము. విష్ణువు ప్రళయకాలమునఁ బ్రపంచము జలమయమగుటచే నా జలముమీఁద వటపత్రశాయియై యుండువాఁడని ప్రమాణము. నారాయణశబ్దమున కనేక వ్యుత్పత్తులు గలవు. నరస్యేదం నారం అవతారేషు నారం వపురయత ఇతి నారాయణః- నరసంబంధమైన శరీరము నారము, అవతారములందు నరశరీరమును బొందువాఁడు. అయగతౌ అని ధాత్వర్థము.

నరసమూహో నారం తస్యాయనమితివా; తదయన మస్యేతివా-నరసమూహము నకు స్థానమైనవాఁడు, లేక నరసమూహము నివాసముగాఁ గలవాఁడు.

ఇట్లీవిధముగ వ్యుత్పత్తి చెప్పినను 'నార + అయన' అను పదవిభాగ ముండును. విష్ణువునకు సంజ్ఞయగుటచే నిది నిత్యసమాసమై యుభయయతి చెల్లుబడి యగును.

ఇందులకు లక్ష్యముగా నొసఁగబడిన నన్నయభట్టారకుని యాదిపర్వ పద్య మొకదానియందే స్వరమునకును వ్యంజనమునకును యతిమైత్రి చేయఁబడి యున్నది. కాన రెంటికి నీ పద్యమే లక్ష్యమగును.

2. పా. నా, రాయణ (నార + అయన) ధరా + అమర
ఇది స్వర ప్రధానవళి.

3. పా. నా, రాయణభట్టు...ధు + రంధర
వ్యంజనమైత్రి

వాతాయన శబ్దమునకు—
చారుదేష్ణ చరిత్రమునందు—

గీ. అచ్చరలు నందనంబునఁ । దెచ్చుకొను సు
రాగసుమములు హర్మ్యవా । తాయనముల
చెంతఁ గాలూఁది తత్పుర । స్త్రీలకొసంగ
వేఁడికొని పోవుదురు కప్ర । వీడియములు. 171

విరాటపర్వమునందు (2-238)

సీ. పా. తరుణులుఁ బతులు వా । తాయనమ్ముల నల్ల
మలయ వేఁబోకల । మలయపవను. 172

వి. వాత + అయనము-వాతాయనము. వాతస్య అయనం మార్గ వాతాయనః - వాయువునకు మార్గము, గాలి ప్రసరించుటకుఁ దోవ, దీనికి గవాక్ష మని యర్థము. వాతాయనం గవాక్షః-అమరము.

171 ప. 2 పా. సుర + అగసుమములు...వాత + అయనముల.
సురాగ మనఁగా గల్పవృక్షము. ఇందు స్వరప్రధానవళి.
172 ప. తరుణ...వా + తాయన-వ్యంజనమైత్రి.

ఉపాయన శబ్దమునకు—

సుదక్షిణాపరిణయమునందు—

చ. వలఁబడియున్న జక్కవ వక । వంబురుణింపుచు సన్నపైఁటలో
పల బిగుగుబ్బదోయి కనుపండువుసేయఁగ మోడ్పుఁజేతు లొ
దలను ఘటించి మ్రొక్కెడి పదంపడి మెల్లన డాయఁబోయితొ
య్యలి విరిబంతిదోయిట నుపాయనమాయనకిచ్చియిట్లనున్. 173

అష్టమహిషి కల్యాణమునందు—

ద్వి. ఇంతుల మేల్బంతి । యిడినసేవంతి
బంతి చేదోయి నుపాయనమిచ్చి. 174

వి. రాజ్ఞ స్సమీపమయి తేనే నేత్యుపాయనమ్, ఆయగతా దీనినేత రాజ సమీపమును బొందుదురు. ఉపాయనమనఁగా గానుక. ఉపాయనశబ్దము ప్రాదిసమాసము గానఁ బ్రాదియతియందుఁ జెప్పుట లెస్స

178 ప. 4 పా. తొయ్యలి.........ఉప + అయన-స్వరమైత్రి.

174 ప, 2 పా. బంతి.......ఉ + పాయన-వ్యంజనమైత్రి

రసాయనశబ్దమునకు—

అనంతుని ఛందమునందు (1-121)

ఆ. నాస్తి యనక మహిన । నంతసంపదలు నా
రాయణుం డొసంగు । రమ్యమగు ర
సాయనంబు బుధుల । కతఁడన నిత్యస
మాసయతులు రెంటి । నంటియుండు. 175

జైమిని భారతమునందు (1-22)

సీ. గీ. మట్టిమాత్రంబె పిల్లల । మట్టిపేరు
పేరువలెఁగాదు శారదా । పీఠకంబు
వారిలోపలఁబిన పీరు । వాక్యసరణి
సరసులకునెల్ల । గర్ణ ర । సాయనంబు. 176

వి. రస + అయన-రసాయన.

రసస్యఅయనమ్ రసాయనమ్; మాధుర్యమునకు స్థానమైనది యని యర్థము. రసాయనమనఁగా జీవనౌషధము. జరావ్యాధులను బోఁగొట్టి సౌఖ్య

మును గూర్చు ఔషధ విశేషము. రసాయనమునకు జీవనౌషధమని వాచ్యార్థము జీవనౌషధమువలె నానందపఱిచెడి తృప్తిపఱిచెడి వస్తువని లక్ష్యార్థము. శ్రోత్ర రసాయనము. కర్ణ రసాయనము అను శబ్దములకుఁ జెవులపండువని యర్థము.

175 ప. 3 పా. రస + అయనంబు......బుధులకు + అతఁడు
ఇది స్వర ప్రధానవళి.

176 ప. 4 పా॥సరస........ర + సాయనంబు-వ్యంజన మైత్రి.

ఇందు రసాయనశబ్ద స్వరయతి కుదాహరణముగ అనంతుని ఛందములోని లక్షణపద్య మొసఁగఁబడినది. ఆ పద్యము నిత్యసమాసయతికి లక్షణమును లక్ష్యము నగును ఇందు నాస్తి, అనంత, నారాయణ, రసాయన, సమాస శబ్దములు నిత్య సమాసములుగాఁ జూపఁబడినవి. అప్పకవి నాస్తి, అనంత, నారాయణ, రసాయనశబ్దముల నిత్యసమాసయతులలో సంగహించినాఁడు: సమాస శబ్దమును గ్రహింపఁడయ్యె. సమాసశబ్దము (సమ్ + ఆస) ప్రాదియతిలోఁ జేరును.

రామాయణ శబ్దమునకు-
రాఘవ పాండవీయమునందు (1-4)

ఉ. ఏయెడ నర్థగౌరవ స । మృద్ధియు శబ్దవిశుద్ధియుం దినం
బైయనవద్యతంబరఁగ । నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణమున్ రచించిన మ । హాత్ముల నాత్మఁదలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిని । దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్.

జైమిని భారతమునందు (6-96)

తే. మౌని జల్పితమైన రా । మాయణంబు
స్వరలయగ్రామ మూర్ఛనా । సరణులెఱిఁగి
గానశక్తుల మెఱసి సా । క్షాత్కరింపఁ
బాడిరాలాపములఁ బ్రదిస । ప్తములు ముట్ట. 178

వి. రామస్య అయనం స్థానం - రామాయణమ్, రామునకు స్థానమైనది. అనఁగా రామచరిత్రమునకు స్థానమైనది. రామచరిత్రము వర్ణ్యముగాఁగల దియని భావము. ఈ శబ్దము సంజ్ఞావాచకమగుట నిత్య సమాసమై యుభయయతి చెల్లును. రామ + అయన-రామాయన అను రీతి సవర్ణదీర్ఘసంధిచే రూపమేర్పడి సంజ్ఞ వాచ్యమగుటచేఁ బూర్వపదస్థములగు బురషలమీఁది నత్వము ణత్వమగు నను శాస్త్రవిధిచే రామాయణ మయ్యెను.

(పూర్వపదాత్సంజ్ఞాయామగః - అన్నది ణత్వవిధాయక సూత్రము)

177. ప. 3 పా. రామ + అయన......మహా + ఆత్ముల
ఇది స్వరప్రధానవడి.

178. ప. 1 పా. మాని......రా + మాయణంబు-వ్యంజనమైత్రి.
వ. పరాయణ, పలాయిన, బాదరాయణ, సాంఖ్యాయన, శాక టాయన, కాత్యాయన, వాత్స్యాయన, బోధాయన, దక్షి ణోత్తరాయణాది శబ్దములకును ఇటువలెనే రెండును గలవు. 179

వి. పరాయణ ప్రభృతిశబ్దములు రామాయణశబ్దమువంటి నిత్య సమాస ములు. ఇందెల్ల నుత్తరపదము 'అయనము'. వీనికెల్లఁబై దానివలె నుభయయతి చెల్లును. అప్పకవి వీని కన్నిటికిఁ బ్రయోగములు చూపలేదు. ఇది గ్రంథాంతర ముల నెఱుఁగఁజనును.

పర + అయన-పరాయణము-పరమాస క్తేరయనం పరాయణమ్. ఇందు రషలమీఁది నకారమునకు ణత్వ మాదేశమయ్యె. పరాయణమువంటిదే పారా యణము. 'సాకల్యాసంగవచనే పారాయణ పరాయణే' అమరము. పారమయంతే గచ్ఛంత్యనేన పారాయణం. అయపయగతౌ-దీనిచేతఁ బారమును బొందుదురని పారాయణ శబ్దమునకు వ్యుత్పత్తి అప్పకవి చెప్పిన దొక పరాయణశబ్దమే. 'త్రిముస్యాత్తత్పరేభీష్టేప్యాశ్రయేపి పరాయణమ్' అని రభసుఁడు (రభస నిఘం టువు). పరాయణమనఁగా ఆసక్తి.

పరా + అయన-పలాయన (పరుగెత్తుట)

'ఉపసర్గస్యాయతే' అను సూత్రముచే నుపసర్గయగు 'పరా' లోని రేఫకు లకారము వచ్చును (అయధాతువు పరమగునపుడు 'పరా' యొక్క రేఫకు లత్వము వచ్చును.)

బాదరాయణ-బదర + అయన-బదరాయణ-ర ష ల మీఁద నకారమునకు ణత్వము; బదరం అయనం యస్యసః బదరాయణః. బదరాయణ ఏవ బాదరా యణః (బదరికావనము నివాసముగాఁగలవాఁడు బదరాయణుఁడు; బదరాయణుఁడే బాదరాయణుఁడు. ఇది వ్యాసమహామునికిఁ బేరు).

మఱి దీనికి బదరస్యాపత్యం బాదరాయణః అను వ్యుత్పత్తియుఁ జెప్ప వచ్చు. అప్పుడయనశబ్ద ముత్తరపదముగాదు. 'బదర + అయన'అని విడఁదీయ రాదు. బదరశబ్దము నడాదులలోనిది గాన 'నడాదిభ్యఃఫక్' అను సూత్రముచే బదర శబ్దమునకు అపత్యార్థమున ఫక్ ప్రత్యయమును దానికి ఆయనేయీయాద్యాది సూత్రముచే ఆయనాదేశమును ఆదివృద్ధియు, రేఫముమీఁది నత్వమునకు ణత్వ

మును రాఁగా (బదర+అయన-బాదర+అయన-బాదరాయణ) బాదరాయణ శబ్దము నిష్పన్నమగును. ఇందు దయనశబ్దము పరముగాలేకున్నను 'అయన' అను అజాది ప్రత్యయముండుటచే నుభయయతి చెల్లుట కభ్యంతరము లేదు.

సాంఖ్య+అయన, శాకట+అయన, కాత్య+అయన, వాత్స్య+అయన, బోధ+అయన అను రీతిఁ బదచ్ఛేదముగలవిగా సాంఖ్యాయనాది శబ్దములను గ్రహింపవలెను. లేదా నడాదిలో గ్రహించి అయన ప్రత్యయముచేర్చి చెప్పినను నుభయయతి విధి కే యభ్యంతర ముండదు.

ఆదిశబ్దము చెప్పుటచే 'దాక్షాయణి, కాత్యాయని' ఆశ్వలాయన, వైశంపాయన, యౌగంధరాయణ' మున్నగు శబ్దములలో నుభయయతులు చెల్లునని గ్రహింపవలెను.

దక్షిణ+అయన-దక్షిణాయన.
ఉత్తర+అయన-ఉత్తరాయణ (ణత్వము)

అయతే యాత్యనేనాస్మి న్నిత్యయనమ్. అయగతౌ. దీనిచేత సూర్యుఁడు పోవును. దక్షిణాం దిశం అయతే సూర్యః అనేన దక్షిణాయనమ్. అయనమనఁగా గమనము. దక్షిణ దిక్కును గూర్చి గమనము దక్షిణాయనము. ఇట్లే యుత్తరాయణ శబ్దార్థము గ్రహించునది.

వీని కెల్లఁ బ్రయోగములు చూపఁబడలేదు. పరిశీలించి తెలిసికొనునది.
మార్తాండ శబ్దమునకు

శృంగార షష్ఠమునందు—

సీ. గీ. వలవదు భయంబు వారెంత। వారలైవ
నట్టివారలు మన కగ్గ।మైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపు।వచ్చువార
లనుచు బుద్ధిగ జెప్పె మా।ర్తాండసుతుఁడు. 180

వి. 4 పా॥ అనుచు...మార్త+అండ-స్వరమైత్రి.

ద్రోణపర్వమునందు—

మ. ధరణీచక్రము దిర్దిరందిరిగె మా।ర్తాండుండు కుంఠీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడం।కె న్మిన్న దర్చెన్మహీ

ధర సంతానములోన గ్రక్కదలె సు। ధ్వాంతంబులై యంబుధుల్
పౌరలెన్ గట్టులమీఁద బెట్టు పిడుగుల్ । మ్రోసెన్మి శాంత ధ్వనిన్. 181

వ. బ్రహ్మాండాది శబ్దములకును ఇటువలెనే అచ్చును హల్లును జెప్పఁదగును. 182

వి. 181 ప. లో 1-పా-ధర....మా + ర్తాండ-వ్యంజనమైత్రి.

విశే. మార్తాండ, మార్తాండ అని ద్వైరూప్యము గలదు. మార్తాండుఁ డనఁగా సూర్యుఁడు. గుణబాలప్రబోధికలో వీని వ్యుత్పత్తు లిట్లున్నవి.

మృతండస్యాపత్యం మార్తాండః - మృతండునికొడుకు.

మృతం బ్రహ్మాండం జీవయతీతి మార్తాండః - నశించిన బ్రహ్మాండమును బ్రతికించువాఁడు. అంధకారమున రాత్రిలో బ్రహ్మాండము మృత ప్రాయమై యుండును; సూర్యోదయమునకే దానికి మరల జీవము వచ్చునని తాత్పర్యము. మార్తండ శబ్దమున కిచ్చిన వ్యుత్పత్తిలోఁ బరిద్వయ సంధిలేదుగాన నుభయ యతి కది పనికిరాదు. మార్తాండ శబ్దవ్యుత్పత్తిలో 'మార్త + అండ' అనుభేదము గలదు గాన నయ్యది యుభయయతిలో గ్రహింపఁదగును అందుచేతనే కాఁబోలు నప్పకవి మార్తాండ శబ్దమును గ్రహించెను.

అమరకోశ సాధాఖ్య వ్యాఖ్యలో 'మృతేఽండేభవః' శకంధ్వాదిః అని అర్థ మొసఁగబడి యున్నది.

కాని మార్త + అండ-మార్తాండ అని పరరూప సంధి నైనను, మార్త + అండ-మార్తాండ అని సవర్ణదీర్ఘ సంధిగానైనను జెప్పికోవచ్చు. ఎటు చెప్పినను నుభయయతి చెల్లును. కవిజన సంజీవని మున్నగు లక్షణ గ్రంథములు మార్తండ శబ్దమును బరరూపసంధియతిలో సంగ్రహించెను.

అండశబ్ద ముత్తరపదముగాఁగల బ్రహ్మాండాది సంజ్ఞావాచక శబ్దములం దుభయయతి చెల్లునని యెఱుంగునది.

ఉపసర్గ సంధికి,

చంద్రికా పరిణయమునందు—

ఉ. అంతట రుక్మబాహు వసు । ధాధిప నందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి వి । హారరతిం జనుదెంచె నెచ్చెలుల్

చెంతలఁగొల్వఁ గుంజదళీ । శింజిత రంజిత కుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవర । తాంగజమోటికిఁ బుష్పవాటికిన్. 183

కవిజనాశ్రయమునందు (1-66)

ఉ. మానుగ విశ్రమాక్షర స । మంచితమై స్వరమూఁదినన్ దదీ
యానుగుణాక్షరంబు కాని । యైనను జెప్పఁగనొప్పు నీ క్రియన్
భాను సహస్రభాసి వృష । భాధిపుఁడన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి । పొల్పగు నాది కవిప్రణీతమై. 184

వి. వసుధాధిప (వసుధా + అధిప). వృషభాధిప (వృషభ + అధిప) - అను శబ్దములలోఁ బరమున నుపసర్గ (అధి) గలదు. అజాద్యుపసర్గపర మగుసంధి ఉపసర్గసంధి యని యట్టి స్థలముల నుభయయతి చెల్లునని యప్పకవి యభిప్రాయము. చంద్రికాపరిణయ పద్యము స్వరమైత్రికిఁ, గవిజనాశ్రయ పద్యము వ్యంజనమైత్రికి లక్ష్యములు.

183 ప-1 పా. అంతట....వసుధా + అధిప-స్వరమైత్రి.

184 ప 3 పా. భాను....వృష + భాధిప-వ్యంజనమైత్రి.

విశే. ఇందుఁ గవిజనాశ్రయ పద్యయతి విషయమున నప్పకవి యభిప్రాయ మించుక సూక్ష్మముగఁ బరిశీలింప వలసియున్నది.

అప్పకవి మతమున నుపసర్గ సంధియం దుభయయతి చెల్లును. ఇయ్యది యప్పకవి స్వమతానుకూలముగఁ గ్రొత్తగా సృష్టించినది. కవిజనాశ్రయ కారుఁడేమో యీ పద్యమును (మానుగ విశ్రమాక్షర-184 పద్యము) అఖండవడికి లక్ష్యలక్షణముగా నిచ్చినాఁడు. అఖండవడి యప్పకవికి సమ్మతముగాదు గానఁ బ్రాచీనమును బ్రామాణికమునగు కవిజనాశ్రయములోని యీ పద్యమందలి యతిని నిత్యసమాసవిశ్రాంతుల క్రిందఁ జేర్చి స్వమతానుగుణముగ నొక విధముగ గతిని గల్పించినాఁడు. ఇయ్యది విమర్శనీయము. భీమన తన 'మానుగ విశ్రమాక్ష' రేతి పద్యమున నఖండవడి యని నొక్కి వక్కాణించి యుండఁగా, నా పద్యమునే యుదాహరించి యుపసర్గ సంధి నిత్యసమాసయతిగా నప్పకవి పేర్కొనుట స్వరసముగాఁ జూపట్టదు. ఈ కవిజనాశ్రయ పద్యములోని అఖండవడి శబ్దమును బరికించియే కాఁబోలుఁ దొలుతఁ దన లక్షణములో నప్పకవి నిత్యసమసవిశ్రాంతులను నఖండ విశ్రమములనఁ రెండుఁజెల్లు' (135) నని యుభయ నామములఁ బేర్కొన్నాఁడు. అప్పకవి సామాన్యాఖండవడి నొప్పని వాఁడగుటచే నిట్టి గొన్ని ప్రసిద్ధాఖండవడి స్థలములను మార్గాంతరముచే సాధింపకోవలసివచ్చె.

ఒక మరొక విషయము :

ప్రాదియతి, ఉపసర్గసంధియతి—వీనిభేదము.

ప్రాదుల కుపసర్గలని సంజ్ఞ. అట్లుండగాఁ ప్రాదియతి, ఉపసర్గసంధి యతి యని వేర్వేఱఁ జెప్పనేల, ఒక్కటిగాఁ జెప్పరాదా? యను ప్రశ్న యుద యించును. ఇందులకు సమాధానము—

ప్రాదియతి ఉపసర్గసంధియతి యను నీ రెండొక్కటిగాదు, పరస్పరము భిన్నములు. ప్రాదియతియందుఁ బ్రాదులు పూర్వ పదమందును. ఉపసర్గసంధి యతియందయ్యవి యుత్తర పదమందును నుండును. మఱి యుపసర్గసంధియందుఁ బ్రాదు లజాదులుగా నుండవలయును. అనఁగా అజాది ప్రాదులు మాత్రమే గ్రాహ్యములు. ఈ యిరు దెఱఁగుల సంధులందు నుభయయతి చెల్లును.

అధి + ఈశ - అధీశ - ఇందు 'అధి' యను నుపసర్గ పూర్వమున నున్నది-
ఇది ప్రాదియతి.
వృషభ + అధిప - వృషభాధిప - ఇందు 'అధి' పరమున నున్నది—
ఇది యుపసర్గసంధియతి, ఇది యప్పకవి మతము.

ఇట్లు రెండు యతులు చెప్పుటకన్న (అనఁగా - ప్రాదియతిని జెప్పి యుప సర్గసంధి యని నిత్యసమాస విశ్రాంతిలో వేఱుగాఁ జెప్పుటకన్న), రెంటి నొక్క ప్రాదియతియందే చెప్పుట రమ్యము యుక్తమును. ఇంతకు నుపసర్గ సంధియతియని యప్పకవి ప్రత్యేకముగఁ జెప్పలేదు. నిత్యసమాస విశ్రాంతి క్రింద వృషభాధిపశబ్ద వ్యంజనయతిని సాధింప నందలిది యఖండపది కాదని నిరూపింప నిట్టి పద్ధతి కల్పించె

తాతంభట్టు కవిచింతామణియందుఁ బ్రాదియతిచే యీ రెంటి నుదా హరించె.

ధాత్రిఁ బ్రాదియోగ - మాత్రంబు గలిగిన
నుభయమును రచింప - నొనరు యతికి
సాతిరిక్త భక్తి + శక్రసేవిత క్రమ
లాలయానివాస + లక్ష్మమిదియ

స + అతిరిక్త - సాతిరిక్త. ఇందు 'అతి యను నుపసర్గ యుత్తర పదమం దున్నది. ఇట్లే కమల + ఆలయ (ఆఙ్ - లయ) అనుచోట ఆఙ్ అను నుపసర్గ యుత్తరపదమున నున్నది. తాతంభట్టు మతమున నిదియుఁ బ్రాదియతియే యగు. అప్పకవి మతమున నియ్యది నిత్య సమాసయతిలో నుపసర్గ సంధి యడి.

ఋషి విధేయ గుణస + మృద్ధ జగద్వంద్య
అంతకుఁడు కృపాప + రాఙ్ముఖుండు
భంగమతిని వలనఁ + బ్రాపింపకుండ సు
దగ్ర కరుణఁజూడు + దైత్యదమన

ఇది యప్పకవి మతమునఁ బ్రాదియతి. ఇందుఁ బ్రాదులు పూర్వపదమున నున్నవి. (సమ్-బుద్ధ, పరా + అఙ్, ప్ర + ఆప, ఉత్ + అగ్ర) (ఈకవిచింతామణి యముద్రితము. నాచేఁ బరిష్కృతమై ముద్రణ యోగ్యదశలో నున్నది)

వ. ద్వారశబ్దమునకు ద్వే అరే పార్శ్వేయస్యతత్ ద్వారమ్ 'పృషోదరాదీని యథోపదిష్ట' మితి సూత్రేణ ద్విశబ్దాంతస్య ఇకారలోపః అకారాదేశః.

వి. ద్వారశబ్దమునకు గురుబాలప్రబోధికలో 'వార్యతే నూతన పురుషః అత్రేతి ద్వారమ్-వృఙ్ వరణే' అని వ్యుత్పత్తి చూపఁబడినది. ఈ వ్యుత్పత్తి ప్రకారము ద్వారశబ్దమునఁ బదద్వయ విభాగములేమిచే నుభయయతికి సాధకము గాకపోవును. కాన అప్పకవి నిర్వచనమే యిందు గ్రాహ్యము. ద్వి + అర-అరమనఁగాఁ బార్శ్వము, రెండు ప్రక్కలుగలది ద్వారము. ద్విశబ్దములోని ఇత్వము లోపించి యాస్థానమున అకారమే నిల్చి ద్వార మను రూపము గలుగును. సాధారణముగా యణాదేశ సంధి రావలసియున్నను నిందట్టి విధి చెల్లక పృషోదరాది గణమునఁ జేర్పఁబడుటచేఁ బూర్వపదాంతేకారమునకు అకారాదేశము కలిగి (ద్వి + అర-ద్వ + అర) సవర్ణదీర్ఘసంధిచే ద్వారమయ్యెను; పృషోదరాదులు యథాప్రయుక్తముగ గ్రాహ్యములని పాణిని సూత్రించె. పృషత్ + ఉదర-పృషోదర-ఇందుఁ బూర్వ పదాంత తకారము లోపించి సంధియయ్యెను. ఈ పృషోదరాది గణము నిపాతరూపములని యెఱుఁగవలెను. అప్పకవి ద్వారశబ్దమును బృషోదరాదులలోఁ జేర్చి యుభయయతి చెల్లుటకు మార్గమును దెల్పెను.

ఉ. వారక వారకామినుల వర్తులచారు కుచోపగుహ్యముల్
కోరక కోరకోల్లసిత కుంజములం జిగురాకు పానుపుల్
చేరక చేర కేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వారవిహారులై సిరుల నందక నందక పాణిఁగొల్వరో. 185

వి. 4. ప్రా. ద్వ + అర—సిరులన్ + అందక-స్వరప్రధానపడి

ఈ పద్య మెందలిదో, చెప్పఁబడలేదు. ఇది వేములవాడ భీమకవి రచితమని కవుల చరిత్రవలనఁ దెలియుచున్నది.

హల్లునకు నిర్వచనోత్తర రామాయణమునందు (1-84)

ఉ. వారలు వారి భూరి పరి । వారముతోడ విమానమెక్కి రాఁ
గా రఘునందనుం డరిగి । కాంచన తోరణచిత్రమై నవ
ద్వార నికాయమైన నిజ । పట్టణముత్సుకవృత్తిఁజొచ్చె నిం
డారు ముదంబునన్ భరతు । నాకృతి బాలిశవృత్తి
గ్రాలఁగాన్. 183

వి. 3 పా. ద్వార........+ పట్టణ

ద్వా లోని వకారమునకును యతిస్థానములోని టుపకారమునకును వ్యంజన మైత్రి. పాదాదిలో సంయుక్త వర్ణమున్నదిగాన నియ్యది సంయుక్త యతిలో నభేదవర్గయతి యగును.

## క్యజ్ ప్రత్యయాంతములు

వ. కుమారపదాచరితాశక్తిః, కుమారాయితశక్తిః, కుమారాయితయా శక్త్యాశాలత ఇతి కుమారాయితశక్తిశాలీ. కుమారసమాన పరాక్రమద్యోతవా నిత్యర్థకః,

ఆదిపర్వమునందు (5-6)

ఉ. ఆయము గర్వమున్విడిచి । యన్యపతుల్వనిసేయు నిట్లు గాం
గేయభుజాశ్రయంబున ని । కృత్తవిరోధి సమాజుఁడై కుమా
రాయితశక్తిశాలి ధృత । రాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయత కీర్తితోఁదనకు । హస్తిపురంబది రాజధానిగాన్. 187

వ. భద్రపదాచరితామూర్తి ర్యస్యతత్ భద్రాయితమూర్తి శోభనమూర్తిమ దిత్యర్థః, అయమపి క్యజ్ ప్రత్యయాంతః.

విరాటపర్వమునందు (1-1)

ఉ. శ్రీయన గౌరినాఁబరఁగు । చెల్వకుఁ జిత్తము పల్లవింవ భ
ద్రాయితమూర్తియై హరిహ । రంబగు రూపముదాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని । పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత నిష్ఠగొల్చుపర । తత్త్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్. 188

వ. ఈ రెండుపద్యములయందును నన్నయ తిక్కనగార్లు కుమార భద్రశబ్దములు క్యజ్ ప్రత్యయాంతములుచేసి సంయుక్తవిశ్రామంబులుగాను ప్రయోగించిరి. అది గనుక గొందఱా రెండు శబ్దములమీఁదను అకారములున్నవి. నిత్యసమాస విశ్రాంతులని భ్రమయుదురు. శబ్దసూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవిగాని అందులోపల అత్తులులేవు. 189

వి. క్యజ్ ప్రత్యయాంత వివరణము.

ఉపమానములైన అజంత హలంత కర్తృవాచకపదములకుఁ గర్త్రర్థమున, భూత, భవిష్యత్కాలఁ భావార్థములందు ఆచారార్థమునఁ గ్రమముగా యమాన, యిత, యిష్యమాణ, యిత ప్రత్యయములు వికల్పముగా వచ్చును. ఈ ప్రత్యయములు పరమగునేని పూర్వాచ్చునకు దీర్ఘము వచ్చును. ఇవి కజ్యంతములందురు (చూ. తత్సమచంద్రిక 306 సూ)

వర్తమాన॥ మూర్ఖ = యమాన - మూర్ఖాయమాణ (మూర్ఖ ఇవాచరన్ మూర్ఖునివలె నాచరించు (చుండు) వాఁడు)

భూత॥ మూర్ఖ + యిత - మూర్ఖాయిత

భవిష్యత్॥ మూర్ఖ + యిష్యమాణ - మూర్ఖాయిష్యమాణ

భావార్థము ॥ మూర్ఖ.... యిత - మూర్ఖాయిత

ఇట్లే కుమార + యిత - కుమారయిత (కుమారునివలె నుండు)

భద్ర + యిత - భద్రాయిత (భద్రమువలె నాచరించు)

కుమారాయితశక్తిశాలి - కుమారస్వామివలె నాచరించు శక్తిచేతఁ బ్రకాశించువాఁడు అనఁగా కుమారునివంటి పరాక్రమముగలవాఁడు.

ఈ రూపనిష్పత్తికి సంస్కృతసూత్ర ప్రక్రియ యిట్లుండును :

సూ. ఉపమానాదాచారే (3-1-10)

కర్తుః క్యజ్ సలోపశ్చ (3-1-11) ఉపమానాత్కర్తుస్సుబన్తాదాచారే క్యజ్ వాస్యాత్ - కృష్ణ ఇవాచరతి కృష్ణాయతే (ఆచారమనఁగా వ్యవహారము)

ఇందుపమానమైన కుమారశబ్దమున కాచారార్థమున క్యజ్ ప్రత్యయము వచ్చును. 'కుమారవదాచరితః' అను నర్థమున కుమార + క్యజ్ కుమార + యు

(క్విప్ ప్రత్యయమగుటచే 'య' వర్ణము వచ్చును.) తరువాత 'అకృత్సార్వధాతుక యోర్దీర్ఘః' అను సూత్రముచే కుమారశబ్దము తుది అకారమునకు దీర్ఘమువచ్చి క్త ప్రత్యయము (భూతార్థకప్రత్యయము (రాఁగా, 'కుమారాయిత' అగును ఇట్లే భద్రములు కలవివలె లేదా భద్రమువలె నాచరించు మూర్తికలది (భద్రవ దాచరితామూర్తిః) అనఁగా నెల్లరకు శుభప్రదమగు నాకారముగలది. ఇట్టి యర్థమున క్యజ్ప్రత్యయమువచ్చి క్త ప్రత్యయముచేరి భద్ర + య + త-భద్రాయిత అను రూపమేర్పడును

కుమార + యిత - కుమారాయిత

భద్ర + యిత - భద్రాయిత

ఈ క్యజంతరూపములందుఁ బూర్వాచ్చునకు దీర్ఘమువచ్చును. ఇందు 'కుమార + అయిత' అనురీతి స్వరసంధి పదవ్యయవిభాగమున్నదని భ్రమింపరాదు. కాన నిట్టి పట్టులందు యతిస్థానముల స్వరప్రధానవడి చెల్లనేరదు. ఈ శబ్దములు నిత్యసమాసములని యజాద్యుత్తరపదములని యుభయయతి చెల్లనగినదని తలంపరాదని తెలుపఁదలచియే యప్పకవి యీ క్యజ్ప్రత్యయాంతవిషయము విస్తరించి వ్రాసెను.

'కుమారాయిత, భద్రాయిత' శబ్దములందు సాధారణ వ్యంజనయతియే పాటింపఁదగునని యెఱుంగవలెను. స్వరయతి యెంతమాత్రము చెల్లనేరదని యిప్పకవి యభిప్రాయము.

వ్యంజనయతిమైత్రి పాటించినందులకు నన్నయ తిక్కనల పద్యముల నుదాహరించినాఁడప్పకవి.

187 ప. 8 పా. కుమారాయిత.... ధృత + రాష్ట్ర (వ్యంజనయతి)

188 ప. 2 పా. భద్రాయిత . . . హరిహ + రంబగు (ఇది వ్యంజన యతిలో సంయుక్తయతి)

ఆది విరాటపర్వములందు నన్నయ తిక్కనలు క్రమముగ క్యజంతము లగు కుమారాయిత, భద్రాయిత శబ్దములు జాదాదిలోఁ బ్రయోగించి వ్యంజన యతి పాటించిరి. పూర్వాచ్చునకే దీర్ఘమువచ్చుటచేఁ బైశబ్దములలో స్వరసంధి లేదని తత్కారణమున స్వరప్రధానవడి చెల్లుటకు మార్గములేదని తెలియువలెను. కొందఱీశబ్ద సూత్రవిషయము తెలియక యిందు సవర్ణదీర్ఘసంధి గలదని భ్రమింతురు. అట్టివారు పై నన్నయ తిక్కన ప్రయోగములలో వ్యంజనమైత్రి యుంటఁజూచి తమ మతమున స్వరము చెల్లును గాన నిట్టి శబ్దములం దుభయ యతి చెల్లునని భావించి యవి నిత్యసమాసవిశ్రాంతులుగా నెన్నుదురు. ఇట్టిది భ్రమప్రమాదమని యప్పకవి నొక్కి వక్కాణించుచున్నాఁడు.

విశే. నన్నయ ననుసరించి యట్టి శబ్దములు యతిలోఁ దక్కిన ప్రయోగించియుండుట గమనింపఁదగియున్నది.

పై శబ్దములం దకారమున్నదని భ్రమించినవారెవరో యప్పకవి పేర్కొనలేదు. కాని నా పరిశీలనలో నీ భ్రమప్రమాదమున కాకర మిట్లు తెలియవచ్చెడు.

కవిచింతామణిలోఁ దాతంభట్టు ప్రాదియతికి లక్ష్యముగఁ దిక్కన 'భద్రాయితమూర్తియై హరిహరంబగు' అను ప్రయోగముగల పద్యము నిచ్చెను. 'భద్ర + ఆ + యిత' అనిగాని 'భద్ర + అ + యత' అనిగాని పరిచ్ఛేదముచేసి సనే ప్రాదియతి కిది లక్ష్యముకాఁగలదు. ఈ ప్రాదియతి యప్పకవి నిత్యసమాస విశ్రాంతులలోఁ జూపిన యుపసర్గసంధిపడియగును. 'భద్ర + ఆఙ్ + యత' అను పదవిభాగమున 'ఆఙ్' అను నుపసర్గ (ప్రాది) చెప్పవలసియుండును. క్యఙ్ ప్రత్యయాంతమైన 'భద్రాయిత' శబ్దములోని అకారమునకు యతిచెప్పిన యీ తాతంభట్టే భ్రమసిన యా కొందఱిలోనివాఁడుగావలె. క్యఙంతములలో స్వరమైత్రిచేసిన ప్రయోగములు సైతము గానవచ్చెను.

నుతల్లి, కావలీపర్ణనోపదే + ష్టాయమాన (కవిరాజమనోరంజన 5-76)
అడరుచుఁ జిందులాడఁ బురు + షాయితబంధకళాప్రవీణతన్
(చంద్రరేఖ 1-92)
రంగమగర్వవార్ధిచం, ద్రాయిత వేంకటేశసచి + వాగ్రణి
(దశావతార 1-11 పుట)

అప్పకవి చెప్పిన యుభయయతి పాటింపఁదగిన నిత్యసమాసశబ్దముల పట్టిక :

కర్ణాట, వనౌకస్, ద్వీప, అంతరీప, ప్రతీప, నాస్తి, పదార్థ, అనేక, అనాది, అనంత, ఆసంగ, అనూరు, అన్యోన్య, జనార్దన, నాక, విశ్వామిత్ర, ఆపోశన, స్వాంత, ఏకాంత, సిద్ధాంత, రాద్ధాంత, లతాంత, ప్రాంత, నిశాంత, నారాయణ, వాతాయన, ఉపాయన, రసాయన, రామాయణ, పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన, వాత్స్యాయన, బోధాయన, దక్షిణాయన, ఉత్తరాయణ, మార్తాండ, బ్రహ్మాండ, వృషబాధిప, ద్వార.

## 33. దేశ్య నిత్య సమాస విశ్రాంతులు

తే. శబ్దశాసనముఖ కవీ। శ్వరకృత ప్ర
బంధముల లక్ష్యములఁ గను।పట్టు కతన
దేశ్య నిత్య సమాస సం।ధికిఁ బొసంగు
వడి స్వరంబైన వ్యంజన।వర్ణమైన. 190

క. రూపఱఁ, బెంపఱఁ బెల్లఱ,
నేపఱచుట, గ్రిక్కిఱియుట, నిల గ్రచ్చఱయుం,
జూపఱఁ యుక్కఱి మొదలుగ
క్ష్మాపతి యివి దేశ్య నిత్య సమసన పదముల్. 191

వ. కొందఱు వీని పేరే దేశ్యాఖండములును అందురు. 192

వి. అచ్సంధి ఘటితములై యేకపదముగా స్ఫురించు కొన్ని దేశ్యశబ్దములం దుభయయతి పాటించిన లక్ష్యములు నన్నయాది కృతులతోఁ గానవచ్చెడు: గాన రూపఱు, పెంపఱు, పెల్లఱు, ఏపఱుచుట, క్రిక్కిఱియుట, క్రచ్చఱు, చూపఱు, ఉక్కఱు మున్నగు దేశ్యశబ్దములలో సంధ్యక్షరమున కుభయయతి చెల్లును.

రూపఱు ఇత్యాదులు దేశ్యనిత్యసమాసములని యప్పకవి యభిప్రాయము. ఇంతకు మున్ను చెప్పినది సంస్కృత నిత్యసమాసశబ్దయతి కాన దీనికి దేశ్య నిత్యసమాసయతియని పేరిడియె, కాని రూపఱు మున్నగునవి సమాసములుగావు. అని శబ్దద్వయమేళనముచే నేకపదములవలెఁ జూపట్టుచున్నవి. సంస్కృత నిత్య సమాసములకుఁ జెప్పిన యుభయయతిలో నిత్యసమాసములు కాకున్నను తత్సదృశములగు సమాసములందు నుభయయతి చెల్లుబడియగునని తెలియవచ్చు చున్నది. ఇట్లే యివి దేశ్యసమాసకల్పములని గ్రహింపవచ్చు.

కాని దీని కెట్లో యొక తెలుఁగున నిత్యసమాసత్వకల్పన సాధ్యము గావచ్చును రూపు + అఱు-రూపఱు-ఇందుఁ బూర్వపదము నామవాచకము (సుబంతము) ఉత్తరపదము క్రియ. సామాన్యముగా సుబంతపదములకే సమాసము గలుగును (సహసుపా. పాణినీయము 2-1-4) కాని సంస్కృతమునందే 'ప్రణమతి నిషేధతి' మున్నగుచోట్ల సుబంతములు తిఙంతములతో సమసించు విధియుఁ గానవచ్చుటచేతను 'రూపఱు' మున్నగునవి సమాసకల్పములయిన శబ్దపల్లవములగుటచేతను వీనికి విలక్షణార్థము గలుగుటచేతను ఇవి దేశ్యనిత్యసమా సములని యెన్నదగును. రూపుయొక్క అఱుట (నశించుట) రూపఱుటయని విగ్రహము చెప్పికొనవచ్చును. అట్లు భేదముచేసినను వానిని వేఱుచేసి ప్రయో గించుటకు వీలులేదు. 'వాఁడు రూపఱెను' అనవచ్చుగాని 'వాఁడు రూపును అఱెను' అని పదవిభాగముచేసి ప్రయోగింపరాదు. కాన రూపఱు ప్రభృతు లఖండ శబ్దములవంటి వనుటలో సందియములేదు. కాన నిం దుభయయతి చెల్లును. ఛందోదర్పణకర్తయగు ననంతామాత్యుఁడు వీనిని నిత్యసమాసములనియే పేర్కొనియె. (చూ. క్రింది 193 పద్యము)

అప్పకవి యీ యతికి దేశ్యాఖండమను నామాంతరము చెప్పెను. ముందు నిత్యసమాసవిశ్రాంతుల కఖండవిశ్రమములను నామాంతరముచెప్పెఁగాన, నీ

దేశ్య నిత్యసమాసవిశ్రాంతులకు దేశ్యాఖండములను నామాంతరము చెప్పెనని యరయునది.

రూపఱు, పెంపఱు, పెల్లఱు మున్నగు శబ్దములలోనుత్తరపదము 'అఱు' ధాతువు. అఱు అనఁగా నశించు, తమిళ కన్నడములలోను అఱుశబ్దము నశించు అను నర్థమునసే వాడఁబడును. బలవంతుల బలమఱఁగా (భార. ఆది.7-176) అని భారతమున దీనికి వ్యస్తప్రయోగము గాననగును.

అప్పకవి యిచ్చిన దేశ్యనిత్యసమాసశబ్దములు.
రూపఱన్-రూపు + అఱన్-రూపుచెడు-నశించు.
అఱుధాతువుయొక్క తుమున్నాద్యర్థకరూపము 'అఱన్'

'రూపఱన్' ఇత్యాది తుమున్నంతరూపముల జెప్పుటకన్న 'రూపఱు' మున్నగు ధాతురూపముల గ్రహించుట రమ్యముగా నుండును. 'అఱ' అను నీ రూప మనంతు ననుసరించుటవలన నేర్పడినది కాబోలు.

(అఱ నసంగనుబోవుట కర్థమైన-అనంత)
పెంపఱ-పెంపు + అఱ, పెంపఱు-గౌరవము నశించు)
పెల్లఱ-పెల్లు + అఱ; పెల్లఱు - ఆధిక్యము నశించు

ఏపఱచుట-ఏపు + అఱచుట-అఱు ధాతువు ప్రేరణార్థకరూపము 'అఱుచు' కానోపును. కాని 'అఱచు' అనురూపమే వ్రాఁతలలోఁ గానవచ్చుచున్నది. 'ఏపఱచుట' అనఁగా గర్వము నశింపజేయుట యని యర్థము చెప్పికోనగును. ఈ శబ్దము సూర్యరాయ నిఘంటువులోను నొసఁగబడలేదు.

క్రిక్కిఱియుట - క్రిక్కు + ఇఱియుట. ఎడములేక వ్యాపించుట.

క్రచ్చఱన్ క్రచ్చు + అఱన్-దీనికి అమోఘముగా, స్పష్టముగా, ఎల్లప్పుడు, శీఘ్రముగా, అనాలోచితముగా మున్నగు నర్థములు గలవు. శీఘ్రముగా ననునర్థము ప్రసిద్ధము. ఇది క్రియావిశేషణము ద్రుతాంతము 'క్రచ్చఱు' అను రీతిఁ బ్రయోగములేదు క్రచ్చు అను శబ్దమునకు ధాన్యాదులయందలి పనికిమాలిన పదార్థము; పేనిన త్రాడులోనగు వానియం దుపయుక్తముకాని తృణాదులయంశము అను నర్థములు గలవు. దీనిఁబట్టి క్రచ్చునకు నిష్ఫలమను నర్థము వ్యంజితమగును. 'క్రచ్చఱన్' అనుటకు నిష్ఫలముగాకుండ, అమోఘముగా ననునర్థము సిద్ధించును. కాలక్రమమున శీఘ్రముగా నిత్యాద్యర్థములు దీని కేర్పడెనని యరయునది.

చూపఱి చూపు + అఱి అఱుధాతుక్త్వార్థరూపము 'అఱి' చూపుచెఱి యని యర్థము.

ఉక్కఱి-ఉక్కు + అఱి, ఉక్కు = బలము, ప్రతాపము, వేగము, గర్వము మున్నగు నర్థములు గలవు. ఉక్కఱు బలము నశించు, గర్వము నశించు అని యర్థములు.

మొదలగునవి లక్షణమునఁ జెప్పుటచేఁ నింకను నిట్టివి గలవని యెఱుఁగ వలయు. 'రూపఱు' మున్నగువాని కుభయయతి లక్ష్యములు క్రిందఁ జూపఁ బడును.

అనంతుని ఛందమునందు (1-101)

తే. 'అఱనఁనంగను బోవుట । కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి । ఇరుగు రెంట
నసుర వీరులనెల్ల ను । క్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నే । పఱచెననఁగ. 193

వి. పై పద్యమున దేశ్యనిత్యసమాసయతికి లక్షణలక్ష్యములు గలవు. ఈ యనంతుని లక్ష్యలక్షణములు బరికించియే యప్పకవి మఱికొన్ని శబ్దములఁజేర్చి యీ యతిభేదమును బ్రపంచించెను. అనంతుఁడు 'ఉక్కఱ, ఏపఱచె' శబ్ద ద్వయము నొసంగినాఁడు.

3 పా. అసుర.... ఉక్కు + అఱ—స్వరమైత్రి

4 పా. భాను.... ఏ + పఱచె—వ్యంజనమైత్రి

ఆరణ్యపర్వమునందు (3-345)

క. ఎఱకలుగల కులశైలము
తెఱఁగున మెరయము మెఱయ । దివికి నెగసి బి
ట్టుఱుము జలధరము క్రియ ను
క్కఱఁ దద్వనమెల్ల న్రుదప । నార్చుచుఁగడిమిన్. 194

వి. 4 పా. ఉక్కు + అఱ.... + అర్చుచు (స్వరమైత్రి)

---

1 అఱయనంగను అని యప్పకవీయముద్రితపాఠము. అఱన్ ద్రుతాంతము గాన నకారాగమము దుష్టము 'అఱు' అని ధాతురూపమును వ్రాయుటకు సంధి పొసఁగదు.

2. ఏపఱిచె-అని యుండనగును. ఏపఱుచు అన్నది ఏపఱు ణిజర్థరూపము.

యుద్ధకాండమునందు (784)

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె । యుగ్గొనరించిన దానికై కదా
చెఱఁగొని వచ్చితిం బిదప । సీత వృథాకథలింక నేల పెం
పఱ బ్రతుకింతతీయనె ఖ । రాదుల దాపున కేమిచింత నీ
మఱఁదలి బన్న మేపగిది । మానిని యీఁగుదు సంధిఁ జేసినన్.

వి. 3 పా. పెంపు + అఱ.... ఖర + ఆదుల-స్వర ప్రధానవడి

వసిష్ఠ రామాయణమునందు—

ఉత్సాహ. మఱి యుఁ బెక్కు యోనులందు।మహితచిత్రగతులఁబెం
పఱ జనించి దుఃఖభాజియై చలించి వెండియున్.
వఱలు విప్రవరునియింట । వాసుదేవుఁడనఁగ దా
నెఱుకగలిగి పుట్టె వేల్పుదే । జీతీరభూములన్. 196

వి. 2 పా. పెంపు + అఱ.... భాజి + ఐ.... స్వరయతి

విరాటపర్వమునందు (5-1-141)

చ. చిఱునగవొప్ప గాండివము । చెచ్చెర సజ్యముఁ జేసి సేనలు
క్కఱ రభసంబుమై నడరఁ గవ్వడి । ద్రౌణియు నీడువోక య
త్తఱిఁదఱుమంగ నస్త్రములు।దండడి దార్కొని మండుచుండెఁ జి
చ్చఱ పిడుగు ల్వడిం దొడఁగు।చాడ్పున నంబరవీథి న్యగమై. 197

వి. 2 పా. ఉ, క్కఱ — + కవ్వడి-వ్యంజనమైత్రి

లక్షణసారసంగ్రహమునందు-

తే. [1]అచ్చు హల్లును దేశీయ । మనియెడి వడి
యెన్న నొక్కొక్కచోటఁ ద్రిక్కఱి సెఁగృతుల
సరస లక్షణకవులు ప్ర । చ్చఱ నొనర్ప
భంజితాసుర సముదాయ । యాంజనేయ; 198

1. అచ్చుతోఁగూడి దేశీయమనెడు పేరతి.... ద్రిక్కఱియుఁ గృతుల-లక్షణ సారసంగ్రహపాఠము.

వి లక్షణసారసంగ్రహము ఛందోగ్రంథముగానఁ బై పద్యము దేశియ యతిలక్షణము లక్ష్యముగూడ నందే యున్నది. తత్కర్తచిత్రకవిపెద్దన దేశ్య నిత్యసమాసయతి యని పేర్కొనక కేవలము దేశీయ విరతి యన్నాఁడు. అనంతుఁడు చూపని 'క్రిక్కిఱియు, క్రచ్చఱ' శబ్దద్వయము నిచ్చినాఁడు పెద్దన. అప్పకవి యీ శబ్దమునుగూడ సంగ్రహించెను.

దేశీయమను విరతిలో అచ్చు హల్లు చెల్లునని పై లక్షణభావము.

2. పా. ఎన్న.... క్రి + క్కిఱియు (క్రిక్కు + ఇఱియు) - స్వరమైత్రి
3. పా సరస— క్ర + చ్చఱ - వ్యంజనమైత్రి

నిర్వచనోత్తరరామాయణమునందు (5-14)

చ. ఎఱుఁగవుగాఁ భోగముల । కెల్లను నెచ్చెలి జవ్వనంబు ని
త్తఱి నుడివోవకుండ నుచి । తంబుగ జక్కవదోయిఁబోలి క్రి
క్కిఱిసిన చిన్నిచన్నుఁగవ । యింపెసలారఁగ నాదుచిత్తమ
న్నఱలు సరోవరంబున । వారణ కేళి యొనర్పుకోమలీ. 199

వి. 3 పా. క్రి. క్కిఱిసిన... + ఇంపెస-స్వరయతి

అరణ్యపర్వమునందు (7-367)

చ. ఎఱిఁగితి నిన్ను నేను విబు । ధేంద్రుఁడ వీవు జగత్త్రియంబు గ్ర
చ్చఱ భవదీయ రక్షణము । నంద వెలుంగుచునుండు నట్టి ని
న్నుఱువుగ నేను వేడుకొన । నుత్తుఁడగాకఁ మొఱఁగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడుటిది । కర్జమె నిర్జితదైత్య చెప్పుమా. 200

వి. 2 పా. క్ర, చ్చ ఱ...రక్షణము + అంద-స్వరమైత్రి

ఉద్యోగపర్వమునందు (1-176)

చ. తఱయగు నంతకున్ రిపు ను । దగ్రత సైచుట నీతి నీవునా
కఱిపినయట్లు సేయుము త । గంజని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగుననైనఁ బొందగ మ । దింగల దేనియు నింతయేల క్ర
చ్చఱ మునివర్గ వాహనుఁడ । వై చనుదెమ్మను మంతఁ
దీఱెడున్. 201

వి. 4 పా. క్రచ్చ + అఱ....వాహనుఁడవు + ఐ-స్వరమైత్రి

విశే. అప్పకవి 'రూపఱు' మున్నగు వానిలో నన్నిటికి స్వర వ్యంజన, యతులు రెండేసి క్రమముగఁ జూపలేదు. ఆ వివరము స్పష్టముగా, జదువరు లకుఁ దెలియుటకై క్రింద పట్టికలోఁ జూపఁబడినది.

| | | | |
|---|---|---|---|
| పద్యము | 192 | ఉక్కఱు | స్వరమైత్రి |
| | | ఏ పఱచె | వ్యంజనమైత్రి |
| | 194 | ఉక్కఱి | స్వరమైత్రి |
| | 195 | పెంపఱు | స్వరమైత్రి |
| | 196 | పెంపఱు | స్వరమైత్రి |
| | 197 | ఉక్కఱు | వ్యంజనమైత్రి |
| | 198 | క్రిక్కిఱియు | స్వరమైత్రి |
| | | క్రచ్చఱు | వ్యంజనమైత్రి |
| | 199 | క్రిక్కిఱియు | స్వరమైత్రి |
| | 200 | క్రచ్చఱు | స్వరమైత్రి |
| | 201 | క్రచ్చఱు | స్వరమైత్రి |

ఇందు ఉక్కఱ క్రచ్చఱు శబ్దములు రెంటికి మాత్రమే స్వరమైత్రియు వ్యంజనమైత్రియుఁగల ప్రయోగములు రెండేసి చూపఁబడినవి. పెంపఱు, క్రిక్కిఱియు శబ్దములకు స్వరమైత్రిగల ప్రయోగములే రెండేసి చూపఁబడినవి వ్యంజన మైత్రిగల ప్రయోగము చూపఁబడలేదు. ఏ పఱచు శబ్దమునకు వ్యంజన మైత్రిగల లక్షణ గ్రంథస్థలక్ష్యము చూపఁబడినది. స్వరమైత్రికి లక్ష్య మొసఁగఁ బడలేదు. తక్కిన రూపఱు, పెల్లఱు చూపఱు, శబ్దముల కొక లక్ష్యమేని చూపఁబడలేదు. మఱి 194, 197 పద్యములు ఉక్కఱకు లక్ష్యములు గాన నయ్యవి యొకదాని ప్రక్క నొకటి యుండఁదగును.

దేశీయయతిలోఁ జేరఁదగిన శబ్దము లింకను నెన్నో కలవు.

అందుఁ గొన్ని -అఱు ధాతువుతోఁ జేరిన శబ్దములన్నియు నిందుఁజేరును.

కఱకరి (కఱకు + అరి) కల్లడఁఱు (ఈ శబ్దమే నిఘంటువుననుగానరాదు; ప్రయోగము మృగ్యము; అర్థము చింత్యము. ఇది లేఖక ప్రమాదమేమొ? కల్ల రీఁడు (కల్లరి + ఈఁడు అనుశబ్దముగానుండునని తోఁచెడు) కట్టిఁడి(కట్టు + ఇఁడి కట్టు లేనివాఁడు, కట్టనఁగా నియతి, బంధనము. ఇఁడి అభావార్థమునుదెల్పు ప్రత్యయము. నియమరహితుఁడు బంధనము లేనివాఁడు అని భావము. దీనికి క్రూరుఁడు, నిర్దయుడు అను నర్థము సిద్ధించును.) తెమ్మెర(తెమ్మ + ఎర = తేమ గలిగినగాలి, చలిగాలి, మందమారుతము. 'ఎర' అను పదమునకుఁ దెనుగులో గాలి యను నర్థము గానరాదు. కాని ఇదే యర్థముగల తమిళ కన్నడముల సమాస శబ్దములగు తెన్నల్-తెన్ + ఎరల్, తెమ్బళల్-తెమ్బు + ఎరల్' అను

వానిలోని సంధిని బట్టి తెనుఁగు తెమ్మెరను వేర్పఱచి వ్యుత్పత్తి చెప్పికొనగును. తమిళమున 'తెన్' అనఁగా దక్షిణము 'తెన్రల్'కు దక్షిణపుగాలి, మలయ మంద మారుతమని యర్థము.

ఓలమాస (ఓలము + ఆస) 'ఓలమాసగొను' అనురీతి నిఘంటువులోఁ గలదుగాని ఓలమాసశబ్దము గ్రహింపఁబడలేదు. ఓలము + ఆస + కొను-మఱుఁగును గోరు అనఁగా మఱుఁగునఁజొచ్చు. దేహము నుపేక్షించి యుద్ధమునకు వెనుదీయు నిత్యాద్యర్థములు సిద్ధించును.

ఎసలారు – (ఎసలు + ఆరు) ఒప్పు' అతిశయించు.

ఉల్లుఱుకు—ఈ శబ్దము నిఘంటుకారులు సంగ్రహింపలేదు. ఉఱుకు + ఉఱుకు - ఉల్లుఱుకు - అని యామ్రేడితసంధిగా నెన్నవచ్చును. (అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు-బాలవ్యా. సంధి-42) ఇది ఉల్లూఁగు(ఊఁగు + ఊఁగు) వంటిదియగును. ఈ సంధిలో 'ఉఱుకు + ఉఱుకు -ఉల్ల + ఉఱుకు-ఉల్లుఱుకు' అనురీతిరూపము సిద్ధించును. దీనికి మిక్కిలి పరుగెత్తు అని యర్థము.

వేటిఁడి-దీనికి వేటిఁడిశబ్దము మొదటిరూపము వేఱు + ఇఁడి - వేటిఁడి-అవివేకి యని యర్థము.

రజ్జులాఁడు (రజ్జులు + ఆఁడు) వదరుఁబోతు, ఆత్మస్తుతిపరుఁడు.

కఱకరి ఇత్యాది దేశ్యశబ్దములకెల్ల నుభయయతి చెల్లును.

కఱకరి ప్రభృతి శబ్దములు కావ్యాలంకారచూడామణిలో నొసఁగఁబఁడినవి. అప్పకవి వీనినేల సంగ్రహింపలేదో!

చూడామణి యొసఁగిన దేశ్యశబ్దములఁ బరికింప నీ క్రిందివన్నియు దేశ్యోభయయతికిఁ జెల్లునని చెప్పనగును.

మతుబర్థకమున అరి, ఆఁడు-ఈఁడు ప్రత్యయములు చేరు శబ్దములు-కఱకరి జూదరి, కల్లరి, నేర్పరి, చదువరి, తెరువరి, రజ్జులాఁడు, వగులాఁడు, వన్నెలాఁడు, వగలాఁడి, వన్నెలాఁడి, కల్లరీఁడు, మొక్కలీఁడు, బానసీఁడు మొ.

తదభావద్యోతకంబున మతుబర్థంబున 'ఇఁడి' ప్రత్యయమూ చేరునని-కట్టిఁడి, ముక్కిఁడి, వీటిఁడి, వెరవిఁడి-మొ.

ఆరు ధాతువు చేరు శబ్దపల్లవములు-

ఎసలారు, ఒనరారు, అలరారు, పెంపారు - మొ.

అక్కఱ, గ్రక్కఱలు శబ్దములను సర్వలక్షణసారసంగ్రహమును, ఆఱడి, శబ్దమును రంగయఛందమును దేశ్యయతిలోఁ బేర్కొన్నవి. రెండవ,

జోరన గ్రక్కున మున్నగు ననేకశబ్దములం దుభయయతి గూర్పఁబడిన ప్రయోగములు గానవచ్చుచున్నవి. పదద్వయమేళనము గలిగి యఖండముగాఁ దోఁచు దేశీయ శబ్దములందెల్ల నుభయయతి గూర్పవచ్చుననుట యుక్తము.

దేశ్యనిత్యసమాస విశ్రాంతి విషయ మింతవఱకేయైనను. నిత్య సమాసములు గాని యచ్చంధిఘటితశబ్దములం దుభయయతి (అప్పకవిమతమున నచ్చు చెల్లును. హల్లుతో మైత్రి చెల్లదు) చెల్లదని, యట్లు వ్యంజనమైత్రిగల ప్రయోగము లపపాఠ దూషితములని అప్పకవి యీ క్రింది సోదాహరణముగ స్పష్టపఱచుచున్నాఁడు.

1 (అఖండపది నిరాకరణము)

ఉ. నన్నయ ముఖ్య సత్కవి జనంబులు కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములుఁగొన్నియుఁ బోకడఁబెట్టి
తక్కువై
యున్నెడఁగాంచి జానవదు । లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజమంచుఁ గైకొని లక్షణ వేత్తలు సమ్మతింతురే. 202

వ. అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగమగుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబులగు లక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు పరీక్షించి వానినెల్లను ప్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబులగు పురాతనకవిప్రోక్తంబులు వివరించెద.

వి. పై పద్యగద్యములలో అఖండపది సరిగాదను తన మతమును నిరూపించుచున్నాఁడు.

నన్నయ మున్నగు మహాకవుల గ్రంథములలోఁ బ్రతిలేఖకులు కొన్ని పాఠములను, పాఠకులు గొన్నింటిని మార్చివైచిరి. అందుమీఁద లక్షణజ్ఞానరహితులు గొందఱు తమకుఁదోచినట్లు కొన్ని పాఠముల సవరించిరి. అనఁగా నిప్పుడున్న పెక్కుపాఠములు కవిప్రయుక్త మూలపాఠములు గావు. ఈ తప్పుత్రోవలను(అపపాఠములను) గవిప్రయుక్తములే యని గ్రహించుట లక్షణవంతము గాదు. అనఁగా నన్నయాది కవుల గ్రంథములలో నఖండపది ప్రయుక్తముగాలేదని, యఖండపదితోడి పాఠము లటీవలఁ గానవచ్చెదునని; యయ్యవి లేఖక పాఠకాదులు మిడిమిడిజ్ఞానముగల పండితమ్మన్యులు క్రొత్తగాఁ జేర్చినవి సవరించినవి యని. యట్టి పాఠములు గ్రాహ్యములుగావని భావము.

---

1. కుండలీకృతభాగము చేర్పఁబడినది.

ఇట్టి యపపాఠములను గ్రహించి సులక్షణసారమున లింగమగుంట తిమ్మన యఖండవడికి లక్ష్యములుగా నన్నయాదుల పద్యములఁ జూపెనని, యందుల కచ్చెరువడి బహుపుస్తకములు (ప్రతులు) పరిశోధించి యాపాఠములఁ బ్రక్షిప్తము లుగా నెఱిఁగి, లక్షణవంతములగు నిక్కమయిన మూలపాఠములఁ దాఁజూపెదనని పక్కాణించుచున్నాఁడప్పకవి.

గమనిక :- అప్పకవి క్రింది నన్నయాది పద్యములలో అఖండవడిలేని తన కిష్టమైన పాఠమునే ప్రవర్శించెను. లింగమగుంట తిమ్మన యిచ్చిన యఖండవడి యుక్తపాఠముఁ జూపలేదు. ఆ పద్యములలో నెం దఖండవళులుండెనో తిమ్మన చూపిన ప్రయోగపాఠమేదో తెలిసిననే యప్పకవి సవరణలోని సామంజస్య తత్త్వ మవగాహన యగును. కాన ఆ పాఠద్వయము ప్రతిపద్యమునకుఁ జూపెదను

ఇందు మొదటిది యప్పకవి వ్రాసిన పాఠము, దానిక్రిందిది యప్పకవికి సమ్మతముగాని తిమ్మనాది లాక్షణికులు జూపిన యఖండవడి యుక్తిపాఠము క్రమముగాఁ బ్రదర్శింపఁబడును.

ఆదిపర్వమునందు (5-135)

క. నా వచనమున నపత్యము
గావించును నీవు గొంతి । కడు నెయ్యమున్
నీ వగచిన యా యర్థము
సూపె మనంబునఁ దలంతు । సుందరి యెపుడున్, 204

వి. ఇందు 4 పా. పాఠాంతరము.

చూపె మనంబునఁ దలంచు + చుందును నెపుడున్

తలంచుచు + ఉండు - తలంచుచుండు - ఇది నిత్యసమాస శబ్దముగాదు. స్వర ప్రధానవడి గూర్పఁదగియుండగా సంధ్యక్షరమునకు వ్యంజనయతి మైత్రి గావింపఁ బడినది అప్పకవి పాఠమునఁ గేవలం వ్యంజనయతిమైత్రి.

ఉద్యోగపర్వమునందు (2-74)

క. తమతండ్రి భంగి నీకును
సముచితముగ భక్తిజేసిఁ । సజ్జన నుత మా
ర్గమునను జరియించవంగా
నమలమతీ కన్నకొడుకు । లట్లరయఁ జనున్.

వి. 3, 4 పాదముల పాఠాంతరము.

సజ్జనసుతమా, ర్గమునఁ జరింపంగా నమ.

లమతీ నీకన్నకొడుకు + లట్ల రయఁజనున్.

ఇందు 4 పా. కొడుకుల + అట్లు-కొడుకులట్లు-అచ్సంధిలో లకారమునకు వ్యంజనయతి చేయఁబడినది. ఇది యప్పకవిమతమున నఖండయతి.

అప్పకవియిచ్చిన పాఠములో అమల.... కొడుకుల + అట్లు-స్వరప్రధానవడి అనుశాసనిక పర్వమునందు (1-68)

క. అతిథి నినుఁగోరు నేనియు
నతిఁ గింకిరిపడ యోల । మాసపడక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము
సతికిం బతి పనుపుసేయఁ । జను నెల్లవియున్. 206

వి. 2 పా. పాఠాంతరము.

మతిఁగింకిరిపడకయోల + మాసపడక

మతి...ఓల + మాస (ఓలము + ఆస) వ్యంజనయతిమైత్రి.

అప్పకవి మతమున నిందు స్వరప్రధానవడియే చెల్లును. కాన నతని పాఠములో 'అతి.... ఓలము + ఆస' అనురీతి స్వరయతి యున్నది. అప్పకవి పాఠము సరిగా నని యీక్రిందికారణముచేఁ దెలియఁగలదు. ఓలమాసశబ్దము కావ్యాలంకారచూడామణిలో దేశీయవళిలో (దేశ్యనిత్యసమానోభయయతిలో) నొసఁగఁబడియున్నది. (7-69)

కలకరి కల్లకుఁబు కడుఁగట్టిఁడి తెమ్మెరలోలమాస గ
చ్చలనెసలారు టుల్లులకు లాడెడి వీటిఁడి రజ్జులాఁడు గ్రి
క్కిఱియుట నాఁదెనుంగునకు నీయుభయంబు వళిప్రకారమై
మెఱయఁ గవిప్రయోగముల మేలమెఱింగి రచింపఁగాఁదగున్.

చూడామణిలో నీ పద్యమును జక్కఁగా నప్పకవి పరికింపలేదు కాఁబోలు. ఇది సమీక్షించియుండునేనిఁ బైభారతపద్యమున నఖండవడి భ్రాంతిజనకమైన పాఠమును సవరించియుండఁడు. మఱియు నప్పకవి పాఠము సరిగా నున్నట్లులేదు. 'అతిఁగింకిరిపడక' ఇందు అతి వ్యస్తపదమా? దీని కిట్లు వ్యస్తప్రయోగముగలదా? లేదా 'అతికింకిరి' యని సమాసము చెప్పికోనగునా? అదియు వీలుగాదు. కింకిరిశబ్దము, (కోపమని యర్థము) దేశ్యము. ప్రాదులు దేశ్యశబ్దములతో సమసింపవు. ఇట్టి విలక్షణప్రయోగములు కాదాచిత్కములు గల

నని సమర్థింపఁజూచినను నిందంతటి యావశ్యకత గానరాదు అప్పకవికి ముందు వెనుకలనున్న లాక్షణికులు 'మఱిఁగింకిరిపడక' యనుపాఠమే చూపినారు. తిక్కనసోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్రుఁడు. తిక్కన శిష్యుఁడు మారన మార్కండేయపురాణమున నీ పద్యము ననుకరించి యీక్రిందిపద్యము రచించె.

క అతఁ డెంత రేఁగిత్తిట్టిన, మఱిఁగింకిరిపడక యపుడు మాటాడకయా
నతయగుచు నప్పతివ్రత, యతని నతిశ్రేష్ఠుఁగాఁగ నాత్మఁదలఁచుచున్.
(మార్క. 2-158)

తిక్కనమారన పద్యములలో విషయసామ్యము శబ్ద ప్రయోగసామ్యము నరయఁదగును. తిక్కనపాఠము 'మఱిఁగింకిరిపడక యోలమాసగొనక' యనుట నిశ్చయము. 'ఓలమాసగొనక' యనుటకుమాఱు 'ఓలమాసపడక' యనుపాఠ మప్పకవీయమున నున్నది. ఇందు మొదటిపాఠమే భారతమున గానవచ్చెను. ఇదియే గ్రాహ్యము.

రామాయణమునందు (యుద్ధకాండ-142)

ఉ. అన్నవు తండ్రి యట్ల విను । మంతియ కాదట మీఁద రాజవే
మన్నఁ గొఱంతలేదు మణి । హారము లాదిగఁ బెక్కుకానుకల్
మున్నుగసీతనిచ్చి జగ । లోక పతింగని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుఁ గార్యము ల్వలదు । సంధియ మేలటుగాక తక్కినన్.

వి 3. పా. పాఠాంతరము.

రాజవే,మన్నఁ గొఱంతలేదు మణి + మండనముఖ్యములైన

ఏమి + అన్న-ఏమన్న - ఇందు సంధ్యక్షరమగు మకారవ్యంజనములో నఖండయతిమైత్రిగలదు. అప్పకవిపాఠమున 'ఏమి + అన్న.... మణి + హారము' అనుచో 'అ హ'లకు మైత్రి, ఏమన్న-అనుచోట స్వర ప్రధానవడి యగును.

మఱియు, దానియందే (యుద్ధ. 165)

ఉ. ఓ కపివీరులారా! సుగు । ణోదధి నీరఘురాము సర్వలో
కైక శరణ్యునిం గొలువ । నిప్పుడు వచ్చితి నొండుగాదు నా
రాక మహాపరాధి యగు । రావణు తమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు । లర్కకులాగ్రణితోడఁ జెప్పరే. 208

వి. 2 పా. పాఠాంతరము.

సర్వలో, కైకశరణ్యునిం గొలువఁ + గా నిటవచ్చితి

లోక + ఏక-లోకైక, ఇందు వృద్ధి స్వరమైత్రి సేయవలయు. కాని పాదాది సంధ్యక్షర కకారమునకు (కై) యతిస్థానములోని గకారముతో మైత్రి సేయఁ బడియె ఇది యఖండయతి.

అప్పకవిపాఠమున 'లోక + ఏక.... + నప్పుడు' వృద్ధియతి.
దేవకీనందనశతకమునందు—

మ. చతురంభోధిపరీత భూవలయు రా । జన్యాలి కోటీర రం
జిత మాణిక్యవిరాజి తచ్చరణ రా । జీవుండు ధర్మాత్మజుం
డతి కార్పణ్యముతోడ మత్స్యపతిఁ దా । నాసింపఁడే నీదు శా
శ్వత కారుణ్యము గల్గునంతకును గృ । ష్ణా దేవకీనందనా. 209

వి ఇందు 1 పాదము పాఠాంతరము.

చతురంభోధిపరీతభూవలయరా + జానీకకోటీర

రాజ + అనీక-రాజానీక - సంధ్యక్షరమగు జకారముతో నఖండయతి అప్పకవిపాఠములో 'రాజన్య' యతిస్థానములో సంధిలేదు; చ జ లకు యతిమైత్రి.
అరణ్యపర్వమునందు (6-367)

చ. ఉరమున రెండుగన్నులు ప్ర । భూదర దేశమునందు నోరు ప్ర
స్ఫురిత భుజద్వయంబును సముజ్జ్వల దున్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృ । తాకృతితోడ నశేష సత్త్వసం
హరుఁడగుచున్నవాని దివి । జారిఁ గబంధుని గాంచి రచ్చటన్.

వి. 4 పా. పాఠాంతరము.

సత్త్వసుసంహరుఁడగుచున్న వాని దివి + జారిఁ గబంధుని

దివిజ + అరి-దివిజారి. సంధ్యక్షరమగు జకారమునకుఁ బాదాదిలో నున్న 'స్మ' సంయుక్తవర్ణములోని అకారమునకు నఖండయతి. అప్పకవిపాఠమునఁ బాదాది హకారమునకు యతిస్థానమున 'దివిజ + అరి' సంధియందున్న పరపదాద్యకారమునకు స్వరప్రధానవడి.

అప్పకవి చెప్పిన చొప్పున లేఖకపాఠకాదములు దిద్ది యఖండవడి యుక్తిపాఠములను గిలిపితనుటకన్న, పై పద్యములం దఖండవడి పాఠములే సరస

ములుగానుండుటచేతను లింగమగుంట తిమ్మనాదు లట్టే యుదాహరించుటచేతను మొదటఁ గవి ప్రయుక్తములైన యఖండవడి పాఠములను దరువాతి లేఖకాదులు సవరించి వైచిరని యట్టి తప్పుత్రోవల (కవిప్రయుక్తపాఠములఁ దొలఁగించి సవరించిన దుష్టమార్గముల) లక్షణవేత్తలు సమ్మతింపరని చెప్పుట యొప్పిదముగా నుండునని నా యభిప్రాయము.

ఉద్యోగపర్వమునందు (4-140)

చ. అని మది నిశ్చయించి తగనందఱఁ బిల్వఁగఁబంచి వారితో
నెనిచిన మాటలాడి వినయంబునఁ బ్రార్థనచేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొకొండిటికిఁ బ్రాభవమాచరింపఁజొ
చ్చిన సకలంబు నొప్ప నభిషేకముఁ గైకొనుఁడుత్స
వంబునన్. 211

వ. దీని మూఁడవ పాదంబునందు 'పదునొకొండిటికి' నని యున్నచోట సంధిగూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు ప్రయోగించినారు ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్య సమాసవడియని యనుకొందురు 212

వి. పై పద్యమున 'మాకొనరిన' (మారు + ఒనరిన) అనుచోట అచ్సంధి యున్నది. యతిస్థానమున 'ఒకొండు' శబ్దమున్నది. ఒకొండు శబ్దములో సంధి యున్నట్లు స్ఫురింపదు. ఒకొండు వ్యస్తపదమున్నచోఁ బై పద్య పాదమున (మా. కొనరిన.... ఒ + కొండు) అఖండవడి యని యొప్పుకొనక తప్పదు. అనగా మాకొనరిన అను సంధిగత శబ్దములో 'కొ' వర్ణమునకు మైత్రి. అఖండవడి యప్పకవికి సమ్మతముగాదు. అఖండవడి పాఠముల నితడు పద్యములందు సవ రించునట్లిందే లొకో యప్పకవి మార్చుడయ్యెం అతని కే ప్రతియందును దీనికిఁ బాఠాంతరము లభింపలేదేమో! అప్పకవి దీని పాఠము మార్పక 'స్థితస్యగతి శ్చింతనీయా' యను న్యాయమున నీ యతిమైత్రిని సమర్థించుచున్నాఁడు. ఒకొండు శబ్దములో 'ఒక + ఒండు' అను రీతి సంధిగలదని యాతని యభిప్రాయము. అట్లందు సంధియున్నదన్న 'మాకు + ఒనరిన.... ఒక + ఒండు' అని స్వరప్రధాన వడి యుభయత్ర చెప్పికొనదగు.... అప్పుడఖండవడి కవకాశములేదు. 'ఒకొండు' ఏకపదముగాకొని లింగమగుంట తిమ్మన, ముద్దరాజు రామన మున్నగు లాక్షణి కులు పై పద్యపాదము నఖండవడికి లక్ష్యముగాఁ జూపిరి అప్పకవి యీ తిమ్మన రామన ప్రభృతుల నుద్దేశించియే 'ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్య నిత్యసమాస వడియని యనుకొందురు.' అని వ్రాసియుండును. ఎవరిని మూఢుల క్రింద జమకట్టెనో యట్టి వారి లక్షణగ్రంథముల నాధారముగాఁగొని

యందలి పద్యము లుదాహరించినాఁ డప్పకవి. ఇతఁడిందే కాక పెక్కుచోట్లఁ బూర్వకవులను తన మతమునకు విరోధమున్నచోట ధూర్తులు అజ్ఞులు ఇత్యాది నిందార్థక శబ్దప్రయోగముచే నిరాకరించియున్నాఁడు.

**విశే.** అప్పకవీయ విమర్శనలో-'ఒక + ఒంటికి' అని యప్పకవి తాత్పర్యమని తోఁచుచున్నది. పదద్వయ విభాగమునకుఁ బ్రసక్తి కనిపించదు'- అని కూచిమంచి వెంకటరాయని సుకవిజనమనోరంజని (అముద్రిత లక్షణగ్రంథము) వాక్యముల నుద్ధరించినారు గిడుగువారు. 'ఒకొండు'లోఁ బదద్వయ సంధిగలదని సూర్యరాయాంధ్రనిఘంటువు తెల్పుచున్నది. (చూ. ఒండుశబ్దము) వ్యుత్పత్తిని బట్టి 'ఒక + ఒండు, అని పదవిభాగము గలదనుటలో సందియము లేదు. మఱి యీ క్రింది పాండురంగమాహాత్మ్యప్రయోగము 'ఒకొండు'లో స్వరసంధి యున్నదని నిరూపించెను.

గీ. వాసుదేవాది నవశక్తి-వైభవంబు
రుక్మిణీ సత్యభామల-రూపరేఖ
యిడియె వహియించునన నల్వ-యిడిన పదునొ
కొంటి లెక్కనఁ గనుబొమ్మ + లువిద కమరు. (8-198)

'ఒక + ఒంటి.... బొమ్మలు + ఉవిద' - ఇది యతిమైత్రితీరు. ఒకొండులోఁ బదద్వయ విభాగ ప్రసక్తి కనిపించదన్న నిందు యతిభంగము సిద్ధించును. ఇందఖండవడి చెప్ప వీలులేదు. ఇది స్వరప్రధానవడి. ఇట్టి స్వరప్రధాన వడియే పై భారత పద్య తృతీయపాదమున అప్పకవి చెప్పినచొప్పున నొప్పారుచున్నదని యొప్పక తప్పదు. ఈ పాండురంగమాహాత్మ్య ప్రయోగము సూర్యరాయాంధ్ర నిఘంటువు చూపలేదు. అప్పకవికిఁ దెలియదు. కూచిమంచి వెంకటరాయుఁడు పరిశీలింపలేదు. గిడుగువారు నెఱుఁగరు కాఁబోలు. ఎఱిఁగి యున్నవారు పదద్వయ విభాగప్రసక్తి కనిపించదని వ్రాయుదురా?

తిక్కన రామకృష్ణకవుల పద్యములలో 'ఒకొండు' శబ్ద మధ్యాక్షరమునకు స్వరమైత్రి చేయఁబడినదని తెలిసికొంటిమి. దీనికి వ్యంజనమైత్రియుఁ గలదని భారత ప్రయోగాంతరము నిరూపించుచున్నది.

పాండవుల వల్లనఁ గీడొ
క్కొండును లేదధిప నీదు + కొడుకులు (స్త్రీ 1-83)

రంగనాథ రామాయణములో ఒకొండు శబ్ద మధ్యాక్షరమునకు స్వరయతి యీ క్రిందిపాదమునఁ గానవచ్చుచున్నది. చూ.

పదునొ కొండువేలేండ్లు దా + నుర్విఁ బాలించె(వావిళ్ళ ప్రతి పుట 498)

ఒకొండు శబ్దములోఁ బదద్వయ విభాగము స్వరసంధియుఁ గలవు. స్వరవ్యంజనోభయయతి మైత్రి మహాకవి సమ్మతము. ఇది రూపఱు. క్రిక్కి

జియు నిత్యాదులవలె దేశ్య నిత్య సమాసముల క్రిందఁ జేరఁదగినది. కాన నియ్యది దేశ్యాఖండయతి క్రిందఁ బరిగణింపఁదగినది. కాన దీని కుభయయతి చెల్లునని ఫలితార్థము.*

ఒకొండు శబ్దములో స్వరసంధి లేదనుకొని దాని నేకపదముగా గ్రహించి లింగమగుంట తిమ్మనాదులు 'మా కొనరిన' అను దానిలోని సంధ్యక్షరముతో అఖండవడి గూర్పఁ బడినదని తలంచిరి. ఒకండులో సంధియున్నదన్న యప్ప కవి 'మా కొనరిన' యను దానిలోని సంధ్యక్షరముతో స్వరప్రధానవడి చెల్లినదని వచించెను. ఒకొండు శబ్దములో నుభయయతి చెల్లునను యితరాధారములవలన నేర్పడుటచే నప్పకవి మతానుసారము స్వరప్రధానవడి యన్నను, ఇతర - లాక్షణి కుల మతమున నఖండవడి యన్నను సమీచీనమే యగును.

ఈ పద్యమున దేశ్య నిత్యసమాసవడి గాదన్నను ఒకొండు శబ్దము దేశి నిత్య సమాసవడిలోఁ జేర్పఁదగినదని యట్లు చెప్పుట మూఢత్వముగాక సం సత్వమే యగునని యరయునది.

అప్పకవి యఖండవడి కుదాహరించిన పద్యపాఠముల నెల్ల మార్చినవాఁడు, దీనినిగూడ 'మా, కొనరిన సైన్యముల్ పదియు నొంటికి అనుకీతి ననరింపలేక పోయెనా? ఈ పాఠము సరసముగా లేదని మానెనా? కరాలపాటి వారి ముద్రిత భారతప్రతిలో 'మీరలి' యొనరిన సైన్యముల్ పదునొకొంటికి, బ్రాభవ' మను పాఠము వెలయుచున్నది. అప్పట్టున నప్పకవి చెప్పిన స్వరప్రధానవడి యొక్కటే చెల్లునని యెఱుఁగునది.

## 34. నిత్యయతులు

క. ఏని యను నాంధ్రశబ్దము
తో నతికిన పూర్వపదము । తుది వ్రాయికి న
చ్చైనను వ్యంజన వర్ణం
బైన రచింపుదురు నిత్య।యతులనుచుఁ గవుల్. 213

శేషధర్మములయందు—

క. మెట్టఁడు నారకమార్గం
బెట్టి మహోక్రూరకర్ముఁ । డేనియుఁదుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టిన హరితలఁపు గలిగె । నేని మహాత్మా. 214

* విశేషములకు చూ. నా వ్యాసము 'అఖండవ' పదునొకండు శబ్దము భారతి 1949 సెప్టెంబరు సంచిక.

వి. అప్యర్థకమయిన 'ఏని' శబ్దము పరమయి సంధిఁగూడిన పూర్వపదాంత వర్ణమునకు నుభయయతి చెల్లును. దీనికి నిత్యయతి యని పేరు

ఏనియను పదంబుతో నాఁడు పదమంది
సంధి నిత్యయతుల-జరగుచుండు
ఎట్టి క్రూరకర్మ-జేసి సద్గతినొందు
నన్ను నాత్మఁదలఁచె-నేని కృష్ణ (ఛందో 1-130)

అని యనంతామాత్యుఁడు దీనికి నిత్యయతి యని పేరిడెను. అప్పకవి యీ పేరినట్లే గ్రహించె. ఏని శబ్దమునకుఁ బ్రత్యేక ప్రయోగము లేదు. అప్యర్థమున దానికిఁ బూర్వమొక శబ్దముండును. ఏని యజాది పదమగుటచే నచ్సంధి యగును. సాధారణముగ దీనికి నిత్యసంధి ఘటిల్లును. అట్లు నిత్యసంధిగల చోటనే యీ యుభయయతి చెల్లును గాన దీనికి నిత్యయతి పేరు గలిగియుండును. పై యనంతుని లక్షణమందుత్తరార్థము లక్ష్యము. 3, 4 పాదములలో క్రమముగ ఏని శబ్దసంధిలో స్వర వ్యంజనయతి మైత్రి చేయఁబడినది.

అప్పకవి చూపిన లక్ష్యములలోను స్వర వ్యంజనముల రెంటిమైత్రి కుదాహృతులు గలవు.

2 పా. మార్గంబు + ఎట్టి.... కర్ముఁడు + ఏనియు-స్వరమైత్రి.
4 పా. నెట్టన.... కలిగె + నేని — వ్యంజనమైత్రి.

విశే. అప్పకవి చూపలేదు గాని నిత్యయతి కీ క్రింది నన్నయ ప్రయోగము గానవచ్చెను.

దీని నెట్టులు గ్రమ్మఱింతు మ + దీయభాషణ మెన్నఁడు
న్నేని మోఘముగాదు దిగ్ధర + ణీరవీందు లెఱుంగఁగాన్ (ఆది. 17-141)

ఇందు రెండవపాదమున వ్యంజనమైత్రిగల నిత్యయతిగలదు. ఎన్నఁడున్ + ఏని-ఎన్నఁడునేని ఇందు సంధియందు ద్రుతమునకు సంశ్లేషము చేయఁబడెను. నిత్యయతి ప్రకారము సంశ్లేషవశమున నిల్చిన నకారవ్యంజనమునకు యతి చేయబడెను. ఈ పద్యము కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహములో నిత్యయతికి లక్ష్యముగాఁ జూపఁబడినది.

ఈ ప్రయోగ విషయమునఁ గొంత వివాదమున్నది.

'ఉకస్సంశ్లేషౌనాటి ద్రుతస్య' (ద్రుతమున కచ్చు పరంబగునపుడు లోపము గాని సంశ్లేషముగాని రాదు) అని చింతామణిలో నన్నయయే సూత్రించి

తద్విరుద్ధముగ 'ఎన్నఁడున్ + ఏని - ఎన్నఁడున్నేని' అని ప్రయోగించవచ్చునని యిందున్నది నేని శబ్దము గాని ఏని శబ్దము గాదని యిటీవలి పండితుల యభిప్రాయము.

సూర్యరాయాంధ్ర నిఘంటు విట్టి యభిప్రాయముతోడనే 'ఏని - నేని' రూపాంతరములుగాఁ జూపినది. నేని శబ్దముక్రింద పై నన్నయ ప్రయోగము నుదాహరించినది. నేని రూపాంతరమని యిందు గ్రహించితిమేని నన్నయ ప్రయోగమునఁ గేవల ప్రాణియతి చెప్పికోవచ్చును. నిత్యయతి కవకాశములేదు, అప్పకవి యిచ్చిన శేషధర్మస్థ పద్యమునందుఁ గూడ 'నెట్టన.... కలిగె + నేని' యనుచోట సాధారణ వ్యంజనమైత్రి చేయఁబడెనని చెప్పవలెను. అనంతామాత్యుఁడు మొదలుగాఁ బ్రాచీన లాక్షణికు లీ నిత్యయతిని జెప్పుటచేత 'ఏని' యను రూపమే కాని నేని రూపము ప్రాచీన పండితాభిప్రేతము గాదని యెంచ నగును

సూర్యరాయాంధ్ర నిఘంటుకారులు అప్పకవి చూపిన శేషధర్మపద్యమును నేని శబ్దముక్రింద నొసఁగుచు 'ఈ పద్యమును అప్పకవి ఉభయపక్షములలోని నిత్యయతికి ఉదాహరణముగా నిచ్చినాఁడు. కాని పై ప్రయోగములఁబట్టి చూడఁగా దాని కాధారము చింత్యము' అని వ్రాసినారు

నిఘంటుకారులు చూపిన ప్రయోగములు

నీవును జూచి తట్టి సభ + నేని వినంబడ దే యుగంబునన్ (సభా 2-95)

సలలిత సాంద్రక కుసుమ.... అలఁదిన చందనంబు తడి యారదు నేనియు (నన్ని. కుమార 5-551)

నెలత న్నాఱుంగవునేని (నన్ని కుమార 6-670)

అర్థ విశేషమునందుఁ గళలపై సముచ్చయము ప్రయోగములం జూపట్టుచున్నవి-కలరును దాతలు నిత్తురున్, నొచ్చెదరును, విచ్చెదరును, తల్లివి తండ్రివిన్-మొ. తడియారదునేనియు నిత్యాదులం దర్థ విశేషముల సముచ్చయ ప్రయోగమని ఎన్నఁదగును సభాపర్వ ప్రయోగమునకుఁ గరాలపాటివారి భారత ప్రతి యందేని శబ్ద రహితమగు పాఠము గానవచ్చెడు-'ఈవును జూచితట్టి సభ యెందు వినంబడదే యుగంబునన్.'

వీని నెల్లఁ బరిశీలింపఁగా ప్రాచీనులు చెప్పిన ఏని శబ్దమే పై ప్రయోగములందుఁ గలదని నిత్యయతి కుభయము చెల్లునని గ్రహింపఁజనును.

## 35. రాగమసంధివళులు

తే. ఆలను పదంబు మొదలను । రాగమంబు
వచ్చు సంధికి నుభయంబు । వళికిఁ జెల్లు
నతని జవరాలు బాలెంత । రాలు ముద్ద
రాలు ధర్మాత్ముఁరాలన రాక్షసారి. 512

వి. రుగాగమ సంధిలో నుభయయతి చెల్లును.

పేదాది శబ్దములకు ఆలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. (బాల. సంధి 30)

పేద + ఆలు - పేదరాలు, జవ + ఆలు - జవరాలు, బాలెంత + ఆలు - బాలెంతరాలు, ముద్ద + ఆలు - ముద్దరాలు.

కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. (బాల సంధి 31)

ధర్మాత్మ + ఆలు - ధర్మాత్ముఁరాలు.

ఇందు సూరి సూత్రములు స్పష్ట ప్రతిపత్తికై చూపఁబడినవి. అప్పకవి దీనినే ఆలుశబ్దము మొదట రాగమము వచ్చునని చెప్పినాఁడు. సూరి సూత్రములలో మొదటిది యాచ్ఛిక శబ్ద విషయము, రెండవది తత్సమ శబ్ద విషయము. అప్పకవి యుదాహరించిన శబ్దములలో, నీ రెండు తెలుఁగులు గ్రాహ్యములు. ఇట్టి రాగమ సంధులతో అచ్చునకుఁగాని హల్లునకుఁగాని యతి చెల్లును. రాగమ సంధిలో వచ్చు నుభయవళులు గాన దీని కీ పేరు సార్థకము.

అప్పకవి లక్షణ పద్యములో నుత్తరార్ధము లక్ష్యమగును.
3 పా. అతని....బాలెంత + రాలు (బాలెంత + ఆలు) - స్వరమైత్రి.
4 పా. ముద్ద, రాలు.... + రాక్షసారి - వ్యంజనమైత్రి.
అప్పకవి చూపిన యితర లక్ష్యములు :
మనుచరిత్రమునందు (2-41)

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు । వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవ । రాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగ । వేమునువచ్చినత్రోవచొప్పు నీ
కింతభయంబులే కడుగ । నెల్లిద మైతిమె మాటలేటికిన్. 216

వి. 2 పా, ఏక + అంత...జవ + ఆంధ్ర-స్వరమైత్రి

రాగమసంధివళి వలన 'జవరాంధ్ర' లో స్వరము చెల్లునట్లు-ఇంతకు ముందు నిత్యసమాసయతిలోఁ జెప్పఁబడిన ఏకాంతశబ్దములోను స్వరము చెల్లును. ఉభయయతి చెల్లదగిన రెండు శబ్దములలోని స్వరముల కేకత్రమైత్రి యిందుఁ జూపట్టు చున్నది.

చారుదేష్ణ చరిత్రమునందు—

క. ఈలలన వేలుపుంజవ
రాలో యచ్చరయొ కిన్న । ర వధూమణి యో
వ్యాళాంగన యో కాకీ
భూలోకస్త్రీల కిట్టి । పొంకము గలదే. 217

వి. 2పా. జవ,రాలో...కిన్న + రవధూ-వ్యంజనయతి.

రుగాగమమునం దుభయయతి చెప్పినారు గాని యట్టిదే యగు టుగాగమ నుగాగమములం దెవ్వ రభయయతి చెప్పలేదు.

## 36. విభాగవళులు

క. తులసీభూషణ సంఖ్యకుఁ
దెలుఁగునఁ బరిమాణ సంజ్ఞ । దేటపడుచు ప
ట్టుల నేసి యను పదమునకు
నలరు విభాగవడి యనగ । నచ్చును హల్లున్. 218

కాశీఖండమునందు (2-105)

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా । కంబు జూక్షి
ఋషుల పాలిటివే యింత । లేసి పనులు
కొతుక కాఁబోతు నాఁబోతు । గుమ్ములాడ
నడిమి యాఁబెయ్యె దెసవచ్చె । నాకుఁజూడ 219

కావ్యచింతామణియందు—

ఆ. కృష్ణుఁ డిచ్చెనాలు గేసి । చీరలు కూర్మి
నింతులకును నాలు । గేసి మణులు

తీవితోడదోసె । డేసి మాడలు కడు
నింపెసంగ గంపెఁ । డేసి సొమ్ము. 220

వి. సంఖ్యా వాచకమునకు బరిమాణ వాచకమునకు దెనుఁగున ఏసి శబ్దము (ప్రత్యయము) పరమగును. ఏసి పరమయి కూడిన నిత్యసంధి యందుభయ యతి చెల్లును. నాలుగేసి (నాలుగు + ఏసి) గంపెఁడేసి (గంపెఁడు + ఏసి) యను సంఖ్యా పరిమాణార్థక శబ్దములో ఏసిశబ్దము విభాగార్థమును దెలుపును. కృష్ణుఁడు భార్యలకు నాలుగేసి చీరలిచ్చెననఁగా నొక్కొక్కతెకె నాలుగు నాలుగు చీరలు విభాగించి యిచ్చెనని యర్థము. దోసెఁడేసి మాడలిచ్చె ననఁగా దోసెఁడు దోసెఁడుగా వేఱుచేసి విభాగించి యెత్తుకొని యిచ్చెనని యర్థము. ఏసి శబ్దము విభాగమును సూచించును, గాన నీయతికి విభాగవడి యను పేరొసఁగబడియె.

'సంఖ్యకుఁ దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపరుచు పట్టుల' అని రెంటి నప్పకవి యిందుఁ బేర్కొన్నాఁడు నాలుగు - సంఖ్య, దోసెఁడు - పరిమాణము. 'సంఖ్యకుం బరిమాణ సంజ్ఞకుఁ దనర్చు, శబ్దములపై విభాగోక్తి సరణి సంఘటించునప్పుడు యతులు రెండేసియగు నుపేంద్రుఁడిచ్చె నర్థము మోపెఁడేసి యనఁగ' (ఛందో 1-121)

అను ననంతామాత్యుని లక్షణము మన యప్పకవికి మూలము.

పరిమాణార్థమందుఁ గొన్ని యెడల ఎఁడు వర్ణకముపై ఏసి చేరును.

ఉ. దోసిలి + ఎఁడు + ఏసి-దోసెఁడేసి గంప + ఎఁడు + ఏసి-గంపెఁడేసి.

219 ప-2 పా. ఋషుల.... ఇంతలు + ఏసి-స్వరమైత్రి.

220 ప - కావ్యచింతామణి తాతంభట్టు రచించిన లక్షణ గ్రంథము. అందీ పద్యము విభాగవడికి లక్ష్యము గాన నాలుగు పాదములును విభాగవడి కుదాహరణములగు.

1. పా. కృష్ణ .... నాలు + గేసి - వ్యంజనమైత్రి
2. పా. ఇంతు .... నాలుగు + ఏసి - స్వరమైత్రి
3. పా. తీవి .... దోసెఁ + డేసి - వ్యంజనమైత్రి
4. పా. ఇంపెసంగ గంపెఁడు + ఏసి - స్వరమైత్రి

విశే. ఏసికిఁ జెప్పిన యుభయయతి 'ఎఁడు' అను పరిమాణార్థక ప్రత్యయము చేరిన సంధి యందును జెల్లనగును. దీనిని లాక్షణికులు చెప్పలేదు. ప్రయోగములు గలవు.

చెలసి కుచేలుఁ డొక్క కొణి + దెండ డుకుల్ తనకిచ్చినన్ (భా. శ.)
చెఱఁగొలు కింతెఱు పుడి + సెండు జుంబిడి పెంపనేర్చునే (భా. శ)

కొణిసిలి + ఎడు-కొణిదెండు, పుడిసిలి + ఎడు-పుడిసెడు. హ్రస్వము మీఁది యకారమున్న వికల్పముగ నిండుసున్న యగును. గాన కొణిదెండు, పుడిసెదను రూపములు సిద్ధించును. ఇందు వ్యంజనమైత్రి చేయఁబడినది. స్వర మైత్రి సర్వసాధారణము.

## 37. నామాఖండ విశ్రమములు

ఆ. అప్ప అయ్య అన । 1అరసవ్వ అమ్మక్క
ఆయి యను పదంబు । లదుకు సంధు
లుభయమునకుఁ జెల్లు । చుండు నామాఖండ
వశులనంగ నూచ । బడక యైన. 221

టి. అప్పాదిశబ్దములు పరమగు కూడిన సంధులం దుభయయతి చెల్లును. శ్రేష్ఠతావాచకంబులగు అన్నాద్యర్థకశబ్దంబులు పరంబులగుచో నన్నయమ్ము లను సంధి నిత్యము (ప్రౌఢవ్యాకరణము సంధి 1)

ఇతర వ్యాకరణములు దీనినే అన్న్యములని వ్యవహరించెను.

అన్న, అప్ప, అయ్య, అరసు, అమ్మ, అక్క, అవ్వ అయి మున్నగునవి యన్నాదులు. ఇవి శ్రేష్ఠతావాచకములు. అన్నాదులు పరమగుచో అన్ని యమ్ము లను సంధి నిత్యము. ఉ॥ రామ + అయ్య-రామయ్య, సీత + అమ్మ-సీతమ్మ, సింగ + అన్న - సింగన్న-వీ యందెల్ల స్వరమును వ్యంజనమును యతికిఁ జెల్లును. 'రామయ్య' అనుచోట సంధిలోని మకారముకుఁగాని పరపదాద్యచ్చగు అకారమునకుఁగాని యతి చెల్లును. ఇట్లే తక్కినవానికి గ్రహింపవలెను.

ఈ యన్నాదులు 'అన, అమ, అయ, అప, అనురీతి ద్విత్వరహితములు గాను నుండును. ఉ. రామయ, సీతమ, సింగన - మొ. అట్లూపఁబడక యున్న పుడును నుభయ యతిచెల్లును. అనంతుఁ డీయుభయయతి యన్నాదులూఁదఁ బడక యున్నప్పుడే చెల్లునని చెప్పెను. ఆ విషయము ముందు వివరింపఁబడును. (అప్ప 3-208) ఆ సందేహము నివారించుటకే 'యూఁదబడకయైన' అని యప్పకవి స్పష్టపఱిచె

'రామయ్య' ఇత్యాదులు నామములు పేళ్ళ కన్నాదులుచేరి సమసించును. ఈ సమాసములకు విగ్రహము చెప్పు వాడుకలేదు. ఇవి నిత్యసమాసము లనఁ దగును. ఈ నామము లఖండశబ్దములవలెఁ దోచునుగాన నీ యుభయయతి

---

1. అరసు

భేదమున కప్పకవి నామాఖండ విశ్రమము లని నామకరణముగావించె అనంతుఁడు ప్రభునామాంతయతియని, చిత్రకవిపెద్దన ప్రభుయతి యని దీనిని బేర్కొనిరి. ప్రభువనగా శ్రేష్ఠుఁడు. శ్రేష్ఠార్థకములగు అన్నాదుల యోగమునఁజెల్లు యతిగానఁ బ్రభుయతి యను పేరుపెట్టి యుందురు.

అప్పాదుల యర్థములు విస్పష్టములు.

అరసు - అరుసు - రాజని యర్థము. కన్నడమున అరసు, అరుసు అని తమిళమున అరసన్ అని యిది వాడఁబడును. (తిమ్మరసు)

ఆయి - తమిళ కన్నడములం దీశబ్దము గలదు. అమ్మ శబ్దమువలె స్త్రీల పేళ్ళ చివర శ్లేష్మవాచిగాఁజేర్పఁబడును. (సీతాయి)

ఇందులకు లక్ష్యములు :

అప్ప యనుటకు నందితిమ్మన చాటుధార—

క. ఇప్పటి దాతల సరిగాఁ
జెప్పకురా భట్ట కర్ణ । శిబిఖేచరులన్
జెప్పము మూర్తి ఘనుని వెం
కప్పకు దానమున నిర్భ । యంబున సభలన్. 222

వి. వెంక + అప్ప......నిర్భ + యంబు-స్వరమైత్రి.

ఇందు అకారముతో యకారము చెల్లింపఁబడినది: అయలమైత్రి సరసవళి యందుఁ జెప్పఁబడినది యని యెఱుఁగునది.

హుళక్కి భాస్కరుని చాటుధార

క. అప్ప లిడు నఁతడు ఘనుఁడా
యప్ప డొసఁగి మరలఁ జెందు । నాతఁడు రాజా
చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు । రాజు నటంచున్. 223

వి. మా,రప్ప (మార + అప్ప)...... + రాజు-వ్యంజనమైత్రి.

అన్న అనుటకు పొట్టూరి గోపన—

క. అన్నలుఁడు రూపమున సిరి
యన్న కళాయుక్తి భరతు । నన్న కరుణచే
నన్న సముద్రపు పెద చి
న్నన్న కుమారుండు వెంగ । ళామాత్యుఁడిలన్. 224

వి చిన్న + అన్న......... వెంగళ + అమాత్య - స్వరయతి
తెనాలి రామలింగము-

క. చిన్నన్న ద్విపద కెఱగును
బన్నుగఁ బెద తిరుమలయ్య । పదమున కెఱగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్య । గద్య శ్రేణిన్. 225

వి. నరసింగన్న (నరసింగ + అన్న — గద్య— వ్యంజనయతి.)
తేలఁబలుకుటకు విక్రమార్క చరిత్రమునందు—

చ. అనఘుఁడు సింగనార్యునకు । నబ్బయ గోవయ మంత్రి చిక్కనా
ర నయును గల్గి రాత్మజులు। రాములు మువ్వురుదోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకు పుత్త్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయునుబాచరాజు గుణసంగుఁడులింగనయుం గ్రమంబునన్.

వి తేలబలుకుట - ద్విత్వరహితముగఁ జెప్పుట, దీనినే యూఁదఁబడ కుండుట యనియుఁ జెప్పుదురు. ఊఁదఁబడుట-ద్విత్వ యుక్తముగాఁ జెప్పుట. అన్న - ఊఁదఁబడుటకు అన - తేలఁబలుకుటకు ఉదాహరణములు. నారన - నారన్న, కేసన - కేసన్న - అన్నవి రూపాంతరములు.

ఇందు నారన కేసనలు తేలఁబలుకఁబడినవి. ఊఁదఁబడినను నూఁదఁబడకున్నను నిం దుభయయతి చెల్లును.

2. పా. నా, రన(నార + అన)....... + రాములు - వ్యంజనమైత్రి.

4. పా. కే, సన (కేస + అన)....... + సంగుఁడు - వ్యంజనమైత్రి.

అయ్య అనుటకు—

.... .... .... ....

(ఇం దీపద్యము లోపించినదని యెంచవలెను; క్రింది కాశీఖండ పద్యమున స్వరమైత్రి యుంటచే నీపద్యము వ్యంజనమైత్రి గలదాని కుదాహరణముగ నిచ్చినదై యుండవలెను.)

కాశీఖండమునందు (1-13)

సీ. గీ. నైషధాది మహా ప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ

యిపుడు సెప్పఁదొడంగిన । యీ ప్రబంధ
మంకితము సేయు వీరభ । ద్రయ్య పేర.

వి. 4 పా. అంకిత...భద్ర + అయ్య - సర్వమైత్రి.
ఊఁదఁబడక ఉన్నం యనకు సనంతుని ఛందమునందు (1-120)

తే. ఒరుల నమ్మయ్య యనుచోట । నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభు నామాంత । విరమణంబు
మహి నయోధ్యకు రాజు రా । మయ యనంగ
నతని పట్టంపు దేవి సీ । తమ యనంగ 228

వి. ఇది యనంతుఁడు నామాఖండ విశ్రమమునకుఁ బ్రభునామాంకితవిరమణము పేరఁ జెప్పిన లక్ష్యసహిత లక్షణపద్యము. అమ్మ అయ్య యను శబ్దము లూఁదఁబఁడని యప్పుడే (రామయ, సీతమ) యుభయయతి చెల్లునని యనంతుని మతము. యూఁదినను (ద్విత్వసహితమయినను-రామయ్య, సీతమ్మ-ఇత్యాదివలె) నూఁదఁబడక యున్నను (ద్విత్వరహిత మయినను-రామయ, సీతమ ఇత్యాదివలె) నుభయత్ర నీ యుభయయతి చెల్లునని అప్పకవిలక్ష్యపురస్సరముగాఁ దెల్పెను. 'రామయ' అనుచోఁ జెల్లు నుభయయతి 'రామయ్య' యనుచోఁ జెల్ల దనుటకుఁ గారణము దురూహము. రెంటను జెల్లునని యెఱుఁగునది. అనంతునికి ద్విత్వయుక్త రూపములం దుభయయతి లక్ష్యములు లభింపలేదు కాఁబోలు.

అనంతుని పై పద్యమం దుత్తరార్ధము లక్ష్యమగును.
4. పా. మహి.........రా + మయ- వ్యంజనమైత్రి.
అతని—సీ + తమ (సీమ + అమ) - స్వరమైత్రి
రుక్మాంగద చరిత్రమునందు—

ద్వి. శ్రీకర గుణసాంద్ర । చిరయశో మంద్ర
ఆకార చంద్ర రా । మయ భాస్కరేంద్ర. 229

వి. 2 పా. ఆ—రా + మయ (రామ + అయ) - స్వరమైత్రి.
(ఇది యూఁదఁబడని దాని కుదాహరణము.)

అరుసు అనుటకు ఆంధ్రకవితా పితామహుఁడు-

క. చేపట్టిన ధ్రువులగుదురు
కోపించిన రంభఁగూడు । కొందురు జగతిన్

స్థాపింపఁ బౌదవఁజాలని
యాపందలు సొల్పకోన । మరుసున కెనయే. 230

వి. 4 పా. ఆ పంద....కోనము + అరుసు - స్వరమైత్రి

పలకలూరి గోపన—

ఆ. గోలకొండ మలక । గోవుల భక్షించుఁ
గొండపీటి విప్ర । కులము నెల్ల
బాచ మరుసుచేరి । భక్షించుచున్నాఁడు
మలక మేలొ బాచ।మరుసు మేలొ. 231

వి. 4 పా. మలక........బాచ + మరుసు(బాచమ + అరుసు) - వ్యంజన మైత్రి.

అవ్వ అనుటకు....

.... .... .... ....

(ఈ పద్యము లోపించినదని గ్రహింపవలెను.)

అమ్మ యనుటకు ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధార—

క. ఇమ్మహిలో మహనీయ గు
ణమ్ముల నీపాటి గలరె । నానావిధ దే
శమ్ముల శ్రీరాముని సీ
త మ్మా మాయమ్మ నిత్య । హర్షము లిమ్మా. 232

వి. 4 పా. సీత+అమ్మా...హర్ష - స్వరమైత్రి.

క. ఇమ్మా మదభీష్టంబులు
కొమ్మా మా మ్రొక్కులెల్ల । గురుమతితో మా
యమ్మా రఘునందను సీ
తమ్మా సౌభాగ్య సిద్ధి । దాయిని వమ్మా. 233

వి. 4 పా. సీ, తమ్మా — + దాయి - వ్యంజనమైత్రి.

అక్క యనుటకుఁ పణుకూరి గురువన్న చాటుధార-

క. ఇక్కలియుగ శక్తులలోఁ
లెక్కింపకు భట్ట శంక । లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశుని యం
బక్కకు సరివేల్పుగలదె । యవనీ స్థలిలోన్. 234

క. చొక్కపు శ్రీగిరి నిలయుని
మక్కువ మదిలో నెఱింగి । మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చిన మాయం
బక్కకు సరిగలదె సకల । భాగ్య స్ఫురణన్. 235

వి. అంబ + అక్క - అంబక్క - ఇది సంజ్ఞావాచకము.
234 ప - 4 పా. అంబ + అక్క.... + అవనీ - స్వరమైత్రి
235 ప - 4 పా. అం, బక్క... + భాగ్య - వ్యంజనమైత్రి

ఈ రెండవదెవరి చాటువో తెల్పఁబడలేదు. పై రెండు పద్యములకుఁ గర్త యొక్కఁడేయని తోఁచెడు.

ఆయి యనుటకు రాచపూఁడి వెంకటయ్య చాటుధార—

క. వ్యాయామ జనిత మాయో
పాయ సమస్తాఘములు ని। వారణ మగు దు
ష్ప్రాయంబు పూతమగు గం
గాయిని బొడగన్నఁ దాన । మాడిన మాత్రన్. 236

వి. గంగ + ఆయి - గంగాయి (గంగమ్మ)
గంగ + ఆయి — తానము + ఆడిన — స్వర ప్రధానవడి

శమంతకమణి చరిత్రమునందు-

ఉ. కాయవచో మనస్థలన । కల్పిత దోషములెల్లఁ బాయఁగా
యెదలోన నిత్యము స। నాతన ధర్మముఁబూని యర్మిలిన్
బాయక కొల్తు రామ నర। పాల నిరంతర సౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభన వి। ధాయి మహాఫల సిద్ధిదాయిఁగన్.

వి. 4 పా. సీ, తాయి (సీత + ఆయి) ... వి + ధాయి-వ్యంజనమైత్రి.

విశే. ఈయతి లక్ష్యములలో ననేకములు చాటుధారలు. ఇంకఁ గొంత పరిశీలించి గ్రంథస్థ పద్యములనే యప్పకవి యుదాహరించియున్నఁ బ్రామాణికతకు బలముగా నుండియుండును.

ఈ నామాఖండయతికిఁ బ్రామాణికములైన రెండుమూడు మహాకవి ప్రయోగములఁ గ్రిందఁ జూపెదను.

సీ. పా. కొమ్మన దండనాథుండు + మహితకీర్తి (బాల. వీరాట-1-10) వ్యంజనమైత్రి

మ. అన్నమకున్ గొమ్మనమంత్రికిన్ సుతుఁడ ది + క్కాంతుండ (సర్వ. ఉ రా 1-13) స్వరమైత్రి

గీ. చారు చారిత్ర రామాను + జయ్యపుత్రు(పాండు-1-19)వ్యంజనమైత్రి

గీ. అనఁగ వెలసిరి రామాను + జయ్యసుతులు(పాండు. 1-69)స్వరమైత్రి

## 38. పంచమీ విభక్తి విరామము

ఆ. తత్సమంబుఁ జేయు।తఱిని బంచమి కన్న
నంటెనను విభక్తు । లదుకు సంధి
మెలఁగుఁ గృతులఁ బంచ।మీ విభక్తి విరామ
మనఁగ నచ్చునకును।హల్లునకును. 238

వి. సంస్కృత శబ్దములను దత్సమములుగా (తెనుఁగులో) నుపయోగించునపుడు పంచమీ విభక్తిలో 'కన్నన్, కంటెన్' అను ప్రత్యయములు చేను. రామునికంటె అనుచో 'రామునికి + అంటె,' రామునికన్న అనుచో 'రామునికి + అన్న' అనుచేదము వ్యుత్పత్తినిబట్టి యేర్పడుచున్నది. అట్లే రామునికంటె అనుచోట రామునకు + అంటె అనునది పదచ్ఛేదము. కి + అన్న, కు + అన్న, కన్న, కి + అంటె, కు + అంటె కంటె' అనునవి, పైకి నఖండశబ్దముగాఁ దోఁచుచున్నను వ్యుత్పత్తినిబట్టి చూడ అజాది ప్రత్యయము పరమగునని, దానంజేసి యుభయయతి చెల్లునని యప్పకవి యభిప్రాయము.

'కన్న, కంటె' - పంచమీ విభక్తి ప్రత్యయము లగుటచేఁ పంచమీ విభక్తి విరామమను పేరు దీనికి సార్థకము.

చమత్కార రామాయణమునందు—

క. నిన్నుఁ జెఱగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్య మెక్కుడగు భార్గవు లీ
ల న్నిర్జించిన రాముని
కన్నను శూరుఁడు ముజ్జగంబులఁ గలఁడే. 239

వి. ఈ పద్యమున పంచమీవిభక్తి కన్న ప్రత్యయయోగమున స్వర వ్యంజనోభయ యతిమైత్రి కుదాహరణములు గలవు.

2. పా. హైహయు, కన్నన్.... ఎక్కుడు + అగు - స్వరమైత్రి.

4. పా. రాముని, కన్నను.... జ + గంబుల - వ్యంజనమైత్రి.

రెండవ పాదములో 'హైహయుకు + అన్న' అని పదచ్ఛేదము చేసి కోవలెను.

ఆదిపర్వమునందు (2-227)

చ. వితత మఖప్రయోగ విధివిత్తము లుత్తను ధీయుతు ల్జగ
న్నుత సుమహా తపోధనులనుగ్రహ నిగ్రహశక్తి యుక్తు లీ
క్రతువున ఋత్విజుల్క్రమల । గర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తముల । కంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్.

వి. 4 పా. క్రతువు... + కంటె - వ్యంజనమైత్రి.

విశే. అప్పకవి తత్సమములందు కన్న కంటె ప్రత్యయములను జెప్పెను. గాని యీ ప్రత్యయములు తెలుఁగు శబ్దముల కన్నింటికిఁ జేరును - నాకంటె, నాకన్న, అన్నకంటె, అన్నకన్న - మొ.

'షష్ఠి వలన కంటె ఇతి పంచమీ, అని నన్నయ చింతామణి, ఆంధ్రభాషా భూషణములోఁ బంచమికి 'వలన' మాత్రమే యొసఁగఁబడినది. కావ్యాలంకార చూడామణిలో కంటె వర్ణకము పంచమిలోఁ జెప్పఁబడినది. 'కంటె' ప్రాచీనము; కన్న-అర్వాచీన ప్రత్యయ మనఁదగును. ఇవి కకారాది ప్రత్యయమువలెఁ గానవచ్చుచున్నది. భాషాశాస్త్ర పద్ధతిలో 'నాకు + అంటె' హరికి + అంటె, నాకు + అన్న, హరికి + అన్న 'అనురీతి రెండుశబ్దములు కలిసి పంచమీ విభక్త్యర్థ మిచ్చును. కాలక్రమమున కంటె కన్నలనురీతి, ప్రత్యేక ప్రత్యయములుగా సంగ్రహింపబడి యుండునని యెన్నఁదగు, 'రామునికన్నన్' అను రూపమున 'రామునికి + అన్న' అను విభాగము ప్రాథమిక దశలో నుండినదని చెప్పనగు కాని 'రామునికంటె' అనుచోట 'రామునికి + అంటెన్' అని విడఁ

దీయవలసినప్పుడు 'అంటెన్' అను అపరూపము సంఘటిల్లును. 'అన్నన్' (వాఁడిట్లన్న) అను నర్థమున 'అంటే' యను వ్యావహారిక శబ్దరూపముగలదు. అట్టి వ్యావహారిక 'అంటే' శబ్దమే హ్రస్వాంతమును ద్రుతాంతమునై గ్రాంథికతనందె ననవలె. లేదా అంటివి × 'ఏని' అనురీతి రెండుశబ్దములుచేరి భూతార్థక వకార లోపముచే (లిఙ్గాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు-బాల) అంటి-ఏని, మధ్యమ పురుషేకారమగుట సంధి నిత్యమై 'అంటేని' అని యేర్పడి ఏనిలోని తుది యచ్చులోపించి 'అంటెన్' అని అగుచుఁ గాలక్రమమున-స్వాంతమయి పూర్వ కి-కు ప్రత్యయములలోని కకారముతోఁ గలిసి ప్రత్యేక ప్రత్యయమై రూపొంది యుండవచ్చును. భాషాశాస్త్ర పద్ధతి నరసిన నిట్టి మార్పు సహజమనఁదగును.

అప్పకవి స్వరయతి మైత్రిగల చంపూరామాయణ ప్రయోగముఁ బరికించి యీ విధమగు వ్యుత్పత్తి నరసి యుభయయతికి గతి కల్పించె. ఈ పంచమీ విభక్తియతిని జెప్పినవాఁ డప్పకవి యొక్కఁడే. భారతాదులందు కంటె ప్రత్యయమున వ్యంజనయతి మాత్రమే ఘటింపఁబడియున్నది. స్వరమైత్రి కీ క్రింది ప్రయోగ మర్వాచీన మొకటి గానవచ్చెడు.

సీ. నీ, కన్న నా కాప్తుఁ డెం + దైన లేఁడు (వేంకట-3-147)

స్వరము గూఢముగానున్న కంటె కిట్లుభయ యతి నిర్దేశించిన యప్పకవి స్వరము స్పష్టముగాఁ దెలియవచ్చు 'కై-కయి' ప్రత్యయముల కేల యుభయ యతి నుపదేశింపఁ డయ్యెనో ?

కు + అయి, కి + అయి-కయి
కు + ఐ, కి + ఐ-కై.
నాకు + అయి-నాకయి, నాకు + ఐ-నాకై.

షష్ఠీ విభక్తి ప్రత్యయములయిన 'కి-కు'ల మీఁద 'అయి-ఐ'లు చేరి 'కయి కై' యను చతుర్థీ విభక్తి ప్రత్యయము లగుచున్నవి.

ప్రాచీనులు కొందఱు చతుర్థికై ప్రత్యయమునకు మారు 'కునై, కినై' అనియుఁ బ్రయోగించిరి.

చూ-బసవోదాహరణము-పవిత్ర గోత్రునకునై
త్రిపురాంతకోదాహరణము-శృంగారికినై

ఇవి పై కృతులలోఁ జతుర్థీ విభక్త్యంతమున కుదాహరణములు. ఇట్లు 'కి-కు' లలో 'అయి' లు సంధించి యేర్పడిన 'కయి-కై'లు కాలక్రమమునఁ బ్రత్యేక వర్ణకములై యుండును. వీని కుభయయతి చెప్పుట శాస్త్రీయ మనఁ

దగును, 'కంబె కు వ్యంజనయతిమైత్రికిపలె 'కై'కి స్వరయతిమైత్రికే యెక్కువగాఁ బ్రయోగము గనఁబడును.

అనఘ మామామ శకుని నా + కై కడంగి (భార. సభా-2-134)
నీ. కై వేదండ మొనర్తు నీవలన ని + ష్టా వాప్తి చేకూరె (అప్ప-4-332)

ఇది యప్పకవి వ్రాసిన కృష్ణోదాహరణములోనిది. ఇందలి 'నీకై' చతుర్థీ విభక్తిః స్వరప్రధానవడి గూర్పఁబడినది.

వ్యంజనయతి మైత్రిగల ప్రయోగములు—
కమలాపతిఁగొల్తు ముక్తి + కై విభునకుఁగన్ (నరస-4-21)
కలయ మరంద దంభమున + కై (చంద్రికా పరిణయము)

సూర్యరాయాంధ్ర నిఘంటువు 'కై-కయి' రెండుభయయతులలోనివిగాఁ జూపెడి, సుకవిజన మనోరంజనీ కర్త కూచిమంచి వెంకట్రామయకవి కైకయి' రెంటి కుభయయతి చెల్లునని యది చతుర్థీ విరామమని పేర్కొనెను. అప్పకవి పంచమీ విరామమును జూఁచి యకఁడీ పేరు పెట్టినాఁడనవలె.

## 39. కాకుస్వరవళులు

క. వలుకుల తలఁగల వ్రాలకు,
వలనగుచోఁ బ్లుతము నిలిపి । వానికి రెండున్
వళులుగఁ జెప్పిన గావ్యం
బుల నది కాకుస్వరంబుఁ । బ్లుతవళియునగున్ 241

ఆ. ఏకమాత్ర హ్రస్వ । మినుమడింపఁగఁ దీర్ఘ
మయ్యె మూఁడు మాత్ర । లయినఁ బ్లుతము
భీతిశోక తర్క । గీత దూరాహ్వాన
సంశయార్థములను । జరగుఁ బ్లుతము. 242

వివ. అ-ఇ-ఉ-క-చ-ట ఇత్యాది హ్రస్వాక్షరము లుచ్చరించుట కేక మాత్రాకాలము పట్టును. ఆ-ఈ-శ్రీ-ధీ-కం ఇత్యాది వర్ణముల (దీర్ఘాదుల) నుచ్చరించుటకు ద్విమాత్రాకాలము పట్టును. ఏకమాత్ర లఘువు, ద్విమాత్ర గురువని ఛందోలక్షణమునఁ జెప్పఁబడును. భీతిశోక తర్కగీత దూరాహ్వాన సంశయార్థములందలి దీర్ఘస్వరము త్రిమాత్రాకాలికమందురు. 'ఎఱుఁగవా?' నాథా! రమ్ము' - మున్నగు శబ్దములందలి తుది దీర్ఘము త్రిమాత్రాకాలి

కము. దీనిని ప్లుతమని చెప్పుదురు. ప్లుత స్వరము సయితము గురువుగానే యెన్నఁబడును. పలుకుటకు మూఁడు మాత్రలకాలము పట్టు వర్ణము ప్లుతసంజ్ఞ గలదగును.

కాకుస్వరదీర్ఘము ప్లుతోచ్చారణగలది. శోకభయాదులచేఁ గలిగెడి ధ్వని వికారము కాకువు. (కాకుఃస్త్రియం వికారో యశ్శోక భీత్యాదిభిర్ధ్వనేః-అమరము.) ఇట్టి ప్లుతస్వరముగలచోట నుభయయతి చెల్లును. అనగా దీర్ఘాంత మయిన యాప్లుతస్వరమునకుఁగాని, యాస్వరము చేరియున్న హల్లునకుఁగాని యతి గూర్పవచ్చు.

'అకటా యేమని దూరుదాన నిను నాథా', 'వలదు కృష్ణ యెఱుఁగవా' ఇత్యాదులందలి దీర్ఘస్వరములు, కాకుస్వరము లనఁబడును. ఇవి ప్లుతములు. ఇట్టి చోట్ల థకార వ్యంజనములకుఁ గాని వానిపై నిలుచు అకారస్వరమునకుఁ గాని యతి చేయవచ్చు 'ఎఱుఁగవా' అనుచోట 'ఎఱుఁగవు + ఆ' అని స్వరము విడఁదీయ గునుగాని, నాథా అనుచోట వలనుపడదు. స్వరము నేర్పఱచుటకైనను గాకున్నను నుభయయతి చెల్లునని యరయునది.

అప్పకవి యీ యతికిఁ గాకుస్వరవళి ప్లుతవళి యను రెండు పేర్లు వ్రాసెను.

ఉభయయతి భేదములఁ జెల్పు పద్యములో (121) కాకుస్వరవళి యని పేర్కొనె. లక్షణము చెప్పుచోట రెండు పేళ్ళు చెల్పెను.

ఇఁక అప్పకవి చూపిన యితరుల లక్ష్యములు :

భీతిప్లుతమునకు భాస్కరుని రామాయణమునందు— (యుద్ధ-41)

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జుం
డో జనులార యడ్డపడరో సురలార సురారి కంచు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతినేఁగుచో
నీజలరాశిఁజూచి మదినెంత దలంకెనొ యేమిసేయుదున్. 243

వి. ఇందు రెండవపాదమునఁ బ్లుతయతి.

ఇందు రావణాపహృతయగు సీత భీతిచే నఱచుట విషయముగాన రెండవ పాదమునఁ బాదాదిలోను యతిస్థానములోను గాకు స్వరములున్నవి.

ఇవి భీతిప్లుతములు :

రాము భార్యఁజుండు + ఓ........అడ్డపడరు + ఓ

భార్యజుం ! డో.... పడ + రో (పాదాది యతి స్థానములలో— హల్లులమీఁద నున్న ఓకార కాకుస్వరమునకు యతిచేయబడినది.)

మనుచరిత్రమునందు (2-39)

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడనేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవదప్పితిం
గొవ్వన నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగదవే తెరువేది శుభంబు నీకగున్.

2. 4 పా, ఎవ్విధి.... చెప్పఁగదవు—ఏ-ఇదియు భీతిప్లుతము; ఇందును స్వరమైత్రి.

వ్యంజనమైత్రికిఁ బ్రయోగము చూపఁబడలేదు.

శోకప్లుతమునకు రామాయణమునందు (అరణ్య-2-111)

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధినేనజ్ఞానినై పల్కితిన్
నన్నాపాపము వచ్చి ముట్టుకొనియెన్నాపాలి దైవంబ వై
యిన్నీచుం బరిమార్ప వేగఁబఱతేవే నన్ను *రక్షింప మీ
యన్నం గక్కనఁ జీరవే యరుగవేయత్యుగ్రశీఘ్రంబునన్.

వి. రావణునిచేఁ గొనిపోవఁబడుచున్న సీత శోకభరమునఁ బల్కువాక్యము లివి. 'వేగఁ బఱతేవే' అనుచోట శోకప్లుత స్వరమున్నది.

4. పా. ఇన్నీచు........ పఱతే —వే-స్వరమైత్రి.

పఱతేవే శబ్దరూప నిష్పత్తి - పఱచు + తెంచు - పఱతెంచు (తెంచు ధాతు వనుప్రయుక్తంబగునపుడు చువర్ణంబు లోపించును-బాల - క్రియ-112) పఱతెంచు—ము-(అద్దానికి ముత్తు పరంబగునపుడు తేతేరులగు - బాల - క్రియ - 113) - పఱతే + ము - ఇందు ము ప్రత్యయము ప్రార్థనార్థకమున వచ్చెను. సంప్రార్థనంబుల ఏదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముజ్జునకు వుజీ రుజీయగు (బాల-క్రియ 84)-పఱతే + ము + ఏ-పఱతే + వు + ఏ-పఱతేవే.

---

*నన్ను రక్షింపు-అప్పకవీయ ముద్రితప్రతిపాఠము. రక్షింప-అని భాస్కరరామాయణములోని పాఠము. ఈ పాఠమే యుక్తముగాన గ్రహింపఁబడినది.

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు (2-147)

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁటరారో మద
క్రూరాభీల మృగావళిం దునుమరో । ఘోరాటవుల్లేవో నా
యారామంబు గలంచి జంతుతతిమాయంజేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁగవచ్చినను వారిన్నొంచినా వేమిరా. 246

వి. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునితోఁ దర్కించుట యిందలి విషయము. కాన 'నృపులులేరో' యనుచో దర్కప్లుతమని యర్థయునది.

1. పా. ఓరీ... లే+రో (లేరు+ఒ) స్వరమైత్రి.
శాంతి పర్వమునందు (1-237)

మ. *అనుమానింపక తోడఁబుట్టులనె కాదా తున్మితూఁటాడెనెం
దును గొన్నెత్తురు లేఋలైపఱవ నింద్రుండు గతన్దైత్యులన్,
మును ల వ్వీరులభజింపరో క్రతువులా । మోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరో యూర్ధ్వలోప మదికాదో నాక
మూహింపుమా. 247

వి. బంధువధచేఁజింతించు ధర్మజునితో వ్యాసుఁడు పల్కు సందర్భము లోని దీ పద్యము. ఇంద్రుఁడు సోదరులగు దైత్యులఁ జంపలేదా యను వృత్తాంత మును దృష్టాంతముగాఁ జెప్పి తర్కించుచున్నాఁడు. అధ్యాహార స్తర్క ఊహః- అని యమరము. 'అదికాదో నాక మూహింపుమా' అని యూహశబ్దము ప్రయోగింపఁబడి యుంట యిందలి తర్కప్లుతమును దెల్లము చేయుచున్నది. ఇందు 1 పా లో కాదా (కాదు+అ), 4 పా. కాదో (కాదు+ఓ) - ప్లుతము లున్నవి.

1 పా. అను....కా+దా - స్వరమైత్రి.
4 పా. త్మునికా+దో - వ్యంజనమైత్రి (తు-దోలకు యతి)

ఈ పద్యమందు స్వరమైత్రియు వ్యంజనమైత్రియు గావింపఁబడియుంట యిది కాకుప్లుత స్వరయతికిఁ జక్కని యుదాహరణ మనఁదగును.

రంగనాథుని రామాయణమునందు—

ద్వి. అట్టి నామీఁద నీ+వా యలిగెదవు
పట్టి చెట్టలు వాపి+పాలుపైచెదను. 248

* అనుమానింపక తోడఁబుట్టవులు కారా... యూర్ధ్వలోక మడఁగాదో యేలఁడో నాకమున్ - వావిళ్ళ భారతప్రతిపాఠము.

వి. ఇదియుఁ దర్కప్లుతోదాహృతియే (నీవు + అ-నీవా)
అచ్చి.... నీ + వా (స్వరమైత్రి)

ఆనుశాసనిక పర్వమునందు (1-53)

ఉ. ఆ నరనాయకుండొక మహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజయొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయమారఁగా ననలుఁడాతని పాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదు పుత్త్రిఁ గృపయేర్పడ దానముగాఁగ నావుడున్.

వి. నాల్గవపాదమున 'ఈవే' అనచోటఁ బ్లుతమున్నది.

ఇమ్ము + ఏ-ఈవే - (ఈ రూపనిష్పత్తికి సంబంధించిన వ్యాకరణ సూత్రములకు, 'పఱతేవే' - 245 ప. అనుచోటఁ జూపఁబడిన ప్రక్రియను జూచునది.)

4 పా. ఈ, వే.... + ఏర్పడ - స్వరమైత్రి
అప్పకవి దీనిని దర్కప్లుతమునకు లక్ష్యముగా నిచ్చియున్నాఁడు.

ఆలోచింపఁగా నిది తర్కప్లుతముగాఁ దోఁపదు. 'ఈవే' అనుట యిందుఁ బ్రార్థనార్థకము. కాకుస్వరకళిలో భీత్యాదులఁ జెప్పినారుగాని ప్రార్థనమును సంగ్రహింపలేదు. ఈ లక్ష్యమునుబట్టి ప్లుతయతిలోఁ బ్రార్థనయుఁ జేరునని గ్రహింపవలెను.

దురాహ్వాన ప్లుతము—

తే. ఆది తేయార్చి తాంఘ్రి పద్మా యనంగ
ద్వారకాపుర మధ్య సద్మా యనంగ
నసుర కులవైరి వీరులారా యనంగ
రసిక చిత్తాబ్ద వాసులారా యనంగ. 250

వి. దురాహ్వాన మనఁగా సంబోధనము; దూరముగా నున్నవారిని బిలుచునపుడు సంబోధనార్థక ప్రత్యయములు చేరను. సంబోధనమున శబ్దము తుది హ్రస్వదీర్ఘములు రెండు నుండవచ్చును. ఓ రామ, ఓ రామా, బహువచనమున ఆరగాగమము రాములారా, రాములారా.

సమీపస్థుని సంబోధించునపుడు హ్రస్వదీర్ఘాంతములు రెండుండవచ్చు. దూరాహ్వానమున దీర్ఘాంత సంబుద్ధియుండుట సహజము. ప్లుతమునకు దీర్ఘాంత

దూరాహ్వానముండి తీరవలయు. దానంజేసియే యప్పకవి కేవల సంబోధన పదమును జెప్పక దూరాహ్వానప్లుతమని పేర్కొనెనని యెన్నఁదగు.

ఈ పద్య మప్పకవి దూరాహ్వాన లక్ష్యార్థము గచించినది. ఇందు స్వర వ్యంజనముల రెండికిఁ క్రమముగా యతిమైత్రి చూపఁబడినది.

1. పా. ఆది....ప + ద్మా—స్వరమైత్రి

1. పా. ద్వార....స + ద్మా—వ్యంజనమైత్రి.

(ఇది సంయుక్త వ్యంజనయతి, ద్వాలోని దకారమునకు ద్మాలోని దకార మునకు యతి గూర్పఁబడెను.)

3 పా. అసుర....వీరులా + రా - స్వరమైత్రి.

4 పా. రసిక....వాసులా + రా - వ్యంజనమైత్రి.

'పద్మా' అను సంబోధనాంత శబ్దములో సంబోధనార్థమున వచ్చిన ఆకారప్లుత స్వరమునకు మొదటిపాదమున యతిచేయఁబడినది. ఇట్లే మూఁడవ పాదమున స్వరమైత్రి నరయునది.

కళాపూర్ణోదయమునందు (1-112)

మ. అకటా యేమని దూరుదా న నినునా । థా వేఁగుజామయ్యెఁబొం
దికగాఁ బాదములొత్త రమ్మనుటగా । నీ యొంటియేమోకదా
నికటక్షోణికిఁ జేర రమ్మనుట గా । నీ కొంత నెయ్యంపు హూ
నికతోఁ గన్నుల విచ్చి చూచుటయ కా । నీ లేదొకింతేనియున్.

వి. మొదటిపాదమున 'నా థా' అనుచోట దూరాహ్వాన ప్లుతము.

అకటా....నా + థా - స్వరమైత్రి.

మఱి యిందు 2,3,4 పాదములలో యతిస్థానమున 'కానీ' యనుశబ్దము వెలయుచున్నది. అప్పకవి యీ లక్ష్యము దూరాహ్వాన ప్లుతమున కిచ్చినాఁడు. కానిమ్ము - కానీ, (కాన్ + ఈ) - ఇది ప్రార్థనార్థక క్రియ. క్రమముగా అవ్యయముగా మాఱినది. ఇందిది వికల్పార్థమును దెల్పును. దీనినిందుఁ దర్క ప్లుతమనఁదగును. మూఁడు పాదములందును వ్యంజనమైత్రియే చేయబడి యున్నది. కాని స్వరమైత్రియు జేయనచ్చునని యరయునది.

సంశయ ప్లుతము—

ఆ. హరియనంగ నాతఁ । డా నిన్నఁ గంసు న
డంచెఁ గృష్ణుఁ డీతఁ । డా యశోద

కెంత భాగ్య మబ్బె । నే బోటి ! నాబోఁటి
నెలఁత కటు గలుగు । నే తలంప. 252

వి. సంశయ మనఁగా సందేహము. సంశయ ప్లుతమనఁగా సందేహార్థమును సూచించునపుడు పలుకఁబడు ప్లుతస్వరము. ఈ పద్యము సంశయప్లుతమున కుదాహరణగాఁగవి వ్రాసినది. ఇం స్వరవ్యంజనములను వరుసగ యతిమైత్రి చూపఁబడినది. ఆతఁడా, ఈతఁడా - ఇత్యాదులు సంశయార్థకములు. అబ్బెనే, కలుగునే అనుపదోత్తరార్థమునఁగల ప్లుతస్వరము తుదిగల శబ్దములు సయిత మప్పకవి సంశయప్లుతమునకే యుదాహరించినవి. సూక్ష్మముగాఁ బరికింప నిందలి ప్లుతములన్నియు సంశయార్థకముగాక యాశ్చర్యార్థకమగునని తోఁచెడు. సంశ యాశ్చర్యములం దేదియైనను నిందు ప్లుతముగలదు. ప్లుతయతి చెల్లును.

1 పా. హరి.... ఆతఁడు + ఆ (ఆతఁడా) - స్వరమైత్రి.
2 పా. డంచె.... ఈతఁ + డా - వ్యంజనమైత్రి.
3 పా. ఎంత ···· అబ్బెన్ + ఏ (అబ్బెనే) - స్వరమైత్రి.
4. పా. నెలఁత ... కలుగు + నే—వ్యంజనమైత్రి.

రామాభ్యుదయమునందు (5-239)

సుగంధి. అంగనాలలామఁ గాన । వా లతా కుడుంగ మా
తంగమా భుజంగమా ప।తంగమా కురంగ మా
లుంగమా లవంగ మాతు।లుంగ మాధవీ నట
ద్భృంగమా వనీరమా శ।రీరమా సమీరమా. 253

వి. 1 పా. అంగ.... కానవు + ఆ (కానవా) - స్వరమైత్రి

సీతను వెదకు రాముని పల్కులివి. కానవా యనఁగా జూచితివాయని ప్రశ్నార్థకమగునే కాని సంశయార్థకము గాఁజాలదు. ఇందును నిది సంశయ ప్లుతము గాదనవలెను.

విజయసేనమునందు—

ఉ. వల్లభుఁడేగు దుర్లభుఁడు।వాని యసందగు లూఁది యిమ్మెయిన్
దల్లడమందె దేల యు।చిత స్థితికి న్ననుఁ బాసఁజూపినన్
దల్లియు బంధులోకమును।దండ్రియు నేమనువా రటింగి రే
నుల్లమ యిట్లు నీకుఁ దగు।నో తగదో పరికించి చూడుమా.

వి. 4 పా. ఎటింగిరేని + ఉల్లము తగున్ + ఓ-స్వరమైత్రి.
ఇందిది సంశయప్లుతమే యగును.

రామాయణమునందు (అయో-258)

క. జనకజకు సుమిత్రానం
దనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనమున నుండగఁ రఘుపతి
యనుజన్ముని జూచి సేమమా జనపతికిన్. 255

వి. 4 పా. అను జన్మ........ సేమము + ఆ (సేమమా) - స్వరమైత్రి.
ఇందును నిది ప్రశ్నార్థకప్లుతమగును కాని సంశయప్లుతము గాఁజాలదు.

విశే. అనంతామాత్యుఁడు కాకుస్వరయతిలో దీర్ఘాంత సంబుద్ధియుఁ బ్రశ్నాకలిత దీర్ఘమును జెప్పెను. (చూ. ఛందో. 1-95-97 ప) అప్పకవి ప్రశ్నను సంగ్రహింపఁడయ్యెను గాని యతని శర్కాప్లుతములో నిది గతార్థ మగును. ప్రశ్ననుగూడఁ జేర్చుట యుక్తము.

అప్పకవి స్వీయలక్ష్యపద్యములందు మాత్రమే ప్లుతస్వరమువల్ల నుభయ యతిచేసి చూపెను. కాని యాతఁడొసఁగిన యితరుల లక్ష్యములందెల్ల స్వర మైత్రి యొక్కటే చేయఁబడియున్నది. వ్యంజనమైత్రికిఁ బ్రయోగముల చూపి యుండవలయు.

మీఁదు మిక్కిలి యిందు గీత (గాన) ప్లుతమున కుదాహృతి చూపఁబడ లేదు. కస్తూరిరంగ కవి 'స్వరసంగతిని గానము చేసినట్లు చెప్పుట గానప్లుతము, గానప్లుతము మాత్రము ప్రబంధాదులందు అపూర్వము గనుకఁ దక్కిన మూఁడు ప్లుతములకు (దూరాహ్వాన రోదన సంశయార్థములకు) లక్ష్యములు' అని తన రంగయ ఛందమున వ్రాసెను.

కూచిమంచి తిమ్మన గానప్లుతమునకు లక్ష్యము నొసఁగి, గానప్లుతమనఁగా స్తుతిఁ జేయుటయందు వచ్చునదియని తెలిపెను.

అప్పకవి కాకుస్వర యతిలోఁ జెప్పినది దీర్ఘాంతములు మాత్రమే. కాని హ్రస్వాంతములందును నుభయయతి ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది.

ఇట్లగు, నె జడాకృతితోడఁ దగవు + నెఱపక యుండెన్
(ఉ-హరి 3-240)

(అగున్ + ఎ-ఇది ప్రశ్నార్థకము-ఇందు వ్యంజనమైత్రి)

గురుండుగాఁడె నృపవరేణ్య నీకుఁ బ్రకట + టీకృత సత్త్వుఁడు
(భార. ఉద్యో-2-24)

(గురుండు కాఁడు + ఎ-ఇందును వ్యంజనమైత్రి)

ఇట్లే యవధారణార్థకమందును హ్రస్వ దీర్ఘాంతస్థలములలో నుభయ యతి గానవచ్చుచున్నది.

కాకుస్వరవశియగు నితఁ
దే కదలక జలధిఁబవ్వ + ఢించె ననఁగ (ఛందో 1-95)
ఇతఁడే-అవధారణార్థకము, దీర్ఘాంతము-ఇందు వ్యంజనమైత్రి.
పంద్రెండవ పర్వంబ కడున్ మేలనఁగ శాంతి + పర్వము వెలయున్.
(భార-ఆది-1-58)
(పర్వంబు + అ-ఇందు వ్యంజనమైత్రి-అవధారణార్థకమున
(హ్రస్వాంతము)
చూ. అప్ప-5-257 ప, 'నీవేగతి' - ఇందలి ప్లుత మవధారణార్థకము.

లాక్షణికులలోఁ గొందఱు ప్లుతయతిని, గొందఱు కాకుస్వరయతిని, మఱి కొందఱు రెంటిని రెండుభేదములుగాను జెప్పిరి. పరిశీలించిన రెండొక్కటే యని తెలియఁగలదు. భీమన ప్లుతయతిని, అనంతుఁడు కాకుస్వరయతిని జెప్పిరి. చిత్రకవి పెద్దన యీ రెంటిని వేర్వేఱుగాఁ జెప్పెను. అతనిమతమునఁ బ్రశ్నా కలిత దీర్ఘస్థలమునఁ గాకుస్వరయతి, సంశయాహ్వాన గీతార్థములందు బ్లుత యతి. ఇతని ననుసరించియే కాఁబోలు, సులక్షణసారమునను రంగరాట్ఛందము నను నీ రెండు యతులు ప్రత్యేక భేదములుగాఁ జెప్పఁబడినవి. అప్పకవి సూక్ష్మపరిశీలనచేసి రెండొక్కటే యని వక్కాణించెను.

## 40. ప్లుతయుగ విశ్రామములు

క. తామే వర్ణను లైనను
క్ష్మామండలమునను బ్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగ వి
శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్. 256

వి. పాదాదియందును యతిస్థానమందును రెంటను బ్లుతముగల హల్లులు పరస్పరము భిన్నములయినను శ్లుత సంయుక్తిచే యతిచెల్లును. ఇందు రెంటు చోట్లను బ్లుతస్వరముండును. ఆ స్వరముతోఁగూడిన హల్లులు భిన్నములుగా

నుండవచ్చు. రెంటను ప్లుతముగలదు కాన వానికి మైత్రి యేర్పడును. ప్లుత ద్వయమునకు యతిగాన దీనికిఁ బ్లుతయుగ విశ్రామమని పేరు పెట్టఁబడెను.

వజ్రపంజర శతకమునందు—

ఉ. శ్రీ గజగామినీ మణిని।సీతనుగా నిరపాయిఁగా ద్రిలో
కీ గృహమేధిఁగా గరుడ।కేతనుఁగా భవరోగ వైద్యుఁగా
నాగురువాన నిన్నె మది।నమ్మితి వేఱొక వేల్పుఁగొల్వ నీ
వేగతి కావ వే రఘుప।తీ శరణాగత వజ్రపంజరా. 257

వి. ఇందుఁ బాదాదిలో 'నీవే–నీవు + ఏ' ఇది ప్లుత స్వరము: యతిస్థానములో 'రఘుపతీ' - సంబోధన దీర్ఘప్లుతము (రఘుపతి + ఈ) రెండుచోట్లను ప్లుతమున్నది. (ఏ ఈ) కాని ముందున్న హల్లులు వకార తకారములు పరస్పరము యతి మిత్రములు గావు కానున్నను వానిపై ప్లుతము లుంటచేఁ బ్లుతస్వర మైత్రి వశమున వానికి యతి చెల్లినదని యరయునది.

విశే. ఉభయయతి యఖండముగాఁ దోఁచు స్వరసంధి ఘటితశబ్దములందు స్వరమునకేని వ్యంజనమునకేని యతి గూర్పనగునని చెప్పెను. ఈ ప్లుతయుగ విశ్రామములో స్వరమైత్రియే కాని వ్యంజనమైత్రి కవకాశములేదు. కాన నుభయ యతిలో దీనిఁజేర్చుట సరిగాదని తోఁచును. ప్లుతయతినిబట్టి యిది సిద్ధించునుగాన దాని తర్వాతనే దీనిఁజెప్పవలసి వచ్చె. ఏతత్కారణమున నుభయయతి లక్షణము పూర్తిగాఁ బట్టువడకున్నను నుభయయతిభేదమగు ప్లుతయతివలన సిద్ధించినదగుటం జేసి యిందుఁజెప్పిన యప్పకవి పద్ధతి యెంతయు నొప్పిదమైయున్నదనకతప్పదు. ప్లుతియతి భేదముచేతనే యిది గతార్థమగును గాని స్పష్ట ప్రతిపత్తికై యప్పకవి చెప్పెఁగావలయు.

ఈ యతిభేద మితరు లెవ్వరును జెప్పలేదు.

అప్పకవీయములోని యీ ప్లుతయుగ విశ్రామమువంటిదే సులక్షణసారములోని సౌభాగ్యయతి. ఉభయయతి చెల్లఁదగుశబ్దములు రెండొకే పాదమున అనఁగా బాదాది యతిస్థానముల నిలిపి యతిమైత్రిఁగూర్చుట సౌభాగ్యయతి.

ఉదా. ప్రాంచితామర వినుత వే + దండ వరద

ఇందు పాదాది యతిస్థానములలోని ప్రాంచిత వేదండశబ్దముల కుభయ యతి చెల్లును. మొదటిది ప్రాదులలోనిది; రెండవది శకంధ్వాదులలోనిది. మొదటి దానికిఁ బ్రాది యతివలనను. రెండవదానికిఁ బరరూప యతివలనను స్వరమైత్రి చెల్లును.

'ప్ర । అంచిత.... వేద + అండ' ఇందు అకార స్వరమైత్రి.

అప్పకవి యిట్టి యతిని జెప్పలేదు. ప్రాదిపరరూపాద్యుభయయ భేదముచేతనే యిది గతార్థమగును గాన దీనిని ప్రత్యేకముగా నుపదేశింప నక్కఱ లేదు.

ఈ పంద్రెండును నుభయయతి భేదంబులు

ఇంకం బ్రాసయతు లెట్టివనిన—

## 41. ప్రాసయతులు

గీ. గీతముల సీసములను సం । గీతములను
విరతి విడనాడి యొక్కొక్క । చరణమునను
రెంటికిని బ్రాసవర్ణంబు । నంటఁ బలుకఁ
బ్రాస విశ్రాంతు లండ్రు క । బ్బములవాని. 258

ఆ. దేవకీ కుమార । గోవర్ధనోద్ధార
తోయజాక్ష పాండ । వేయ పక్ష
ఘనవినీలగాత్ర ముని జన స్తుతిపాత్ర
యదు కులాబ్ధిసోమ । కదన భీమ 259

వి. తేటగీతి, ఆటవెలది యను గీతపద్యములందును సీసపద్యములందును పదములు మున్నగు గేయములందును యతికిమాఱు పాద ద్వితీయాక్షరమును యతిస్థానము ప్రక్కనిలిపి ప్రాసమైత్రిఁ గూర్చుట ప్రాస విశ్రాంతి యనఁబడును. ప్రాసయతికి ప్రాసమైత్రి లక్షణము చెల్లునుగాని యతిమైత్రీ లక్షణము చెల్లదని యెఱుఁగవలెను.

ప్రాసయతి ప్రసిద్ధమగుటచే నప్పకవి స్వీయలక్ష్యమును మాత్రము చూపెను.

పా. దేవ.... + గోవ

ఇందు ప్రాసాక్షరమగు వకారము యతిస్థానము ప్రక్క నిలుపఁబడినది. వృత్తములందు ద్వితీయాక్షర ప్రాసమైత్రివలె నిందు ఒకే పాదమున బాదాది యతి స్థానములోఁ బ్రాసమైత్రి గూర్పఁబడినది. ఇట్లే తక్కిన మూఁడుపాదము లందును బ్రాసయతిమైత్రి నరయునది.

2 పా. తోయ... + వేయ
3 పా. ఘన...... + ముని
4 పా. యదు.... + కద

ఇందు 1, 2. పాదములలో దీర్ఘాక్షర పూర్వప్రాసమైత్రియు, 3, 4 పాదములలో హ్రస్వ పూర్వప్రాసమైత్రియు జూపఁబడినవి. ప్రాస పూర్వాక్షర నియమమునుగూర్చి మున్ముందు ప్రాసలక్షణమునఁ దెలుపఁబడును.

3, పా. 'ఘన-ముని' అనుచోట నకారప్రాసమైత్రి. ప్రాసమైత్రి యందు హల్సామ్య మావశ్యకము. స్వర సామ్యమైత్రు లపేక్షణీయములు గావు. అదే యతిలోనైన 'న-ని' అను వీనికి మైత్రిచెల్లదు. కానఁ బ్రాసయతిలోఁ బ్రాసలక్షణమే కాని యతిలక్షణము పొసఁగదు.

విశే. ఈ ప్రాసయతి యుపజాతి పద్యములను గీతసీసములందు మాత్రమే పనికివచ్చును. గీతసీసముల పాదాదులందుఁ బ్రాసమైత్రి లేనివి అది ప్రాస మైత్రిగల కందాది జాతులందు వృత్తములయందుఁ బ్రాసయతి కవకాశ మించుకేనియు లేదని యెరయునది. అప్పకవి గీత సీసముల రెంటినే పేర్కొన్నాఁడు గాని యుద్ధుర మాలావృత్తములకు లయగ్రాహి ప్రభృతి పద్యవిశేషములందుఁ బ్రాసయతి నియతము. అందు సాధారణయతిమైత్రి సరిపడదు.

జాతులకుఁ జెందిన ద్విపదకుఁ బ్రాసయతి చెల్లదని లాక్షణికమతము. కాని పాల్కురికి సోమన మతమున ద్విపదకుఁ బ్రాసయతియుఁ జెల్లవచ్చు. పాల్కురికి సోమన ద్విపదలలోఁ బ్రాసయతిని గూర్చుచు దానినిట్లు సమర్థించినాఁడు.

'జాతులు మాత్రానుసంధాన గణవి, నీతులుగాన 'యనియతగణైర' నియును 'బ్రాసోవా' యనియు యతిర్వా 'య'నియుఁ జెప్ప ఛందోవి-నిహితోక్తిగాన

ప్రాసమైనను యతి + పైవడియైన, దేసిగానిరెపి యాది ప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదను రచియింతు'-పండితారాధ్య చరిత్ర. (పుట. 18)

సోమనకు ముందే యేదోయొక యజ్ఞాతాంధ్రచ్ఛందోగ్రంథమున (ఇది సంస్కృతభాషలో శబ్దచింతామణివలె రచితము కాఁబోలు) ద్విపదకు బ్రాసయతియుఁ జెల్లునని చెప్పఁబడినట్లు పండితారాధ్యచరిత్రవలనఁ దెలియనగుచున్నది. ద్విపదకుఁ బ్రాసయతి సోమనాథాది కతిపయ శివకవి మతము, సర్వాంగీకృతముగాదు.

గీత సీసములం దిచ్ఛానుగుణముగఁ బ్రాసయతి సాధింపవచ్చు. ఒక్క పాదమున యతి మరొక్కపాదమునఁ బ్రాసయతి గూర్పవచ్చు. సీస పాదములందు రెండు సగములకు భిన్నయతులుండును అందొక సగములో యతి: వెఱసగములోఁ బ్రాసయతి గూర్పవచ్చు. ఒక పాదములోఁ బ్రాసయతి యున్నఁ దక్కిన పాదములలో బ్రాసయతి గూర్పవలెనను నియమములేదు. ఇచ్చవచ్చిన

చోటఁ బ్రాసయతి నిలుపనగును. కాని నన్నయ భట్టారకుఁడు మాత్రము గీత సీసములలో నీ యతి ప్రాసయతి విషయములలో నొక నియమమును పాటించెను అన్ని పాదములందు యతిగాని, ప్రాసయతిగాని యొక్కటే నియతముగ నిలుపుట, ఒక సగమందు యతి, పెఱసగమందుఁ బ్రాసయతి యుంచుట మున్నగు నియమముల విధిగా గ్రహించి రచించెను. తర్వాతికవులెవ్వ రిట్టి నన్నయ నియమముల ననుసరించినవారు లేరు.

ప్రాసయతి ప్రాసమైత్రి లక్షణముగలది కావుటఁజేసియు గీత సీసాది కతిపయ పద్యములందే యుపయుక్తము నగుటంజేసియు, నిదియొక యతిభేదముగాఁ జెప్పనక్కఱలేదని కొందఱమతము. ప్రాసయతిని యతిభేదముగాఁ జెప్పినవారు చిత్రకవి పెద్దన, లింగమగుంట తిమ్మన, కస్తూరిరంగ కవి మున్నగు వారు గొందఱుగలరు.

ఇంతవఱకు స్వరయతులు - 7. వ్యంజనాక్షరయతులు - 21, ఉభయ యతులు-12. ప్రాసయతి-1 మొత్తము 41 యతిభేదములు చెప్పఁబడినవి.

## అగ్రాహ్య విరామంబులు

ఆ. వికటకవులు కొన్ని । వింతలు కల్పించి
కవిజనాశ్రయమునఁ । గలిపినారు
వానిఁగైకొనంగ । వల, దప్రయుక్తంబు
లేల చెప్ప భీముఁ । డెఱిఁగి యెఱిఁగి. 260

వి. ఇఁక నిందు గ్రహింపఁగూడని దుష్టములు, నలాక్షణికములుఁ బ్రాచీన మహాకవి ప్రయోగరూఢములు గానివియు నగు యతులఁగూర్చి తెల్పుచున్నాడు.

వికటకవులు కొందఱు అప్రశస్తములయిన యతులకుఁ బ్రామాణ్యము కలిగింపనెంచి యీ యపూర్వవిషయముల సృష్టించి అట్లుగా లక్షణ పద్యముల స్వయముగా రచించి ప్రాచీన లక్షణగ్రంథమగు వేములవాడ భీమనకృత కవిజనాశ్రయమునఁ జేర్చివైచిరి. పరమప్రామాణిక లక్షణకారుఁడగు భీమన యిట్టి యప్రశస్త యతిప్రాసములను దెలిసి తెలిసి యేల చెప్పును? అయ్యవి కవిజనాశ్రయములోఁ బ్రక్షిప్తములుగాన, వానిని గ్రహింపరాదని, యట్టివానిని బ్రయోగింపరాదని యప్పకవి నేటికవులను హెచ్చరించుచున్నాడు

వికటకవులు ప్రాచీన సంప్రదాయమును వికటించుకవులు. వికటమనఁగా వ్యత్యయము, వక్రము, ఎదురుతిరుగుట. వికటకవుల మతము వక్రమతము గ్రాహ్యముకానిది. వికటకవులు తమ క్రొత్త యభిప్రాయములకుఁ బ్రామాణ్యము కలిగింపఁదలఁచి యాదిలక్షణగ్రంథమగు కవిజనాశ్రయమున భీమనయే రచించినట్లు దోఁపఁజేయుటకుఁ గొన్ని వింతయతులనుఁ బద్యబద్ధముచేసి

ప్రక్షిప్తము గావించిరనియు, భీమన యట్టి యప్రయుక్త విషయములను జెప్పఁడనియుఁ, గవిజనాశ్రయములో నున్నదని నమ్మి వానినిఁ బ్రయోగింపరాదనియు నప్పకవి యభిప్రాయము.

విశే. తెనుఁగులో నుపలబ్ధములయిన లక్షణ గ్రంథములలో (ఛందో గ్రంథములలో) మిక్కిలి ప్రాచీనమయినది కవిజనాశ్రయము. ఇది వేములవాడ భీమకవి ప్రణీతమనుట ప్రసిద్ధము. వేములవాడ భీమకవి యీ ఛందమును గవి జనాశ్రయ బిరుదాంకితుఁడగు రేచన కంకితముచేసి యతనిపేరఁ గవిజనాశ్రయ మని నామకరణమొనర్చి వెలయించెనందురు. అందుచే దీనికి భీమన ఛందమను పేరే వ్యవహారమున బహుళప్రచారము గాంచి మించినది. కాని నేఁడు లభించెడు కవిజనాశ్రయపుఁ బ్రతులఁబట్టి యది రేచనకృతముగాఁ బరిశోధకులు కొందఱు నిర్ణయించెదరు. వారి మతమున భీమన గ్రంథకర్తగాఁడు నాఁటినుండి నిన్న మొన్నటిదాఁక లాక్షణికులు వ్యాఖ్యాతలు తదితరులు కవిజనాశ్రయమును భీమన ఛందమను పేర వ్యవహరించుచు వచ్చిరి. అప్పకవ్యాదులు కవిజనాశ్రయము భీమన ప్రణీతమని స్పష్టపఱచినారు. 'వికట కవులను' నీ పద్యము కవిజనాశ్రయము భీమన ప్రణీతమని కరతలామలక న్యాయమున విస్పష్టముచేయుచున్నది.

వ. అవి యెవ్వి యనిన.. 261

వి. వికటకవులచేఁ గవిజనాశ్రయమునఁ బ్రక్షిప్తములయిన యీ వింత లక్షణములు దెల్పుచున్నాఁడు.

## అగ్రహ్యవర్గవళులు*

క. వెలయఁ గకారాదులు భూ
తలమున నైదైదు వళులు । దామగుననుచున్
లలనామదనుఁడు రేచన
నలినభవనిభుండు[1] గుణవ । తంసుఁడు చెప్పెన్. 262

ప. ఈ పద్యములోఁ జెప్పిన యయిదు వర్గములయందును మొదలి వర్ణములు నాల్గింటికి వర్గవళ్లగనుకఁ జెల్లుబడి; యవి యన్నియు దాపలఁబూర్ణ బిందువు లేకుండిన ననునాసికములకుం

* ఈ శీర్షిక నాచేఁ జేర్పఁబడినది. మూలమునఁ లేదు. వెనుకవచ్చు అగ్రాహ్య సంబంధవళులు మున్నగు శీర్షికలంబట్టి యీ శీర్షిక వదలిపోయి యుండునని తోఁచెడు.

1 గుణవతంసుం డనఁగన్ - సూర్యాలోక ప్రతిపాఠము.

జెల్లవు. ఆ బిందువులున్నట్లాయెనా బిందుయతులు గనుక నవియుఁ జెల్లును. ఈ భేదము చెప్పనందు చేత నీపద్యమగ్రాహ్యము. 263

వి. ప్రతివర్గమందున్న వర్గాక్షరము లైదును దమలోదాము యతికిఁ జెల్లునని పై లక్షణము (282) చెప్పుచున్నది. వర్గము లైదు. ప్రతివర్గమునను అక్షరము లైదు. క ఖ గ ఘ ఙ లు కవర్గము: చ ఛ జ ఝ ఞ లు చవర్గము; ట ఠ డ ఢ ణ లు టవర్గము: త థ ద ధ నలు తవర్గము: ప ఫ బ భ మ లు పవర్గము. పై లక్షణప్రకారము వర్గాక్షరములయిదు యతికిఁ జెల్లవలెను. పై లక్షణముందే 2, 4 పాదములలో లక్ష్యముగూడఁ జూపఁబడినది.

2 పా. త - దలకు యతి. ఇది లక్షణవంతము

4 పా. నలిన.... న + తంసుఁడు- 'న-త' లకు యతి. ఇది యప్పకవి చెప్పిన చొప్పున వింతయగు యతి. ఇది తవర్గాక్షర యతిమైత్రి కుదాహరణము. ఇట్లే తక్కిన వర్గముల కరయవలెనని భావము.

ఈ లక్షణముపై అప్పకవి విమర్శ-(263)

వర్గయతి ప్రకారము ప్రతివర్గమునను దొలి నాలుగక్షరములు (క ఖ గ ఘ లు, చ ఛ జ ఝ లు. ట ఠ డ ఢ లు, త థ ద ధ లు, ప ఫ బ భ లు) పరస్పరము యతిచెల్లును: కాని యవి తమ వర్గ పంచమాక్షరములతో అనఁగా ఙ ఞ ణ న మ లను ననునాసికములతోఁ జెల్లనేరవు. అనునాసికములతోఁ జెల్లవలయునన్న, ఆ తొలి నాలుగక్షరములకుఁ బూర్వము పూర్ణబిందు వుండవలయును. అప్పుడది బిందుయతి యనఁబడును. వర్గయతి బిందు యతులు ఇంతకుమున్నె వివరింపఁబడినవి. నకారముతోఁ గేవల తకారము యతిచెల్లదు. బిందుపూర్వక తకారము (ంత) నకారముతోఁ జెల్లును. ఇందట్టిది లేదుగాన నిది యగ్రాహ్యము (క ఖ గ ఘ లు చెల్లునను‌ట వర్గవళి; క ఖ గ ఘ ఙ లు చెల్లునను‌ట అగ్రాహ్య వర్గవళి) ఇట్లే తక్కిన వర్గములకని యరయునది.

(చూ వర్గవళి. బిందువళి)

## అగ్రాహ్యసంబంధవళులు

క. దడలకు దము లెంచక
వడియును బ్రాసంబు నిలుప । వచ్చును గృతులం
దది యెట్లన్నను శ్రీహరి
దొడిఁబడి దానవులఁ జంప । డులియాయెననన్ 264

వ. ఈ చెప్పిన దడలకుంబదాది నున్న చతుర్థవర్గసరళము ఆదేశమై వచ్చునపుడు ఆదేశయతిగాఁ జెప్పవచ్చును. అదియు

గాక ఆ రెంటికిని దాపలించి నెలసున్నలున్నప్పు డనుస్వార సంబంధ యుతులు గనుక అటువలెను జెప్పవచ్చును. అవి గలుగఁ జెప్ప లేదు గనుక నిదియు సమ్మతముగాదు. 265

వి. ద డ లకు యతిమైత్రియుఁ బ్రాసమైత్రియుఁ జేయవచ్చునని పై లక్షణము చెప్పుచున్నది. లక్ష్యముగూడ నందే కూర్పఁబడినది.

ద డ - వ డి — ద డి — దొ డి - ఇది ద డ ప్రాస.

4 పా. దొ డి .... + డులి — ఇందు ద డ యతి.

ఇందుల కప్పకవి విమర్శ - (285)

చతుర్థవర్గ సరళము - దకారము. డకారమునకు దకార మాదేశముగా వచ్చునపుడు ద డ లకు యతి గూర్పవచ్చునని యట్టిది యాదేశయతి యనఁబడు నని యప్పకవి చెప్పుచున్నాఁడు. ఇందట్టి యాదేశము లేదుగాన నీ దడ వర్ణ యతి గ్రాహ్యముగాదని యతని యభిప్రాయము.

విశే. ఇందు విచారింపవలసిన విషయము చాలఁగలదు. అందుల కించుక సూచన—

డంభ డిండీర డోలికా డా డి మా ది సంస్కృతశబ్దముల యాది డకార మునకు దంభ దిండీర దోలికా దా డి మా ది రీతిగా దకారదేశ రూపములును గలవు. అట్లే తెనుఁగున 'డాక-దాక, డగ్గఱ - దగ్గఱ, డిగ్గు - దిగ్గు, డాపల- దాపల' అను విధమున డకారమునకు దకారాదేశము రావచ్చును. ఈ విషయ మప్పకవీయముననే కలదు.

(చూ. అప్ప - + - 147-149 ప.)

ఇట్లు దడలకు ద్వైరూప్యమున్నపుడే యీ యాదేశయతి చెల్లునని యప్పకవి యభిప్రాయము కాఁదగు. అట్లు ద్వైరూప్యములేని 'దమము, దాఁటు' మున్నగు శబ్దముల దకారమునకు డకారము యతికిఁ జెల్లదని యాతని భావమని యరయఁదగును. ఇట్టి యాదేశ యతి చెప్పుటలోఁ బ్రయోజనము శూన్యమని మా యభిప్రాయము.

'డిగకుఁడు వాహనంబులు గ । డింది మగంటిమి గోలుపోవ'

ఈ పద్యపాదమున 'దిగు' అనుచోట దకారమునకు డకారాదేశము రావచ్చు, (డిగు)కాన నాదేశయతిచే నప్పకవి మతమున 'ద-డ' లకు యతి చెల్లుననవలెను. ఇప్పట్టున డిగు శబ్దమున్నదని యాదేశయతి చెప్పుకొనుటకంటె

'డిగు' అనుశబ్దమును బఠించుకొని సమయతి యని తృప్తి చెందవచ్చుఁగదా? ద్వైరూప్యముగల స్థలములలో వలసిన వర్ణమే పఠించుకొన నగుఁ గాన నాదేశ యతి నుపదేశించుట నిష్ప్రయోజన మనక తప్పదు. అదియుఁగాక యప్పకవి 41 యతులలో నాదేశయతి చెప్పక యీ సందర్భమున దానిని క్రొత్తగాఁ బేర్కొనుట వింతయయి కానంబడుచున్నది.

ఆదేశయతి రీతినిగాక ద్వైరూప్యములేని ద డ లకు యతిచెల్లింపవలెనన్న; వానికి ముందు పూర్ణబిందువు లుండవలయు. అప్పకవి యనుస్వార సంబంధయతి లక్షణమునుబట్టి (ంద-ండ) పరస్పరము యతి చెల్లును. ఇట్టి సంబంధములేక చెప్పిన యతిగాన దీని నగ్రాహ్యసంబంధయతియని పేర్కొనెను.

అప్పకవి యిందు దడయతి విషయము విమర్శించెకాని పై లక్షణమున ద డ లకుఁ బ్రాసయుఁ జెల్లుననుటను స్పృశింపక విడిచెను. ద డ ప్రాస యగ్రాహ్యమని యాతని మతమగుట తెల్లము. ప్రాస ప్రకరణాంతమున ద డ ప్రాస నప్రశస్త ప్రాసము క్రిందఁ బ్రసంగించెను. (రూ. 111-378-380 ప.)

పై 264 లక్షణపద్యమునఁ జతుర్థపాదమున 'ద డ' యతి కుదాహరణముగలదు. ఇది సమ్మతముగాదని యప్పకవి పరామర్శించె. అందలి డులి శబ్దమునకు దులి యను రూపాంతమును గలదు. డులి-అఁడు తాబేలు. శబ్దకల్పద్రుమ నిఘంటువులో దులి శబ్దము సంగ్రహింపబడియున్నది అప్పకవి యుపదేశించిన యాదేశ యతి ప్రకారము 'దౌడిఁ బడి.... + డులి,' యనుచోట యతిమైత్రి సర్వసమ్మతము గావలెఁగదా? అప్పకవికి దులి యనురూపము కలిమి తెలియదు కాబోలు.

## అగ్రాహ్యవర్ణ చతుష్టయవళులు

క. యరలవలను నీ నాల్గును
వరుసం దమలోన వళ్ళు । రయమునఁ జెల్లున్;
ధర శషసహ వర్ణంబులు,
సరవినొకటి కొకటిచెల్లు । హరినిభరేచా. 266

ప. ఈ మొదలను జెప్పిన యరలవలకు నాల్గింటికిని జెల్లుబడి గాదు. శషసహలలోపలను తొలుతటివి మూఁడును ఊష్మవిశ్రాంతులు గనుక చెల్లును. వానికి హకారము చెల్లదు. ఇవి తెలియక చెప్పిన కతంబున ఇదియు అప్రయుక్తమే ఆయెను. 267

వి. అంతస్థములయిన 'య ర ల వ లు' తమలోఁదాము యతిమైత్రి నందను. అట్లే యూష్మములయిన 'శ ష స హ లు' పరస్పరము మిత్రములు అని పై లక్షణము చెప్పుచున్నది. లక్ష్యముగూడ నందే కలదు.

రెండవ పాదమున 'వ-ర' లకు, నాల్గవపాదమున 'స-హ' లకు యతి గూర్పఁబడినది.

2 పా. వ రు స........ + ర య ము

4 పా. స ర వి........ + హరి

ఇందుల కప్పకవి విమర్శ—

య ర ల వ లకుఁ బరస్పరము యతిచెల్లదు. శ ష స హ లలో శ ష స లకు మూఁడింటికి మాత్ర మూష్మ విశ్రాంతిచే యతిచెల్లును: వానికి హకారముతో యతిమైత్రి చెల్లదు.

ఇట్టి యతులప్రయుక్తములగాన నగ్రాహ్యములు.

ఇందు నాల్గేసివర్గములుంటచేఁ గవి దీనికి అగ్రాహ్యవర్ణ చతుష్టయవశులని పేరిడియె. అగ్రాహ్యవర్ణ చతుష్టయ యతియను పేరికంటె అగ్రాహ్యాంతస్థోష్మ యతులని చెప్పుట సముచితముగా నుండును.

విశే. ఈ యప్రశస్తయతి యశవర్గద్వయయతి యనుపేర సులక్షణసార మున నీ క్రింది లక్షణపద్యమునఁ జెప్పఁబడినది.

'యశవర్గ ద్వయమునకును
విశదము దమ యక్షరములు । వెలయఁగ వళ్ళౌఁ,
గుశలమగు పదము ధరలో
శశి నౌదలఁ దాల్చునతఁడు । హరుఁడను మాడ్కిన్'

ఈ యతికిఁ బ్రామాణిక ప్రయోగము లెందును గానరావు.

ప్రఖ్యాత లాక్షణికులయిన విన్నకోట పెద్దన, అనంతామాత్యుఁడు తాతం భట్టు, చిత్రకవి పెద్దన, కూచిమంచి తిమ్మన మున్నగు వారెవ్వరును దమ లక్షణ గ్రంథములలోఁ జెప్పలేదు.

కవిజనాశ్రయపుఁ బ్రతులలో నొక రెంటిలో హ శ వర్ణయతి మున్నగు యతిభేదము లధికముగా నున్నవని యాంధ్రసాహిత్య పరిషత్తువారి కవిజనా శ్రయములో సూచింపఁబడి యున్నది. (చూ. పుట 23)

భీమన చెప్పినది యతులేకాన నియ్యది ప్రక్షిప్తమగును.

## అగ్రాహ్యాభేదవర్గయతులు

క. ధరఁబఫ బభ మాక్షరములు
పరువడి నీయేనుగూడ । వాతోఁజెల్లున్
సరి సంభావన వడియన
మరు దీమము లేమ కీర । వాణియనంగన్. 268

వ. పంచమ వర్గాక్షరము లైదింటిలో నున్న పబలకభేద యతి[1] గనుకను ప్రథమ ద్వితీయ చతుర్థవర్ణములు వకారమునకు నభేదవర్గయతులు గనుకను అవియు నిలుచును; మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు[2] అబద్ధమని తెలిసికొనునది.

వి. ప ఫ బ భ మ అను నైదక్షరములు వకారముతో యతి చెల్లునని, దాని పేరు సంభావన వడియని పై లక్షణము చెప్పుచున్నది. చతుర్థ పాదమున నిందులకు లక్ష్యము చూపఁబడినది. అందు 'మ-వ' లకు యతిమైత్రి గూర్పఁబడినది.

అప్పకవివిమర్శ - అభేదయతిచే 'ప-బ'లు చెల్లును. అభేద వర్గయతిచే ప ఫ భ లు వకారముతోఁ జెల్లును. ఈ రెంటివలన ప ఫ బ భ వ లు మిత్రము లగును మకారముతోఁ ప ఫ బ భ లు చెల్లవు: వకారముగూడఁ జెల్లదు. నెఱసున్న ముందుండునేని ప ఫ బ భ లు బిందుయతినిబట్టి మకారముతోఁ జెల్లును. అట్లే బిందుపూర్వక వకారము సవర్ణ విరామముచే మకారముతోఁ జెల్లును. కేవల 'మ-వ' లు చెల్లవు.

విశే. మకారయతిచే పు ఫు బు భు లు ముకారముతోఁ జెల్లుటను సంభావించి ప ఫ బ భ లు మాతోఁ జెల్లనగుననియు, నట్లే ప-వలు, పు వులు చెల్లునుగాన మ - వలు ము - వులు చెల్లనగుననియు వికటకవులు కల్పించి యుందురు. ఈ సంభావన వడి లక్షణదీపిక, లక్షణ రాజీయము మున్నగు కొన్ని యముద్రిత లక్షణగ్రంథములలోఁగానవచ్చెడు.

1. ఇందులకుఁ కొన్ని ప్రయోగములు గూడ గోచరించుచున్నవి-
వసుమతి గారవించుచు ద్రొ । మంపడ కుండిన నేలకల్లు
(కావ్యా - మూడా. 3-44.)

1. గాన 2. అయుక్తమని (ఇవి సూర్యాలోక ప్రతిపాఠములు)

మొదమునఁ బ్రాచిదేవుండును గలిసి (పల్నాటి-34 పుట. 135 పంక్తి)
వృశ్చికములకు బుధుకు స్త్రీమిథునములకు (రంగరాట్ఛందము2-208)
మదిమదినుండి యేను బలవంతుఁడనై (హరివంశ-ఉ 8-199)

కావ్యాలంకార చూడామణిలోఁగాని రంగయ ఛందములోఁగాని 'మ-వ'ల యతి చెప్పఁబడలేదు. పై ప్రయోగములకు సరియగు పాఠాంతరము లున్నవేమో ?

ప ఫ బ భ వ లు అభేదవర్గయతిచేఁ జెల్లును. మకారము పవర్గమునకుఁ జెందినది గాన మవర్ణము ప ఫ బ భ వ ల తోఁ జెల్లునను కల్పించిన యీ యతిని అప్పకవి యగ్రాహ్యాభేదవర్గయతియని పేర్కొనియె.

తే. భరితభువనార్ణవంబులో । బ్రవంత సరియె
రమ్యమణి రాజరాజితో । లక్క సరియె
లలిత వీణారవంబుతో । ధక్క సరియె
యనఁగఁ జెల్లు నభేదాఖ్య । నమరువళ్ళు. 270

వ. ఈ మూఁటిలోపలను భకారవకారములకు నభేదవర్గ విరతిగనుకఁ బ్రయోగించవచ్చును. లవర్ణ ధవర్ణములకు నభేద వర్గయతులుగావు గావునఁ బ్రయోగింపరాదు; రవర్ణమునకును లకారమునకును గ్రాహ్యంబుగాదు, వానికిని లక్షణవిలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు; అవియును వివరించెద. 271

వి. పై పద్య మభేదవళ్ళను దెల్పును. లక్ష్యముగూడ నందే కూర్పఁబడి నది. ఇందు మూఁడభేదవళ్ళు చూపఁబడినవి. మొదటిపాదమున 'భ-వ'లు, రెండవ పాదమున 'ర-ల'లు మూఁడవపాదమున 'ల-ధ'లు యతిగూర్పఁబడినవి. ఈలక్ష్యముచే భ-వ లు, ర-ల లు, ల-ధ లు అభేదవళిపేరఁ జెల్లునని లక్షణము నరయ నగును.

అప్పకవి విమర్శ-అభేదవర్గ విరతిచే 'భ-వ'లు చెల్లును.

ల ధ లు, ర ల లు చెల్లవు. అప్పకవి మతమునఁ బ్రథమపాదయతి లక్షణ వంతము: తక్కినవి యసాధువులు గాన నగ్రాహ్యములు.

విశే-పై పద్యము 3-వ పాదమున 'ధక్క' యను శబ్దమున్నచోట 'ఢక్క' యనురూపము సులక్షణ సారాదులలో వెలయుచున్నది. అప్పుడు

ల-డ ల కభేదయతి యప్పుడపి సమ్మతమగును. ఢక్కా-శబ్దవైకృతము డక్క. కాన నిందు నిర్బాధమైన 'డక్క-యను తద్భవశబ్దమున్న దనవలెను ఇక 'ర-ల' యతి యభేదయతిలో నప్పకవి చెప్పలేదు. అయ్యది యతనికి సమ్మతముగాదు. కాని రల ల కభేదము శాస్త్రమునఁ జెప్పఁబడియున్నది.

ర ల యతికి మహాకవి ప్రయోగములును గానవచ్చుచున్నవి.
లవర్ణ ధవర్ణములకు కభేదవర్గ యతులను గావన్నాఁడప్పకవి.

లవర్ణ దవర్ణముల కభేదయతిలోఁ జెప్పినాఁడు. ఇందభేదయతి యన వలెనేకాని యభేదవర్గయతి యనుట పొరపాటు.

ఈ క్రింద రలయతికి లక్షణ విలాసమున నొసఁగబడిన యుదాహరణముఁ జూపి యప్పకవి విమర్శించుచున్నాఁడు

శృంగార నైషధమునందు—(1-110)

క. కైలాటరాయ యభినవ
లీలామకరాంక చంద్ర । రేఖాంకుర చూ
డాలంకార బహాంబురు
హాలింగిత సుఖిత నిర్మ । లాంతః కరణా. 272

రామాయణమునందు—(యుద్ధ. 2323)

క. దానవ సుందరుల త్రతి
జానకి నందలముమీఁద । సమ్మద మొదవం
గానిలుప శారదాభ్ర వి
లీనత నేపారుచంద్ర । రేఖయపోలెన్. 273

వ. సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండును గలవు గాన నీరెండు పద్యములయందును జెప్పిన లేఖాశబ్దము మొదలిది తృతీయాంతస్థమని యెఱుఁగునది. 274

వి. లక్షణ విలాసమున నుదాహరించిన నైషధ రామాయణ పద్యములలోఁ గ్రమముగ 2, 4 పాదములలో 'ర-ల' యతి గానవచ్చుచున్నది.

ఇందు యతిస్థానమున రేఖాశబ్ద మున్నది. రేఖకు లేఖయను పాఠాంతర మున్నది. రేఖా లేఖా శబ్దములు రూపాంతరములు.

రూపద్వయ ముండుటచేఁ బై యతి స్థానముల రేఖాశబ్దమునకు మాఱు లేఖాశబ్దము పఠింపవలెనని యప్పుడు ర ల యతి కాస్కారములేదని యప్పకవి యభిప్రాయము. ఇందలి లేఖాశబ్దము మొదటి యక్షరము తృతీయాంతస్థము. య ర ల వ లంతస్థములు. లకారము తృతీయాంతస్థము. లేఖాశబ్దము మొదటి యక్షరము లకారమని దీని యర్థము.

అప్పకవీయ ముద్రణములో ద్వితీయాంతస్థమని యున్నది: అయ్యది పొరపాటు.

హరిశ్చంద్రుని కథయందు—

ద్వి. చీఁకటి విరియించు । జిఱునవ్వుపసిడి
రేకులతో నెది । రించు చెక్కులును. 275

వ. కొందరు 'రేకులతో మురా । శించు చెక్కులును' అని చదువుదురు; అది వ్రాఁతతప్పుగాని కవి హృదయముగాదు. 276

వి. పై ద్విపద గౌరన హరిశ్చంద్ర చరిత్రలోనిది. పై ద్విపదలోని రెండవపాదమునకు వచనములోఁజూపిన పాఠాంతరమున 'ర-శ' యతిగలదు. ఈ పాఠము తప్పని యప్పకవి 'ర-ల' యతిచేయని పాఠమును బద్ధముగఁ జూపెను. కొందఱు చదువు 'మురాశించు' పాఠము కవి హృదయముగాదని నిరాకరించె. కవి హృదయము గాదనుట కాధారమేమో? గౌరనకు ర ల యతి యిష్టము గాదని యెట్లు చెప్పనగును? అప్పకవికి ర ల యతి యిష్టముగాదు గాన, గౌరన కును సమ్మతముగాదని నిర్ణయించె ననవలె.

వసుచరిత్రమునందు - (3-162)

శా. ఓలంబాలక యోలయోలయన నో । లోలంచు మేలంబునన్
లోలంబాలక యోర్తు । గ్రుంకి బిసవ । ల్లు ల్లున్మితూఁటాడి కెం
గేలంబూని తటాలునన్నెగసెన । క్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారలయశః । శ్రీఁదెచ్చుచందంబునన్.

వ. ఈ పద్యము రెండవచరణము మొదలను 'లోలం బాలక గ్రుంకి' యని కవి హృదయము. ఇదిగానక కొందఱు 'ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరోపిచ' అని నిఘంటున నున్నదని 'రోలంబాలక'

యని చదువుదురు; ఇటని 1 రామరాజభూషణుని తలంపుగాదు.

వి. వసుచరిత్రలోని పై పద్యము రెండవపాదమున 'లో లంబాలక' యనుశబ్దము కవి ప్రయుక్తమై యుండగాఁ దానియర్థము సరిగా స్ఫురించక, దానికి మూఱు, తుమ్మెదలవంటి ముంగురులుకలది యను నర్థమిచ్చు 'రోలంబాలక' యను శబ్దమును గొందఱస్ఫూర్తి గాననివారు పఠించి 'ర-ల' యతిమైత్రి చెప్పికొందురనియు, నిషిద్ధమయిన ర ల యతిని గూర్చుట కవి హృదయము గాదనియు నప్పకవి పరామర్శించుచున్నాఁడు. 'రోలంబాలక' యను పాఠము సహజము సరసముగా నున్నను ర-ల ల కభేదయతి చెప్పికొనవలసి వచ్చుటచే నిట్టి యప్రశస్తయతిని వారింపనెంచి యప్పకవి 'లో లంబాలక' పాఠమునిచ్చి యదియే కవి హృదయమని వ్రాసెను.

విశే. 'రోలంబాలక యోర్తు గ్రుంకి కసవ + ల్లు ల్లున్కి తూఁటాడి' అను పాఠమున 'ర-ల' యతి సిద్ధించును రోలంబాలక కున్న యర్థ సామరస్యము లోలంబాలకకుఁ గుదరదు. 'లోపల లంబములయిన యలకలుగలది' యను నస్వరసార్థమును అప్పకవి మతమునఁ జెప్పికొనవలె. లాక్షణికులు తమ మతము నకు విరుద్ధముగానున్న పాఠముల నపరించుట, యా నపరించిన పాఠములే కవి హృదయమనుట పరిపాటి. రామరాజ భూషణునకు 'ర-ల' యతి సమ్మతమని యీక్రింది వసుచరిత్ర ప్రయోగాంతరము చాటుచున్నది.

'రాయంచ కాళ్ళఁ దొ। లకయ మున్న' (4-25)

అహోబల పండితుఁడీ యప్పకవి యభిప్రాయమును నవిచారితాభిధాన మనుచు నిరాకరించెను. (చూ. అహోబల-పుట 167-క్రొత్తప్రతి)

వసుచరిత్ర వ్యాఖ్యాత సోమకవి యప్పకవి మతము నంగీకరించి 'లోలం బాలక యనెడు పాఠమే సాధువును గవి హృదయమునని తోఁచెడి' యని వ్రాసెను.

ఈ ఖండన మండనము లిట్లుండఁగా సర్వలక్షణసార సంగ్రహకర్త కూచిమంచి తిమ్మకవి యందు లోలంబాలక శబ్దమే యున్నదని దానికి 'లో + లంబాలక' అను రీతిఁ బదవిభాగముచేసి యర్థము చెప్పనక్కఱలేదని 'సమౌ రోలంబ లోలంబౌ రేఖా లేఖాచ కథ్యతే' యను ద్విరూపకోశ పంక్తులుదా

1. రామరాజ భూషణము తలంపు - వావిళ్ళ అప్పకవీయ ప్రతుల పాఠము; రామరాజ భూషణ కవితలంపు - సూర్యాలోకమువారి అప్పకవీయ పాఠము, పై పాఠము మదీయము.

హరించి రోలంబ లోలంబ శబ్దములు రెండుగలవు గానఁ దుమ్మెదలవంటి యలకలుగలది యను నర్థమున 'లోలంబాలక' యను అకారాదిశబ్దమే యందున్నదని సమర్థించెను. అప్పకవికిఁ దిమ్మకవి కర్థప్రదర్శనమున మాత్రమే భేదము. తిమ్మకవి యీ సందర్భమున ర-ల యతిమైత్రిని నిషేధించుచు నందిట్లు రచించెను.

'ర లల కభేదంబని యి, మ్ముల్గొందఱు వసుచరిత్రమున లక్ష్యము నిశ్చలగతి నారసి కలుగం, బలుకుదు రది యెల్లకల్ల పర్వత నిలయా'
(సర్వలక్షణ. 123-124 పుటలు)

'రాతీతి రోలంబః, రలయోరభేదా ల్లోలంబః' అని గురుబాల ప్రబోధిక. శబ్దద్వయముగలదని వసుచరిత్ర పద్యములో నిది లోలంబ శబ్దమే యని నిర్ణయించి యందు 'ర-ల' యతి కవకాశములేక చేసినను ర-ల యతిమైత్రి చేయఁబడిన ప్రయోగము లితరకవులు పెక్కులు గానవచ్చెడు

లోకుల్ మెచ్చ వతంబు నాతలఁపు తీరున్ (కాళహస్తీశ్వరశతకము)
లీలాహాస్య కథాప్రసంగముల ను । ద్రేకించి (కాశీ 6-20)
లక్షేక్షురసాబ్ధి మట్టి । రా విలసిల్లున్ (భాగ. V-(2)-61)
సం, రంభా టోప.... ప్ర । ష్ఠాప ప్రతిష్ఠాపరున్ (సింహాసన-12-116)
భా, రమునం బుచ్చుచు వర్ధమాన విరహగ్లానిన్ మదింగుందుచున్
(శృం-శాకుంతలము)
లేమికై యొరులఁ గా । రించుఁ గాత (పంచ-మిత్ర-316)
రవికఁ దొడిగించి సొమ్ము ల । లంకరించి (రాధిక-1-52)

రంగరాట్ఛందమున 'ర-ల' యతి యభేదయతిగ్రకింపఁ జెప్పఁబడి యందులకుఁ గొన్ని పూర్వకవి లక్ష్యములు చూపఁబడినవి.

'రథసంబున నతనిశరములను గడు నొంచెన్' అను ద్రోణపర్వములోని పద్యము ర ల యతికి లక్ష్యముగా రంగకవి యిచ్చియున్నాఁడు. (ద్రోణ-2-73)

కాని నేఁటి ముద్రిత భారత ప్రతులలో ర ల యతిపాఠము మార్పఁబడియున్నది. (రథసంబున నతనిఁ బటుశరంబుల నొంచెన్).

నేఁటి పండితులు పరిష్కర్త లప్పకవీయము నాధారముగఁగొని తద్విరుద్ధమైన ప్రయోగముల పాఠములను సవరించి ముద్రించుట సంప్రదాయమైయున్నది. పాఠములను మార్పరాదు; అట్లు మార్చినపుడు పూర్వపాఠములను సమిత మధస్సూచిలోఁ దెలుపవలయును. ఈ నియమము నవలంబించిన పరిష్కర్తలే కొందఱో!

లక్షణ విలాసమువారు పై లక్ష్యముల నుదాహరించిన ట్లప్పకవి పేర్కొ న్నాఁడు. ఈ లక్షణవిలాస కర్తయెవరో? పెనుమర్తి వేంకటార్యుఁడు లక్షణ విలాసము రచించినట్లు దెలియవచ్చెడు. దానికే యతిప్రాస విలాసమని నామాంతరము. దీనికి ముద్రణభాగ్యము కలుగలేదు. అప్పకవి పూర్వగ్రంథ నామ సంగ్రహములోను లక్షణవిలాసమును జేర్కొనెను. ఇది వేంకటార్యుని లక్షణ విలాసమే యగునేమో పరిశీలింపవలయును.

క. నణలను రెండక్కరముల
కునువడిఁ బ్రాసంబుఁ బెట్టు, కొనవచ్చుఁ గృతిన్
విను ఱరల (రఱల) కిట్లపెట్టం
జను, లళల కభేదమరయ। సర్వజ్ఞ నిధీ. 279

వ. ఈ చెప్పిన మూఁటిలోపలను మొదలఁ జెప్పిన న ణ ల కు సరసవడియుఁ గడనుజెప్పిన ల ళ ల కభేదవిరతియు గనుక నీ రెండును గూర్పవచ్చును. నడుమను జెప్పిన ర ఱ ల కు 'రయోస్తు నిత్యంస్యాత్' అని శబ్దశాసన సూత్రము కలిమింజేసి యేక త ర యతు లగుటనుం గూర్పరాదు; అటుగాన నీ పద్యము ప్రశస్తముగాదు. 280

వి. న-ణ లకు, ర-ఱ లకు ల-ళ లకు యతిప్రాసలు చెల్లునని పై లక్షణము చెప్పుచున్నది.

అప్పకవి విమర్శ - సరసవడిచే 'న-ణ'లు అభేదవిరతిచే 'ల-ళ'లు చెల్లును. సరసవడి, అభేదవిరతి 41 యతిభేదములలో మున్నె చెప్పబడినవి. ర ఱ ల కట్లు యతిచెల్లదు. ఆంధ్రశబ్దచింతామణిలో 'ర-ఱ'లకు వైధర్మ్యము నిత్యమని చెప్పఁబడుటచే నీ రెండక్షరము లేకతర యతిలోఁ జేరినవయ్యెను. ఏ యక్షరమున కా యక్షరము చెల్లుట యేకతరయతి. దానికి మరొక యక్షరము చెల్లనేరదు.

లఘురేఫ శకటరేఫములు (ర-ఱలు) ఏకతరయతిలోఁ జెప్పఁబడినవి. (85 ప.)

కావున 'ర-ఱ' లకు యతిమైత్రిని జెప్పు పై పద్యము ప్రశస్తముగాదు.

విశే. పై పద్యమున న ణ లకు ర-ఱ లకు ల ళ లకు వడియును ప్రాసంబును పెట్టుకొనవచ్చునని చెప్పఁబడినది. అప్పకవియొక్క వడి విషయమును మాత్రమే గ్రహించి విమర్శించెను. ప్రాసవిషయమును స్పృశింపఁడయ్యెను.

ఇది యతి ప్రకరణము గాన యతినిగూర్చి మాత్రము పరామర్శించెనని తలఁప వలయును. ఇంతేకాక 264 పద్యములో ద డ ప్రాస విషయమునుగూడఁ దడవలేదు. ఇఁకముందు ప్రాస ప్రకరణమునఁ బ్రాసభేదముల విషయము చెప్పఁ బడును. గాన నిందా ప్రాసవిశేషముల ప్రస్తావము చేయఁబడలేదని యెన్నవలెను.

ఇందు వాని ప్రాసమైత్రినిగూర్చి మనము పరిశీలించుట యప్రసక్తము గాదు గాన వానికించుక వివరణము చేయఁబడుచున్నది.

ముందు చెప్పఁబడు నుభయప్రాసభేదముచే 'న-ణ' లకుఁబ్రాసము చెల్లును (829-ప.)

అభేదప్రాసచే 'ల-ళ' లకుఁజెల్లును, (868 ప.) అప్పకవి ప్రాసవైర లక్షణమున 'ర-ఱ' ల ప్రాసమైత్రిని నిషేధించె. (844 ప.) ర ఱ యతిప్రాస విషయములో లాక్షణికుల కేకీభావము గానరాకున్నది. మీఁదు మిక్కిలి వీనికి యతిప్రాసమైత్రిగల ప్రయోగములు చాలఁ గానవచ్చుచున్నవి.

ర ఱ యతిప్రాస విషయ విమర్శకు ఏకతరయతి (85-86 పద్యములు) ప్రాసవైరము (814 ప.) చూడఁదగును.

ఇందు గమనింపఁదగిన మఱియొక యంశముగలదు. అది న-ణ ప్రాస' పై లక్షణమున న ణ లకుఁ బ్రాసచెల్లునని చెప్పఁబడినది; పైకి నియ్యది సరియని తోఁచును. కాని యప్పకవ్యాది లాక్షణికుల మతమునఁ గేవల 'న-ణ' లకుఁ బ్రాస చెల్లదు. అనఁగా 'వి ను-గుణ' అను రీతినున్న సిద్ధ నకార ణకారము లకుఁ బ్రాసచెల్లదు. ఆదేశ ణకారమునకు సిద్ధ నకారమునకుఁ బ్రాస చెల్లుబడి యగును. (చూ. ఉభయప్రాస-829 ప.)

'వినుమతి గుహ్యము నారా
యణ కవచము............'

నార + అయన-నారాయణ, ఇందలి ణత్వము ఆదేశము.

ఇట్టియాదేశ ణకారమునకు సిద్ధ నకారమునకుఁ బ్రాస గూర్పవచ్చును.

ఇది ప్రాచీన కవులయు లాక్షణికులయు మతము. అర్వాచీనులు సాధా రణ 'న ణ' లకుఁ బ్రాసమైత్రి పాటించెదరు. ఈ విషయము ముందుభయ ప్రాసలోఁ బరామర్శింపఁబడును పై నణలను పద్యమున సిద్ధనకార ణకార ములకుఁ బాస గూర్పఁబడియున్నది.

నణలకు రెండక్కరములు: కును (ఇది యప్పకవి మతమున నప్ర శస్తము. అప్పకవి యీ విషయము నిందుఁ బ్రస్తావింపలేదు.

262-వ పద్యము మొదలు 279-వ పద్యము వఱకుఁగల లక్షణములు కవి జనాశ్రయమున వికటకవులచేఁ గల్పితములై ప్రక్షిప్తములైనవని యప్పకవి వాక్యమువలన నెఱుఁగ నగును. అప్పకవి చెప్పినదానిలో సత్యము లేకపోలేదు. నేఁడు కవిజనాశ్రయములోఁ గలిగినన్ని మార్పులు చేర్పులు మఱే యితర లక్షణ గ్రంథమునకు గలుగలేదనుట పరిశోధకులు కెల్లరకుఁ దెల్లము. కవి జనాశ్రయము వ్రాఁతప్రతులు బహువిధముల లభించుచున్నవి. ఒకదాని కొకటి భేదించుచున్నది. ఇతరచ్ఛందములలోని పద్యములు కొన్ని యందుఁ బ్రవేశించినవి. నేఁటి ముద్రిత ప్రతులలోనే సాహిత్య పరిషత్ప్రతికిని వావిళ్ళ ప్రతికిని జాల భేదముగలదు. భీమన్న చెప్పిన 10 యతులు పరిషత్ప్రతిలో నుండఁగ, వావిళ్ళ ప్రతిలో 4 యతులే చెప్పినట్లున్నది. ఉభయప్రతులను బరికించినఁ గవి జనాశ్రయ మెట్టి మార్పులకు లోనై యున్నది తెల్లమగును.

ఇవి వలువది యొక్కటియు యతిభేదంబులు.

వి. ఇంతవఱకు 41 యతిభేదములు చెప్పఁబడినవి:—స్వరయతులు-7, వ్యంజనయతులు-21, ఉభయ యతులు-12, ప్రాసయతి-1.

****

# ప్రాసము

## ప్రాస స్వభావము

ఇంకఁ బ్రాస స్వభావం బెట్టిదనిన.

మూ. సూ. ద్వితీయోవర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు.
కించ ప్రాస స్సర్వేషు చైక ఏవస్యాత్.

వి. ఇఁక బ్రాస లక్షణము చెప్పఁబడుచున్నది. ఇందులకు మూలమైన చింతామణి సూత్రము తొల్త నొసఁగబడినది. ఈ సూత్రప్రతిపదార్థ మీ గ్రంథారంభమున వివరింపఁబడెను.

తెనుఁగుభాషలోఁ బద్యములలోఁ బ్రతిపాదమందును రెండవ యక్షరమునకుఁ బ్రాసమని సంజ్ఞ. మఱి యా ప్రాసాక్షర మన్నిపాదములందుకు (సాధారణముగ నాలుగు పాదములందును) నొక్కటేయై యుండవలెను. ప్రథమ పాద ద్వితీయాక్షర మేదో యదే తక్కిన మూఁడుపాదములలోను రెండవచోట నిలుపవలయును. (ద్విపదలో మాత్రము రెండుపాదములకే ప్రాసమైత్రియని యెఱయునది.)

తే. ప్రథమపాద ద్వితీయాక్ష । రంబు ప్రాస
మయ్యెఁ బదపద్యముల నడు । గడుగునందు
నదియు రెండవ వర్ణమై । యమరు సీస
గీత దండక మంజరీ । కృతులఁ దక్క. 281

వి. రెండవ యక్షరము ప్రాసము. ప్రథమపాదముయొక్క రెండవ యక్షరమే పదములందును (గేయ కృతులందును) బద్యములందును దరువాతి ప్రతిపాదమున రెండవ యక్షరమై యుండవలెను.

అనఁగాఁ బదపద్యములం దన్నిపాదముల రెండవ యక్షర మొక్కటే యయి యుండవలయుననుట.

పద్యకవితయందేకాక పదకవితయందును ప్రాస నియతిగలదు. సాధారణముగఁ బద్యము నాలుగుపాదములు గలది. ద్విపదయందు మాత్రము పాదములు రెండే. ద్విపదయందు రెండు పాదములలోను బద్యములందు నాలుగు పాదములలోను ప్రాసాక్షరము సమానమై యుండవలెనని దీని భావము.

సీసము, గీతము (తేటగీతి, ఆటవెలఁది), దండకము, మంజరీ ద్విపద యను పద్యవిశేషములందుఁ బ్రాస నియమము లేదుగాన వానియందు ద్వితీయాక్షర సామ్యము పాటింప నక్కరలేదు.

విశే. సీసము గీతద్వయము ఉపజాతి పద్యములు? వీనికి ద్వితీయాక్షర ప్రాసనియమము లేదు. దండకమునకు యతిప్రాసలు రెండునులేవు. మంజరి యన్నది ప్రాసములేని ద్విపద. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర మంజరిలో రచితము.

ప్రకృష్టో వర్ణ విన్యాసః ప్రాసః-అని వ్యుత్పత్తి. సంస్కృత భాషలో నీప్రాసము శబ్దాలంకార భేదము. సంస్కృత పద్యములకుఁ బ్రాస నియమము లేదు.

తెనుఁగులో యతిప్రాసలకుఁ బ్రాముఖ్య మనాదిగా వెలయుచున్నది. యతిలో స్వరవ్యంజనములు రెంటికి మైత్రి యావశ్యకము. ప్రాసలో వ్యంజన సామ్యమున్నఁ జాలును. అనఁగాఁ బ్రాస వ్యంజన ప్రాధాన్యము గలదనుట. ఇట్లనుటచేఁ బాదములో రెండవచోటనున్న వ్యంజనమునకే ప్రాసమైత్రి గూర్పవలెనని యెన్నఁదగును. దీనిని స్పష్టముగా నిర్వచింపవలెనన్న నిట్లు చెప్పవలె-తొలి యచ్చుమీఁది హల్లులేక హల్లులు అన్ని పాదముల సమముగా నుండవలెను. ఉ. కవి - ఇందుఁ దొలియచ్చుమీఁది హల్లు వకారము (క్ - అ+వ్ - ఇ); కన్య - (క్-అ+న్-య్-అ) -ఇందుఁ దొలియచ్చుమీఁది హల్లులు న కా ర యకారము. కాంత - (క్ - ఆ - ం - త) — ఇందుఁ దొలియచ్చుమీఁదిది

బిందుపూర్వక తకారము. ప్రాసలో నిట్టిపట్టుల బిందుపూర్వక తకార మన్ని పాదముల నిలుపవలయు. 'దుఃఖ' ఇత్యాదులలోని విసర్గలకు నిట్లే. కాని యరసున్నకుఁ బరిగణనము లేదు. ఈ యంశము లన్నియు ముందు ప్రాసభేదములలోఁ దెలుపఁబడును.

తెనుఁగున స్వరము సాధారణముగఁ బ్రాసస్థానమున నుండుటకు వీలు లేదు. కావనే ప్రాసలో స్వరమైత్రి చెప్పఁబడ లేదు. ప్రాసలో హల్లు పైనే స్వరమేని నిలుపవచ్చు. ఉ. విమల – సముదయ – సమిత – అమృత. పాదమధ్యమున విసంధి తెనుఁగుభాషలో ననుమతింపఁబడదు. కాన ద్వితీయాక్షరము స్వరముగా నుండదు. 'ఆ + అతివ–ఆ యతివ' యని సంధించి యకార హల్లే ప్రాసాక్షరమగును.

కవిజనాశ్రయములో నీ క్రింది పద్యములో స్వరము ప్రాసస్థానములో వెలయుచున్నది.

అ ఆ ఒ ఔ లకు మఱి
ఇ ఈ లు ఋకార సహిత - మె ఏ లకు నౌ
ఉ ఊ ల్ దమలో నొదఁబడి
ఒ ఓ లకు వళ్ళగు న్న - యోన్నత చరితా.

ఇట్టిది సామాన్యముగా నుండనేరదు. లక్షణ పద్యము గాన నిందుఁ గవి ప్రాసలో నన్నియెడల స్వరములే నిల్పి వింతగా రచించెను.

హల్లుపై నే స్వరమున్నను బ్రాసలో బాధలేదుగాన నీ పద్యమందుఁ గేవల స్వరములే నాల్గుపాదములందును నిలుపఁబడినవి. ఇది విలక్షణమైనదని యరయవలయు.

## ప్రాస పూర్వాక్షర నిర్ణయము

క. గురు లఘువులలో నెయ్యది
మురహర తొలిచరణమునకు । మొదల నిలుచు ని
ద్ధర నాపై నిండు ప్రాసా
క్షరములఁ బూర్వమున నదియి । కదియింప నగున్. 282

ఆ. దాస పారిజాత । వాసవా వరజాత
ఘన ఘనాఘనాంగ । దనుజగర్వ
భంగ యనుచు నిట్లు । ప్రాసాదులను గూర్ప
వలయు నొక్కభంగి । బ్రాలు కృతుల. 283

వి. తొలుత ప్రాసమననేమియో నిర్వచింపఁబడినది. ఇందు దత్ప్రాస పూర్వాక్షర మెట్లుండవలయునో తెల్పఁబడుచున్నది. ప్రథమపాదమునఁ బ్రథమాక్షరము (అనఁగాఁ బ్రాస పూర్వాక్షరము) గురువైనచోఁ దక్కినపాదములందుఁ బ్రథమాక్షరములు గురువులే కావలయును: అట్లే మొదటిది లఘువైనచోఁ దక్కినవి లఘువులేయై యుండవలయు. అట్లుగాక ప్రాస పూర్వాక్షర మొక పాదమున గురువు మఱొకపాదమున లఘువై యుండరాదు. (ఈ పూర్వాక్షర నియమము ప్రాసయతి యందుఁగూడ ననుసంధించుకోవలెను.)

ఇందుకు 283 పద్యము కవి స్వీయలక్ష్యము.

దాస........ + వాస (పూర్వాక్షరములు గురువులు)

ఘన........ + దనుజ (పూర్వాక్షరములు లఘువులు.)

ఇట్లుగాక. 'దాస-రస, ఘన-మాన' అనురీతి గురులఘువు లిచ్చవచ్చినట్లు ప్రాసలో నిలుపరాదని యర్థయునది.

టీ. (283) - వాసవ + అవరజాత - ఇంద్రుని తమ్ముఁడై పుట్టినవాఁడా. ఉపేంద్రుడా. ఘన ఘనాఘన + అంగ—సాంద్రమైన వానకురియు మేఘమువంటి చాయగల దేహముగలవాఁడా !

విశే. ప్రాస పూర్వాక్షర నిర్ణయమను నీలక్షణమునకుఁ బాగ ద్వితీయాక్షర ప్రాస నియతిగల కందాది జాతి పద్యములనో వృత్తములనో యుదాహరించి యున్న రమ్యతరముగా సముచితముగా నుండును. గీతమునకుఁ బ్రాసలేదని తానేచెప్పి యాటవెలఁదిని వ్రాసి యందుఁ బ్రాసయతిలో లక్ష్యమును జూపుట యలాక్షణికము గాకున్నను స్వక్రమము స్వరసము ననుటకుఁ జాలకున్నది. లాక్షణిక మతమున నాటవెలఁదిలోనిది ప్రాసగాక ప్రాసయతి యనవలెను. అప్పకవికిఁ బూర్వులయిన యనంతాదులు సయితమిట్టి వ్యత్క్రమము చేసినవారే.

ఆ క్రింద జడ్డలును బి । ఱుంద బిందువులును
నూఁది ప్రాసములకు । నుండెనేని
హ్రస్వమొకటినిడుద । యక్కరం బొక్కటి
వాని మొదల నిలుపవచ్చు నెందు. 284

ఆ. పక్షి రాజ పత్ర । రాక్షస తృణ దాత్ర
దంతి భయ విరామ । శాంతి ధామ
యింద్ర నీలమూర్తి । సాంద్రపాండుర కీర్తి
యనఁగఁ బ్రాసమాత్ర । కాదు లొప్పు. 285

వి. ప్రాసాక్షరము సంయుక్తమైనను, ప్రాసకుఁ బూర్వము పూర్ణబిందు వున్నను (విసర్గము సయితము మిందు గ్రాహ్యమే), పాద ప్రథమాక్షరములు-అనఁగాఁ బ్రాస పూర్వాక్షరము - ఒకటి హ్రస్వముగా మఱియొక్కటి దీర్ఘముగా నుండవచ్చు. ప్రాస పూర్వాక్షరమునకు 282 ప. లో గురు లఘుత్వ నియమమేకాని హ్రస్వ దీర్ఘత్వ నియమములేదని యరయునది.

'పక్షి-రాక్షస' అనుచోట క్షకారము ప్రాసాక్షరము. తత్పూర్వము మొదటి దాన హ్రస్వము (ప) రెండవదాన దీర్ఘము (రా) గలవు. కాని సంయుక్త పూర్వములగుట నయ్యవి రెండును (ప; రా) గురువులేయగును. ఇట్లే పూర్ణబిందు పూర్వక ప్రాసాక్షరములలో నా పూర్ణబిందువునకుఁ బూర్వమున్న యక్షరము హ్రస్వమైనను గురువేయగును

'దంతి - శాంతి. ఇంద్ర - సాంద్ర'

ఈ రెండు జంటలందును బ్రాసకు ముందు నిండుసున్న యున్నది. నిండుసున్న వెనుకనుండుటచే హ్రస్వదీర్ఘములైన 'ద, శాలు' 'ఇ-సా' లు గురువులే యగును.

ఇట్టి సంయుక్త బిందు పూర్వాక్షరములో హ్రస్వ దీర్ఘములం దేది యున్నను నయ్యవి గురువులే యగుటచే 282 వ లక్షణము సరిపడుచున్నదని యెఱుఁగవలెను.

ఈ 284 పద్యము లక్షణము: 285 పద్యము కవి స్వీయలక్ష్యము.

1 పా. పక్షి - రాక్షస

2. పా. దంతి - శాంతి

3 పా. ఇంద్ర - సాంద్ర

ఇందు మొదటిది సంయుక్త ప్రాసాక్షరమునకుఁ బూర్వముననున్న హ్రస్వ దీర్ఘాక్షరములకు, రెండవది పూర్ణబిందు పూర్వక ప్రాసకుఁ బూర్వమున నున్న హ్రస్వ దీర్ఘాక్షరములకు, మూఁడవది నెఱసున్న పిఱుఁదఁగలిగి జడ్డగా నున్న ప్రాసకుఁ బూర్వముననున్న హ్రస్వ దీర్ఘాక్షరములకు లక్ష్యములని యరయునది.

టీ. 284 - జడ్డ - సంయుక్తము: పిఱుంద - వెనుకప్రక్క. నిడుద యక్కరము - దీర్ఘాక్షరము.

285 పక్షిరాజపత్ర గురుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడా: రాక్షస తృణదాత్ర - రాక్షసులను గడ్డికిఁ గొడవలివంటివాఁడా: ప్రాసమాతృకాదులు - ప్రాసాక్షరములకు మొదటివి, అనఁగా బ్రథమాక్షరములు.

ఆ. వేదవేద్య యసమ । వృత్త పాదములను
ప్రాస నియమరహిత । పాదములను
వలసినట్లు మొదలి । ప్రాలు సెప్పగ నొప్పు
నొక్కదాన గురువు । నొకట లఘువుఁ 286

స్వస్థానార్థ సమవృత్తోపజాతివృత్తము.

క్షమా కళత్రున్ వనజాత నేత్రున్
గామేపలీశున్ ద్రిజగ త్ప్రకాశున్
దమాల నీలున్ సముదార శీలున్
హేమాక్షవైరిన్ భజియింతు శౌరిన్. 287

ఆ. హరిజాతగర్భ । వామదేవ సహస్ర
నయన ముఖ్యపుణ్య । నామ యనుచుఁ
ప్రాసనియతి లేని । సీసాది పదముల
మొగల రెండు నిట్లు । గదియుచుండు. 288

వి. 282 వ- లక్షణ పద్యములోఁ జెప్పిన ప్రాస పూర్వాక్షర నియమము **అసమవృత్త** పాదములందు ప్రాసనియతిలేని సీసగీతాదులందును జెల్లదుగాన నందు **మొదటియక్షర** మొకదాని లఘువు నొకదాన గురువు కానవచ్చును. అసమ వృత్తమునకు 287 పద్యము, ప్రాసరహిత పద్యమునకు 288 లక్ష్యములు.

**అక్షరముల సంఖ్యయు** గణముల క్రమము నాల్గుపాదములందు సమముగా నుండు వృత్తము **సమవృత్తము.** ఇట్టి సమవృత్తములలో గురు లఘుక్రమము **సమముగా** నుండునుగానఁ బ్రాస **పూర్వాక్షర** నియమ మిందుఁ బాటింపఁబడును. **ఉత్పల** చంపల **శార్దూల** మత్తేభాదులు సమవృత్తములు. పాదమునకు ఒక యక్షరము మొదలుకొని ఇరువదాఱక్షరముల వఱకుఁగల వృత్తములు ఛంద శ్శాస్త్రములోఁ జెప్పఁబడినవి. పాదమున కెన్నియక్షరము లుండునో యావృత్త మన్నవ ఛందమునఁ బుట్టినదని చెప్పవలెను. కాన వ్యవహారములో నున్నవి 26 ఛందములు.

ఇఁక నాలుగు పాదములయందు గణక్రమము సమముగా లేనివి; **అక్షర సంఖ్య** సమముగాలేనివి యసమవృత్తములు. ఇట్టి యసమ వృత్తములు అయిదు **విధములు:** వాని కించుక వివరణము—

1. **స్వస్థానార్థ సమవృత్తములు :-** ఒకే ఛందమునఁబుట్టిన రెండు భిన్న **వృత్తములలో** నొకటి సమపాదములందును మఱొకటి విషమ పాదములందుం

డును. లేదా తొలి సగముగ నొక విధమగు వృత్తము, మఱుసగమున నింకొక వృత్తము నుండును.

2. స్వస్థాన విషమవృత్తములు :- ఒకే ఛందమునఁబుట్టిన నాల్గు భిన్న వృత్తములు నాలుగుపాదముల వేర్వేఱుగా నుండును.

3. పరస్థానార్ధ సమవృత్తములు :- వేర్వేఱు ఛందములఁబుట్టిన రెండు వృత్తములలో నొకటి సమపాదములలోను మఱియొకటి విషమపాదములలోను నుండును.

4. పరస్థాన విషమవృత్తములు :- ఒక పాదమో రెండు పాదములో భిన్న ఛందోజాత వృత్తములై యుండును.

5. సర్వ పరస్థాన విషమవృత్తములు :- నాలుగు వేర్వేఱు ఛందములలోఁ బుట్టిన నాలుగు భిన్నవృత్తములతో నాలుగు పాదములు నడచును. ఇందు నాలుగు పాదములందలి గురు లఘుక్రమము (గణక్రమమును), అక్షర సంఖ్యయు భిన్న భిన్నముగా నుండును. (ఈ యసమవృత్త విశేష విషయములకు:—

చూ. అప్పకవీయము IV. 367-422; నా తెలుఁగుభాషలో ఛందోరీతులను గ్రంథము - పుటలు 114 - 127)

ఇట్టి యసమవృత్తములలో నొకపాదము లఘ్వాదియు నొకపాదము గుర్వాదియునై భిన్నరీతుల నుండునుగాన నిందుఁ బ్రాసపూర్వాక్షర గురులఘు నియమము పరిపడదు.

అప్పకవి చూపిన లక్ష్యములు—

287 ప-ఈపద్య ముపజాతి, స్వస్థానార్ధసమవృత్తము ఇందు బేసిపాదములం దుపేంద్ర వజ్రావృత్తము (జ-త-జ-గగ) సరిపాదములం దింద్ర వజ్రా వృత్తము (త-త-జ-గగ) నడుచును. ఈ రెండు వృత్తములు 11-వ ఛందమునఁ బుట్టినవి. పాదమునకు 11 అక్షరములు. విషమపాదములందు జగణము మొదట నుంటచే 1,3 పాదముల ప్రథమాక్షరములు లఘువులు. సమపాదము లందు తగణము మొదట నుంటచే 2,4 పాదముల ప్రథమాక్షరములు గురువులు.

| | |
|---|---|
| 1. క్షమా కళత్రున్ | ప్రాస పూర్వాక్షరము లఘువు |
| 2. కామే పలీశున్ | ,, గురువు |
| 3. తమాల నీలున్ | ,, లఘువు |
| 4 హేమాక్ష వైరిన్ | ,, గురువు |

విశే. అప్పకవి యుదాహరించిన యీ వృత్త ముపజాతిగాదు. అప్పకవి మతమున నుపజాతికి బేసులం దింద్రవజ్రయు, సరులం దుపేంద్ర వజ్రయు నుండవలెను. ఇందట్లులేదు. బేసులం దుపేంద్రవజ్ర, సరులం దింద్రవజ్రి కలది వ్యత్యస్తోపజాతియని యప్పకవీయమే చెప్పుచున్నది.

(చూ. అప్ప IV. 376.)

248 ప. ఇది యాటవెలఁది. దీనికి ద్వితీయాక్షర ప్రాస నియమములేదు.

గీత సీసమంజరులకుఁ బ్రాసనియతి లేదుగానఁ బాద ప్రథమాక్షరములకు గురులఘు నియతి యక్కఱలేదు.

1. వారిజాత........ 2. నయన.... 3. ప్రాస.... 4. మొదల

దీనికిఁ బ్రాసలేదు. ప్రథమాక్షరములు కొన్నిట గురువులు, కొన్నిట లఘువులై యున్నవి.

ఇం దుత్తరార్ధమునఁ బ్రాసయతులు గలవు.
ప్రాస........ + సీసాది (గుర్వాది)
మొదల........ + గదియ (లఘ్వాది)

## ప్రాసాక్షర మైత్రి

తే. ప్రాసముల కెల్ల దుల్యాక్ష । రంబు లైనఁ
జాలు స్వరభేదమైన దో । షంబు లేదు,
చరణముల కడఁగూర్చుప్రా।సముల కెల్ల
నన్నియు సమస్వరంబు లై । యమరవలయు. 289

ఆ. సరసిజాతనేత్ర । దురిత గుల్మలవిత్ర
హరితనూజ మిత్ర । గరుడ వత్ర
ధారుణీ కళత్ర । నీరదాసిత గాత్ర
యనుచుఁ గూర్పవచ్చు । నచ్చు లెల్ల. 290

క. దురిత ద్వీపహర్యక్షా
నరక మురాసుర విపక్ష । నాళీకాక్షా
శరధి సుతాలయ వక్షా
కరినాయక రక్ష హరము । ఖ సులాధ్యక్షా. 291

వి. ప్రాసములో హల్లు సమానముగా నున్నఁ జాలును. స్వరసామ్య మక్కఱలేదు. ఏహల్లు మొదటిపాదము ప్రాసస్థానములో నున్నదో యాహల్లే తక్కిన యన్ని పాదముల ప్రాసలో నుండవలయు, ప్రాణియగు హల్లుపై నే స్వరమేని యుండనగు (తుల్యాక్షరమని యప్పకవి చెప్పినాఁడు. హల్లనలేదు, కాని దాని ప్రక్కన స్వరభేదమైన దోషంబులేదని వ్రాయుటచే స్వరముకాని యక్షరము హల్లనుట యర్థము చేసికోవలెను.)

ఛందస్సంబంధియైన ప్రాసలో స్వరభేద ముండనగుఁగాని శబ్దాలంకార సంబంధియైన యంత్యాను ప్రాసలో వ్యంజనముతో స్వరసామ్యము సయిత మావశ్యకమని యప్పకవి దెల్పుచున్నాఁడు.

ఇందులకు 290, 291 పద్యములు లక్ష్యములు.

290 ప. ఆటవెలఁదియందుఁ బాదాదిలోఁ బ్రాసనియతిలేదుగాన లక్ష్యము ప్రాసయతిలో నిమిడింపఁబడినది.

1. పా. నరసి.... + దురిత (రేఫమీఁదఁ బాదాదియతి స్థానములలో క్రమముగ అకారస్వరము ఇకారస్వరమున్నవి.)

2 పా. హరి.... + గరుడ (ఇందు రేఫమీఁద రెండుచోట్లఁ గ్రమముగ ఇకారస్వరము ఉకారస్వరమున్నది.)

3 పా. ధారుణీ... + నీర (ఇందు రేఫమీఁద ఉకారస్వరము అకార స్వరమున్నవి.)

పై మూఁడు పాదములలో రేఫప్రాసయే కూర్పఁబడినది. హల్సామ్యము నిర్వహింపఁబడినది. స్వరపాదము చూపఁబడినది. మఱియు 1,2 పాదములలోని ప్రాస పూర్వాక్షరములు లఘువులు; 2 పాదములో గురువులు. మీఁదు మిక్కిలి యిందే యంత్యానుప్రాసయు సంఘటింపఁబడినది. నేత్ర....విత్ర; మిత్ర....పత్ర; శత్రి - గాత్ర - అన్నిటియందును రెండవయక్షరము త్రకారము. హల్సామ్యమే కాక స్వరసామ్యమును గలదు. అన్నియు అకారాంతములు.

'నేత్రి-ధాత్రి' అనురీతి నంత్యానుప్రాస యుండరాదని యెఱుఁగనది. అంత్యానుప్రాస ప్రదర్శనమునకై మఱియొక పద్యము చూపఁబడినది.

291 ప. హర్యక్షా. విపక్ష, నాళీకాక్షా. వక్షా, రక్ష. అధ్యక్షా.

ఇందు నంత్యప్రాసలో టకారమున్నది. అన్నియు అకారాంతములు, కాని కొన్ని హ్రస్వాంతములు, కొన్ని దీర్ఘాంతములు. హ్రస్వదీర్ఘ భేదమే కాని స్వరభేదములేదని యరయవలయు.

టి. 290 - గరుడపత్ర-గరుడ వాహనుఁడు. నీరద+అసిత గాత్ర-మేఘశ్యామల దేహుఁడా. 201 - దురిత ద్విపహర్యక్షా-పాపములను గజములకు సింహమైన వాఁడా, నాళీక-పద్మము, శరధి సుత-లక్ష్మి.

తే. వట్రువయు [1]ద్విత్వమును గల । వ్యంజనంబు
ప్రాసమై యుండునెడఁ బెఱ । ప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం । బైనఁ జాలు
వానిపై నేస్వరంబైనఁ । బూనవచ్చు. 292

అ. సకియ పూర్వజన్మ । సుకృత ఫలంబునఁ
గాక తను విభాని । రాకృతాభ్రు
నిక్కృపా పయోధి । దక్కఁగఁ గొనుటకుఁ
దరమె భోజసుతకుఁ । దక్క ననఁగ. 293

వి. వట్రువ యన ఋత్వము. ఒక పాదమునఁ బ్రాసాక్షరము (హల్లు ఋత్వసహితమై యుండునేని తక్కిన పాదములు ప్రాసస్థానములో హల్సామ్యమున్నఁ జాలును. ఋత్వసహితమై యుండవలెనను నియమములేదు. మీఁదు మిక్కిలి యాహల్లుపై నే సత్వమేనుండవచ్చు. ఈవిధి ద్విత్వము పట్లను గ్రాహ్యము. ద్విత్వాక్షరము ఋత్వసహితమైన యొక పాదమునఁ బ్రాసలోనున్న దక్కిన ప్రాసలలో ద్విత్వాక్షరమున్నఁ జాలును. వానిపై నే స్వరమే నుండవచ్చు. వట్రుసుడి యుండనక్కఱలేదు.

ఇందులకు 296 పద్యము లక్ష్యము—

1. పా. సకియ—సుకృత (ఇందుఁ బ్రాసలో కకారమున్నది మొదట కి - కకారముమీఁద ఇత్వము తరువాత కృ-కకారముమీఁద ఋత్వము)

2. పా. కాక—రాకృ (ఇందును బ్రాసలో కకారమున్నది. మొదట కకారముపై అత్వము, తరువాత కకారముపై ఋత్వము.)

ఈ రెండును ఋత్వ విశిష్టమగు నద్విత్వ వ్యంజనమున కుదాహరణములు. ఇందు మొదటిపాదమునఁ బ్రథమాక్షరము లఘువుఁ రెండవపాదమున గురువు.

1. నైత్వము.

3. పా. ఇ క్కృపా—ద క్కఁగ (ఇందు ఋత్వసహిత ద్విత్వాక్షర ప్రాస కుదాహరణము చూపఁబడినది. పాదాది యతిస్థానములలోఁ బ్రాసలో కకార ద్విత్వము కలదు. ఆదిలో ఋత్వమున్నది. యతి స్థానములో అత్వమున్నది.)

విశే. వట్రువ స్వరూపం. 280 ప. లోఁ బ్రాసలో స్వరభేదమైన దోషము లేదను వాక్యముచేతనే యియ్యది గతార్థమగును. వట్రసుడి రేఫసంయుక్తము వలె నుచ్చరించు వాడుకయుంటఁబట్టి యట్టి సంయుక్తభ్రాంతిని నివారింప స్పష్ట ప్రతిపత్తికై యిట్లప్పకవిచే నుపన్యసింపఁబడెనని యరయునది.

ఋత్వ విశిష్ట ప్రాస కప్పకవిచూపిన యితరుల లక్ష్యము—

శల్యపర్వమునందు - (1-14)

క. చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు సెప్ప । నిప్పలుకులు దుః
ఖావేశ కరములై చే
తోవృత్తిఁ గరంపఁ జొచ్చె । దుర్భర భంగిన్. 294

వి. ఇందుఁ బ్రాసలో నాల్గు పాదములందును వకార వ్యంజనమున్నది. ఆ వకారముపై వరుసగ 'అ-ఉ-ఏ-ఋ' అను స్వరములు నిలిచియున్నవి. వట్రువయొక్క నాలుగవ పాదమున మాత్రమున్నది. తక్కినపాదములలో లేదు.

కవికర్ణరసాయనమునందు-(1-64)

మ. అమరీ విభ్రమ రీతి లోల నయనా । హస్తాబ్జ [1]దోధూయ మా
న మణీదండక చామరాగ్ర పవమా । న స్పందనాందోళన
క్రమ శోభానృపకుండల ప్రకర ము । త్కృష్టార్ద్ర మయ్యెం దదీ
యమృదు స్పర్శ సుఖోన్నతిం బరవశంబై తూఁగుచుందం
బునన్. 295

వి. ఇందుఁ బ్రాసలో మకార వ్యంజనమున్నది. నాల్గవ పాదమున మాత్రము మకారముతో వట్రువ (ఋత్వము) చేరియున్నది. తక్కిన పాదములలో వట్రువలేదు.

విశే. అప్పకవి వట్రువయు ద్విత్వము నని ద్విత్వముమాత్రమే చెప్పినను సంయుక్తముగూడ ద్విత్వములో గతార్థమని యెన్నవలెను. ఏకవిధమైన

1. దోదూయమాన.

హల్లులకూడిక ద్విత్వమని (త్త, క్క), భిన్న హల్లుల సంయోగము సంయుక్త మని (ర్త, వ్య) వ్యవహరింతురు.

'వార్త - ఆర్తి - ధూర్తు - భర్తృహరి' అనురీతి ప్రాస చెల్లునని పై విమర్శవలనఁ దెలియఁదగును.

గమనిక: —

వావిళ్ళ వారి అప్పకవీయము ప్రతిలో ఈ 292 వ పద్యము(వట్రువయు ద్విత్వమునుగల) వెలయు పుటయం దధస్సూచిలో 'వట్రువయు నైత్వమును గల వ్యంజనంబు' అను పాఠాంతరము చూపఁబడియున్నది.

ఈ పాఠాంతరము గ్రాహ్యముగాదు. ఐత్వముగూడ స్వరమే, వట్రువ వలె వ్రాఁతలో సంయుక్త భ్రాంతి జనకము. తెనుఁగు లిపిలో ఐత్వము తావత్తు వలె నిటు ప్రక్క వ్రాయఁబడును. కాన సంయుక్త భ్రమ గలిగించును. అప్పకవి చూపిన లక్ష్యములలో వట్రువయు ద్విత్వమును గలవుగాని యైత్వము గాన రాదు. కాని ద్విత్వమనుచోట నైత్వమును పాఠము కలదనుట భ్రమ ప్రమాద మని యెఱుఁగునది.

క. విరమము స్వర ప్రధానము
ధరఁ బ్రాసము వ్యంజన ప । ధానము నగుటన్
స్వరసంధిఁ జెందునవుడును
బరుచిరముగ హల్లు దాన । 1ప్రాసము లయ్యెన్. 296

కి. అనలు వెట్టిన నిలువక
తా నూరక యలిగి యా సు । దంతను జేరెన్
దానవ సంహరుఁ డేక్రియ
చే నిఁకఁ జనుదెంచు నాకుఁ । జెప్పవె యనఁగన్. 297

వి. యతియం దచ్చు ప్రధానము; ప్రాసయందు హల్లు ప్రధానము గాన స్వరసంధిగల స్థలమునను బ్రాసలో హల్లునకే మైత్రి, యతిలోవలె సంధి వేర్ప అచి ప్రాస గూర్పరాదు అట్లు గూర్ప వలనుపడదుగూడ.

స్వరసంధి యున్నపుడు స్వరప్రధాన పడినిబట్టి సంధి విడఁదీసి పరపదా ద్యచ్చునకే యతిమైత్రి గూర్పవలెనని మున్ను యతిప్రకరణమునఁ దెలుపఁ బడెను. 'తానూరక' యనుచోట సంధ్యక్షరమునకు యతిలో (తాను + ఊరక)

1. ప్రాసంబయ్యెన్ - అని యేకవచన రూపముంట యుక్తము – అప్ప కవీయ ప్రతులన్నిట బహువచనరూపమే యున్నది.

స్వరసంధి వేర్పఱిచి పరపదాది స్వరమునకే (ఊకారమునకే) మైత్రి గూర్ప వలయును. అట్లే క్రియచే నిఁక(క్రియచేన్ + ఇఁక)అనుచోటను యతిలో ఇకార స్వరమునకే మైత్రి - సంధిలో నిలిచిన హల్లున కుభయయతిలో మాత్రమే మైత్రి పొసఁగును. యతిలోవలె స్వరమునకు సంధి వేర్పఱిచి ప్రాసమైత్రి చేయరాదు.

'తానూరక, చేఁనిక' (297 పద్యము) అను స్థలములలో సంధియున్నను స్వరమునకుఁగాక యందు నిలిచియున్న వ్యంజనమునకే అనఁగా నకారమునకే ప్రాసమైత్రి చేయవలెను.

పై 297 లక్ష్యపద్యములలో 'ఆనలు, దానవ' అనుచోటఁ బ్రాసాక్షర మగు నకారము సిద్ధము. 'తానూరక, చేనిఁక' అనుచోట నకారము సంధి గతము. ఇందు నాల్గు పాదములలోను బ్రాసలో నకార వ్యంజనమునకే మైత్రి.

ఈ నియమము స్వరసంధియందేకాక వ్యంజనసంధియందును గలదు.
సంధి వశమున వచ్చిన యాగమాదేశాక్షరములకే ప్రాస గూర్పవలెను.
సింగము....వ, చ్చెంగుంతీసుత (వచ్చెను + కుంతీసుత)

ఇది స్వర సంధి విషయము గాదు. సంధికిఁ బూర్వము కకారముండెను; సంధిలో గకార మాదేశమయ్యెను. సంధిలో నిలిచిన గకారమునకే ప్రాస చెల్లును.

(చూ సంధిగతప్రాస - 372)

విశే. 297 లక్ష్యపద్యములో 'సుదంతనిజేరెన్' అను పాఠము పూర్వ ముద్రితప్రతులలోఁ గానవచ్చెడు. బహువ్రీహిని వయోవాచకమున సుశబ్దంబు పూర్వమందుగల దంతశబ్దము దతిగా మాఱును (వయసిదంతస్యదతృ- సంఖ్యా సుపూర్వస్య దతృ ఇత్యాదేశస్స్యాత్ - సిద్ధాంతకౌముది) శోభనదంతములు గలది (యువతి) యను నర్థమున సు + దంత-సుదతి యగును; సుదంతి కాదు' కాన గుప్తార్థ ప్రకాశికాకారులు 'తానూరక యలిగి యాసుదతినిఁ జేరెన్' అన్న సరిపోవునని ప్రసంగించిరి. (తత్సమపరిచ్ఛేదము-85 సూ.) కాని యిందలి సుదతి యువతి యను నర్థము కలదిగాదు. కృష్ణుని యష్టభార్యలలో సుదంత యొకతె. ఉదాహరణములోని విషయము కృష్ణవృత్తాంతమును జెప్పునది. సంజ్ఞ యగుటచే 'సుదంత' యను రూపము నిర్బాధము, సలక్షణము. నాసికోదరోష్ఠ జంఘాదంతకర్ణ శృంగాంగ గాత్ర కంఠ శబ్దములకు స్త్రీత్వవివక్షయందు జీ ప్రత్యయంబు (ఈకారాంతము) వికల్పముగా వచ్చును. ఈకారము రానపుడు అకారాంతముండును. 'చంపకనాసికీ, చంపకనాసికా' అను రీతి నుభయ రూపములుండును. దంతశబ్దమునకు బహువ్రీహిని స్త్రీవాచకంబున అకారాం

తము ఈకారాంతము రెండు రావచ్చును. మీఁదు మిక్కిలి సంజ్ఞ యగుటచే సుదంతారూపము సమీచీన మనఁదగును. 'సుదంతనుజేరెన్' అని యిందుండ వలెను. 'సుదంతి' యను రూపమునకు దెనుఁగు కావ్యములలో ప్రయోగము గలదు. 'ఎదవోఁ జూచెదవో సుదంతికిఁ బొలంతీ శాంతి యెప్పంచు'-(పాంచాలీ పరిణయము.)

## ప్రాసభేదంబులు

సీ. అర్ధబిందు సమా । హ్వాయముఁ బూర్ణబిందు, ఖం
డా ఖండములు, సంయు । తాక్షరంబు,
ధర సంయుత సంయు । తము, రేఫయుత, లఘు
ద్విత్వ, వికల్పముల్, । వెస నుభయము,
ననునాసిక ప్రాస । మును, ప్రాసమైత్రియుఁ,
బ్రాసవైరంబు, స్వ । వర్గజంబు,
ఋ ప్రాస, లఘు యకా । ర ప్రాసములు నభే
దంబును, సంధిగ । తంబు ననఁగ...

తే. బదియు నేఁడు తెలుంగులఁ । బరిఢవిల్లు
బ్రాసములు పూర్వసుకవి ప్ర । బంధములను
గ్రమత లక్షణలక్ష్య యు । క్తంబు గాఁగఁ
దేటపఱచెద వాని ని । శాట దమన. 297

వి. ప్రాసాక్షర మన్ని పాదములందుఁ దుల్యమై యుండవలెనని మొదటఁ జెప్పఁబడియె. (ప్రాసస్స ్వేషు చైక ఏవస్యాత్) ప్రథమపాదముతో రెండవ చోట నే వ్యంజనముండునో యదే తక్కిన పాదములలోఁ ప్రాసస్థానములో నుండవలెనని యనుశాసించుటచేఁ బ్రాసభేదములకు నవకాశము లేదనవలెను. కాని జీవద్భాషలో నానాఁటికి మార్పులు చేర్పులు సహజము. కాన యతి భేదములు పెరిగినట్టు కాలక్రమమునఁ బ్రాసమైత్రిలో భేదములు పెరిఁగినవి. తుల్యాక్షరనియమము కొంత కొంత సడలినది. కవులు నిరంకుశులుగానఁ బ్రాసలలోఁ గొన్ని క్రొత్తలు సృష్టించిరి. లాక్షణికు లట్టి మహాకవుల ప్రయోగములకు గతి కల్పింపక తప్పదు. కాన నట్టి ప్రాసవిశేషములను మఱియు సందేహమున కెడ మిచ్చు కొన్ని ప్రాసవిశేషములను జేర్చి ప్రాసభేదములు కల్పించిచూపిరి.

కవిజనాశ్రియ కావ్యాలంకార చూడామణులందుఁ బ్రాసభేదములు చెప్పఁబడలేదు. తరువాత అనంతుఁడును నాతని ననుసరించిన చిత్రకవి

పెద్దనయు 12 ప్రాసభేదములఁ జెప్పిరి. అప్పకవి 17 ప్రాసభేదములఁ దెల్పెను. అప్పకవి యతిభేదములందువలెఁ బ్రాసభేదములందును గొన్ని యనవసర భేదములు గలవని చెప్పక తప్పదు. ఆ విషయము లాయా ప్రాసభేదముల క్రింద సూచింపఁబడును.

అప్పకవి చెప్పిన 17 ప్రాసభేదములు :—

1. అర్ధబిందు సమప్రాసము
2. పూర్ణబిందు సమప్రాసము
3. ఖండాఖండప్రాసము
4. సంయుతాక్షరప్రాసము
5. సంయుతాసంయుత ప్రాసము
6. రేఫయుతప్రాసము
7. లఘుద్విత్వప్రాసము
8. వికల్పప్రాసము
9. ఉభయప్రాసము
10. అనునాసికప్రాసము
11. ప్రాసమైత్రిప్రాసము
12. ప్రాసవైరము
13. స్వవర్గజప్రాసము
14. ఋప్రాసము
15. లఘుయకారప్రాసము
16. అభేదప్రాసము
17. సంధిగతప్రాసము

## సమప్రాసములు

తే. పూర్వమున నర్ధమైనను । బూర్ణమైన
దిగువ జడ్డక్కరంబైనఁ । దగిలి మొదలి
ప్రాసముండిన యెడ సమ । ప్రాసమనఁగఁ
బిదప నన్నియు నట్లన । గదియవలయు. 299

వి. ప్రథమపాదమునఁ బ్రాసాక్షరమునకుఁ బూర్వము అర్ధబిందువుగాని పూర్ణబిందువుగాని యున్నను, ఆ ప్రాసాక్షరము సంయుక్తముగా నున్నను దక్కిన పాదములందెల్ల నా ప్రాసాక్షర మట్లే సమానముగ నుండవలయు. దీనికి సమప్రాసమని పేరు. ఈ సమప్రాసమే క్రింద రెండు ప్రత్యేకభేదములుగా జెప్పఁబడుచున్నవి.

## 1. సమప్రాసములందర్ధబిందుప్రాసము (అర్ధబిందు సమప్రాసము[1])

ఆ. వీఁకఁ బం క్తిముఖుని । దాఁకి కోసలవల్ల
భుఁడు బలాసురాంత । కుఁడు సెలంగ
నవనిఁ గూల్చె ననుట । నర్ధబిందు ప్రాస
మట్లు గూర్పవలయు । నెల్ల కడల 300

వి. అప్పకవి ప్రాసగలిగిన జాతివృత్తములం దెదియే నుదాహరించియున్న సముచితముగా నుండును. అట్లుసేయక ప్రాసలేని యాటవెలఁది నుదాహరించుటచే నీ ప్రాసభేదము ప్రాసయతిలో నెఱుఁగవలెను.

1 పా. వీఁక — తాఁకి.

2 పా. భుఁడు — కుఁడు.

మొదటి పాదమునఁ బ్రాసాక్షరము కకారము. రెండుచోట్లను కకారమునకుఁ బూర్వమరసున్న యున్నది. అట్లే రెండవపాదమున డకారము ప్రాసవర్ణము, రెండుచోట్లను దానికి ముందరసున్న గలదు. ఇది యర్ధబిందువురెంటను సమముగ నున్న ప్రాసమైత్రి. ఇందు మొదటి పాదమున అరసున్న దీర్ఘ పూర్వకము, రెండవ పాదమున హ్రస్వపూర్వకము.

## 2. పూర్ణబిందు (సమ) ప్రాసము

క. పొందింపవలయు నెల్లెడ
బృందావనచారి పూర్ణ । బిందు ప్రాసం
బిందీవరాక్షి భీష్మక
నందనఁ జేకొనియె నంద , నందనుఁడనఁగన్. 301

వి. 300 వ పద్యమున నర్ధబిందు సమప్రాసవలె నిందు నాలుగు పాదము లందును బ్రాసాక్షరమైన దకారమునకుఁ బూర్వము పూర్ణబిందు వున్నది. (ఇది ప్రాసముగల కందపద్యముగానఁ బాదాదిలోనే లక్ష్యముగలదు)

టీ. బృందావనచారి-బృందావనమునఁ జరించు వాఁడా; భీష్మక నందన-రుక్మిణి.

విశే. అప్పకవి యర్ధబిందు సమప్రాస మొక భేదముగాఁ జెప్పినాఁడు కాని యొక పాదమునఁ బ్రాసాక్షరమునకుఁ బూర్వమరసున్న యున్నచో నన్ని

1. కుండలీకృతమయిన భాగములు మూలమున లేవు.

పాదముల నరసున్న యట్లే యుండవలెనను నియమము లేదని క్రింది ఖండా ఖండ ప్రాస చెప్పుచున్నది. అర్ధబిందు సామ్యమెచ్చకమై యుండఁగా నప్పకవియే యట్లు ఖండాఖండప్రాసలోఁ జెప్పుచుండగాఁ నర్ధబిందు సమప్రాసయొక ప్రత్యేక ప్రాస భేదముగాఁ బేర్కొనుట వ్యర్థము, నిష్ప్రయోజనముకని యెన్నునది.

మీఁద మిక్కిలి యర్ధబిందు సమప్రాసపూర్ణబిందు సమప్రాసయని వేర్వేఱుగాఁ రెండు ప్రాసభేదములఁ జెప్పుట యనవసరము. సమప్రాసమని యొక్క భేదముగాఁ జెప్పినఁజాలును. 299వ సమప్రాసలక్షణములో అరసున్న, నెఱసున్న, సంయుక్తమను మూఁడు విషయములున్నవి. అట్లుంటచే 300, 301 పద్యములు (అర్ధబిందుప్రాస, పూర్ణబిందుప్రాస దెల్పునని) 299వ సమప్రాసలక్షణమునకు లక్ష్యములుగా నన్నింటిని గలిపి యొకే ప్రాసభేదముగా నెన్నవచ్చును. మఱి యట్లే సమప్రాసమందే గతార్థమగు సంయుతాక్షర ప్రాసను అప్పకవి ప్రత్యేకముగాఁ జెప్పుట యనవసరమే యనవలె.

## ఖండాఖండ ప్రాసములు

క. నిడుపులు నరసున్నలు దమ
కెడమనుగల క చ ట త వ ల । కిలఁ బ్రాసములై
దొడరును నిర్బిందువు లో
కెూడ ఖండాఖండ సంజ్ఞ । నిన శశినయనా॥ 302

వి. దీర్ఘముమీఁది యరసున్న పూర్వమందుఁగల క చ ట త ప ల కు అరసున్న పూర్వమునలేని క చ ట త ప లు ప్రాసలోఁ జెల్లును. అనఁగా సార్థబిందుకములైన క చ ట త ప లొకపాదమున ప్రాసస్థానమున నుండఁగా, మరొక పాదమున నిర్బిందుకములైన క చ ట త ప లు ప్రాసలోనిలుపవచ్చును. అప్పకవి దీర్ఘపూర్వములకే యీ విధి నుపదేశించెను. దీనికి ఖండాఖండ ప్రాసమని పేరొసఁగఁబడియె. ఖండబిందు వనఁగా అరసున్న. ఖండబిందువుగల యక్షరమునకు ఖండబిందువులేని యక్షరమునకుఁ బ్రాసగాన దీనికి ఖండాఖండ (ఖండ + అఖండ) బిందుప్రాసయని యప్పకవి నామకరణ మొనర్చె. ఖండాఖండబిందుప్రాసయనుటకు మాఱు బిందుశబ్దమును వదలి ఖండాఖండ ప్రాసయని పేర్కొనియె. ఇది యప్పకవి తొలుతఁ జెప్పినయర్థబిందువు సమప్రాస కపవాదము. సమప్రాస చారుతరము. అయినట మహాకవి ప్రయోగములుంటచే నీ ఖండాఖండ బిందుప్రాస యుపదేశింప వలసివచ్చెనని యెన్నునది.

దీని నిరూపింపఁ బెక్కుమహాకవుల లక్ష్యములు ప్రదర్శించుచున్నాఁడు.

ఆదిపర్వమునందు (8-203)

క. వీఁకఁ బఱతెంచి నల్గడఁ
దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న
మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ
[1]డాఁకరమున నేసె నుగ్రుఁడై రణభూమిన్. 808

వి. 'వీఁక' అను శబ్దమున దీర్ఘ పూర్వక సార్ధబిందుక కకారమున్నది. 1, 2, 4 పాదములలోఁ బ్రాసలో దీర్ఘముమీఁది కకారములు సార్ధబిందుకములు 3-వ పాదమునఁ బ్రాసలో కకారము నిర్బిందుకము. సార్ధబిందుక కకారమునకు నిర్బిందుక కకారము ప్రాస చెల్లుట కిది యుదాహరణము.

విశే. ఇందు మూకశబ్దము నిర్బిందుకముగా నప్పకవీయమున ముద్రితమై యున్నది అప్పకవిమతమున మూకశబ్దము (సేన యని యర్థము) నిర్బిందుకమని యాతఁ డీ క్రింద నిచ్చిన లక్ష్యాంతరమువలనఁ జెప్పవలసివచ్చెడు.

ఆ లక్ష్యము —

మూకలు విరియించి + వీఁకనాదార్యాది (805 పద్యము)

ఇందొకటి సార్ధబిందుకము మఱొకటి నిర్బిందుకము గావలెను. అప్పుడే యిది ఖండాఖండ ప్రాస కుదాహరణమగును. 'వీఁక' లో నరసున్న యున్నది గాన 'మూక' లో నరసున్న లేదని యేర్పడును.

కాని శబ్దరత్నాకర సూర్యరాయనిఘంటువులలో మూకశబ్దము సార్ధానుస్వారముగాఁ జూపఁబడి పై 'మూఁకలువిరియఁగ' యను పద్యపాదమే యుదాహరింపఁబడినది.

మూఁగు ధాతువు కృదంతరూపము మూఁక. మూఁగుధాతువులో నరసున్న యున్నది. అప్పకవి మతమున సయితము మూఁగుధాతువు సార్ధబిందుకము (చూ. 308 పద్యోదాహృతి.)

మూఁగి చరించున + మ్మొకరి తుమ్మెదలు

బాగొప్ప....... ఇది ఖండాఖండ ప్రాసోదాహృతి గాన 'మూఁగి'లో నరసున్న యున్నదనక తప్పదు.

---

1 డాఁకతమున

'మూఁగు-మూఁక' ధాతువులో నరసున్న యున్నది గానఁ గృదంత రూపములోను నరసున్న యున్నదందురు. కడఁగు-కడఁక, కలఁగు-కలఁక, వీఁగు-వీఁక మున్నగు ధాతు తత్కృదంత రూపములం దరసున్న యున్నది కాని యిది సార్వత్రికముగాదు.

తునుఁగు-తునుక, ఎఱుఁడు-ఎఱుక-వీనియందు వ్యతిక్రమమున్నది. ఇందు 'మూక' నిర్బిందుకమున్న నే పై భారత పద్యము లక్ష్యమగును. ఇప్పట్టునఁ గొందఱు మూఁక సార్ధబిందుకమనియు నాల్గవ పాదముననున్న 'ఆకరము' నిర్బిందుకమనియు నటుగాన నీ పద్య ముదాహార్యమందురు. అగ్రహాశబ్దభవము అకరము. ప్రకృతియందనుస్వారములేదు గాన వికృతియందును నరసున్న యుండ దని యొక మతము. నన్నయభట్టారకుఁ డెచటను ఖండాఖండ ప్రాస ప్రయోగ మును జేయలేదని వజ్ఝలచినసీతారామస్వామి శాస్త్రిగారు వైయాకరణ పారిజాత మున సహేతుకముగ సిద్ధాంతీకరించియున్నారు. (చూ. వైయాకరణ పారి జాతము-పుట305) వారి మతమున 'మూఁక, ఆఁకరము' రెంటను ఖండబిందు వున్నది. అహంకార శబ్దవైకృతము ఆఁకరమని కొందఱి మతము. ఏది యెట్లు న్నను అప్పకవి యీ నన్నయ పద్యమును లక్ష్యముగా నిచ్చుటచే 'మూక'లోనో ఆకరము లోనో మఱి రెంటి యందునో యరసున్న యాతని మతమున లేదని యెన్నవలెను. గిడుగువారి యప్పకవీయము ప్రతిలో 'అర్జునుఁ డాఁకతమున' అను పాఠమున్నది. ముద్రణలో నరసున్న యున్నది కాని 'ఆకతమున' ఆకార మున' అను నర్థమున నం దరసున్న యుండుటకు వీలులేదు.

విరాటపర్వమునందు (2-271)

క. నా కొఱఁత దీర్చి వచ్చితి;
నీ కొఱఁతయ యింక సూతునిఆ డెగఁజూడన్
లోకము వంచింపఁగఁదగు
చీఁకటి రేయొదవె నేమి। సేయుదొ చెపుమా. 304

వి. ఇందు మొదటి మూఁడు పాదములలోను ప్రాసవర్ణమగు కకారమునకుఁ బూర్వమరసున్నలేదు. నాల్గవ పాదమున 'చీఁకటి' శబ్దములోఁ బ్రాసాక్షరమగు కకారమునకుఁ బూర్వ మరసున్న యున్నది. ఇందు నాల్గు పాదములలోను ప్రథ మాక్షరములు దీర్ఘములు.

విశే. చీకటి శబ్దములో నరసున్న లేదని యిటీవలి కొందఱి యభిప్రాయము అప్పకవిమతమున నిది సార్ధబిందుకము.

శబ్దరత్నాకరము సబిందుకముగాను, చిన్నయసూరి నిఘంటువు (అముద్రి తము) నిర్బిందుకముగను గ్రహించినవి. భారతాది ప్రయోగమునుబట్టి నిర్బి

దుకమనుటయే యుక్తమని చీకటి శబ్దము క్రింద సూర్యరాయనిఘంటువు వివరించినది.

ద్రోణపర్వమునందు (2-136)

సీ. పా. మూకలు విరియించి । వీఁక నాచార్యాది
యోధుల కెల్లను । నొక్కదెసను. 305

వి. పై సీసపాద పూర్వార్థమునఁ బ్రాసయతి గలదు. 'మూక - వీఁక, యను శబ్దములలోని కకారము ప్రాసాక్షరము. మూకశబ్దము నిర్బిందుకము వీఁకశబ్దము సబిందుకము.

గిడుగువారి యప్పకవీయము ప్రతిలో నీచోట నధస్సూచిలో 'మూక శబ్దము శబ్దరత్నాకరములో సార్ధానుస్వారముగఁ జేర్చి యీ సీసపాదమునే యుదాహరించినాఁడుఁ కాని యప్పకవి మతమున సార్ధానుస్వారము గాదు' అని తెలుపఁబడియున్నది.

మూకశబ్దము సబిందుకమని, నిర్బిందుకమని యుభయమతములు గలవు. నన్నయ ఖండాఖండమునందు ప్రాససాంకర్యము చేయలేదను మతమవలంబించిన మూకలో నరసున్న యున్నదనవలెను. అప్పకవిమతమున నిర్బిందుక మనుట యాతడు దీని నిందుదాహరించుటచే స్పష్టము దీని విషయము 303 పద్య వివరణ విశేషమునఁ జర్చింపఁబడినది.

రుక్మాంగద చరిత్రమునందు (4-99)

ఉ. ఓ కరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డియ్యెడన్
గాకులు చంపకుండ ననుఁ । గైకొని కాచిన నీ కృపా గుణం
బే కలిగె న్వసింపఁదగు । నే తొలి పుట్టువునందు భర్తపైఁ
గాఁకలు సేసినట్టి ఘన । కల్మషముల్ విన నీకు జెప్పెదన్. 306

వి. ఇందు మొదటి మూఁడు పాదములలోని ప్రాసకవర్ణము నిర్బిందుకము, నాల్గవపాదములోనిది (కాఁక) సబిందుకము, కాఁకయనఁగాఁ దాపము, బాధ యని యర్థము.

ఆదిపర్వమునందు—

మత్త. తీఁగ యుయ్యెల నూఁగు, జల్లని । తియ్యమామిడి మోకలం
దాఁగుఁ బువ్వుల తేనెసోనలఁ । దారుఁ గేతకిఁ జేరుఁ బు
న్నాగ పూగ మహీగవీధుల । నాట్యముల్ పచరించు నా
భోగ నాగలతా గృహంబుల । భోగముల్గను వేడుకన్. 370

వి. ఇందు 1, 2 పాదములలోని ప్రాసాక్షరము (గకారము) సబిందుకము, 3, 4 పాదములలోనిది నిర్బిందుకము. ఖండాఖండ ప్రాసమైత్రి గలదు.

విశే. అప్పకవి చూపిన ట్టి పద్య మాదిపర్వమునఁ గానరాదు. అందేకాదు నన్నయ భారత భాగమునను మీఁదు సిక్కిలి ఎఱ్ఱన తిక్కనల భారత భాగము లందును జూపట్టదు. అప్పకవీయములో వ్రాయఁబడిన 'ఆదిపర్వము' అనునది ఏ గ్రంథము పేరికి బదులుగానో తప్పుపడియుండునని తోఁచెడు. మఱి యిది యేయితర గ్రంథములోనిదో తెలియరాలేదు.

కనుక :—అప్పకవి లక్షణములో దీర్ఘములమీఁది సార్ధబిందుక క చ ట త పలకే (పరుషములకే) యీ ఖండాఖండప్రాస చెప్పి యీ పద్యమునందును దీని క్రింద పద్యమందును (తీఁగయుయ్యెల-307. మూఁగిచరించు-308) సార్ధబిందుక నిర్బిందుక గకారప్రాసమైత్రి చూపియున్నాఁడు. ఈ విషయమును సూక్ష్మముగ నాతడు పరికింపలేదని తోఁచెడు. దీనింబట్టి యీ ఖండాఖండ ప్రాస పరుషములకేకాక సరళములకును (గ జ డ ద బ లకును) జెల్లునని గ్రహింపవలెను. అచ్చ తెలుఁగు శబ్దములయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువుండును. కాన నరసున్న ముందుకల పరుషసరళముల కీ ప్రాస చెల్లునని యేర్పడును.

రామాయణమునందు—

ద్వి. మూఁగి చరించు న । మ్మొకరి తుమ్మెదలు
బా గొప్పఁ గొప్పునఁ । బరఁగిన దాని 308

వి. ఇది రంగనాథరామాయణములోని ద్విపద. ద్విపదలో రెండు పాదముల కేకప్రాసయుండును మొదటిపాదమున 'మూఁగు' సబిందుకము, రెండవ పాదమున 'బాగు' నిర్బిందుకము.

అప్పకవి మతమున మూఁగుధాతువులో నరసున్న యున్నది. కాని మూఁగు ధాతుజన్యమైన మూకశబ్దములో (కృదంతరూపములో) నరసున్న లేదు. ఈ యంశము 308 పద్యమునఁ జర్చింపఁబడినది.

వరాహపురాణమునందు—

క. ఆ చింతామణి ముని తన
పీఁచ మడఁచు దాఁక నీక । పృథు లోభము చే
దాఁచుకొనుఁగాక నాచే
నీచే నీఁక మోసపోవు । నే నరనాథా, 309

వి. ఇందు ప్రాసాక్షరము చకారము 1, 4 పాదములలో నిర్బిందుకము; 2, 3 పాదములలో సార్ధబిందుకము.

ఉద్యోగపర్వము నందు (4-407)

క. 1మీటు గతి రథికులను నొక
నాఁటికి వేవుర వధింతు । నరుశరములు నో
నాటి పడవైచు నంతకు
వేటాడెదఁ బ్రతిబలంబు । నీరుల నెల్లన్. 310

వి. ఇందు 1, 3 పాదములలోఁ బ్రాసటకారము నిర్బిందుకము, 2, 4 పా. లలో సబిందుకము.

విశే. ఇందును మతభేదము గలదు. ముద్రిత భారత ప్రతిలో నాల్గు పాదములందు నరసున్న పెట్టఁబడియున్నది. 'మీఁటుగల రథికు'లను పాఠము గానవచ్చెను. 'మీఁటు,నాఁటు'శబ్దములను సూర్యరాయనిఘంటువు సబిందుకముగాఁ జూపుచున్నది. 'మీఁటు' అనఁగా విజృంభణము.

ఆ. బోఁటి యొకతె పెండ్లి । పాట పాడఁగఁజొచ్చె
నాఁపరాని విరహ । తాపమునను
బేరుగూర్చి తాను । బెండ్లికూఁతురు గాఁగ
గోత్రధరుఁడు పెండ్లి । కొడుకు గాఁగ. 311

వి. ఇదియెందుండి గ్రహింపఁబడిన లక్ష్యమో యప్పకవీయమునఁ దెల్పఁ బడలేదు. ఇది యాటవెలఁదిఁ బ్రథమ ద్వితీయపాదములందుఁ బ్రాసయతి యున్నది. బోఁటి-పాట; ఆఁపరాని-తాప. ఇందు రెండు జంట పదములలో మొదట నున్నవి సబిందుకములు; వెనుకనున్నవి నిర్బిందుకములు.

విశే. ఇవార్థకమైన బోఁటి సార్ధబిందుకమని, స్త్రీ వాచకమైన బోటి నిర్బిందుకమని శబ్దరత్నాకరకారుని మతము. సూర్యరాయాంధ్ర నిఘంటువుభ యార్థములందు బోఁటి శబ్దము సార్ధబిందుకముగాఁ జూపుచున్నది. అప్పకవి మతమున 'బోఁటి' సార్ధబిందుకమే యగును.

---

1. నీటుగల, మేటులగు, మీటుగల-పాఠాంతరములు.

ఆదిపర్వమునందు (2-42)

క. ఆపన్నగ ముఖ్యులఁదన
వీఁపునఁ బెట్టుకొని వఱచి । విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపాల పురములుఁ జూపెఁ । జని వారలకున్. 312

వి. ఇందు పకారము ప్రాసలో నున్నది. రెండవ పాదములో నున్న 'వీఁపు' శబ్దము సార్ధబిందుకము. తక్కిన మూఁడు పాదములలోని ప్రాసపకారము నిర్బిందుకము; నన్నయభట్టు ఖండాఖండ ప్రాస ప్రయోగింప లేదను సిద్ధాంతము గలవారు వీపుశబ్దము నిర్బిందుకమని వాదింతురు. దీనికి సమానార్థక మనఁదగు 'పిన్బు' అను తమిళశబ్దమును బట్టియు, 'వెను, వెనుక' శబ్దములనుండి యేర్పడిన వెన్నుశబ్దము దీనికి మూలమనఁదగునను మతమునుబట్టియు వీఁపు సబిందుక మనఁదగును. వీఁపు సబిందుకముగా నప్పకవికి ముందే యనంతుఁడు చూపి యున్నాఁడు. (వీఁపు మూఁపులు మఱి తల + మోపులయ్యె-అర్ధబిందుప్రాసకుదాహృతి. అనంతుఁడు ఖండాఖండప్రాస కర్ధబిందుప్రాసయని పేరిడియె. ఛందోదర్పణము (1-52)

విశే. నన్నయ ఖండాఖండప్రాస ప్రయోగింపఁడయ్యెనని, తిక్కనాదులు ధారాళముగ ప్రయోగించిరని వజ్ఝలవారి సిద్ధాంతము. ఖండాఖండప్రాస ఏకవికిష్టమో యేకవి కసమ్మతమో నిర్వివాదముగ సిద్ధాంతీకరించుట సులభసాధ్యము గాదు. ఈ యర్ధబిందు విషయమునఁ గల యస్తవ్యస్తస్థితిని బరికించియే కాఁబోలు అనంతాది లాక్షణికులు ఖండాఖండబిందు ప్రాసభేదమును గల్పించి యుందురు.

గమనిక:—అప్పకవి యిందు సబిందుక నిర్బిందుక తకారప్రాసకు లక్ష్యము చూపలేదు; ఈ ప్రాస కప్పకవి యిచ్చిన లక్ష్యముల ననేకము సంగ్రహించిన కూచిమంచి తిమ్మకవి యప్పకవి చూపలేదను కారణమున నేమో తకార ప్రాసకుఁ గూడ నీక్రింది లక్ష్యము చూపెను.

క॥ ఆతఁడును ఋష్కరిణి యను
నాతికి వైరిణి సమాఖ్య । నందనఁ గనియెన్
బ్రీతి యెసఁగ నుత్పల యను
గోఁతి యతనివలనఁ గాంచె । గొడుకుల వరుసన్

(ఎఱ్ఱన - హరివంశము)

అనంతుఁడు దీని కర్ధబిందుప్రాస యని పేరిడియె. అప్పకవి యర్ధబిందు ప్రాస సమప్రాసములలోఁ జేరునుగాన నాతఁడు ఖండాఖండ ప్రాస యని క్రొత్త పేరుపెట్టవలసివచ్చె. ఈ ప్రాస తొలుతఁ గొన్ని యక్షరములకే పరిమితమై కాలక్రమమున నన్నింటికిఁ జెల్లుబడి కాజొచ్చెను.

అనంతుడు 'సార్ధబిందువులై తేలినట్టిపటల, కరయఁ బ్రాసంబు నిర్బిందు వైనఁజెల్లు' (ఛందోదర్పణము 1-52) నని 'ప-ట'లకు మాత్రమే చెప్పెను.

కవిజన సంజీవనిలో ముద్దరాజు రామన—
'అర్ధబిందువు నిర్బిందువగు పదంబు,
ప్రాసముల దీర్ఘములమీఁదఁ బలుకఁజెల్లు ;
మూఁడు మూర్తులు నేకమై-కూడెననఁగ
నోఁకుమూఁకల నణఁచె ని-క్ష్వాకుఁడనఁగ'

అను లక్షణము రచించి దాని క్రింద 'అనంతుఁడు చెప్పినరీతి ట ప లకు మాత్రమే కాదు, అన్నింటికిఁ జెప్పవచ్చు'నని తెలిపినాఁడు. అప్పకవి ముద్దరాజు రామన మతము ననుసరించెఁ గాఁబోలు. రామన లక్ష్యలక్షణరీతిని బరికింప నతఁడు పరుషసరళములకెల్ల నీ ప్రాస చెప్పినాఁడనవలె. అప్పకవి పరుషములకు మాత్రమే యుపదేశించె. కాని తెలిసియో తెలియకయో లక్ష్యమున సరళమును సయితము చూపెను.

కూచిమంచి తిమ్మన పై రామన మతము నిట్లు ఖండించెను :—
'అర్ధబిందువు నిర్బిందువగు పదముల
ప్రాసములు దీర్ఘములమీఁద బలుకఁజెల్లు
ననుచుఁ దగ ముద్దరాజు రామన వచించె
హ్రస్వములమీఁద నటువలె నలరు రుద్ర'
(సర్వలక్షణసారసంగ్రహము 2-19)

ముద్దరాజురామనను బేర్కొన్నాఁడే కాని దీర్ఘములమీఁదనే చెప్పిన యప్ప కవి వ్రాఁతను గమనింపలేదేమో, తిమ్మకవి కుఱుచలమీఁదది యర్ధబిందువుల ప్రాసకు రెండుదాహృతులు చూపెను. (పుట 10)

తగవులఁబోక రాజు బెడి - దమ్ములు పల్కిన యేని సైఁచి యొ
ప్పఁగనిలుమీ (ఉద్యోగ-3-34)
తగ నక్కురువృద్ధునకు నొ
సఁగె (భార-ఆశ్రమవాస 2-121)

ఈ విమర్శనుబట్టి సార్ధబిందుకమైన పరుషసరళముల కన్నింటికి నయ్యవి దీర్ఘపూర్వములయినను హ్రస్వపూర్వకములయినను నిర్బిందుక పరుష సరళములతో నీ ఖండాఖండ బిందుప్రాసచెల్లునని యెఱుగఁదగును.

## 4. సంయుతాక్షర ప్రాసము

తే. సంయుతాక్షర ప్రాసమై । జగతి వెలయు
గర్గుఁ దర్చించు దైవంబు।భర్గుఁ డనఁగఁ
బక్ష్మ లేక్షణ కౌనతి । సూక్ష్మమనఁగఁ
జంద్ర వంశ్యుఁడు భోగ దేవేంద్రుఁడనఁగ 313

వి. ఒకపాదమున ప్రాసాక్షరము సంయుక్తముగా నుండునేని యన్ని పాదములందు నా ప్రాసాక్షర మట్టి సంయుక్తము గలదిగా నుండవలెను. ఒక సంయుక్తములో నెన్ని హల్లు లేవిధముగా ననఁగా నే క్రమమునఁ గూడి యొక ప్రాసలో నుండునో యదే యాకారముతోఁ దక్కిన ప్రాసస్థానములలో నుండ వలెనని భావము. ప్రాసయతికిఁ గూడ నిట్టి నియమమే. ఇం దప్పకవి వ్రాసిన పద్య మాటవెలఁది: ప్రాసయతి గలది. 2,3,4 పాదములలో లక్ష్యము చూపఁ బడినది.

2 పా॥ గర్గు—భర్గు (రెండు హల్లుల కూడిక)
3 పా॥ పక్ష్మ—సూక్ష్మ (మూఁడు హల్లుల కూడిక)
4 పా॥ చంద్ర—వేంద్ర (పూర్ణబిందుపూర్వక సంయుక్త వర్ణము)

సంయుక్తాక్షరమైత్రిని దెలుపు ప్రాసగాన దీనికి సంయుతాక్షర ప్రాస యను పేరొసఁగఁబడియె. ఇందు విశేషమేదియును లేదు. ఇది యప్పకవి తొలుతఁజెప్పిన సమప్రాసలో నంతర్భూతమగును. ఇది ప్రత్యేకముగఁ జెప్పుట యనవసరము.

## ౫. సంయుతా సంయుత ప్రాసము

తే. [1]రలలు తమక్రింద జడ్డలై । క్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ । బాసియైనఁ
గూడియైనను బెఱయడు।గులను నిలుచు
సంయుతా సంయుత ప్రాస।సంజ్ఞఁ దనరి. 314

1 రలలు తమ కింద నుండఁ బైగ్రాలువ్రాలు.

తే. పాఁడి ద్రచ్చఁగ నిమ్ము నా తండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాకఁ బండ్లు దినుము
దుండగవు చేష్టలను నోటి గాండ్రతనము
మెండుగాఁజొచ్చె నీకు [2]నై దేండ్ల కనగ. 315

వి రేఫగాని లకారముగాని క్రిందఁజేరి సంయుక్తమైన హల్సముదాయము ఒక పాదమునఁ బ్రాసస్థానములో నున్నచోఁ దక్కిన పాదముల ప్రాసలలో రేఫలకారములఁ బాసియుండవచ్చు. ఒకచో సంయుతము మరొకచో నసంయుతము నగు బ్రాసగాన దీని కీసంయుతాసంయుత బ్రాస నామము సార్థకము.

'శ్రీకర — ఈక్రియ' అనురీతిఁ బ్రాస చేయవచ్చునని సంయుతా సంయుత ప్రాస చెప్పుచున్నది. 'ఈక్రియలోఁ బ్రాసకకారము రేఫతోఁ జేరియున్నది. 'శ్రీకర' లో రేఫ సంయుక్తములేదు. ఇట్లే లకారముక్రిందఁ జేరి యేర్పడిన సంయుక్తమునకు లకార సంయుక్తి లేక ప్రాస గూర్పవచ్చునని పై 314 లక్షణము దెల్పుచున్నది.

ఈ లక్షణమునకు 315 పద్యము కవి యిచ్చిన స్వీయోదాహృతి.
ఈ లక్ష్య మించుక విమర్శనీయము.
ఇందు 3 పాదమున 'దుండ—గాండ' అనుచోటఁ బ్రాసయతి.

రెండవచోట సంయుక్తములో రేఫ క్రింద నున్నది. మొదట రేఫ సంయుక్తము లేదు ఇట్లే 4 పాదమున 'మెండు-దేండ్లు' అనుచోట మొదట లకారముతోడి సంయుక్తము లేకయు రెండవచోట లకారముతో సంయుక్తముకలిగియు నున్నది.

3, 4 పాదములలోని బ్రాసమైత్రి యప్పకవి చెప్పిన లక్ష్యము ననుసరించి యున్నది.

ఇఁక 1, 2 పాదములలో 'పాఁడి—తండ్రి' వేఁడు-పండ్లు' అను ప్రాస మైత్రి సాధుత్వము చింత్యము. ఇవి క్రమముగా రేఫ సంయుక్తము కలదానికి లేని దానికి లకారసంయుక్తము గలదానికి లేనిదానికి లక్ష్యములేయైనను బిందుసంయోగ మొకటి యధికముగాఁ గలిగి బిందుప్రాస లక్షణాతిక్రమమైయున్నది. ఖండాఖండ ప్రాసనుబట్టి యొకచో నరసున్న కలిగి యొకచో నరసున్న లేకయుండుట సరిపడును. కాని పూర్ణబిందుప్రాసలో నిట్టి పద్ధతి చెల్లదు. పూర్ణబిందుప్రాస సమప్రాస యగునే కాని యర్ధబిందు ప్రాసవలె సమప్రాస యసమప్రాస యను రెండు రీతులు

2. నై దేండ్లు గనుక-సూర్యలోక ప్రతి.

నుండదు. 'తంౘడి, పండ్లు' అనుచోట నిండుసున్న యున్నది గాన వాని పూర్వ శబ్దములందును ప్రాసలోఁ పూర్ణబిందు వుండక తప్పదు. అర్ధబిందువునకుఁ బూర్ణ బిందువునకుఁ బ్రాసచెల్లదు. పూర్ణార్ధబిందుప్రాసభేదమార్వాచీనపరిశోధకులు కల్పించి నది. అప్పకవియట్టిదిచెప్పలేదు. అప్పకవిబిందుప్రాసలక్షణములఁబట్టి'పాఁడి, తంౘడి, వేఁడు-పండ్లు'వంటి ప్రాసమైత్రి యసాధువు లనకతప్పదు. అప్పకవి చూపిన క్రింది యితర కవిలక్ష్యములలో నిట్టి వ్యతిక్రమము గానరాదు. మీఁదుమిక్కిలి లకార సంయుక్తవిషయ మప్రశస్తమని తోఁచెడు. దాని సాధింపఁదగిన ప్రయోగ మప్పకవి చూపలేదు.

అప్పకవి యిచ్చిన యితర లక్ష్యములు—

రేఫ శ్లిష్టమునకు నాదిపర్వమునందు (2-173)

ఉ. క్షత్రియ వంశ్యులై ధరణిఁ । గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రులనఁ । గాదఁగు నాలుగు జాతులన్
స్వాచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బ । రిక్షితు కాచినయట్లు రామ మాం
ధాతృ రఘుక్షితీశులు ము । దంబునఁ గాచిరె యేయుగం
బునన్. 316

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁదకారము క్రింద నున్నది వట్రువసుడిగాని క్రావడిగాదు. అందునకు 317

కవి కర్ణరసాయనమునందు (2-58)

సీ. గీ. దాన గుణశాలి భూసముద్ధరణ దక్షుఁ
డనిశ మఘ దీక్షితుండు మ । త్తారి హరిణ
విహృతి నిరతుఁడు యువనాశ్వ । విభు సుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైన । కాలమునను. 318

వి. (316-ప) పై భారత పద్యమున మొదటి మూఁడు పాదములలోను ప్రాసలో తకారము రకారతోఁ గూడియున్నది. అనఁగా త్రకారసంయుక్త మున్న దనుట. నాల్గవపాదమున 'మాంధాతృ' అనుచోటఁ బ్రాసలో రేఫసంయుక్తములేదు. అందున్నది ఋత్వవిశిష్ట తకారము. తకారము వట్రువసుడితోఁ జేరియున్నది. ఋకారమచ్చుగాన 'తృ' వర్ణము సంయుక్తముగాదు. ఈ పద్యము రేఫ సంయుతా సంయుత ప్రాసకు లక్ష్యము.

నాల్గవపాదమునున్న మాంధాతృశబ్దము ఋకారాంతమని యది 'మాంధాత్ర' వంటి అకారాంత రేఫ సంయుక్త తకారముగల శబ్దముగాదని (మాంధాత్రుఁడు వంటిది గాదని) స్పష్టపఱుపఁగవికర్ణరసాయన ప్రయోగ ప్రామాణ్యము చూపఁబడినది. ఈ పద్యమున నాల్గవ పాదమందు మాంధాతయను ప్రయోగము అయ్యది ఋకారాంత తత్సమశబ్దమని తెలుపును. విధాతృ-విధాత యగునట్లు మాంధాతృ-మాంధాతయని తత్సమ ప్రథమాంతరూపము నందును. (ఋకారాంతంబునకత్వంబును త్రీవద్భావంబగు బాల-తత్సమ-52)

విశే. 'రామ మాంధాతృరఘుక్షితీశు' లను నీ ప్రయోగ విషయములోఁ గొంత వివాదమున్నది. అందుల కించుక సూచన—

ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు (బాల సమాసము-26)

(ఉర్ద్వందేరః—ఆంధ్రశబ్దచింతామణి).

మాతృ + పితృ-అను ద్వంద్వసమాసము సంస్కృత వ్యాకరణ మర్యాదచే నానజాదేశమువచ్చి మాతాపితలగును. పై తెలుఁగు వ్యాకరణవిధిచే రేఫము వచ్చి మాత్రి పిత లగును. ఆ ప్రకారము 'రామ మాంధాతృ + రఘు క్షితీశులు' అను ద్వంద్వసమాసస్థలమున 'రామమాంధాత్ర రఘుక్షితీశు' లని ఋకారస్థానమున రేఫవచ్చునని కొందఱి మతము. అడిదము సూరన కవి సంశయవిచ్ఛేదములో నీ పద్యమునే రేఫాదేశము వచ్చినందుల కుదాహరించె. అప్పకవి మతమున నిందు రేఫాదేశము రారాదు; వచ్చునేని సంయుతా సంయుత ప్రాస కియ్యది లక్ష్యము కానేరదు. 'ఆనఙ్ ఋతోద్వంద్వే' అను పాణినీయసూత్రముచేఁ గలుగు నానజాదేశము వచ్చుచోటులందే యారేఫాదేశము తెనుఁగున సంభవించునని. విద్యాయోని సంబంధముగల ఋకారాంత ద్వంద్వమందే పూర్వపదాంత ఋకారమునకు నానజాదేశస్థలమున రేఫము విభాషగానగునని, మాంధాతృరఘుక్షితీశులను ద్వంద్వమున నట్టి విద్యాయోనిసంబంధములేమిచే నానజాదేశ రేఫాదేశము లెవ్వియు గావని, మాంధాతృరఘు క్షితీశులను రూపమే సమీచీనమని యాంధ్ర వైయాకరణ సార్వభౌములు సిద్ధాంతీకరించియున్నారు. అప్పట్టున నప్పకవి మతము సంరక్షితమయి యీ భారతపద్యము సంయుతాసంయుతప్రాసకు లక్ష్యమగుట నిర్బాధము కాగలదు.

అప్పకవి పాఠమునకు ప్రాసమైత్రిలో మఱొక వ్యతిక్రమము దోఁచెడు. 'క్షత్రియ-మాంధాత్ర' అని యున్నప్పుడొకచో, ప్రథమాక్షరము హ్రస్వము మఱొకచో దీర్ఘమునైనను ప్రాససంయుక్తాక్షరమగుటచే రెండును ప్రాస పూర్వాక్షరము గురువులయి లక్షణవంతములగును. కాని 'క్షత్రియ-మాంధాతృ'

అన్నప్పుడు, రెండవచోట సంయుక్తము లేమిచే ప్రాసపూర్వాక్షర నియతికి వ్యతిక్రమమగను. క్రిందఁ గ్రారపడి యొకచోనుండి మరొకచో లేనపుడు కార్రవడి కల ప్రాసపూర్వాక్షరము హ్రస్వదీర్ఘములలో నొకటి కావచ్చును గాని క్రారలేనపుడు ప్రాసపూర్వాక్షరము దీర్ఘము గావలయునని దీనింబట్టి యెఱుఁగ నగును.

సోముని హరివంశమునందు—

శా. నాతో మార్కొన లేరు నిర్జరపురీ । నాగేంద్ర బృందారకా
రాతుల్మన్నగ దేవసంఘములు పో । రను ధీర సంగ్రామ కుం
డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం । బెచ్చోట లేకుండఁగాఁ
జేతుల్వేయు వృథా భరంబగుచు వ । చ్చెన్ దేవ యీ మేని కిన్. 319

వి. ఇందు మూఁడవపాదమునఁ బ్రాసలో 'త్రై' యను రేఫశ్లిష్టతకార మున్నది. తక్కిన పాదములలో తకారమున్నది గాని రేఫ సంయుక్తము గాదు. కాన నిది సంయుతాసంయుత ప్రాస యగును.

విశే. నాచనసోమన యుత్తర హరివంశములో నీ పద్యము గానరాదు. అప్పకవి యుత్తర హరివంశ మనక హరివంశమని పేర్కొన్నాఁడు. నాచన సోమన పూర్వ హరి వంశములోనిదై యుండునేమో యీ పద్యము. సోమన పూర్వహరివంశము నష్టమై యుండునని విజ్ఞుల యభిప్రాయము.

దేవీ విజయమునందు—

తే. వాక్రిణే తాంగనా శచీ । శక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభ ని । కుంభ దైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీ । మంత్రములను
స్తోత్రములు చేసి మంగళా । రాత్రిక లిడి. 320

వి. 1 పా॥ వాక్రి-శక్తు

2. పా॥ సంభ్ర-కుంభ

ఇందుఁ బాదాదిప్రాసలు రేఫ సంయుక్తములుగాను ప్రాస యతిలోనివి రేఫరహితములుగా నున్నవి.

పద్మపురాణమునందు—

క. శ్రీకర చక్రాంకితులగు
లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీ క్రియలు లేక యుండినఁ
బ్రాకృతులనఁ బతితులనఁగఁ బడుదురు జగతిన్. 321

వి. ఇందు మూఁడవ పాదమున రేఫసంయుక్త కకార ప్రాసయు దక్కిన పాదముల రేఫసంయుక్తము కాని కేవల కకార ప్రాసయుఁ గలవని యెఱుంగునది. నాల్గవ పాదమున 'ప్రాకృతు' లను చోటఁ బ్రాసాక్షరము ఋకార స్వరవిశిష్టమేకాని రేఫ సంయుక్తముగాదని యగయునది.

లకార శ్లిష్టమునకు రాఘవపాండవీయమున (పీఠిక. 8)

శా. లోక త్రాణరతిం దదాదిమ మహీలోక ప్రవేశోత్క భా
షాక్లప్త ప్రథమ ద్వితీయపద గుంజన్మంజు మంజీర గ
ర్జా కల్పామలరామ భారత కథాసర్గంబుల న్మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థ సంసిద్ధికిన్. 322

వి. ఇందు రెండవ పాదమున ౠకార స్వరవిశిష్టమైన కకారము ప్రాసలో నున్నది. తక్కిన మూఁడు పాదములలోని ప్రాసకకారము ౠకారస్వరవిశిష్టము గాదు. అయ్యవి అకారేకార స్వరవిశిష్టములు.

ఇది యిట్లుండఁగా అప్పకవి దీనిని లకారశ్లిష్టమున కుదాహరించెను. ఇది లకారశ్లిష్టముగాదు. 'క్ల' - సంయుక్తాక్షరముగాదు. 'క్లి, క్లృ' వంటి ప్రాణి వర్ణము (అచ్చుతోఁగూడిన హల్లు). 'లోక-షాక్ల' అనుచోటఁ బ్రాసవర్ణము క్ కారవ్యంజనము; దానిమీఁద అకార ౠకార స్వరములు నిలచియున్నవి. స్వర భేదము మాత్రమే యిందున్నది. 'ప్రాసములకెల్లఁ దుల్యాక్షరంబులైనఁ జాలు స్వరభేదమైన దోషంబు' లేదని యప్పకవి యనుశాసన మున్నదిగదా (289 ప.) 'క-క్ల' ప్రాస యీ 289 పద్యలక్షణముచేతనే గతార్థమగును. ౠకారస్వర మును లకార వ్యంజనముగా భ్రమించినాఁ డప్పకవి యని తోఁచెడు. ౠకార శ్లిష్టమునకే యప్పకవి యుదాహరించి యుండరాదా యను శంక కలుగవచ్చు. ఇది సంయుతాసంయుత ప్రాసయగుటచేతను ర ల లు తమ క్రింద జడ్డలై గొలు వ్రాలు అని లక్షణము వ్రాసి, మెండుగాఁ జొచ్చె నీకు నైదేండ్లు - అని స్వీయలక్ష్య మొసఁగుటచేతను, నాతడు క్లప్తశబ్దస్థకారము లకారశ్లిష్టమనియే

పొరపాటున నెన్నొననక తప్పదు. (పామరులు క్లృప్తశబ్దమును క్లుప్తమని లకార సంశ్లిష్ట శబ్దముగా వ్రాయుదురు. లాక్షణికాగ్రేసరుఁడైన యప్పకవి కీ ప్రమాదమెట్లు కలుగెనో?) 'ప్రమాదోఽధీమతామపి' యను నభియుక్తోక్తి కలదు గదా? "కాళిదాసమయూరాది కవుల కెల్లఁ గలవు తప్పులనంగ నన్యులకులేవె' యని యప్పకవియే కృత్యాదిలోఁ జెప్పినాఁడు. అప్పకవిగారి యీ పొరపాటును గమనించి కాఁబోలుఁ గూచిమంచి తిమ్మకవి 'శ-క్ల' ప్రాస చెల్లుటలో సందేహమును నివారింపఁదలఁచి,

'కబ్బముల క్లృప్తియను స్వరల్కార మితర
హల్లుతోఁ బ్రాసములఁ గూర్పఁ జెల్లు మును మ
హా కవీంద్రులు గడఁగి పద్యముల నిలుపుటల' (స్వరలక్షణ-పుట 101)

అని ప్రత్యేక లక్షణము స్పష్ట ప్రతిపత్తికై రచించి పై రాఘవ పాండవీయ పద్యమునే లక్ష్యముగాఁ జూపెను. తరువాతి వాఁడగురంగకవి ఌ వర్ణము ఋ వర్ణమువంటిదే కాన నీ పద్యమును ఋ యుతాయుత ప్రాసక్రింద సంగ్రహించెను.

విశే. అప్పకవి ఌకారశ్లిష్టమును లకారశ్లిష్టముగా భ్రమించినందున సంయుతాసంయుతప్రాసలో రేఫముతో లకారమునుజేర్చి లక్షణము రచించి యందుల కనుగుణముగ స్వీయలక్ష్యమును వ్రాసిచూపెను. (315 ప.)

అప్పకవి వ్రాసిన 'మెండు-ఏండ్లు' వంటి లకార సంయుతా సంయుత ప్రాసకుఁ బూర్వ ప్రయోగము మృగ్యము.

మీఁదు మిక్కిలి 'పొఁడి ద్రచ్చఁగ' నను నప్పకవి లక్ష్యపద్యమునకు నీక్రింది యనంతుని పద్యము మూలమని యూహింపవచ్చును.

ఆ॥ పొడి మరగి బ్రతుకు-వాండ్రిలవ్రేతలు
వాండ్ర నెన్నలేల । తండ్రి యనఁటి
పండుకొఁలకు వింత । యిండ్లకుఁబోకు కృ
ష్ణుండు నీకు బ్రాఁతె । పండ్లు నిచట (ఛందో. 1-54)

ఈ పరామర్శనుబట్టి యొక రేఫసంయుతాసంయుత ప్రాసమాత్రమే ప్రయోగ ప్రామాణ్యముగలది కావుటంజేసి గ్రాహ్యమని లకారశ్లిష్ట ప్రాస యంగీకార్యము గాదని తెలియనగును.

## 6. రేఫయుత ప్రాసము

ఆ. సుకులు తెలుఁగులందుఁ బొడమ, వాక్కైవడి
ప్రాలు కొమ్ము ప్రకార । వడులుగాన
రేఫయుత సమాఖ్య । గృతులఁ బ్రాసములగు
సొరిదిఁ దమకుఁదాము । సుడులఁబాసి. 323

క. సంగ్రామ రంగమునఁ బెలు
చంగ్రుమ్మరుచున్న సాల్వ । జగతీవరు మే
నంగ్రుచ్చిపార నాటిం
చెంగ్రూరాస్త్రములు నాల్గు । శ్రీకృష్ణుఁడొగిన్. 324

క. ఈ క్రకార వలుకునకు మొద
లై క్రాలుచుఁదేలి ప్రాస । మగుఁ దనతన కే
శ్రీ క్రొమ్ముడి సౌందర్యము
వా క్రువ్వందరమె యురగ । వరునకునైనన్. 325

వి. 323 - తెలుఁగు శబ్దములందు వట్టువసుడులుండవు. తెలుఁగనఁగా నిందచ్చ తెనుఁగు; తత్సమేతరభాష. తత్సమములందు ఋకారము వట్టువసుడి గలదు (కృష్ణ, కృప - ఇత్యాదులు). అచ్చతెనుఁగులో వ్రటువసుడి యుండదు. ఉచ్చారణలో వట్టువసుడివలె వినఁబడునని క్రారకొమ్ములు, 'క్రుమ్మరు' ఇత్యాదులలోని 'క్రు' వర్ణము 'కృ' వర్ణమువలెఁ బామరులచే నుచ్చరింపఁబడును. ఇది క్రార కొమ్ముగలది. అనఁగా ఉకారస్వరవిశిష్ట రేఫ సంయుక్తము గలది, గాని ఋకారస్వరవిశిష్టము గాదని యెఱుంగనది. ఇట్టి క్రారపడులుగల హల్లులనే వట్రసుడులను గలపక యన్నిపాదములందుఁ బ్రాసస్థానములఁ గూర్చుట రేఫయుత ప్రాసమనఁబడునని యీ లక్షణ తాత్పర్యము.

324 ఇది రేఫయుతప్రాస కప్పకవి చూపిన స్వీయలక్షణము.

'సంగ్రామ - చంగ్రుమ్మరు - నంగ్రుచ్చి - చెంగ్రూరా' ఇందు నాలుగు పాదములలోను బ్రాసలో క్రారవడితోడి గకారమే కూర్పఁబడి యున్నది. రేఫయుత మనఁగా క్రారవడితోఁ గూడినది.

విశే. తమకుఁదాము సుడులఁబాసి యని యప్పకవి చెప్పుటచే సుడులతోఁ గ్రారవడిసి ప్రాసమైత్రి వేయరాదని చెప్పవలసివచ్చును. కాని సంయుతాసంయుత

ఏకపదమందు వర్ణాద్యంబగున సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరము గురు వగును. ఉ. చక్రము, వాక్రుచ్చు-ఇందు మొదటి పదములోని హ్రస్వచకారము సంయుక్త పూర్వమగుటచే గురువయ్యెను. రెండవ పదములోని వకారము తనంత దీర్ఘమగుటచే గురువే యగును; మఱి సంయుక్తపూర్వమగుటను గురువేయగును. తెలుఁగు శబ్దమైనను వాక్రుచ్చులో క్రకార సంయుక్తము మధ్యలో నుంటచేఁ బూర్వాక్షరము గ్రాఁది పలుకఁబడును.

అచ్చిక సమాసమందును మిశ్రసమాసమందును నుత్తరపదాదిలో సంయుక్తమున్నను బూర్వాక్షరము గురువుగాదు. ఉ॥ ఎల్లి పెగ్గడ, తల్లిప్రేమ. సాంస్కృతిక సమాసములందు సాధారణముగ సంయుక్త పూర్వాక్షరము గురువే యగును. అందుఁగూడ రేఫసంయుక్తమునకు (క్రారవడికి) ముందున్న యక్షరము వికల్పముగ గురువగుట గలదు.

క. అపనిజము వలన నమ్ముని ప్రపరు పృథాత్మంగతలము
పైవడిఁబడియెన్. (భార-సభా-1-143)
ఉ. కావునఁ గామక్రోధములఁ గ్రాచుచు (భార-శాంతి)
చ. కృపకృతవర్మలింగడిమిఁ గిట్టి శిఖండి ప్రభద్రకుల్ (భార-శల్య)

## 7. లఘుద్విత్వప్రాసము

తే. భువి లఘుద్విత్వసంజ్ఞి కం। బులయి కొన్ని
యూఁదబడని క్రారలతోడ । నొక్కటికొక్కటి
ప్రాసముల కగుఁ దమలోనఁ । బక్రతయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిమ్ము । లద్రువననఁగ. 326

వి. క్రారవడులు కొన్ని పదమధ్యములో నున్నను నూఁదఁబడక తేలఁ బలుకఁబడునేని అనఁగా పదమధ్య రేఫసంయుక్తములు పూర్వాక్షరములకు గురుత్వమును గలిగింపకుండునేని. యట్టి క్రారలు ప్రాసలోనున్నపుడన్ని ప్రాస స్థానముల లోను నూఁదఁబడని క్రారలే నిలుపవలయును. ద్విత్వమనఁగా నిందు జడ్డ; సంయుక్తమని యర్థము. పూర్వాక్షరమునకు గురుత్వము నీయక లఘుత్వము నిచ్చు ద్విత్వము (సంయుక్తము) ప్రాసలోఁ గూర్పఁబడుటచే దీనికి లఘుద్విత్వ ప్రాసమను పేరన్వర్థము.

326 ఇందు నాల్గవపాదమునఁ బ్రాసయతిలో ట్రిసిక లక్ష్యమూ గూర్పఁబడినది. 'విద్రుచు, అద్రుచు' అనుశబ్దములలో 'ద్ర' ప్రాసలోనున్న సంయుక్తాక్షరము. దీనికి పూర్వమునున్న యక్షరములు తేల్చ పలుకఁబడును: అవి గురువులుగావు. విశే. ఈ ప్రాసభేదము చెప్పుటకుఁ గారణము గలదు.

తెనుఁగున 'అ్రదుచు, ఎ్రదుచు, ప్రదుచు, వి్రదుచు క్రదుచు' మున్నగు శబ్దమందలి సంయుక్త పూర్వాక్షరములు లఘువులు.

'చక్పరక రువర్ణంబునకు ముందఱ దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు (బాల-ప్రకీర్ణక-20).

అదురు + చు - ఉత్వలోపముచే 'అ్రదుచు' అను రూపము గలుగును. ఇది యాచ్ఛిక శబ్దవిషయము. 'అద్రి, విద్రుమ' ఇత్యాది తత్సమ శబ్దములందు సంయుక్త పూర్వాక్షరములు గురువులే. కాన 'అద్రి, విద్రుమ' ఇత్యాది గురుపూర్వక ద్విత్వముఁ తో 'అ్రదుచు, వి్రదుచు' మున్నగు లఘుపూర్వక ద్విత్వములను ప్రాసలో మైత్రి చేయరాదని తెలుపుటకే యీ ప్రాసభేదము చెప్పఁబడినది.

అప్పకవి దీనికి స్వీయలక్ష్యమును జూపెను. ఈ క్రింది యుత్తరహరివంశ పద్యము చక్కని లక్ష్యము కాఁగలదు.

చ. ఎ్రదిచిన కాలపాశమున । నిగతి నీ మదఁ గ్రోధ వల్లికం
బ్రదిచినవారు మున్నితఁడ । బాణపరంపరవైవ మిఙ్గుఖుల్
వి్రదుపఁగఁ దత్ప్రాణంబుల ద । విం జరితార్థులుగా శరీరపుం
ఱ్రిదుపలు చేరఁ దత్సుతుల । చేతులఁ గాకకులంబు వాతులన్.
(ఉ. హరి-4-109)

ఈ పద్య మప్పకవి కంటఁబడలేదేమో?

## 8. వికల్పప్రాసము

తే. పంచవర్గంబులను గను । పట్టునట్టి
పొల్లు లనునాసికాక్షరం । బులను గదిసి
తమదు పంచమములుఁ దృతీ । యములునగుచు
నమరుఁ బ్రాసంబులకు విక । ల్పాహ్వయముల. 327

తే. ప్రాజ్ఞగ సమానధృతి సుధా । రుజ్ఞి భాస్య
ప్రసజ్ఞి చయసక్తకంఠ దా । వాగ్ని పాయి
వాఙ్మనోహరనుత యస । దృఙ్మహాత్మ
దిఙ్మ హితకీర్తి యర్జున యుగ్మభేది. 328

వి. (అయిదు వర్గములలోని పొల్లు హల్లులు అనఁగా కచటతపలు (స్వరముతోఁ జేరనివి) అనునాసికములు పరంబులగునపుడు వర్గములోని పంచ

మాక్షరములుగానో (ఙ ఞ ణ న మ) తృతీయాక్షరములుగానో (గ జ డ బ) వికల్పముగ మాఱును దీని కనునాసిక సంధి యని పేరు. (ఈ సంధి వికల్ప విరమణములలో ముందు వివరింపఁబడినది) ఈ సంధిలో వర్గతృతీయ పంచమాక్షరము లుభయ మాదేశమగుటచేఁ బ్రాసలో నీ యుభయ విధాక్షరములకు మైత్రి గూర్పవచ్చును) దిక్ + మహిత దిఙ్మహిత, దిగ్మహిత అని వికల్పముగ రెండు రూపము లుండును. ఇట్టిచోట ఙకారమునకుఁగాని గకారమునకుగాని ప్రాస చెల్లును. ఇది వికల్పసంధి విషయముగాన ముందు వికల్పవిరమణమని పేరు పెట్టినట్లు ఇందు దీనికి వికల్ప ప్రాసయని నామకరణ మొనర్చె.

ఇందులకు 328 పద్యము కవి లక్ష్యము.

ఇది యాటవెలఁది కానఁ బ్రాసయతిలో లక్ష్యముగలదని యెఱుంగునది.

1. పా॥ ప్రాఙ్నగ — రుఙ్నిభాస్య—
ప్రాక్ + నగ—ప్రాఙ్నగ, రుక్ + నిభ-రుఙ్నిభ—ఇందుభయత్రఁ బంచమాక్షరము లాదేశములై యున్నవి. ఇది సమప్రాస.

2. పా॥ స్రఙ్నిచయ—దా + వాగ్ని
స్రక్ + నిచయ—స్రగ్నిచయ, స్రఙ్నిచయ—
ఇందు వర్గ తృతీయాక్షరాదేశము వికల్పముగాఁ గలదు గాన ఙ కారమునకు గకారము ప్రాస చెల్లినది. ఇది యసమప్రాస.

3. పా॥ వాఙ్మనో - దృఙ్మహాత్మ
వాక్ + మనో, దృక్ + మహా—రెంటియందు సంధిలోఁ బంచమాక్షరాదేశము - ఇది సమప్రాస.

4. పా॥ దిఙ్మహిత—యుగ్మ.
దిక్ + మహిత్ — దిగ్మహిత యను రూపములో గకారమున్నది గాన దిఙ్మహిత యను వికల్పరూపములో ఙకారముతో గకారమునకుఁ బ్రాసమైత్రి చెల్లుచున్నది.

విశే. 'దిఙ్మహిత' యను రూపమేకాక 'దిగ్మహిత' యను వర్గ తృతీయాక్షరాదేశరూపము వికల్పముగా నుండు కారణమున 'యుగ్మ' శబ్దములోని 'గ్మ' వర్ణము 'ఙ్మ' వర్ణముతోఁ బ్రాస చెల్లుబడి యయ్యెను. వికల్ప సంధిరూపమున్నప్పుడు దీనిని 'దిగ్మహిత-యుగ్మ' యని సమప్రాసగానే వ్రాసికోవచ్చుఁగదా? 'దిఙ్మహిత' యను రూపము నిల్పి యీ వికల్పసంధి విధానము చెప్పుట యనవసరమేకదా? వికల్పసంధివ్యాజమునకుఁ నిట్టి సంధిలేని సిద్ధ వర్ణములకి ప్రాసచెల్లునన్ననే యీ ప్రాస భేదమునకుఁ బ్రయోజనముండును. 'సన్మునిస్తుత

చారిత్ర + పద్మనేత్ర' యనుచోట్ల వికల్ప ప్రాసచెల్లును. ఇట్లు చెల్లుటకు 'సద్మని' యను వికల్ప రూపముండుట కారణము. 'సద్మని' యని నిలిపి 'సద్మని' యను రూపమున్నది గనుకనని చెప్పుటకన్న నిందు 'సద్మనిస్థిత' - 'పద్మనేత్ర' యని సమప్రాస వ్రాసికొన్న వీలుండఁగా నీ యనవసర లక్షణ విధానము లేల? అట్లు గాక 'జన్మ జన్మలఁ దలఁతుస్నిగ్ధ + పద్మనేత్ర' యను కల్పితోదాహరణతో జన్మలో వికల్పసంధిలేదు: వికల్పసంధి వ్యాజమున నిట్టివాని కీ ప్రాస యంగీకరింతుమేని వికల్ప ప్రాసమునకు సార్థకత యుండునని మా యభిప్రాయము.

అప్పకవి యితర కవి లక్ష్యము చూపలేదు. అందులకొకటి-

క. అగ్నిహతిఁ జేసి మానవ
భుఙ్నివహము - (భార-ఆది-7-153)

టీ 328 ప-సుధారుక్ + నిభ + ఆస్య - చంద్రునిఁబోలు మొగము గలవాఁడా; స్రక్ + నిచయ పుష్పహార సమూహము, దావాగ్నిపాయి — కార్చిచ్చు మ్రింగినవాఁడా. అసదృక్ + మహాత్మా సాటిలేని మహాత్ముఁడా, అర్జునయుగ్మ-మద్దిచెట్ల జంట.

## ఉభయప్రాసము

ఆ. ధాత్రిఁ బాణినీయ । సూత్రములను దృతీ
యోష్మమును ద్రుతంబు । నొక్కచోటఁ
గ్రమత షాక్షరము ణ । కారమునై ప్రాస
ములకు నుభయసంజ్ఞ । బొసఁగు రెండు. 329

వి. సంస్కృత వ్యాకరణ సూత్రములచే నాదేశములగు షకార ణకారములకు శబ్దగత కేవల సకార నకారములకు, నట్లే కేవల షకార ణకారములకును గ్రమముగాఁ బ్రాసమైత్రి చెల్లును. దీనికి నుభయప్రాస యని పేరు.

తృతీయోష్మము-సకారము (శ, ష, స లు ఊష్మములు) ద్రుతమునకారము. పాణినీయములోని 'ఆదేశ ప్రత్యయయోః' అను మున్నగు సూత్రములచే సకారమునకు షత్వమును, 'రషాభ్యాంనోణస్సమానపదే' ఇత్యాది సూత్రములచే నకారమునకు ణత్వమును గలుగును. ఇట్టి మార్పునుబట్టి యాదేశమైన షకారము సహజషకార సకారములతోను బ్రాస చెల్లును. అట్లే యాదేశ ణకారము సహజణకార నకారములతోఁ బ్రాస చెల్లును. ఇం దుభయాక్షరములు చెల్లుటచే నుభయప్రాసయను పేరు గలిగె.

త్రైశంకవ్యాఖ్యానమునందు—

క. ఝష కేతు ద్విషునకుఁ గి
ల్బిషపర్వత వృషున కమృత । విషనిధి జామా
త్రిషునకు ఋషి పూజితునకు
విషమాక్షున కింద్రముఖ ది । విజపతునకున్. 330

వి:వి + సమ - విషమ; ఇందలి షకారము వ్యాకరణ సూత్రముచే నాదేశమైనది.

4. పా॥ విషములోని షకార మాదేశము: 1, 2, 3 పాదములలోని (ఝష. కిల్బిష. త్రిష) షకారము శబ్దగత సహజ షకారము. ఆదేశ షకారమునకు సహజ షకారమునకుఁ బ్రాసమైత్రిగాన నిది యుభయ ప్రాసకు లక్ష్యమయ్యెను.

సాంబవిలాసమునందు—

క. వసుధా కళత్రునకు సా
రసదళ నేత్రునకు మరుద । రాతిమద తమో
విసరాంబుజ మిత్రునకు
న్విషమ శిలీముఖసహస్ర । నిభ గాత్రునకున్. 331

వి. నాల్గవ పాదమున విషమశబ్దములోని యాదేశ షకారమునకు మొదటి మూఁడు పాదములలో సకారమునకుఁ బ్రాసమైత్రి.

తే. ప్రాణములఁబాపె నాహవ । క్షోణియందుఁ
బ్రాణవల్లభఁ గొనిచన్న । దాన వేంద్రుఁ
దమ్ముఁడును దాను గిరిజా । తమ్ముతోడ
శరధి బంధించిదాఁటెదా । శరధి యనఁగ. 332

వి. ఇది న - ణ ప్రాసకుఁ గవి స్వీయలక్ష్యము (స-శ ప్రాసకు స్వీయ లక్ష్యమొసఁగలేదు; కారణమేమో?)

ప్ర + అన-ప్రాణ-నకారమునకు ణత్వమాదేశము.

1 పా॥ 'ప్రాణ' లోని యాదేశ ణకారమునకు 'క్షోణి' లోని సహజ ణకారమునకుఁ బ్రాసమైత్రి.

2 పా॥ ఆదేశ ణకారమునకు (ప్రాణ) కేవల నకారమునకు (దానవ) ప్రాసమైత్రి.

ఇతరుల లక్ష్యములు—

ఉద్యోగపర్వమునందు—(1-299)

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు । ద్రోణసుతుండును గర్ణ
శల్యులున్
బ్రాణము లాసుయోధనుని । పాలివయం ద్రడు నిజానుజన్ముల
క్షీణ పరాక్రము ల్సుతు ల। జేయులు బాహ్లిక సోమదత్తు లా
స్థాణునకైన నోదరు వ। శంబె జయింపఁగ వారినేరికిన్. 333

వి. ఇందు 2 పా. స. ప్రాణశబ్దములోని యాదేశ ణకారమునకుఁ దక్కిన పాదములలోని సహజ ణకారములకుఁ బ్రాసమైత్రి చేయఁబడియున్నది.

కాళహస్తి మాహాత్మ్యమునందు - (1-109)

మ. ప్రణతుల్సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడులో ।పాముద్రతోఁ
గూడి ద
క్షిణకైలాసము అంబికాహర కృత । శ్రీపాదుకా న్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్ భవమహా । మయావిపర్యాసమున్
గణనాతీత నటీవిలాసము సమ । గ్ర శ్రీసముల్లాసమున్. 334

వి. మొదటి పాదములో ప్రణతి (ప్ర+నతి) శబ్దములోని యాదేశ ణకారమునకును దరువాతి మూఁడుపాదములలో సహజ ణకారమునకు బ్రాసమైత్రి చేయఁబడినది.

కాశీఖండమునందు - (2-150)

క. త్రిణయనుని రాణివాసము
నణిమాద్యైశ్వర్య వితర । ణామరతరువున్

మణి కర్ణిక ముక్తివధూ
మణికర్ణికఁ దలఁచె మౌని । మానసవీధిన్ 335

వి. త్రి+నయన—త్రిణయన

ఇందు మొదటి పాదములోని యాదేశ ణకారమునకుఁ దక్కిన పాదముల లోని సహజ ణకారమునకుఁ బ్రాసమైత్రి.

రామాయణమునందు - (యుద్ధ - 554)

చ. రణమున నుగ్రసాయక ప । రంపర భానుకులం బరామల
క్ష్మణము జగంబవానరము । గా విలు నేర్పును మద్భుజా విజృం
భణమునుజూపి తండ్రి మదిఁ । బుట్టినచింత దొలుగఁబెట్టి శూ
ర్పణఖకు నిట్లు వాటిలిన । బన్నము నీఁగుదు నేనవశ్యమున్.

వి. ఇందు నాల్గవ పాదమున శూర్పణఖ (శూర్ప + నఖ) యనుచోటఁ గల యాదేశ ణత్వమునకు దక్కినచోట్ల సహజ ణకారములకు బ్రాసమైత్రి.

మధుసేవనమునందు—

కం. పోనుద్యోగముఁ జేసిన
ప్రాణంబా యింక నీకుఁ । బాథేయం బీ
మానిని మందస్మిత మధు
రానన చంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 337

వి. ప్ర+అన - ప్రాణ.

రెండవ పాదములోని యాదేశ ణకారమునకుఁ దక్కిన పాదములలోని కేవల నకారమునకుఁ బ్రాసమైత్రి.

శృంగారషష్ఠమునందు —

క. అనుటయుఁ గృష్ణద్వైపా
యన తనయుం డిట్టులనియె । నవహిత మతియై
వినుమతి గుహ్యము నారా
యణ కవచము భక్తవాంఛి । తార్థ ప్రదమున్. 338

వి. నార + అయన - నారాయణ.

మొదటి మూఁడు పాదములలోనున్న 'చక్రీశౌరి' యకారద్వయసహితము నాల్గవ పాదమునందున్న యాదేశ ణకార ద్వయముసకుఁ బ్రాసమైత్రి.

266

అరణ్య పర్వమునందు - (4-38)

చ. కనకగిరిం బ్రదక్షిణము । గా శశిభాస్కర తారకాగణం
బనవరతంబు ద్రిమ్మరు మ । హామునిసప్తక మండలంబుతో
ననఘ తదీయశైల శిఖ । రాగ్రమునందుఁ బయోరుహాసన
త్రిణయన విష్ణులుండుదురు । దేవగణంబులు గొల్చు చుండఁగన్. 339

వి. ఇందు నాల్గవ పాదములోని త్రిణయన శబ్దగతాదేశ ణకారమునకు (త్రి+నయన) తక్కిన పాదములలోని కేవల నకారమునకుఁ బ్రాసమైత్రి.

విశే. వావిళ్ళవారి యప్పకవీయ గ్రంథములో 335-339 పద్యములలోని 'త్రిణయన' శబ్దములోని ణత్వమును గూర్చి యథస్సూచిలో, 'ఇచ్చట ణత్వము కాదు, కాని శ్రీనాథుఁడు ప్రయోగించినందున సాధుత్వము కల్పనీయము లేక సామాన్యముగ నణలకుఁ బ్రాసమైనను ఒప్పు కొనవలసివచ్చును' అని, ఇచ్చట ణత్వ ప్రాప్తి కవకాశములేదు: కాని వ్రాఁత ప్రతులందు ణత్వమే కనఁ బడుచున్నది' అని గిడుగువారు వ్రాసియున్నారు.

'పూర్వ పదాత్సంజ్ఞాయామగః ఋషాభ్యాం నోణస్సమానపదే' - అను సూత్రములంబట్టి (త్రి+నయన త్రిణయన) త్రిణయనశబ్దములో ణత్వము వచ్చును. (సంజ్ఞావాచ్యమగునేని పూర్వపదస్థములగు ఋ - ర — షకారములకుఁ బరమైన నకారమునకు బహుళముగా ణత్వము వచ్చును-తత్సమచంద్రిక) కాని యిది యీ విధికి భిన్నముగా క్షుభ్నాదిగణమునఁ బఠింపఁబడుటచే ణత్వనిషేధము చెప్పఁబడును. అప్పట్టున త్రినయన రూపమే సాధువందును. పాణినీయ పారంగతుఁడైన శ్రీనాథుని ప్రయోగ మప్రమాణమని నిరాకరింప వీలులేదు. 'త్రినయన, త్రిణయన' అను రూపద్వయము గలదని వ్యాకరణ మహాభాష్యాదులవలనఁ దెలియ నగుచున్నది. మీఁదు మిక్కిలి త్రిణయనశబ్దము సంజ్ఞయగుటచే ణత్వ ప్రాప్తి కవకాశము గలదు. అదియునుగాక తెలుఁగుకవులు సంస్కృత వ్యాకరణ (పాణినీయ) నియమము నతిక్రమించి ప్రయోగించుటయుఁ గలదు.(ఉదా॥ అంధతము, ప్రౌఢిమ, గీష్పతిః దుర్జయః ముష్టాముష్టి ఇత్యాదులు.)

ఈ ప్రాసభేదములో గమనింపవలసిన యంశము గలదు.

వ్యాకరణ సూత్రములచే నాదేశమైన షకార ణకారములకు సహజ సకార నకారములతోను, సహజ షకార ణకారములతోను గ్రమముగఁ బ్రాస చెల్లునని యప్పకవి లక్షణ మనుశాసించుచున్నది.

330 ష-ఝష - విషమ - సహజాదేశ షకార ప్రాస.

331 సి-వసుధ - విషమ సహజ సకారమునకు నాదేశ షకారమునకుఁ బ్రాస.

332 ష- ప్రాణ - క్షోణి - ఆదేశ సహజ, ణకార ప్రాస.

ప్రాణ - దాన ఆదేశ ణకార సహజ నకార ప్రాస.

ఇట్టి తక్కిన లక్ష్యములందు గ్రహించునది.

ఇట్టి లక్షణమును బట్టి సహజ 'ష-స' లకు సహజ 'న-ణ' లకుఁ బ్రాసము చెల్లదని యెప్పకవిమతము నరయఁదగును. దీనినిబట్టి 'గుణము-మనము' అను రీతిఁ బ్రాసము గూర్పరాదని యేర్పడును. కవిత్రయ భారత విషయమెట్లున్నను సహజ 'న-ణ'లకుఁ బ్రాసమైత్రిగల ప్రయోగము లనేకములు గాన వచ్చుచున్నవి. నా పరిశీలించిన లక్ష్యములు గొన్ని దెల్పెద—

పెనఁగుతీఁగలుదొడ్డ + ఫణులుగాఁగ (నన్ని-కుమార-4-101)
గుణపాత్రులఁ బూజించి, చిన శాసనపూజఫలము (శివతత్త్వ-137)
దనుజుల...ని. ర్గుణతను (భాగవత-6-276)
మనకుఁగల యట్టి బాంధవ + గణము (మొల్లరామా-యుద్ధ-1-88)
పణసహస్రంబు దండువు + గొనఁగవలయు (విజ్ఞాన-2-130)

ఇంకను బ్రయోగములు గలవు. (చూ. నా ఛందోరీతులు-పుట 337-338) సహజ నకార ణకారములకుఁ బ్రాస చెల్లునని లక్షణము వ్రాయుట యుక్తతరము.

## 10. అనునాసిక ప్రాసము

తే. తమకుఁదాము ద్విత్వంబులై । తనరునవియుఁ
పూర్ణబిందులు డాపలఁ । బొరయునవియుఁ
గలసి యనునాసిక ప్రాస । ములను పేర
న మ లమరుఁ గావ్యములయందుఁ । దమకుఁదాము 340

క. మిన్నేఱు పాదమున ధా
తంనాభిని గుసుమశరు నె । దం గాంచిన నీ
సాన్నిధ్యము దొరుకుటకై
సన్నుతి సేయుదురు నిన్ను । సనకాదులఁజా. 341

క. తమ్ములను మల్లికా కుసు
మమ్ముల మరువాది పత్ర । మాలికలను భ
క్తిం మురసంహరు పూజలు
సమ్మదమున సలుపఁగలుగు । సకలార్థంబుల్. 342

వి. ద్విత్వము లైన నకార మకారములు క్రమముగాఁ బూర్ణబిందు పూర్వకము లైన నకార మకారములతోఁ బ్రాస చెల్లును.

శబ్దములో సహజముగనున్న నకారద్విత్వము (మిన్నేఱు), మకార ద్విత్వము (తమ్ములు) ద్రుతసంధిలోఁ బూర్ణబిందు పూర్వకము లైన నకార మకారములతో (ధాతంనాభి; భక్తిం మురసంహర) ననునాసిక ప్రాసభేదలక్షణమునుబట్టి ప్రాసకుఁ జెల్లుబడియగును.

341 ప-నకారద్విత్వమునకు, 342 మకార ద్విత్వమునకుఁ గవి యిచ్చిన యనునాసిక ప్రాసలక్ష్యములగును.

341 ప-1,3;4 పాదములలో సహజ నకారద్విత్వము ప్రాసలోనున్నది. 2 పా. లో ధాతన్ + నాభి-ధాతంనాభి యనుచో బిందుపూర్వక నకారమున్నది. నకారద్విత్వమునకు బిందుపూర్వక నకారమునకుఁ బ్రాసమైత్రి చూపఁబడినది.

342ప-1, 2, 4 పా.లో మకారద్విత్వము ప్రాసలోఁ గలదు. 3పా. లో బిందుపూర్వక మకారమున్నది, (భక్తిన్ + మురస-భక్తింమురస) అనునాసికములగు నమల మైత్రిని జెప్ప వ్రాసె గాన దీని కనునాసిక ప్రాసయను పేరుగలిగె.

విశే. ఈ సంధి విధానమునుగూర్చి యెఱుఁగఁదగిన విషయము కొంత గలదు. పై లక్షణప్రకారము 'ధాతంనాభి, భక్తిం మురసంహరు' నని యున్నదనవలెను. కాని నేఁడిట్టి బిందుపూర్వక నమలు తెలుఁగుసంధిలోఁ జెప్పఁబడవు. ఇట్టి రూపమును వ్రాయుట వాడుకయు లేదు. అప్పకవి యిటు వ్రాయుటకుఁ జింతామణి సూత్రమే యాధారము. 'లుగ్వా ద్రుత ప్రకృతికో త్పరత స్సరళేస్థిరేచ నస్యసాత్, అలుకిచ సంశ్లేషస్స్యాత్, బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్' అను చింతామణి సూత్రములవలన ద్రుతమునకు మకారపరకత్వమున బిందుత్వము విధింపఁబడినది. 'కేచిద్వదంత్యభిన్నత్వ మనుస్వారమకారయోః' అని బిందు మకారముల కభేదత్వమును జెప్పినాఁ డథర్వణుఁడు.

ఒక్క మకారవిషయమున మాత్ర మిట్టి ప్రాస చెప్పవలసియుండఁగా మన యప్పకవి మకారముతోపాటు నకారమును సైతముచేర్చి సూత్రించెను. ప్రాసలో నకారపరకత్వమున ద్రుతమునకు సంశ్లేషరూపముగలదు గాన ద్విత్వ నకార ప్రాసమైత్రి కది సరిపడుచుండుటచే బిందువిధాన మప్రసక్తము నయుక్తము ననఁదగును. ధాతన్ + నాభి - ధాతన్నాభియను రూపమున నకారద్విత్వముగలదు గదా ? కాన అప్పకవి యొక మకారమును మాత్రము చెప్పియుండుట యుక్తము. ఇందుల కప్పకవి స్వీయలక్ష్యమునే చూపెనుగాని నన్నయ భారతమున దీనికిఁ బ్రయోగ మీక్రిందిది గలదు.

లయగ్రాహి॥ కమ్మని లతాంతముల + కుంమొనసివచ్చు (ఆది 5-188)

మకారపరకత్వమున నిట్టి బిందులేఖనము నేఁడు గానరాదు. కాన నిట్టి ప్రాసవిధానమును సంరక్షింప నవ్యులగు వ్యాకర్తలు ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు'(ప్రౌఢవ్యా - సంధి -22) అని సూత్రించి కృతార్థులయిరి. వీరి మతమున్న 'భక్తిన్ + మురసంహరు- భక్తిమ్మురసంహరు, లతాంతములకున్ + మొనసి-లతాంతములకు మ్మొనసి' యను రీతి మకారద్విత్వరూపముండును. నేటి భారతముద్రణ నీ పట్టున నిట్టి మకారద్విత్వమే కాననగును.

## 11. ప్రాసమైత్రి ప్రాసము

తే. గట్టిబిందువు మీఁది బ । కారమునకు
జమిలి మా ప్రాసమైత్రి నా । జరుగుచుండుఁ
గమ్మతావులు వెదచల్లు । నంబుజములు
శంబరారాతిచేతి వా । లమ్ము లనఁగ. 348

వి. గట్టిబిందువు-నిండుసున్న, జమిలిమా - ద్విత్వమకారము. పూర్ణబిందుపూర్వక బకారమునకు (ంబ) ద్విత్వమకారమునకుఁ బ్రాస చెల్లును. దీనికిఁ బ్రాసమైత్రిప్రాస యను పేరు పెట్టినాఁ డప్పకవి. అప్పకవి వ్రాసిన పై లక్షణములోనే లక్ష్యమును గలదు. పూర్వార్థము లక్షణము ఉత్తరార్థము లక్ష్యము.

3 పా ।। కమ్మ—అంబు
4 పా ।। శంబ—లమ్మ

విశే. 'వనమ్ము—వనంబు' అని ద్విత్వమకార పూర్ణబిందుపూర్వక బకారరూపములు రెండుంటయు, 'అంబ-అమ్మ' మున్నగు తత్సమ తద్భవ రూపములందుఁ బూర్ణబిందుపూర్వక బకారము ద్విత్వమకారముగా మాఱుటయు నను కారణములచే నీ ప్రాసమైత్రి యేర్పడియుండును.

దీనికిఁ బ్రాసమైత్రి ప్రాసమను పేరంత సముచితముగా నుండునట్లు దోఁపదు. ప్రాసమైత్రిగల ప్రాసయని దీని కర్థము చెప్పవలెను. ఇట్టి యర్థమునం దౌచిత్యము కానరాదు. ప్రతి ప్రాసభేదమును బ్రాసమైత్రి గలదే కదా? అనంతుఁడు దీనికిఁ బ్రాసమైత్రి ప్రాసయని పేరిడుటచే నాతని ననుసరించి యప్పకవి యిట్లు పేర్కొనియున్నాఁడు.

దీని కితర కవిలక్ష్యము చూపఁబడలేదు.

భారతమున దీనికి ప్రయోగము కలదు.

ఇమ్ముగ నుర్వీలోక ఇను...బిం। బమ్మున...కర్ణరం

భమ్ము మ। ధూళిం దలోకపుం। దుంబరముల్ పరాశరసుతాస్ (ఆది-77)

ఇయ్యది కూచిమంచి తిమ్మన చూపిన లక్ష్యము.

నేఁటి వావిళ్ళవారి భారతప్రతిలో 'ఇంబుగ-బిం, బంబున-ర్జం, ధంబున-వం, దుంబరము' అను పాఠము వెలయుచు నిర్బాధమైన సమప్రాసగాఁ గానవచ్చుచున్నది.

## 12. ప్రాసవైరము

తే. కబ్బముల రేఫమునకు అ। కారమునకు
మైత్రి గలుగమిఁ గవి శిఖా। మణులు ప్రాస
వైర మనుచును గలవరు। వానినెందుఁ
గూర్తు-రారెండు వెఱుఁగక। కుకవిజనులు. 344

వి. రేఫ అకారములకు వైధర్మ్యముండుటచేఁ బ్రాసవైరమ్మని ర, అ లకుఁ బ్రాసను మహాకవులు కావ్యములయందుఁ గూర్పరు. ఏయే శబ్దములయందు రేఫ అకారములున్నవో యెఱుఁగక కుకవులు ప్రాసవైరమును పాటింపక ర-అ లకు ప్రాసమును గూర్తురని భావము.

'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అను చింతామణి సూత్రమునుబట్టి ర అ లకు మైత్రి గలుగదు. ఇది యెఱిఁగిన మహాకవులు తమ కావ్యములయందు రేఫ అకార ప్రాస సాంకర్యము చేయరు. రేఫ శకటరేఫ ఘటితశబ్దజ్ఞానము లేకపోవుటచేఁ గుకవులు ర అ ప్రాసము గూర్తురు.

ప్రాసవైరముగుటచే నిందులకు లక్ష్యము చూప నక్కఱలేదని యప్పకవి వదలియుండును. ఏకతరయతియందువలె లఘురేఫ శకటరేఫ సమప్రాసమునకు లక్ష్యములు చూపి యుండవచ్చును.

అప్పకవి మతమున ర అ లకు యతిప్రాస ద్వయము చెల్లవు. ఏకతర యతియందును, అగ్రాహ్య షిద్ధాంతములక్రిందను ర అ యతిని నిషేధించెను. ఇందు ర అ ప్రాసము నిరసించె.

ఏకతరయతియందు వీని మైత్రినిగూర్చి విపులముగ విమర్శింపఁబడినది. మహాకవులే ర అ యతి ప్రాసల మైత్రి గూర్చియున్నారు. కవిత్రయరచనలో

వ. 'శ్రంథగ్రంథ సందర్భే' యను ధాతువులవల్లను 'శాస్త్రద్రవిణ యోర్గ్రంథః' అని నామలింగాను శాసనమునందు నానార్థ వర్గములోపలను దవర్గద్వితీయాంతములందే అమర సింహుఁడు చెప్పుటచేతను గ్రంథిశబ్దము తనయందు రెండవ వ్రాయితవర్గమునందు ద్వితీయాక్షరమైనఁగాని ప్రాసములయందుఁ జతుర్థాక్షరములకు మహాకవి ప్రయోగములు గలుగుటవల్లను జెల్లును.

వి. 345 గ్రంథ మంథ శబ్దములలోని రెండవ యక్షరము (థ) అఘోష ప్రయత్నముగల వర్ణమేయైనను స్వవర్గములోఁ బుట్టిన నాల్గవ యక్షరముతో (ధకారముతో) మహాకవిప్రయోగముల కలిపించిజేసి స్వవర్గజప్రాస మను పేరఁ బ్రాసము చెల్లును.

346—గ్రంథశబ్దములో తవర్గద్వితీయాక్షరము(థ వర్ణ మున్న)ందులకుఁ బ్రమాణము చూపుచున్నాఁడు. పాణినీయధాతుపాఠములో గ్రంథధాతువు థకారాంత ధాతువులలోఁ బఠితమగుటచేతను (క్రంథ-విమోచనప్రతిహర్షయోః; మంథ-విలోడనే: శ్రంథ గ్రంథ సందర్భే; కుంథ-సంశ్లేషణే-అని యీ విధముగ గ్రంథధాతువు థకారాంతముల వరుసలో క్ర్యాది ధాతుగణములోఁ బఠితము): అమరసింహుఁడు నామలింగానుశాసనమున నానార్థవర్గములో గ్రంథశబ్దమును థకారాంతముల వరుసలోఁ జేర్కొనుటచేతను గ్రంథశబ్దస్థ ద్వితీయ వర్ణము థకారమగుట రూఢము. గ్రంథశబ్దమువంటిదే గ్రంథి. ఈ శబ్దములలో ద్వితీయ థకారమున్నను దీనికి నా వర్గములోని చతుర్థ ధకారము మహాకవి ప్రయోగములవలనఁ బ్రాసమైతి నందునని తెలియవలెను.

విశే. గ్రంథము-కావ్యాదిరచన, కూర్పు (గ్రంథసందర్భే-సందర్భ మనఁగా గుంభనము-కూర్పు)

గ్రంథి కంతి (రోగవిశేషము), కనుపు (గ్రంథ్యతే సంధియాపేణ బధ్యత ఇతిగ్రంథిః - గురుబాల - గ్రంథ్యతే - గ్రథి కౌటిల్యే అని యమరకోశ సుధావ్యాఖ్య)

అప్పకవి చూపిన 'శాస్త్రద్రవిణయోః గ్రంథః' అను శ్లోకపాదము అమరకోశమున నేఁడు గానరాదు. ఈ శ్లోకపాద మే యితర కోశములోనిదో?

ఈ థ ధ ప్రాసకు లక్ష్యములు చూపఁబడుచున్నవి...
ఆరణ్యపర్వమునందు- (4-160)

ఉ. అంధక వృష్ణిభోజ కుకు । రాన్వయ భూపతులెల్ల నీదెసన్
బాంధవ సౌహృద ప్రణయ । భక్తి విశేషములొప్ప నీ మనో
గ్రంథియడంగఁజేయు నెస । కంబునఁ బూనినవారు లోభమో
హాంధుల ధార్త రాష్ట్రుల న । యమ్ము మెయి న్మన కుర్వి
యిత్తురే. 347

వి. 1, 2, 4 పాదములలోఁ బ్రాసలోఁ జతుర్థ ధకారమును, మూఁడవ పాదమున (గ్రంథి) ద్వితీయ థకారమును గలవు. ఇందు థ ధ లకుఁ బ్రాసమైత్రి గావింపఁబడినది.

విరాటపర్వమునందు–(1-333)

ఉ. బాంధవ శాశ్వతవాకలిత । భావభవా భవాశబంధ సం
బంధ విరామ కామ పరి । పక్వవివేక నిరూఢ భక్త హృ
ద్గ్రంథి విభేదనా పరమ కారుణికా పరిమాణదూర దుః
ఖేంధన తవకాయితా స । మీక్షణ చైత్యమహోద్భుతాత్మకా.

వి. ఇందు 3 వా. లో గ్రంథిశబ్దములోని థకారమునకుఁ దక్కిన పాద ములలోని ధకారమునకుఁ బ్రాస గూర్పబడినది.

వ. మంథ విలోడనే యనుధాతువు కవికల్పద్రుమము నందుఁ దవర్గ ద్వితీయాంతధాతువులలోను బరిగణతమైనది గనుక మంథర శబ్దములోని రెండవ్రవాయి తవర్గమునందు ద్వితీయాక్షరమైనను బ్రాసముపట్లను బూర్వ కవిప్రయోగములు గలుగుట చేతను చతుర్థ వర్ణములకుఁ జెప్పవచ్చును.

వి. మంథరశబ్దము మంథవిలోడనే యను ధాతువువలన నేర్పడును. ఈ మంథధాతువు ధాతుపాఠములోను (క్యాదులలో - చూ. 346 పద్యవివరణము) కవికల్పద్రుమములోను థకారాంతములలోఁ బరిగణింపఁబడుటచే మంథర శబ్దస్థ థకారము తవర్గ ద్వితీయమనుట రూఢము. ఇందలి థకారమునకుఁ జతుర్థ ధకారమునకు, బూర్వకవి ప్రయోగము లుండుటచేఁ బ్రాస చెల్లునని చెప్పవచ్చును.

విశే. మందగామీతు మంథరః - అమరము. మంథధాతువునకుఁ గలఁత పెట్టుట యని యర్థము.

మంథరము - మందమైనది, విశాలమైనది, వక్రమైనది.
బలము, క్రోధము ఇత్యాద్యర్థములు గలవు.

ద్రోణపర్వమునందు - (1-88)

క. సింధురము మదోద్రేక మ
దాంధంబై వచ్చు నోజ । నాచార్యునిపై
గంధవహ సుతుఁడు గవయఁగ
మంథరగతి నెవ్వఁడాఁగు , మన యోధులలోన్. 350

వి. ఇందు నాల్గవపాదమున మంథర శబ్దములోని ద్వితీయ థకారమునకుఁ దక్కిన పాదములలోఁ జతుర్థ ధకారమునకుఁ బ్రాసమైత్రి.

ఆముక్తమాల్యదయందు - (5-158)

ఉ. కంధర నీలవర్ణ మధు । కైటభనాగసువర్ణ యోగి హృ
ద్గ్రంథిభిదోత్థభోగి వని । తాస్వన వచ్చ్వసనప్రవిచ్చిర
స్సంధివసన్నిశాపతి ర । సప్రసుతి దుగ్ధపయోధి వీచికా
మంథర కేళికాధర స । మాశ్రితపంక్తి శిరోధిసోదరా. 351

వి. ఇందు 1, 3 పాదములలో (కంధర, సంధి) ధకారమున్నది. 2, 4 పాదములలో (గ్రంథి, మంథర) థకారమున్నది. ధథలకుఁ బ్రాస గూర్పఁబడినది.

వ. బుధ అవగమనే అను ధాతువు వలనను బుధశబ్దములోని రెండవ వ్రాయి తవర్గమునందుఁ జతుర్థాక్షరమైనను ప్రాసములపట్లను బూర్వకవి ప్రయోగములు కలుగుటచేతను దృతీయ వర్ణములకు జెప్పవచ్చును. సుధాశబ్దము మొదలైన వానికిని నిటువలెనేయని తెలిసికొనునది. 352

వి. బుధధాతువు ధాతుపాఠములోఁ దవర్గచతుర్థముగాఁ బఠింపఁబడినది. బుధధాతువునుండి పుట్టిన 'బోధ' మున్నగు శబ్దములందలి రెండవ యక్షరము తవర్గ చతుర్థమగును. ఇట్టి చతుర్థ ధకారమునకుఁ బూర్వ కవిప్రయోగము లుండుటచేతఁ దృతీయ దకారముతోఁ (సరళ దకారముతో) ప్రాసమైత్రి చేయ వచ్చును. బుధ ధాతువిషయమునఁ జెప్పిన యీ ప్రాసమైత్రి సుధాశబ్దము మున్నగువానియందును జెల్లునని యెఱుంగునది. అనఁగాఁ దవర్గ తృతీయ చతు ర్థాక్షరములు (ద-ధ లు) ప్రాసమైత్రి నందునని లక్షణము గ్రహింపవలెను.

ఆదిపర్వమునందు—(2-200)

ఉ. కాదన కిట్టిపాటి యప । కారము తక్షకుడేక విప్రసం
బోధనఁ జేసి చేసె నృప । పుంగవ నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున । భస్మము సేయుము తక్షకాదికా
కోదర సంహతిన్ హుతవ । హోగ్ర మహోగ్ర శిఖాచయం
బులన్. 353

వి. ఇందు రెండవ పాదములోని సంబోధనాశబ్దము బుధధాతువువలన జనించినది. బుధధాతువునకు అవగమనము (తెలియుట) అని యర్థము. ఈ పద్యమున 2 పా. లో ధకారమున్నది. 1, 3, 4 పాదములలో దకారమున్నది. దధలకు నన్నయభట్టుచేఁ బ్రాసమైత్రి గావింపబడెను.

విశే. నన్నయ భారత భాగమున దధ ప్రాస కీయొక్క ప్రయోగమే కానవచ్చుటచే నియ్యది తత్ప్రయుక్తముగాదను నభిప్రాయముతో దీనికిఁ బాఠాంతరములు సృష్టింపఁబడెను. (సంపాదనఁజేసి చేసే నృపవల్లభః సంచోదన.... రిపుసూదన)

నరసింహపురాణమునందు—

క. వేదము లాదిగఁగల య
ష్టాదశ విద్యలకు నీవ । స్రష్టవు తత్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదనులు సమస్త ధర్మ । పాలనచతురా. 354

వి. ఇందు 1, 2, 4 పాదములలోని దకారమునకు 3 పాదములోని ధకారమునకుఁ బ్రాసమైత్రి.

విరాటపర్వమునందు—(1-301)

క. ముదమొదవ రమ్యహర్మ్యము
తుదినిలువున నిష్టసఖుల । తోడ విహారా
స్పదమగు నెలవున మెలఁగెడు
సుధేష్ణ తజ్జాలకములఁ । జూచెం బ్రీతిన్. 355

వి. ఇందు 4 పాదమున సుధేష్ణలో ధకారమునకు దక్కిన పాదములలోని దకారమునకును బ్రాసమైత్రి.

విశే. సుధాశబ్దము మొదలైనవాని కిటువలెనే యని యప్పకవి చెప్పుటచే సుధేష్ణాశబ్దములో సుధాశబ్దము పూర్వమున నున్నదని యతని యభిప్రాయమని యేర్పడుచున్నది. దీని కాతఁడు వ్యుత్పత్తి చెప్పలేదు. దేష్ణశబ్దము సుశబ్ద పూర్వకమై సుదేష్ణయైనదని తోఁచెడు. అట్లేని నిందు దధప్రాస యుండదు. ఈ పద్యము లక్ష్యము కానేరదు. ముద్రిత భారత ప్రతిలో 'సుదేష్ణ' యని వర్గ తృతీయ దకార మధ్యమముగా నున్నది.

ద్రోణపర్వమునందు—(1-135)

క. వింధ్యాద్రివోలె నాప్రతి
వింధ్యుఁ డచలితోగ్ర మూర్తి । వెలయ నిలిచి గ
ర్వాంధ్య మలరఁగను దీప్తా
వంధ్యాస్త్రము లక్కుమార । వరుపైఁబఱపెన్. 356

వి. ఇందు 1, 3, 4 పాదములలో 'ధ్య' వర్ణమున్నది. 2 పాదమున ప్రతివింధ్య శబ్దములో 'ధ్య' వర్ణమున్నది. దధలకు ప్రాస గావింపఁబడినది.

విరాటపర్వమునందు—(1-135)

ఉ. ఎండకు వానకోర్చి తన । యిల్లు ప్రవాసపుఁ జోటునాక యా
కొంటి నలంగితి న్నిదుర । కుం దఱిదప్పెను దప్పిపుట్టె నా
క్కొండను నెట్లొకో యన । కార్యముగల్గిన వేళ నేలినా
తండొకచాయఁ జూపినను । దత్పరతం బనిసేయు టొప్పగున్.

వి. ఇదియొక విచిత్ర ప్రాసమైత్రిగాఁ దోఁచుచున్నది. అప్పకవి స్వవర్గజ ప్రాసలోఁదొలుత 'థ-ధ' లకుఁ దర్వాత 'దధ' లకు మైత్రి చెప్పెను. ఈ పద్యమున 'ట-డ' లకుఁ ప్రాసమైత్రి గానవచ్చెడు. ట-డ ప్రాసమైత్రి యప్ప కవియే కాదు, ఇతర లాక్షణికులును జెప్పలేదు, 'ట-డ' లేక వర్గజములు. 'థ ద ధ' లకు జెల్లినట్లు ట డ లకును స్వవర్గజప్రాస చెల్లునని యతని యభి ప్రాయమా? ఇదమిత్థమ్మని నిర్ణయింప వీలుగాకున్నది. ముద్రిత భారత ప్రతిలో 'ఆకొంటి' అనుచోట 'ఆకొండు' అని యున్నది.

'ఎండకు.... నాకయా; కొండు నలంగుదున్'....

ఇది సమప్రాసయగును. మఱి కొందఱు 'ఆ కొండు నలంగుదున్' అను పాఠమును జెప్పి 'ద డ' ప్రాసయందురు.

ఆ కొను + దు-అకొందు, ఆకొండు - అని రూపద్వయము వ్యాకరణ సమ్మతము. దథప్రాస యప్పకవికి సమ్మతము గాదని యాతని యప్రశస్తప్రాస లక్షణలక్ష్యములవలన నెఱుఁగ నగుచున్నది.

(చూ. పద్యములు 378-380)

ఆకొందు పాఠము దథప్రాస సమ్మతముగామిచే గ్రహింపరాదు; మీదు మిక్కిలి యది స్వవర్గజప్రాసలో జెప్పఁదగినది గాదు. ఆకొండు పాఠము సమప్రాసయగుటచే లక్ష్యముగాఁజాలదు. కాన 'ఆకొంటి' పాఠమే యిందు నిలుప వలసివచ్చె; కాని 'ఆకొండు' 'ఆకొందు' పాఠములుండుటచే నీ పాఠము సయుక్తమగ్రాహ్యమనక తప్పదు. అప్పు డీ పద్యముల నుదాహరించుట సరిగా దనవలెను.

విశే. వర్ణోచ్చారణ ప్రయత్నములో బాహ్యప్రయత్నములో థకారము అఘోషమని వ్యాకరణశాస్త్రము చెప్పుచున్నది. థ ధ లకు మైత్రియున్నప్పుడు భిన్నప్రయత్నములు గలవానికి మైత్రియని యరయవలయు. ఈ ప్రయత్న భేదము భిన్నముగా నున్నను థ ఫ ల రెంటికి మహాప్రాణప్రయత్న సామ్యము గలదు. ఇట్లే ద ధ లకు ఘోషప్రయత్నసామ్యమున్నదనవలెను.

పండితుల యుచ్చారణలో నైతము ధథల సాంకర్యము వినఁబడుటయు, 'వీధి-వీథి' ఇత్యాది శబ్దములలో నుభయాక్షరము లుపయుక్తములగుటయు తెనుఁగు లిపిలో వీని భేదమంతగాఁ తెలియరాకుండుటయు నను మున్నగు కారణములచే వీనికిఁ బ్రాసమైత్రి యేర్పడి యుండునని యూహింపనగును.

అప్పకవి థ ఫ లకు, దథ లకు వర్గ ప్రాసచెప్పినాఁడు. కాని దీనింబట్టి దథ లకును జెల్లవచ్చు. రంగకవి స్వీయోదాహృతిలో నిట్టిప్రాస కూర్చి యున్నాఁడు.

'ప్రోదిది యానందరంగ భూ + నాథుకీర్తి' (రంగరాట్ఛందము-368)

## 14. ఋప్రాసము

తే. స్వరములెల్లను బ్రకృతి భా । వంబులందు
రా వెనుకవ్రాయి యగు ఋస్వ । రంబొకండు
తగు యణాదేశమున రేఫమగుటఁ జేసి
ప్రాసముల కట్లయగు వళి । పట్లగాదు. 358

క. ధారుణి ఋప్రాసమనం
గా రేఫాక్షరమునకు ఋ । కారము చెల్లున్
నారికినై నాకకుజం
బా ఋభుపతి గెలిచి తెచ్చె । నచ్యుతుఁడనగన్. 359

ఆరణ్యపర్వమునందు(3-104)

క. ఆ ఋషిపుత్త్రిఁడు గట్టిన
చీరలు మృదులములు నవ్య । శిష్టములు మనో
హారులు నాతని పృథుకటి
భారంబున నొక్క కనక । పట్టము ప్రేలున్. 360

వి. అచ్చంధియందుఁ బ్రకృతిభావమున యకారాగమమువచ్చును. ప్రకృతి భావమనఁగా ఉన్నది యున్నట్లుండుట, రా వెనుకవ్రాయి-రేఫము తర్వాతి యక్షరము యకారము. అచ్చునకు నచ్చు పరమయి సంధి వికల్పమయి ప్రకృతి భావమొందిన నప్పుడు పరస్వరమునకుఁ బూర్వము యకారాగమము వచ్చును. మేన+అత్త-మేనయత్త (దీనినే సూరి యడాగమమనివ్యవహరించె), ఋకార మచ్చేయైనను తెనుఁగు సంధియందు దానికిఁదక్కిన యచ్చులకు వలెఁగార్యము జరుగదు.

అతఁడు+ఋషి-ఇందచ్సంధి కలుగదు. తెలుఁగు సంధిలో ఋకారము రేఫతుల్యము, అనఁగా హల్లుతో సమానమనుట. మఱియు సంస్కృతమున యణా దేశసంధిలో ఋకారము రవర్ణమగును (పితృ+అంశము-పిత్రంశము). ఈకారణ మలచే ఋకార స్వరమునకు రవర్ణము ప్రాసలోఁ జెల్లును.

దీనికి ఋప్రాసయను పేరు సార్థకము.

'ఋ ర' లకుఁ బ్రాసచెల్లును గాని యతిచెల్లదని యప్పకవి సూచించి నాఁడు. ఋకారమునకుఁ గేవల ర వర్ణము యతిలోఁ జెల్లదని దీనియర్థము. ఋవడిని ఇట్టి ఇ-ఈ-ఎ-ఏ లం గూడిన రేఫ (రి-రీ-రె-రే) ఋకారముతోఁ జెల్లును. యతిలో వ్యంజనముపైనున్న స్వరమునకును మైత్రి యుండవలయు. ప్రాసలో స్వరమైత్రి యక్కఱలేదు.

359. ప-అప్పకవి స్వీయలక్ష్యము.

ఇందు మొదటి మూఁడు పాదములలో రేఫమున్నది. నాల్గవపాదమున ఋకారమున్నది. ఈ రెంటికిఁ బ్రాసమైత్రి చూపఁబడినది. అప్పకవి లక్ష్య ములో ఋప్రాసలో రేఫకు స్వరమైత్రి యక్కఱలేదని తెలుపుటకై కాఁబోలు

'ధారుణి, గారేఫ - నారి ఆ ఋభు' అని రు-రే-రి వర్ణములు ప్రాసలోఁ గూర్పబడినవి.

360 ఋ ప్రాసకు నన్నయ ప్రయోగము చూపఁబడుచున్నది.

1 పా. ఋవర్ణము, తక్కిన పాదములలోని రేఫ ప్రాసలో నిలిపి మైత్రి గావింపఁబడినది. (ఆఋషి—చీరలు.......)

విశే. దాద్యంబులు ఋ ౠ వర్ణంబులు ర ఁ తుల్యంబులని సూరి సూత్రించెను. (బాల-ప్రకీర్ణ-1), అతడు + ఋషి-ఇట సంధిలేదు. అ ఋషి-ఇట యడాగమములేదు. వచ్చెను + ఋషి-వచ్చెఋషి, వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి-ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు.

ఈ సూత్రవృత్తులబట్టి ఋకారము తెనుఁగు సంధియందు రవర్ణతుల్యమగుట స్పష్టము.

## 15. లఘు యకారప్రాసము

తే. ప్రకృతి భావంబుఁ జెందిన । ప్రాణములకు
మొదలి యంతస్థములు ప్రాసములను నిలుచు
నఱమఱలు లేక లఘు యకారాహ్వయములు
నాయజునితండ్రి ఫణిరాజ । శాయి యనఁగ. 361

కళాపూర్ణోదయమునందు—(1-92)

ఉ. ఏయెడ నెన్నఁడుం గనని । యింపులుగుల్కెడు తద్గళస్వనం
బాయతమైన కౌతుకము । నద్భుతము న్మొలపింప నెయ్యెదె
ద్దీయిది చాలఁ గ్రొత్తబళి । యింకొకమాటిఁక నొక్కమాట టిం
చాయలి నీలవేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్. 362

వి. ప్రకృతి భావము ప్రత్యయాదుల చేరని మొదటి శబ్దరూపము ఇక్కడ సంధిలో నున్న దున్నట్లుగా నుండు రూపమని గ్రహింపవలెను. ప్రాణము లనఁగా నచ్చులు. మొదలియంతస్థము-యకారము.

అచ్సంధియందుఁ తెలుఁగులోఁ బ్రకృతి భావమున యకారాగమము వచ్చును. సంధిరానిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగునని సూరి సూత్రము (బాల-సంధి-3).

ఆ + అజుఁడు-దీర్ఘాచ్ఛులకుఁ దెలుఁగులో సంధిరాదు; సంధిరానిచోట యడాగమము గలిగి 'యయజుఁడు' అనురూపము సిద్ధించును. ఇందలి యాగమ యకారము లఘువు. అంతస్థములు లఘువులు-అలఘువులు అని ద్వివిధము. అందాగమ యకారము లఘువు. సిద్ధ యకారము అలఘువు (శాయి) లఘు యకారమునకు నలఘుయకారమునకుఁ బ్రాసచెల్లును.

సిద్ధి యకారమునుగూర్చి యెట్టి శంకయునుండదు. ఆగమ యకార విషయమునఁ బ్రాసలో సందియము గలుగును గాన లఘు యకారముగూడఁ బ్రాసలో సిద్ధి యకారమువంటిదే యని తెలుపఁబూని యీ ప్రాసభేదము చెప్పఁబడినది. లఘు యకార ప్రాసమను పేరు దీనికిఁదగియున్నది. లఘ్వలఘు యకార ప్రాస మని పేర్కొనుట యుక్తతరమని యభిప్రాయము.

అప్పకవి లక్షణ పద్యములోనే చతుర్థ పాదమున లక్ష్యమును గూర్చెను.

'ఆ యజుని (ఆ + అజుని) ....ఫణిరాజ + శాయియనఁగ'

ఇది తేటగీతి తనఁ బ్రాసయతిలో లక్ష్యము చూపఁబడెను.

పాదాదిలోని 'ఆయజుని' యనుచోటనున్న ప్రాసయకారము లఘువు. యతిలోనున్న 'శాయి' లోని యకారము సిద్ధముగాన నలఘువు. ఆగమయకారము నకు సహజ యకారమునకుఁ బ్రాసయతి.

ఇందులకు 362 పద్యము ఇతర లక్ష్యము.

1. పా. ఏ యెడ (ఏ + ఎడ) లఘు యకారము.

2. పా. ఆయత-సహజ యకారము.

3. పా. ఎ ద్దీయిది (ఎద్దీ + ఇది) లఘు యకారము.

4. పా. ఆయలి (ఆ + అలి) లఘుయకారము.

ఇందు లఘు యకారమునకు సహజ యకారమునకు, బ్రాస గూర్పఁ బడినది.

విశే. స్వరసంధిఁ జెందునపుడు బహ్రుచిరముగ హల్లు దాన ప్రాసము లయ్యెనని (297) ప్రాసాక్షరమైత్రిలో మున్నే చెప్పఁబడియున్నది. దీనిచేతనే యీ లఘుయకార ప్రాస గతార్థమగును: స్పష్టార్థము మఱల నిందు చెప్పఁబడిన దని యెన్నవలెను.

## 16. అభేద ప్రాసము

గీ. రేఫమునకుఁ బైనుండు మాతృకకుఁ బెద్ద
లాయభేదాహ్వయప్రాసమై యెసంగు
ఖలజన విపక్ష జలరుహదళ నిభాక్ష
కాళియోరగ మదవనకేలి యనఁగ. 363

వి. రేఫమునకుఁ బైనుండు మాతృక (అక్షరము)- య ర ల వ యను వరుసలో రామీఁదిది లకారము. పెద్దలా- ళకారము.

లకారళకారము లభేదప్రాసచేఁ బరస్పరము చెల్లును.

ల ళ ల యతిభేదతనుగూర్చి (లళయోరభేదః) అభేద విరతులక్రింద సవిస్తరముగఁ దెలుపఁబడినది. ఆ యభేదలక్షణమును బురస్కరించుకొని యీ యభేద ప్రాసము రూపొందిన దనవలెను.

ఇందుఁ బూర్వార్ధము లక్షణము: ఉత్తరార్ధము లక్ష్యము. గీతపద్యమగుటచే లక్ష్యములు ప్రాసయతులలోఁ జూపఁబడును.

3. పా. ఖల - దళ

4. పా. కాళి - కేలి

ఇందుల కితరుల లక్ష్యములు :—

రాజశేఖరుని చరిత్రమునందు - (6-4)

శా. కేళీకాంచన సౌధవీథికల చక్కన్ దొట్లలోఁబెట్టి యో
ప్రాలేయాచల కన్యకాధవ కృపా పారంగతా నిద్ర వో
వేలావణ్యపయోనిధీ యనుచు నావిర్భూత మోదంబుతో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతా
మణుల్. 364

1. ఇందు 1 పాదమున ళకారమునకు (కేళి), తక్కిన పాదములలో లకారములకుఁ బ్రాసమైత్రి చేయఁబడెను.

రామాభ్యుదయమునందు (1-8)

ఉ. పాలును నీరు నేలుపఱుపంగల మానవుల వేదవీధి వా
హ్యాళియొనర్చు నేయలికులాలక తా సితవర్ణయయ్యు నే
బాల సువర్ణ దేహమునభాసిలు నానలుమోము వేల్పు ప్రో
యాలు ప్రవీణ మామక మహాకృతినాథుఁ గృతార్థుఁ
జేయుతన్. 365

వి. ఇందు 2 పాదమున ళకారము, తక్కిన పాదములలో లకారము ప్రాసస్థానములో నిలిచి పరస్పరము చెల్లుబడియైనవి.

తే. పెద్దలాకును దనకు నభేదమగుట
లళలకు నభేద మట్లన గలుగు కతన
క్షితిని మూఁడవ సరళంబు యతులఁ బ్రాస
ములను లఘ్వలఘులకారములకు నిలుచు. 366

వి ఇది లక్షణపద్యము, పెద్దలాకు అనఁగా ళకారమునకు; తనకు అనఁగా మూడవ సరళములలో మూఁడవది డకారము (గజడదబలు సరళములు), లఘ్వలఘులకారములనఁగా 'ల-ళ'లు.

ళకారమునకు డకారమునకు నభేదమగుట చేతను, లళల కట్లే యభేదముండుటచేతను డకారము ల ళ ల కభేద ప్రాస పేరఁజెల్లును.

ళ డ ల కభేదము. ల ళ ల కభేదముగలదు గాన ల ళ డ లు మూఁడు పరస్పరము యతిప్రాసములలో మిత్రములు. అభేదయతి ముందే చెప్పఁబడెను. ఇందుఁ జెప్పవలసినది యభేదప్రాస; కానఁ బ్రాసలక్ష్యములు క్రిందఁ జూపఁబడుచున్నవి.

విశే. అప్పకవి మతమున లఘులకారము-చిన్నలా, అలఘులకారము - పెద్దలా - ళకారము. ఇది ప్రాచీన లక్షణకారుల పద్ధతి. కాని సూరి 'తల-నెల యిత్యాదులందలి లకారము లఘువు. ఏళలు-పాళలు, త్రాళలని బహుత్వమందు ర ల డ ల కాదేశమయిన ళకార మలఘువు. వర్ణ సమమ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని యలఘు ళకారముగాదని యెఱుంగునది' యని బాల వ్యాకరణమున నుపదేశించెను. (బాల-సంజ్ఞ-18) ఈ సూత్రవక్కి యప్పకవ్యాదుల పట్టనఁ బొసఁగ నేరదని యరయునది. తళుకు, బెళుకు-ఇత్యాదులలోని ళకారమలఘువని ప్రాచీనుల మతము.

ఇందప్పకవి శడల కభేదముచెప్పి తన్మూలమున లడల కభేదము కలుగఁ బలికినాఁడు కాని ళ డ లకే యభేదముగలదని 'రలయోర్లడయోస్త ద్వల్లళయోః ఇత్యాది శాస్త్రప్రామాణ్యమువలన నెఱుఁగ నగును.

ఇఁక ళ శ డ ల ప్రాసకు లక్ష్యములు చూపబడును.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందు - (1-57)

క. జలనిధి యనుతెర మఱుఁగటు
వెడలి నిలిచినట్టి యాట। వెలఁదియ పోలెన్
గడునింపులు గులుకుచు దన
రెఁడు నీ పురలక్ష్మి యవధ। రించితె యధిపా. 367

వి. 1 పాదములో లకారము, తక్కిన పాదములలో డకారము ప్రాసలో నిలిచి చెల్లుబడి యయ్యెను.

ఉద్యోగ పర్వమునందు - (1-220)

క. కొడుకులు దానును గుఱ్ఱపు
దళములు కరిఘటలు భటర। థవ్రాతములున్
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు
గడువేడుకఁదోడు సూపెఁ। గౌంతేయులకున్. 368

వి. రెండవ పాదమున శకారము తక్కిన పాదములలో డకారము నిలిపి ప్రాసమైత్రి చేయఁబడెను.

భీష్మ పర్వమునందు - (1-93)

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱపు
దళములు పెక్కైన బలవి। తానము తగుమై
నడపించుచు మెలపున సం
గడములతో నడచు శకుని। కడు నొప్పారెన్. 369

వి. రెండవ పాదమున శకారము తక్కిన పాదముల డకారము నిలిచి ప్రాసమైత్రి చెందుచున్నవి.

శృంగార నైషధమునందు (4-24)

చ. చిలుకలు గూయునో చెవులు। సిల్లులవోవఁగనంచు నెన్నఁడున్
వెడలఁడు నందనోపవన। వీథులకై యట మౌళిభాగ ని

ర్మల శశిరేఖచేయు నప । రాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు । కోమలి నీదెసఁ గూర్మి యెట్టిదో.

వి. ఇందు 1, 3, 4 పాదములలోఁ బ్రాసస్థానములలో లకారములును 2 పాదములో డకారమును నిలిచి మైత్రి నందుచున్నవి.

కూర్మపురాణమునందు—

**తోటకము.** తాలిమి దూలిన । తాపసపత్నుల్
ప్రీడ మనంబున । వీడ్కొని జాఱన్
లోల మదాలస । లోచన పంక్తిన్
జాలఁ దలిర్చిరి। శంకరు లీలన్. 371

వి. 2 పాదమున డకారము, తక్కిన పాదముల లకారము ప్రాసలో నిలిచి చెల్లుచున్నవి.

విశే. 363, 364, 365 పద్యములలో ల-ళ ప్రాసకు లక్ష్యములు చూపఁబడినవి. అందలి దళ, కేళి, వాహ్యాళి శబ్దములలోని ళకారమునకు లకారరూపము సయితముగలదు. సంస్కృత శబ్దములలోని ళత్వమునకు లత్వముగూడ నిలుపవచ్చును. 'దల-దళ', 'కేలి-కేళి' అనురీతి ద్వైరూప్యము గలదు. ఆదిలో సంస్కృతములో లకారమొక్కటే యుండెను. గాని ళకారము చెప్పఁబడదు. మహేశ్వర సూత్రములలో ళకారములేదు. కాలక్రమమునఁ బ్రాకృత సంపర్కమున ళకారోచ్చారణము వ్యవహారమున నేర్పడుటచే ళకారము సయిత మర్వాచీనులచే వర్ణ సమామ్నాయమునఁ జేర్పఁబడెను. తెలుఁగువారు దళ, కేళి, వేళ, పరిమళ, కళంక ఇత్యాది శబ్దములలో ళకారమునే యుచ్చరింతురు. కాని వీనికి లళల ద్వైరూప్యము గలదని తెలియవలెను. దళమునకు దలమను రూపమున్నపుడు 'ఖల-దళ' అని వ్రాసికొని లళ ప్రాసయనుటకన్న 'ఖల-దల' అని గ్రహించి సమప్రాసగా నేల చెప్పరాదు? అప్పకవి యిచ్చిన లక్ష్యములందెల్ల నిట్టి లళ ద్వైరూప్యముగల సంస్కృత శబ్దములే వెలయుచున్నవి. ళత్వముగల తెనుఁగు శబ్దము నీప్రాస కుదాహరించుట సముచితము. సంస్కృత ళకారము ఈ ప్రాసకు నిర్ధారకము కాఁజాలదు.

ఈ క్రింద నన్నయ భారతప్రయోగము లళ ప్రాసకు నిర్ధారకమగును.
'ప్రల్లద మేదియిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రి తుల్యుఁడై, త్రెళ్ళుడు'-
(సభ - 269)

లడ ప్రాసకిచ్చిన లక్ష్యములలోఁగూడ లత్వ డత్వద్వైరూప్యముగల శబ్దములే చూపఁబడినవి. కాన నివియు నిర్ధారక ప్రయోగములుగావు.

366 ప-జలనిధి కడు; జడనిధియను రూపాంతరమున్నది. జడనిధియని పఠించిన సమప్రాసయగును.

368. 369-కొడుకులు- దళములు, నేటి ముద్రిత భారతప్రతిలో దడము లను పాఠమున్నది. సమప్రాస చెప్పుటకు వీలుండఁగా సభేదప్రాసగా గ్రహింప నేల ?

370-చిలుకలు - వెడలఁడు దీనికి వెలలఁడు అను రూపాంతరము గలదు. అప్పుడిది సమప్రాసమగును. కూచిమంచి తిమ్మకవియు నిట్టి యభిప్రాయమునే ప్రకటించెను. (సర్వలక్షణ-ఆ-108. పుట)

'లడలకు నభేదమనుచున్
వెడగలు గడుఁ బ్రాసములను విశ్రమముల ను
ల్పదరఁగ గలుపుదు రదియె
య్యెడలను భవ్యంబుగాదు హిమకరముకుటా.

వెలుదెస న్పదంబు వెడలుటయందు ల
క్ష్యంబు నైషధమున నరసి లడల
కిల సభేదమనుచు నలముద్దరాజు రా
మన వచించెఁ దలఁప నది హుళిక్కి.'

'చిలుకలు గూయునో' యను నైషధపద్యమున లడ ప్రాస సాంకర్యమును జెప్పు వెడలఁడను పదము సరిగాదని లడ ప్రాసకట్లు ముద్దరాజు రామన (కవి జన సంజీవనిలో) లక్ష్యము చూపుట ప్రమాదమని కూచిమంచి తిమ్మన నిరాక రించెను. ముద్దరాజురామనను జూచి యప్పకవియు దీని నుదాహరించెఁ గాఁబోలు. తిమ్మన యట్లు నిరాకరించినను లడల కభేదయతి ప్రాసలు సమ్మ తించుటలో ననౌచిత్యమేదయులేదు.

లడల కభేద మున్నప్పుడే అనఁగా ద్వైరూప్యముగల పట్టులందే యిట్టి యభేదప్రాస నుపదేశించుటలోఁ ప్రయోజనము శూన్యము. అభేదన్యాయమున నెల్ల ల—ద లకుఁ బ్రాస చెల్లు ననవలెను.

## 17. సంధిగత ప్రాసము

తే. సంధిగూడినవ్రాలు ప్రా। సంబులైన
నవియె సంధిగతాఖ్యల। నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌ। రివడవైచెఁ
జెంగిపోనీక మధురలో। నంగరినన. 372

వి. ప్రాసలో వ్యంజనము ప్రధానము గావున సంధియందు నిలిచిన యాగమాదేశ వ్యంజనములకే ప్రాసయతి పాటింపవలెను. దీనికి సంధిగత ప్రాసమని పేరు. సంధివలనఁ గలిగిన వర్ణమునకుఁ బ్రాస గూర్పఁబడును గాన దీనికి పేరు తగియున్నది.

యతి యందువలె గూఢస్వర వ్యంజనములకుఁ బ్రాస గూర్పరాదని తెల్పుటకే యీ ప్రాసభేదము చెప్పఁబడినదని యరయనగును.

పై లక్షణ పద్యములో నుత్తరార్ధము లక్ష్యము ; ఇది కవి రచితము.

3 పా. దివిజ - శౌ + రివడవైచె

'దివిజ' లోనిది సహజవకారము. శౌరి + పడవైచె-శౌరివడ వైచె-ఇందు గసడదవాదేశ సంధిచే వకారమాదేశమయ్యె - సహజవకారమునకు సంధిగతాదేశ వకారమునకుఁ బ్రాస గూర్పఁబడినది.

4. పా. చెంగి - లో + నంగిరి.

చెంగి శబ్దములోఁ బ్రాసాక్షరము పూర్ణబిందుపూర్వక సహజగకారము, లోనన్ + కరి-లొనంగరి, ద్రుతముమీఁది పరుషమునకు సరళాదేశమును, ద్రుతమునకు బిందుత్వమును గలిగినది. బిందు పూర్వక సహజగకారమునకుఁ బూర్ణబిందు పూర్వాకాదేశ గకారమునకు( ఇది సంధిగతము) ప్రాస గూర్పఁబడినది.

ఇందుల కప్పకవి చూపిన యితర లక్ష్యములు-

శల్య పర్వమునందు-(2-384)

క. కవదొనలును గాండీవము
నవలనిడం బనుపు ముంద , రరదము డగు మే
నువిదప డిగియెద శుభకర
మవు నివ్విధమిట్లు సేయు , మనుడు నతండున్. 373

వి. ఇందు 1, 2, 4 పాదములలో సహజవకారమున్నది. 3. పాదమున సంధిగతాదేశ వకారమున్నది (ఏను + పిదప-ఏనువిదప)

సహజసంధిగత వకారములకుఁ బ్రాసచెల్లినది.

విశే. పై శల్యపర్వలక్ష్యములోని ప్రాసమైత్రిని గూర్చి యొక విశేషము గలదు. ఆ విషయము సూచింపఁబడును.

ఏను + పిదప-అను శబ్దద్వయసంధిలో ద్రుతముమీఁది పరుషమునకు దేశము వచ్చి-ఏనుబిదప-అని సంధిగతరూపముండును. అప్పుడిచ్చోట 'వ-బ'

ప్రాస చేయఁబడిన దనవలె; ఇది లక్షణవిరుద్ధము. వ బ లకు యతి చెల్లునుగాని ప్రాస చెల్లదు. ప్రాచీనకవులు ఏను తాను శబ్దములఁ గళలుగా నెంచిరని, తిక్కన యందుచేతనే - ఏను విదప అని - గసడదవాదేశముచేసి సహజ వకార సంధిగతవకారములకుఁ బ్రాస గూర్చెనని కొందఱి యభిప్రాయము. ఇటీవలి లాక్షణికులు - ఏన విదప - అను రీతి గ్రహించి యవధారణార్థకము కళ గాన (ఏను+అ-ఏన) దానిమీఁది పకారము వకారమగునని మార్గాంతర మున సమర్థించెదరు. ఏను వెనుక - అను నవ్వరస పాఠాంతర మర్వాచీనులు కొందఱు సృష్టించిరి. ఈ కల్పనలో సంధిగత ప్రాసకిది లక్ష్యముగాఁజాలదు. ప్రాచీన లిఖిత భారత ప్రతులందు బూర్వముద్రిత ప్రతులందును లక్షణ గ్రంథములందును — నీ పద్యములో ఏనువిదప-అను పాఠమే వెలయుచున్నది.

కళాపూర్ణోదయమునందు —

* శా. ఆవాలుంగనుదోయి యానగు మొగం । బాగుబ్బపాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం । బాయొప్పు లేఁజెప్పినం
గై వారంబగుఁగాదె కేవలశిరః । కంపంబు గల్పించి యా
హావుట్టింపదె యిత్తుధన్వునకు న । య్యబ్జాక్షి సీక్షించినన్. 374

వి. 4 పా॥ ఆహా + పుట్టించు-ఆహావుట్టించు. ఇందలి వకారము సంధి గతము. కళలగు నవ్యయములమీఁదఁ బరుషములకు గ స డ ద వా దేశము గలుగును. 4 పాదములోని సంధిగత వకారమునకుఁ దక్కిన పాదములలో సహజ వకారములకుఁ బ్రాస చేయఁబడినది.

విరాటపర్వమునందు-(4-96)

శా. సింగబాఁకటితో గుహాంతరమునం । జేడ్పాటుమైనుండి మా
తంగ స్ఫూర్జిత యూథదర్శన సము । ద్యత్క్రోధమైవచ్చునో
జంగాంతార నివాసఖిన్నమతి న । స్మత్సేన్యపై వీఁడె వ
చ్చెంగుంతీసుత మధ్యముండు సమర । స్థేమాభిరామాకృతిన్.

వి. ఇందుఁ బ్రాసలోఁ బూర్ణబిందు పూర్వక గకారమున్నది. 1,2 పాద ములలోనివి సహజబిందుపూర్వక గకారములు (సింగ, మాతంగ) 3,4 పాదముల లోనివి సంధిగత బిందుపూర్వక గకారములు (ఓజన్ + కాంతార-ఓజంగాంతార, వచ్చెను + కుంతీసుత - వచ్చెంగుంతీసుత, ఇందు సంధిలో ద్రుతము మీఁది పరుషములకు సరళము లాదేశములై ద్రుతము పూర్ణబిందువైనది.)

---

* ఈ పద్యము కళాపూర్ణోదయమునఁ గానరాదు. శృంగార శాకుంతల ములో నున్నది. (2-187)

విశే. అప్పకవి యిందు గసడదవాదేశ సరళాదేశ సంధిగతాక్షరములకు లక్ష్యములు చూపెను. ఈ సంధిగతప్రాస యెల్లసంధులందును జెల్లునని యెఱుఁగునది.

లకారప్రాసము :—

కాకుత్స్థ విజయమునందు—

శా. మారుం డద్భుత శంఖమొక్కటిని సం । పాదించి దోర్మధ్య క
స్తూరీ చర్చనెపంబునం దనదు కే । ల్దోఫన్ సువర్ణత్వ రే
ఖాలిప్సన్ శశి కెత్తిఁజూప నతఁడు । త్కంఠోత్థుఁడై చేరనిం
పారన్ బట్టుట దోఁచెఁదద్గళము కే । శౌఘంబు మోముంగనన్.

ప. ఈ పద్యములోను 'లేఖాలిప్స' ననుచోట రభరాభస్యేయను ధాతువువలనఁ బుట్టినది లిప్సాశబ్దము గనుక సంధిగత ప్రాసమాయెను.

వి. పై పద్యములో మూఁడవ పాదముననున్న లిప్సాశబ్దము రభధాతువు నుండి పుట్టినది. రభలోని రేఫము లకారముగా మాఱినది. అట్లు మాఱిన లకారమునకుఁ దక్కిన పాదములలోనున్న 'మార, కస్తూరి, ఇంపార' అను శబ్దములోని సహజరేఫములకుఁ బ్రాస గూర్పఁబడినది. సహజరేఫకు రేఫకాదేశమైన లకారమునకు నిందుఁ బ్రాస గూర్పఁబడుటచే సంధిగతప్రాస యైనదని యప్పకవి యభిప్రాయము. ఇది 377 వచనమువలన స్పష్టము చేయఁబడినది.

విశే. పై పద్యమున రలప్రాస స్పష్టముగా గోచరించుచున్నది. అప్పకవికి రల యతిప్రాసలు రెండు సమ్మతములు గావు. ఇందలి రలప్రాసను గ్లిష్టమార్గమున సంధిగతప్రాసగా సమర్థించి కృతార్థుఁడు కాఁజూచెను. కాని యతని యీ కల్పనా సమర్థన లయుక్తములని చెప్పక తప్పదు. లభ ధాతు నిష్పన్నము లిప్స. (లబ్ధుమిచ్ఛా-డులభష్ ప్రాప్తౌ-ఇది సన్నంతము) రభధాతు నిష్పన్నము రిప్స (రబ్ధుమిచ్ఛా-రభరాభస్యే) లిప్సారిప్సాశబ్దములు భిన్నములు, భిన్నార్థకములు. పై పద్యములోని రేఖాలిప్సలోనిది లభధాతు జన్య లిప్సాశబ్దమే కాని రభ ధాతుజరిప్సా శబ్దముగాదు. రిప్స-లిప్స గాదు. లిప్స రభ ధాతు సంభవముగాఁ జెప్పుట యయుక్తము. అట్లు రలయోరభేద ఇతి శాస్త్రముచే రిప్సను లిప్సగా మార్చినను నిందు సంధివలన రేఫకులత్వము రాలేదు గాన నియ్యది సంధిగత ప్రాస గాఁజాలదు. అప్పకవి యిందెట్టి సంధి కలిమి నుద్దేశించెనో దురూహము. ఇందిది రలాభేదప్రాసయనఁ జెల్లును. రల ప్రాస లలయతి పూర్వకవి ప్రయుక్తములై కానవచ్చుచున్నవి. ఇందు లేని సంధి నున్నదని మాట వరసకుఁ జెప్పినను సంధిలో నాదేశాదిక కార్యములచే

నిలిచిన వర్ణమునకే ప్రాస గూర్పవలెను, గాని సంధి విధానమునకుఁ బూర్వమున్న వర్ణమునకుఁ బ్రాసచేయుట క్రమముగాదు. వచ్చెం గుంతి (వచ్చెను + కుంతి) - అను సంధిలో సంధిగతమైన గకారమునకుఁ బ్రాస చెల్లును గాని సంధి విధానమునకుఁ బూర్వమున నున్న కకారమునకుఁ జెల్లదుగదా? రేఖాలిప్స, ప్రాస విషయమున నప్పకవి సమర్థన మత్యంత విరుద్ధమును బ్రమాదము ననక తప్ప దని ఫలితార్థము.

## అప్రశస్తప్రాసము

ఆ. అప్రశస్తములగు । ప్రాసజాలము లలం
కార 1విస్మితములు । గావుగానఁ
దివిరి ధూర్తులైన । కవులు కల్పనఁజేసి
యొప్పిదంబు లనుచుఁ । జెప్పరాదు. 378

వి. ప్రాసములు (యతులు సయితము) తెలుఁగు పద్యములకు సహజాలంకారములు సంస్కృతమునందును సమప్రాసములు శబ్దాలంకారముల క్రిందఁ బరిగణితములగుచున్నవి. మహాకవి ప్రయుక్తములును లాక్షణిక సమ్మతములు నగు ప్రాసములే ప్రశస్తములు. అట్లుగానివి యప్రశస్తములు. వికటకవులు మహాకవి ప్రయుక్తములు గాని యప్రశస్తప్రాసములను సృష్టించి ప్రయోగించి యున్నంతమాత్రమున వానిని సమీచీనములు యోగ్యములు మనోహరములు నని చెప్పరాదు.

ధూర్తుఁడనఁగా వంచకుఁడు. అప్రశస్త ప్రాసభేదములను గల్పించి లక్ష్యలక్షణములను వాని కనుగుణముగ గ్రంథములందుఁ బ్రక్షిప్తములుజేసి తరువాతివారిని వంచింతురు గాన నట్టి కవులను ధూర్తకవులని పేర్కొన్నాఁడప్పకవి. అగ్రాహ్య విరామ ప్రస్తావమున గూడ నిట్టే వికటకవులు కొన్ని వింతలు కల్పించి యిత్యాదిగా వ్రాసినాఁడు.

ఆ యప్రశస్తప్రాసము ప్రయుక్తమైయున్న పద్యముల నీ క్రిందఁ జూపుచున్నాఁడు.

వీథి నాటకమునందు—

ఉ. కందుక కేళి సల్పెడు ప్రకారమునం బురుషాయితక్రియా
తాండవకేళి సల్పెడు విధంబునఁ* బాపరభామ లేఁతనీ

---

1. విస్ఫురములు (పాఠాంతరము)

* పామరభామ లేఁత యీరెండ - క్రీడాభిరామ ముద్రిత ప్రతిపాఠము.

రెండఁ బ్రభాతవేళ రచి।యించెను గుబ్బలఁమీఁది హారముల్
కుండలము ల్బురు ల్గదల।గోమయపిండము లింటిముందటన్. 379

వి. ఇందు 1 పాదమునఁ బ్రాసలో దకారము. తక్కిన పాదములందు డకారమున్నది. ఇది యప్పకవి మతమున నప్రశస్తమగు ద-డ ప్రాస'

రామాయణమునందు—(యుద్ధ-2356)

చ. కడుకొని వేఁడిబాష్పములు । గ్రమ్మి పయింబడి పర్వభీతిమై
నదరుచు విన్ననైన హృద।యంబునఁ బొల్పగు హారయష్టి ప
య్యెద దడియంగఁ గానఁబడి । యంచితనిర్మల రత్నభూషలన్
దదుదిత దృశ్యమానమణి।ధామసముజ్జ్వలభాతి దోఁపఁగన్. 380

వి. ఇందు 1, 2 పాదములలోఁ బ్రాసలో దకారములు. 3, 4 పాదములలో డకారములున్నవి. ఇదియు అప్రశస్తమగు 'ద-డ' ప్రాస.

విశే. ఇందు 379 పద్యములోనున్న కందుకశబ్దమునకుఁ గండుక మను పాఠమును గొందఱు పఠింతురు. కందుక కండుక శబ్దములు రెండును గలవు. కండుక శబ్దము సంస్కృత నిఘంటువులలోఁ గానరాదని సూర్యరాయాంధ్ర నిఘంటువు దెల్పుచున్నది. కాని గురుబాల ప్రబోధికలోఁ గందుక శబ్దము క్రిందఁ గండుకశబ్దము పాఠాంతరమని యొసఁగబడియున్నది. పైపద్యమున 'కందుక కేళి' యను పాఠమును బఠించిన, నందప్పకవి చెప్పిన యప్రశస్తప్రాస దొలఁగి సుప్రశస్త సమప్రాస రాణించును. ప్రకృతము ముద్రితములయియున్న వీథి నాటకము ప్రతులలోఁ (శ్రీనాథుని క్రీడాభిరామ మిదియే) 'కందుక కేళి' యను పాఠము గానవచ్చెడు. అప్పకవి మతములో 'కందుక' లేదనవలెను. అట్లున్నదని యత దెలిఁగియున్న, అగ్రాహ్యభేదయుతుల క్రింద రేఖాశబ్దము పట్టున లేఖా శబ్దమును జెప్పి సవరించిన ట్లిందును కందుకశబ్దమును జెప్పియుండును.

ఇఁక 380 భాస్కరరామాయణ పద్యమున నేఁటిముద్రణలో.

'కడుకొని వేఁడి బాష్పములు....భీతిమై, నదరుచు, య్యెద—తదుదిత' అను సమప్రాసపాఠము వెలయుచున్నది. అప్పకవినాఁటి భాస్కరరామాయణపుఁ బ్రతిలో 'కడుకొని' ఇత్యాది పాఠమేయుండి నేఁటి పండితులు ముద్రణలో సమప్రాసగా సవరించి యుందురని తలంపనగును. అప్పకవి మతమున నీ రెండు పద్యములందు నప్రశస్తద-డ ప్రాసగలదని యెన్నఁదగును; అప్పుడు తానే తన యప్పకవీయమునఁ బెక్కుచోట్లఁ బ్రామాణికులుగా గ్రహించిన శ్రీనాథభాస్కరుల నింత ధూర్తుల నిన కవులఁగాఁ జేకొనెనని చెప్పవలెను.

కందుకేత్యాది పాఠమును గ్రహించి సమప్రాసగాఁ జెప్పినను లేదా దడాభేదప్రాసగాఁ జెప్పినను దోషములేదని మా యభిప్రాయము.

ఇవి పదియేడును ప్రాసంబులు.

ఇంక శబ్దాలంకారంబులగు విశేషప్రాసంబు లెఱింగించెద.—

## శబ్దాలంకార ప్రాసములు

సీ. ప్రాసంబు సులభాక్ష । రంబైన సుకరంబు,
దుర్లభంబైనను । దుష్కరంబు,
తగ రెండు మూఁడు నా । లుగు వర్ణముల పదం
బులనెల్ల నొకభంగిఁ । బొసంగెనేని
వరుసఁగావ్యముల ద్వంద్వప్రాసమును త్ర్యక్ష
రప్రాసమును జతుః । ప్రాసమునగుఁ,
బదములఁ దుదినొక్క । పగిది యక్షరములు
దనరు నంత్యప్రాస । మునకు నెందు,

తే. జడిబడిని వర్ణ మొక్కఁడు । కడకు వెడలఁ
బలుకఁబడు నేని యది యను । ప్రాసమయ్యెఁ,
గంజలోచన యవి యలం । కార శాస్త్ర
కథితములు వీని నేడింటిఁ । గానవలయు. 381

వి. ఇంతవఱకుఁ దెనుఁగు పద్యములలో నియతముగా నుండఁదగిన ద్వితీయాక్షర సామ్యరూపమగు ప్రాసమును దద్భేదమును వివరించి, యిఁకఁ బద్యరచనలో నలంకారప్రాయములును నైచ్ఛికములు నగు శబ్దాలంకార ప్రాస విశేషములను దెలుపుచున్నాఁడు. శబ్దాలంకారప్రాసములు కవి యిచ్ఛానుసారముగఁ బ్రయుక్తములగును. 'అలంక్రియతే అనేన ఇత్యలంకారః' అని యలంకార పదవ్యుత్పత్తి. అలంకారములు కావ్యశోభాసంధాయకములు. 'శబ్దార్థౌ సహితౌ కావ్య'మ్మను కావ్యనిర్వచనమునుబట్టి శబ్దార్థముల రెంటికిఁ గావ్యమునఁ బ్రాధాన్యము గలదు. ఈ యలంకారములు శబ్దార్థముల రెంటికిఁ గలవు, శబ్దశోభను గలిగించునవి శబ్దాలంకారములు. అనుప్రాసాదులు శబ్దాలంకారములని యాలంకారికోక్తి. ఇక నీ గ్రంథమునఁ జెప్పఁబడు శబ్దాలంకారప్రాసములు ఒక యనుప్రాసము దక్కఁ దక్కినవి యలంకారశాస్త్ర ప్రోక్తములు గాదు. తెనుఁగు ఛందోగ్రంథములలో సామాన్యముగాఁ జెప్పఁబడునని యెఱుఁగు

నది. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలో ఛేకవృత్తిలాటాను ప్రాసముల షష్ఠోల్లాసమున శబ్దాలంకార ప్రకరణముక్రిందను, నీ సుకర ప్రాసాదులను సప్తమోల్లాసమున ఛందః ప్రకరణముక్రిందను వేర్వేఱ రచించెను. ఛందస్సులోఁ జెప్పబడు నీ ప్రాసభేదములకు షడ్విధప్రాసములను శీర్షిక యందొసఁగబడెను. అలంకారములలో దీని ననుప్రాసమని ఛందస్సులోఁ బ్రాసమని వ్యవహార మున్నట్లు దెలియవచ్చెడు.

ఇందప్పకవి సప్తవిధ శబ్దాలంకార ప్రాసములను వ్రాసెను.

ఆ ప్రాసములు వాని నిర్వచనములు:—

1. సుకరప్రాసము - ప్రాసాక్షరము సులభమైనది. ప్రయత్నపూర్వకముగఁ గాక యనాయాసముగఁ బ్రాస ఘటించుటకు లభించు నక్షరములు గల ప్రాసము సుకరప్రాసము. త ద న మ య ర ల వ స మున్నగు వర్ణములతోడి ప్రాస గూర్చుట సుకరము.

2. దుష్కరప్రాసము - సుకరము కానివి సులభముగా సిద్ధింపనివి బహు ప్రయత్నసాధ్యములగు సంయుక్తాది వర్ణములతోడి ప్రాస దుష్కరప్రాస మనఁబడును. ష్క, క్ష, త్ర్య, ఃక, ఃఖ, ఫ ఇత్యాది వర్ణములు ప్రాసలో దుష్కరములు.

3. ద్వంద్వప్రాసము - అన్నిపాదములయందు రెండవ మూఁడవ యక్షరములు (రెండక్షరములు) సమముగా నుండు ప్రాస. ఇందుఁ బ్రాసాక్షరమును దాని తర్వాతి యక్షరమును నాల్గు పాదముల సమముగా నుండవలెను. దీనికి ద్విప్రాసమని నామాంతరము.

4 త్ర్యక్షరప్రాసము - ప్రతిపాదమందును 2, 3, 4 అక్షరములు సమముగా నుండు ప్రాస. త్రిప్రాసమని నామాంతరము.

5. చతుష్ప్రాసము - నాల్గక్షరములు ప్రతిపాదమున సమముగా నుండు ప్రాస 2, 3, 4, 5 అక్షరములు సమముగా నుండునని యరయునది.

6. అంత్యప్రాసము - ప్రతిప్రాదమునఁ జివరి వర్ణములకు సామ్యముగల ప్రాస. ఈ యంత్య ప్రాసమింతకుముందు 289, 290 291 పద్యములలో వివరింపఁబడినది.

7. అనుప్రాసము - ఒక్క యక్షరము మొదటినుండి కడవఱకుఁ బెక్కుసారులు వెంబడి వెంబడి నావృత్తిసేయుట.

ఇం దనుప్రాస మొక్కటే యలంకార శాస్త్ర కథితము. అప్పకవి యన్నియు నలంకారశాస్త్ర కథితము లనుచున్నాఁడు.

అంత్యానుప్రాసమం దొక్కదానియందు మాత్రము వ్యంజనములయు వానిమీఁద స్వరములయు సామ్య మావశ్యకమగును. తక్కిన సుకరాది ప్రాస భేదములలో స్వరసామ్యమైచ్ఛికము; నియతముగాదు. ఇందుల కప్పకవి స్వీయ లక్ష్యముల నొసఁగెను.

## సుకరప్రాసము

క. కమలదళ నయన సకలా
గమవేద్య పురాణపురుష । కరుణాకర మ
ద్రమహీశ ప్రియతనయా
రమణ యనుచుఁబలుక సుకర ప్రాసమగున్. 382

వి. ఇందు కమ, గమ, ద్రమ, రమ అని సుకరమగు సువర్ణము ప్రాసలో నున్నది గాన నిది సుకరప్రాస.

## దుష్కరప్రాసము

క. దుష్కృత గిరివజ్రాయుధ
పుష్కరసదనాధినాథ । బుధనుత దవళో
చిష్కేశాహార యనన్
దుష్కరమని దీనిఁ బలుకుదురు ప్రాసజ్ఞుల్. 383

వి. ఇందుఁ బ్రాసలో 'ష్క' యను దుష్కరమైన సంయుక్తాక్షరము గలదు.

## ద్వంద్వ ప్రాసము

క. వ్యాసముని వినుత గోప
స్త్రీ సము దయ మానహరణ । శృంగారరసా
వ్యాసముగ నిట్లు ద్వంద్వ
ప్రాసము కావ్యములఁజెప్పఁబడు నెల్లడలన్. 384

వి. ఇందు నాల్గు పాదములలోఁ బ్రథమాక్షరమునకుఁ దరువాతి రెండక్షరములు (సము) సమముగాఁ బ్రాస గూర్పఁబడినది.

## త్ర్యక్షర ప్రాసము

క. తిరమగుఁ ద్రిప్రాసము సుం
దరమగు మురవైరి రూపు । తరుణులకు మనో
హరమగు దానవులకు భీ
కరమగుఁ దపసులకు ముక్తి । కరమగు ననినన్. 385

వి. ఇందుఁ బ్రథమాక్షరమునకుఁ దరువాతి 'ర మ గు' అను మూఁడక్షరములు సమముగా బ్రాసగూర్పఁబడినవి.

## చతుష్ప్రాసము

క. ధీరుఁడు కమనీయ శుభా
కారుఁడు కమలావధూటి । కా మృదుహృదయా
ధారుఁడు కుమతిజనాధిక
దూరుఁడు కమలాక్షుఁ డనఁ జతుష్ప్రాసమగున్ 386

వి. ఇందుఁ నాల్గుపాదములలోను 2, 3, 4, 5 (ర ద క మ) వర్ణములు నాలుగు సమముగాఁ గూర్పఁబడియున్నవి.

## అంత్యప్రాసము

క. తొలుతను గురులఘువులతో
వలనెయ్యది పదము తుదిని । బ్రాసమునకు డా
పలనిల్చు నదియె నాల్గడు
గులకడఁ బ్రాసముల మొదలఁ । గూర్పఁగవలయున్. 387

తే. అంఘ్రితుది వ్రాలు డాపలి । యక్షరంబు
గురువయినఁ బ్రాసమొక్క యక్కరమె యగును,
గాకలఘువైన వర్ణ యుగ్మంబు నడుచు
స్వరవిభేదంబు గాక కావ్యంబులందు 388

క. నందాంగనా కుమారా
మందరగిరి ధీర దనుజ । మదసంహారా

బృందాగహన విహారా
కందర్పాకార రాధికా శ్రీజారా 389

క. గోపవధూజన మదనా
గోపాలన చతుర కుంద కుట్మల రదనా
గోపారి విజిత కదనా
గోపతి వాహాప్త ధవళ గోసమవదనా. 390

వి. 381 పద్యములోనే యంత్యప్రాసలక్షణము చెప్పఁబడినది. మఱియు 289 పద్యములోఁ బ్రాసాక్షరమైత్రిని జెప్పుచోట నంత్యప్రాసము సమస్వరములుగా నమరవలయునని తెల్పఁబడినది. ఇందంత్యప్రాస పూర్వాక్షర నియమమధికముగాఁ జెప్పఁబడుచున్నది. అంత్యప్రాస పూర్వాక్షరములలో గురువో లఘువో యేదో యొక్కటే యన్నిటఁ గూర్పవలయు (387). ఆ ప్రాస పూర్వాక్షరముగురువైనచో నొక్క యక్షరమునకును, లఘువైనచో రెండక్షరములకును సామ్యముండవలయును. తక్కిన ప్రాసములందువలెఁ గాక యంత్యప్రాసమున స్వరసామ్యము గూడ నమరవలయును.

389, 390 పద్యము లంత్య ప్రాసమునకు లక్ష్యములు.

మారా, హారా, హారా, జారా అనుచోట గురుపూర్వకమైన యేక వర్ణప్రాస.

మదనా, వదనా, కదనా, వదనా, అనుచోట లఘుపూర్వక ద్వివర్ణప్రాస.

## అనుప్రాసము

క. నందసుత పురందర ముఖ
బృందారకవంద్య దాస బృందావన గో
విందయన నను ప్రాసం
బందం బగు నెందుఁ గృతుల యందు ముకుందా. 391

వి. ఇందు బిందుపూర్వక దకారము మొదటినుండి తుదిదాఁక బెక్కు సారు లావృత్తి చేయఁబడినది. (నంద, పురంధర, బృంద, గోవింద, అంద, ఎందు, ముకుంద) దీనినే యాలంకారికులు వృత్త్యనుప్రాసమందురు.

క. వడులకుఁ బ్రాసంబులకును
విడువక చెల్లుబడు లెల్ల । వివరించితిఁ బా
ల్పడి వీనిలోన సత్కవు
లొడఁబడి కావలసినవి ప్ర।యోగింపఁదగున్. 392

వి. వడులయుఁ బ్రాసములయు మైత్రులెల్ల లక్ష్య లక్షణ ప్రదర్శనపూర్వకముగ వివరించితిని; ఇందలి వళిప్రాసభేదములన్నియుఁ బ్రయోగార్హములు. సత్కవులనువారు సత్కవులను పేరు వడయఁ గోరువారు ఈ యతిప్రాస భేదములలో నచ్చిన వానిని దమ రచనలలోఁ బ్రయోగింపఁదగునని యప్పకవి చెప్పుచు నిఁక వళిప్రాస పరిచ్ఛేదాఖ్యానమును బ్రాచీనాంధ్ర కావ్యరచనా సంప్రదాయానుసారము భగవత్సంబోధనాంత పద్యముల రచించి ముగించు చున్నాఁడు.

## మత్తేభవృత్త కందగీత గర్భ సీసము

సీ. వినయ సంపన్న ర।వి ప్రఖ్యాత రమణీ
నాథా ప్రయోజేక్షణా నరాప్త
విభయదాకార హ । విర్భుగాయత రిపు
ప్రాణానిలాహీశ్వ।రా రమేశ
విలయ కాలానల।విక్రమప్రథిత సా
ల్వాగ్రావ వృద్ధర్శ।వా వరేణ్య
విజయశీలా యదు।వీర కౌస్తుభధరా
చక్రీ యశోదాత్మ।జా ముకుంద

తే. కరివరద పూతనాంతక । గరుడగమన
సత్త్వసహిత కామజనక । శంకరసఖ
కనకవసన సుందర దేహ । వనధిశయన
సనకముని వినుత చరణ । సరసిజయుగ. 393

వి. చిత్రకవితాభేదములలో గర్భకవిత్వమొక్కటి. ఒక పెద్ద పద్యములో నొకటో రెండో యంతకన్న నెక్కువో చిన్నపద్యముల గణయతి ప్రాసాది నియమము దప్పని యట్లు గర్భీకరించి (ఇమిడించి) చిత్రముగా

వ్రాయుట గర్భకవిత్వమనఁబడు. అప్పకవీయము నాలుగవ యాశ్వాసమున గర్భకవిత్వమునకుఁ గొన్ని పద్యము లుదాహరింపఁబడినవి ఈ యాశ్వాసము తుదిలోనున్న పై సీసము గర్భకవితాచిత్రము గలది. ఈ సీసమున మొదటి నాలుగు పాదములలో మత్తేభవృత్తమును, గీతభాగమునఁ గందపద్యమును గర్భీకరింపఁబడినవి. ఆ గర్భపద్యము లీ క్రింద విడిగా వ్రాయఁబడును.

## గర్భ మత్తేభము

నయసంపన్న రవిప్రభూత రమణీ । నాథా పయోజేక్షణా
భయదాకార హవిర్భుగాయత రిపు । ప్రాణానిలాహీశ్వరా
లయకాలానల విక్రమ ప్రథిత సాల్వగ్రావ వృద్ధశ్రవా
జయశీలా యదువీర కౌస్తుభధరా । చక్రీ యశోదాత్మజా. 394

వి. పై సీసము నాలుగుపాదములలోఁ బ్రతిపాదములోను మొదటి యక్షరమును గడపటి మూఁడక్షరములను దీసివేసిన మత్తేభవిక్రీడిత వృత్తమగును. ఆ యక్షరములఁ దొలగించుటవలన నర్థము చెడదు. మఱి మత్తేభవృత్తమున కుండవలసిన యతిప్రాసలు గణక్రమము లవలేశమైనను దప్పక క్రొత్త పద్యము వలెఁ దోఁచుచున్నది. గర్భపద్యములకెల్ల నిట్టి లక్షణమే యుండును.

## గర్భ కందము

క. కరివరద పూతనాంతక
గరుడగమన సత్త్వసహిత । కామజనక శం
కరసఖ కనకవసన సుం
దరదేహ వనధిశయన సనకముని వినుతా. 395

వి సీసభాగమగు గీతములోఁ దుదిలోనున్న 'చరణసరసిజయుగ' అను దళమును దొలఁగించి (9 అక్షరముల విడిచి) చదివినఁ గందమగును. కాని యట్లేర్పడిన కందము తుదియక్షరమిందు లఘువుగా నున్నది కందము తుది యక్షరము గురువు కావలయుఁ గానఁ దుదిలోని హ్రస్వాచ్చును దీర్ఘముచేసి చదువవలయును. ఇట్టి యలంతిమార్పు గర్భకవిత్వమున నంగీకృతమని యెఱుఁగునది.

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర కామెపల్లి పురమండిత నందనందన చరణారవింద వందనాభిలాష మనీషాప్రాభవ వేంగనార్యతనూభవ విద్యావిశేష సురాచార్య కాకునూర్యప్పకవివర్య విరచితంబైన యాంధ్రశబ్ద చింతామణియను వ్యాకరణశాస్త్రంబునందు వళిస్వరూపంబును నేకచత్వారింశన్ముఖ్య విశ్రామంబులును సగ్రాహ్యావిరామంబులును, ప్రాసలక్షణంబులును, సప్తదశప్రధాన ప్రాసనిర్ణయంబును, 1అప్రశస్తప్రాసంబులు శబ్దాలంకారనిరూపణంబునుం గల వళిప్రాస పరిచ్ఛేదంబును తృతీయాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీః

---

1. ఉభయప్రాసంబులును - అప్పకవీయ ముద్రిత ప్రతిపాఠము-పదునేడు ప్రాసభేదములు తర్వాత అప్రశస్త ప్రాసమున్నది గ్రంథములో. ఉభయప్రాసలు లేవు. ఉభయప్రాసయనుట కర్థము లేదు. కాన సవరింపఁబడినది.

# అనుబంధములు

## 1. అఖండయతి

(అఖండయతి యొక యతిభేదముగా అప్పకవి చెప్పలేదు) అన్సంధిగల శబ్దములందు స్వర ప్రధానవడియే పాటింపవలసి యుండఁగా, ఆశబ్దద్వయ మేళనము అఖండముగా (ఏకశబ్దముగా) భావించి (సంధిస్థలమున నిల్చియున్న వ్యంజనాక్షరమునకే యతి గూర్చుట యఖండయతి యనఁబడును. అఖండయతి యన్నచో సంధిలో వ్యంజనాక్షరమైత్రి యగును.) ఉభయయతి యున్నచో స్వరవ్యంజనములు రెంటికి యతియగునని యర్థము. కాని యఖండయతి నిల్చు శబ్దమందును శబ్దద్వయ మేళనముగలదు, కాన స్వరయతి నిల్చుట కేయభ్యంతరము లేదు. కాన (నఖండయతియు నుభయయతియే యగును.) అఖండవడి యుభయయతి సమానార్థములని పర్యాయసితార్థము. అట్లుంత నఖండవడి నప్పకవ్యాదులు గొందఱు నిరసించిరి, ఏల నిరసించి రనుటకు సమాధానము చెప్పవలెను. అఖండవడి సమ్మతింతుమేని స్వరసంధిగల సంస్కృతాంధ్రశబ్దములందెల్ల స్వరమునకే కాక వ్యంజనమునకును యతి సమ్మతమగును. ఉదా॥రాముఁడతఁడు(డ), నీవిచ్చితి (వి), సర్వేశ (ర్వే), వంశాబ్ధి (శ) ఇత్యాది తెలుఁగు సంస్కృత సంధులందెల్ల వ్యంజనమైత్రియు నంగీకర్తవ్యమే యగును. ఇది యంత రమ్యముగాఁ దోఁపదు. ఇట్టి యతిచారాతివ్యాప్తుల నరికట్టి కతిపయ శబ్దములందే దీనిఁబరిమితము చేయఁదలఁచి యుభయయతి భేదము లనంతాదులచేఁ జెప్పఁబడెను. (అఖండవడి దొల్తఁజెప్పినవాఁడు భీమన) అఖండవడిఁ జెప్పిన భీమనయే యుభయయతి భేదములగు ప్రాదిప్లుత యతులఁజెప్పెను. విన్నకోట పెద్దన, అనంతుడు, చిత్రకవిపెద్దన, ముద్దరాజు రామన, రఘునాథయ్య, పొత్తపి రమణకవి, కూచిమంచి తిమ్మన, రంగకవి మున్నగువా రుభయవళి భేదముల నెక్కింటిని వక్కాణించిరి.

(అఖండవడి యొక్కటి చెప్పినచో ఉభయ వళులన్నియు నందే గతార్థమగును.) మఱల వానినిఁ బ్రత్యేకముగా వివరింప నక్కఱలేదు. కాని కొందఱు ఛందఃకర్త లుభయవళి భేదాలగు ప్రాదినిత్యసమాసాదియతులఁ జెప్పుచు వానితో నఖండవడియు నుడివిరి.

అఖండవడిని జెప్పినవారు-భీమకవి, చిత్రకవిపెద్దన, తాతంభట్టు, అథర్వణుడు, ముద్దరాజు రామన, లింగమగుంట తిమ్మన, వార్తాకవి రఘునాథయ్య పొత్తపి రమణకవి, కూచిమంచి తిమ్మన, రంగకవి, ఓరుగంటి రామకవి, కూచి

మంచి వేంకటరాయకవి మున్నగువారు పెక్కురు గలరు. ఈ లాక్షణికులు తమకు సర్వత్ర అఖండవడిఁ గూర్చుట కిష్టము లేకపోవుటచేఁ గాఁబోలుఁ బ్రాదిరాగమ విభాగ ప్రభుకాకుస్వర నిత్యసమాసాద్యుభయయతి భేదముల జెప్పుచుఁ బ్రాచీనకవి ప్రయోగములు క్వాచిత్కములుగ నఖండవళ్ళకుఁ గనఁబడుటచే నఖండవడియు నొక యతి భేదముగఁ జెప్పినవారైరి. దీనిఁబట్టి యఖండవడి క్వాచిత్కమనియని వార్యపరిస్థితులలోఁ బ్రయోక్తమని యెన్నఁదగును.

బాలబోధచ్ఛందఃకర్త యఖండవడిని సమ్మతించి యిట్లు రచించెను —

'ఈ యఖండవడి మహితబుద్ధి దెలియని, వారు చెల్లదనుట కారణముగఁ
జతురబుద్ధిఁ బెక్కు సమ్మతుల్ వ్రాయుదు; నిచ్చసుకవివరుల మెచ్చుగాఁగ',

లక్షణ శిరోమణిలో నఖండవడినిగూర్చి యిట్లు దెల్పఁబడినది "ఛంద స్సూత్రంబులలోఁ, బొందైన యఖండయతులు బుధనుతముగ బెంపొందలిఖించితి; అవి కొందఱు మెచ్చరుమే; ఎపునని కృతులందు సుకవులయ్యే యెడలన్, దివిరి రచించిరి కావున, వివరింతుస్ దత్క్రమంబు విశ్రుత ఫణితిన్.''అందిచ్చినవానిలో విరాటపర్వ ప్రయోగము-(1-160)

'ఇది పెనుఁబాము చంపమున...............

తుది నొకచోట వైచుటయ + థోచిత కార్యము నయ్యెడున్నదా,

(యథా + ఉచిత-ఇందఖండవడి యున్నది, నేటి ముద్రణలో....'వైచుటయ + తోఁచిన కార్యము' అని మార్పు చేయఁబడి యున్నది.)

గరళ పురిఛందము॥ "అద్భుతముగ సమాసంబులందు శబ్ద. యుగము గూడియు ఖండింప నొనరనట్టి, పదముల నఖండమంద్రదు నేర్పరులు నచ్చ, హల్లులకు వడిచెల్లుఁ గాత్యాయనీశ."

(అఖండవడి యప్పకవికి సమ్మతముగాదు గానఁ దనకుఁ బూర్వులగు ముద్దరాజు రామన లింగమగుంట తిమ్మన లఖండవడి లక్షణముజెప్పి యందులకుఁజూపిన లక్ష్యములందలి పాఠములు ప్రక్షిప్తములని యాక్షేపించి పాఠాంతరములఁ బ్రదర్శించె.) అప్పకవి యిచ్చిన పాఠములలో నఖండవడి యుక్త పూర్వపాఠము దొలగింపఁబడి యాతనిచేఁ గల్పితమైన పాఠము వెలయుచున్నది. (చూ. అప్ప. 3 ఆ-పద్యములు-204-210)

మొదట అప్పకవి పాఠములను, తరువాత నందులోని పూర్వుల యఖండవడి పాఠములను జూపెద—

చూవె మనంబునఁ దలఁతు।సుందరి యెపుడున్ (ఆది-౫-135)
చూవె మనంబునఁ దలంచు।చుండుదు నెపుడున్ (అఖండవడి)

ఏ । మన్నఁ గొఱంత లేదుమణి । హారము లాదిగ, బెక్కు కానుకల్
(భా-రా-యు-142)

ఏ । మన్నఁ గొఱంత లేదుమణి । మండన ముఖ్యములైన కానుకల్
(అఖండ)

మా।ర్గమునను జరియింపంగా, నమలమతీఁకన్న కొడుకు।లట్లరయఁజనున్
(భా-ఉద్యోగ-2-74)

మా, ర్గమునఁ జరింపఁగానమ, లమతీనీకన్న కొడుకు।లట్లరయ (అఖండ)
అతిథి నినుఁ గోరెనేనియు, నలిఁగింకిరి పడకయోల । మానపడక
(భార-అను-1-68)

అతిథి..........మతిఁగింకిరి పడకయోల।మానపడక (అఖండ)
సర్వలోకైక శరణ్యునిం గొలువ । నిప్పుడు వచ్చితి నొండుగాను.
(భా. రా-యుద్ధ-165)

లోకైక శరణ్యునిం గొలువఁగా । నిటవచ్చితి (అఖండ)
చతురంభోధి పరీత భూవలయరా।జన్యాలికోటీర (దేవకీ నందన శతకము)
చతురంభోధి పరీత భూవలయరా జానీక కోటీర (అఖండ)
అశేష సత్త్వసం । హరుఁడగు చున్నవానిదివి । జారిఁ గబంధుని
(భార-అరణ్య-6-307)

సత్త్వఘ । స్మరుడగుచున్న వానిదివి । జారి (అఖండ)

అప్పకవి యిచ్చిన పాఠములకంటె నఖండవడి యుక్త పాఠములే సరసములు.

కూచిమంచి తిమ్మన రామాయణాదుల నుండి యఖండవడికి లక్ష్యము చూపి తుదలో నిట్లు వ్రాసె. "ఇట్టి ప్రయోగములు కలవు కాని యఖండ యతికి ప్రాచీనకవుల ప్రయోగములు లేవు గనుక నిది సుప్రయోగముకాదు" సర్వ లక్షణసారసంగ్రహము (III పుట) కూచిమంచివారి మతమున భారతమున నఖండవడి ప్రయుక్తముగాదనుట తెల్లమగు. అప్పకవి మతము ననుసరించిన వాఁడేమో యితఁడు గూడ (అప్పకవి సర్వత్ర అఖండవడిని నిషేధించి నవరణలు చూపఁగాఁ గూచిమంచికవి కవిత్రయరచనయందు మాత్రమే యఖండవడి లేదనె. దీనిచేఁ దర్వాతి వారికిది సమ్మతమనక తీరదు. అఖండవడి సుప్రయోగము గాదని నిరసించిన కూచిమంచి తిమ్మన రచనయందే యఖండయతి ప్రయోగములు గోచరించెడు.)

లెక్క యిడరాని రొక్కంబు। లీడులేని (రసికజన-1-42)
గురునాథ జంగంబు గోరిన వస్తువు, నెద్దియైన మదంబు। నివ్వటిల్ల
(రా-శే-వి. 1-105)

సుకవిజన మనోరంజనములోఁ గూచిమంచి వెంకటరాయకవి యఖండవడి కనేక ప్రామాణిక ప్రయోగములు చూపినాఁడు. అతడిచ్చిన పాఠములు నేఁటి ముద్రణలోఁ గొన్ని మాఱియున్నవి. అతడు చూపిన ప్రయోగాలు కొన్ని వ్రాసెద.

వైదర్భీ బహుజన్మ......సుకృతాహంకార దుష్ప్రాభవం
బీదాంపత్యమునంజిరాయువయి నె। మ్మింబొందుఁగా ఇంతయున్
(శృం. నై-6-76)
(ముద్రణలో-అహంకార దుష్ప్రాపఖై, మీదాంపత్యము...)
అంభోధి వలయితావని, సంభరణ ప్రౌఢనిజభు। జార్గళ (కాశీ)
శిఖరా। లోకన మాత్రమున ముక్తు। లుల్లసిలంగన్ (కాశీ)
తంత్రము లాచరించివసు। ధామరముఖ్యులు (కాశీ)
నలుపెక్కెంజక్కవలకు, నలపిరహులకున్ (రుక్మాంగ)

ఇట్లు ప్రయోగాలు చూపట్టి చివర నాతఁడిట్లు వ్రాసె: ("ఆంధ్రభాషా భూషణము, నైషధము, కాశీఖండము, ప్రబోధచంద్రోదయము, హరిశ్చంద్రోపాఖ్యానము, రుక్మాంగద చరిత్ర, విజయ విలాసము, సారంగధర చరిత్ర, శ్రీరంగ మాహాత్మ్యము అను తొమ్మిది మహాకావ్యములందు నిరువది నాల్గు పద్యము లఖండయతులు గలవి వ్రాసినాము.) భారత ప్రయోగ మొకటియు లేనందున నఖండవడి మంచిదికాదను కొందురు. భారత ప్రయోగములు ననేకములుగలవు. అప్పకవిగారు భారతాదులయందు దిద్దినవి కొన్ని వ్రాసి కొన్నాము...చూవెమనంబున దలంచు + చుండెద నేనున్ - ఈ ప్రకారముగానే నన్నయభట్టుగారు చెప్పినదిన్ని లాక్షణికులు నఖండవడికి లక్ష్యములు వ్రాసినదిన్ని. ఇందులకు అప్పకవిగారు దిద్దినది 'చూవెమనంబున దలంతు సుందరి యెపుడున్' తాము దిద్దినదే కవి కవిత్వమందురు. వ్యాసకృతశ్లోకము— 'మమాప్యేష సదా సూద్రి హృద్యర్థః పరివర్తతే' నాయొక్క హృదయమందున్న ఈ యర్థమే యెప్పుడు నుండునని యర్థముగదా! ఏషోర్థ స్సదా పరివర్తతే — అనినందువలననే 'దలంచుచుండెద' నని నన్నయభట్టుగారి తాత్పర్యము. కవితాశయ్య విచారించితే, 'తలంచు చుండెద నేనున్' అంటే సొపుగా నున్నదో 'తలంతు సుందరి' అంటే సొపుగా నున్నదో కవిత్వ కళాదురంధరులకు స్పష్టము కాగలదు. అప్పకవి మాత్రము కవితా శయ్యనెఱుంగని వారనరాదు. అఖండవడియం దఖండ ద్వేషముగాన గాపక్రోధములు గ్రమ్మి

నపుడు తత్త్వము పట్టువడదు. కాకపోతే యేమహాకవి ప్రయోగములున్నవని మవర్ణవిరామము నిలిపిరి. ఏ మహాకవి ప్రయోగములు లేవని యఖండవడి ఖండించిరి. ఈయన ఖండించినంతమాత్రమున నఖండపడి ఖండమగునా?" అని యీ విధముగా నప్పకవి మతమును ఖండించుచు సవిస్తరముగా విమర్శించె.

(అఖండవడి ప్రయోగాలు ప్రాచీనార్వాచీన గ్రంథములందుఁ బెక్కులుఁ గాన వచ్చుచుంట నిక్కము.) ఈ క్రింద నా పరిశీలించిన కొన్ని ప్రయోగములఁ జూపి యీ ప్రసంగము ముగించెద.

ర, శైశ కారంభకు భక్తపాలనకళా । సంరంభకున్ (భాగ-1-1)
కన్నుల, కఖిలార్థలాభంబు । కలుగుచుండు (భాగ-10-1702)
నామన మార దీనిఁగని । నప్పుడు (భార-సౌప్తి-296)
జ, నావళి పురజనులు హస్తి । నాపురమునకున్ (భార-అశ్వ-4-93)
ద్వి॥ అతండు, మన్నాఁడు మమ్మురె । మ్మన్నాఁడటన్న (అష్టమహిషీ)
ర, త్నాకరవేష్టితాననివి । నంబడదాతడు (భైరవుని శ్రీరంగ-మా)
ధర నయజ్ఞాదేప । తార్చన మనగ (పండిత-దీక్ష-35)
కవిత శబ్దంబువా । గమ్మృతమైతనర (పండిత-పురా-486)
ప్రత్యక్ష పరాఙ్ముఖ । క్రితు (బసవ-571)
లింగము, నంగమునకు జంగమార్చ । నంబది (అనుభవ-222)
వే, దోక్తముగ నెఱుంగ వలయు । దుదిని మహేశా (శివ-త-సా-100)
తస్మాద్గార్హ్యం, బసియును గలదనిరివేద।భక్తవిధిజ్ఞుల్ (శి-వ-సా-115)
జ్ఞానమునకు యోగ్యమగుట । ననుభావంబై (రసా-2-6 పుట)
వాణిభ। ర్తను నీశండొకరుండు నాజనుమహా॥త్మ్యాప్తిన్
(ఎఱ్ఱ-హరి-పూ-1-9)
కైకొనకున్నె వృషగణి । కావళి (కవిరాజ-4-88)
వెస వసుధా స్థలంబునఁగ । వీంద్రులు (భీమ-1-12)
ని, ర్జరులను మిన్ను దన్నిరి ధ । రాసురకోటియు (కాళ-మా-2-62)
మునినాథ విన్నపం । బొక్కటి (రాధిక-1-45)
మాఱులేని ధృతిహి।మాద్రియతఁడు (శంకరకవి హరిశ్చంద్ర-1-176)
ఏ, మనగలదిప్పు నీచుఁడగు । మర్కటు (భా-రా-యుద్ధ-65)
తెలుపు, చుండనీ పల్లిదంబుల । సొంపు మెఱసి (నృసింహ-5-47)
సౌఖ్య, కరణకరమగు నావంచి । కాఖ్యపురము (రాజ-చరిత్ర-1-44)

బాలిక నృత్యాదితత్స । భాగారమునన్ (వైజ-1-128)
ఈరీతి గాచియుండఁగ నారాక్షసుఁడంతనంగ । నామణి
(సింహాసనద్వాత్రింశిక-5-302)
కాశి యణిమాదిసిద్ధుల । కాటపట్టు (కాశీ-2-50)
కీ, లాకుల తప్తచిత్తులకు । లక్ష్యమె (పాండు-3-82)
చెప్ప, పయ్యపుణ్యసతీ ప్రసభా । వంబునాకు (భార-ఆర-5)
నే, నావిధ మేల నూనుదు బె । నంగక (రుక్మాంగ-5-161)
తప్పక చూచి నన్ను వసు । ధామర సూతికి (నిరంకుశ-4-42)
తలఁపక యిట్టి కోర్కె వసు । ధామరుఁడేమని వేఁడె (సుదక్షిణ-2-68)
దమన కాఖ్యుండు వల్కెనం । దండమొక్కి (పంచతంత్ర-భేద-166)
లోకములన్ గులాచలము । లున్నతరూపకులంబు (కవికర్ణ-4-88)
ప్రియో, గ్రాపయోగవిధులు । గలుగుటరుదు (కళా-7-263)
లసితశస్త్రదోః । లాశాధినాథుల (శృం-శాకుంతల-3-116)
రాజ్యయోగ్యములు ధ రామరార్థంబులు (భార-శాంతి-1-244)
నొవ్విన్ వాఁడెగ్గులాడు । నుత్తమునైనన్ (విజ్ఞాన-2-50)
బ్రహ్మండం, బుదితము గావించి బాహ్య । మున (శశాంక-3-120)

ఇట్టింక నెన్నో లక్ష్యములు చూపవచ్చు. గ్రంథ విస్తరశంకచే విరమించెద.



## 2. యతిప్రాసముల ప్రయోజనములు

యతి యను శబ్దము సంస్కృతము. ఛందః పరిభాషయగు నీశబ్దమునకు విచ్ఛేదమని యర్థము. 'యతిర్విచ్ఛేద సంజ్ఞకః' అని వృత్తరత్నాకర నిర్వచనము. విచ్ఛేదమనఁ బదచ్ఛేదమని యర్థము గ్రహింపవలె. పద్యము యొక్క ప్రతిపాదములోను యతిస్థానముండును. ఆ చోటఁ బదచ్ఛేదము కావలె. ఆస్థానము పూర్వాపరముల నఖండశబ్ద (ఏకశబ్దము) ప్రయుక్తము గారాదని సంస్కృత చ్ఛందోనియమము. పదమధ్యమున యతిరాఁగూడదు. యతిస్థానమున నట్టి పదచ్ఛేదము లేకుండునేని యతిభంగదోషము గలుగునని సంస్కృత లాక్షణికులు శాసించిరి.

సంస్కృతభాషలో విచ్ఛేద మాత్ర రూపయతి వెలయుచుండఁగా, దెలుఁగున నాస్థానమందే యందులకు భిన్నముగా మఱి ప్రత్యామ్నాయముగఁ పాదాద్యక్షరమైత్రి (అక్షరసాజాత్యరచన) విధిగాఁ బాటింపఁబడును.

తెనుఁగునఁ బదవిచ్ఛేదయతి పాదాంతయతు లవశ్యములుగావు. కన్నడమునఁ దెనుఁగులోవలె నక్షరమైత్రి యక్కఱలేదు. అందు సంస్కృత పదవిచ్ఛేద రూపయతి నియతియే పాటింపఁబడును. తెనుఁగు కన్నడముల కనేక విషయములఁ బోలిక యుండుటచేతను, ప్రాచీన కవులకుఁ గర్ణాటాంధ్రములు రెండు పరిచితములై యుండుటచేతను దెనుఁగులోని యక్షర సాజాత్య రూప యతి మనోజ్ఞమగుటఁ బరికించి పండితులు కన్నడములో నట్టి ప్రావ్యమగు నక్షరమైత్రి భాషలో లేమి నేవగించుకొనియే కాఁబోలు 'కన్నడక్కియతి యిల్ల కోణక్కి మతి యిల్ల' అను నానుడి సృష్టించిరి. కన్నడమున యతి గలదు గాని సంస్కృతమునందువలెఁ బదవిచ్ఛేదరూపమే. అక్షరావృత్తిలో నున్న సొగసు పదచ్ఛేదమాత్రమున రాదుగదా ? ఈ యతిప్రాసములు తెలుఁగులో శ్రుతిసుఖమునకై కల్పింపఁబడినవి.

కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో సంస్కృతమునలేని తెలుగునకుఁ బ్రత్యేకములుగానున్న యీ యతిప్రాసల రామణీయకము నిట్లు ప్రశంసించినాఁడు—

విక్రమార్కుని దివ్యపీఠం బెక్కఁబోవుచున్న భోజరాజుం గాంచి తొమ్మిదవ రత్న పాంచాలిక చెప్పిన కథ—విక్రమార్కుని పురోహిత పుత్త్రుఁడు దేశాంతరమున కేఁగి విద్యలనేర్చి తిరిగివచ్చి రాజుతో నిట్లు పల్కెను.

గీ. అట్టి యయ్యు సంస్కృతాది భాషలునేర్చి,
కవిత యెఱిఁగి యెల్ల కడలఁ దిరిగి

తెలిసినాఁడ నిచటఁగల లక్షణముకంటె
నూతనంబు లేదు భూతలేంద్ర.

క. గణములు గణవర్ణంబులు, గణతారలు గణరసములు గణదేవతలున్
గణజాతులు గణఫలములు, గణుతింపఁగ నొక్క విధము కవితలకెల్లన్

వ. ఇట్టివిధంబయ్యును నంధ్రమండలంబునం గోణదేశంబునం దెలుఁగుం గవితకుఁ బ్రాలువళ్ళనను నియమంబులు చూచినాఁడ నవి యియ్యెడం దఱచు గాకుంట నపూర్వం బవధరింపుము.

శా. పుణ్యస్త్రీకి గుణంబు మంగళ గుణంబున్ సౌమ్యులై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతుల్
గణ్యం బౌగతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబులా
వణ్యాకారములౌఁ దెనుంగునకుఁ బ్రాల్వళ్ళు గడు వన్నియల్.

గీ. పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్ళులేని బేలుఁగవిత
వన్నె లెల్లఁ గూర్చి వ్రాయుచో కాటుక,
వన్నెలేని ప్రతిమ వ్రాఁతఁబోలు,

క. తప్పక వళ్ళును బ్రాలును, ముప్పిరి గొనఁదగిన శబ్దములు మెఱుఁగెక్కం
జెప్పిన కవితాచాతురి, యొప్పము వెట్టిన పసిండి యెఱపున మెఱయున్.
(IV-187-192)

ఇందుఁ దెనుంగునకుఁ బ్రావళ్ళు గడువన్నియలని ప్రావళ్ళచేతనే తెలుఁగుఁ గవిత కట్టి వన్నియు చేకూరునని కవి వక్కాణించినాఁడు. ప్రాలు వళ్ళులేని బేలుఁ గవితయని నిరసించినాఁడు. సంస్కృత కవితపైఁ గూడ నిడి యొక బాణప్రయోగమనఁ జెల్లును. 'పలుదెఱంగులైన పలుకులు గలిగియు' నన్నదళము సంస్కృతకవిత యని చెప్పక చెప్పుచున్నదికదా ? 'మాధురతా నిమిత్తం యతిరిష్యతే' (మాధుర్యముకొఱకు యతి కోరఁబడుచున్నది) అని సంస్కృతములోని యతిగూర్చి కవి కల్పలత ప్రశంసించుచుండఁగా దెలుఁగు యతిప్రాశస్త్యముఁ గూర్చి యింక జెప్పవలయునా ?

ప్రతిపాద ద్వితీయాక్షరము ప్రాసమనఁబడును. సంస్కృతమున నీ ప్రాస నియతియు లేదు. సంస్కృతభాషలో లేకున్నను ద్రావిడభాషలలో నందు ముఖ్యముగాఁ దమిళభాషలోఁ దెలుగులోవలె యతిప్రాసములు గలవు. ద్వితీయాక్షరప్రాస కన్నడపద్యములందును నియతము. ఆదినుండి తెనుఁగుభాష సంస్కృతానుకరణమై సంస్కృత సాహిత్య ప్రభావముచేఁ బరిబృంహితమై సంస్కృతపదబహుళమై సంస్కృత కావ్యాలంకారరీతులు యథాతథముగా గ్రహించియు ఛందో వ్యాకరణములందును గొంత గ్రహించి మఱి కొంత

తచ్ఛాయలో వెలయుచు, సంస్కృతం బాద్యప్రకృతి తెలుఁగు వికృతియను జనకజన్యభావముతోఁ బ్రచారమును గాంచిన యాంధ్రభాషలో ఛందములో సందులేని యతిప్రాసద్వయ నిర్బంధమేల పరిత్యజింపఁ జను? నని యిటీవలి కొందఱు భాషా విప్లవకారు లభిప్రాయపడుచున్నారు. యతిప్రాసములు శబ్దాలంకారములవలె నైచ్ఛికముగా వాడుకోవచ్చు. ఇవి విడిచిపెట్టినఁ గావ్యములు రసవంతముగాఁ జెప్పవచ్చు. (సంస్కృతమున యతిప్రాసలు లేవుగదా? కాళిదాసాది మహాకవుల కావ్యములకేమి లోటు కలిగినది? వానికంటెఁ దెనుఁగు కావ్యములకు వీనివలన వచ్చిన ఘనతయేమి?) నన్నయ తిక్కనాది మహాకవులు సయితము వడిప్రాసములకోసము పొల్లుమాట లుపయోగింపవలసి వచ్చె. ఇత్యాదిగాఁ బ్రతిపక్షుల యాక్షేపము వెలయుచున్నది.

ప్రాచీను లేర్పరచిన నియమములఁ ద్యజింపవలయునను వాదమున కర్థములేదు. (సంస్కృతమున లేనంతమాత్రమునఁ దెనుఁగున నుండరాదన వలెనా? సంస్కృతమున వెన్నో తెలుఁగులో గలవు. సంస్కృత వాక్య రచనాపద్ధతి లింగవ్యవస్థ, ద్వివచనస్థితి, దశలకారాది ప్రక్రియ మున్నగునవి తెలుఁగున నున్నవా? ఏ భాషాపద్ధతి దానిది. ఆయా భాషా ఘనత దానికున్నది. ప్రతిభాషలోను; వైశిష్ట్యము, పై లక్ష్యము గలదు. తమిళమున యతిప్రాసలున్నవి కదా! దానికి ఘనత కొఱవడినదా? యతిప్రాసనియతి నించుకయు వదలక నన్నయనాఁటినుండి నేఁటివఱకు వ్రాయఁబడు కావ్యములు రసవంతములు గావా? ఇతరులు తలపెట్టని యతిప్రాస నియమ విశేషములను సీసగీతములందును సర్వత్ర నస్ఖలితముగఁ బాటించి కృతార్థుడయిన నన్నయ రచన రసవంతము గాదని యే విచక్షణుఁడు చెప్పఁగలఁడు? నన్నయ తిక్కన శ్రీనాథ పోతనాదుల కవిత సంస్కృత మూలగ్రంథ కవితకన్న రసవత్తరమని యుభయభాషావేత్త లగ్గడించుట లేదా? వళిప్రాసములు రసవత్కవితారచనకు నిర్బంధములున్నచోఁ బద్యగణము సయితము నిర్బంధమే కదా! సీతారామశాస్త్రి విద్యారణ్యస్వామివంటి పదా లుత్పలమాలలోను రసికజన మనోభిరామశబ్దముత్పల చంపక శార్దూలమత్తేభములలోను గుదురవు. ఇది గణనిర్బంధ వశముననే కదా? దండక కృతిని వ్రాయుచు విభీషణశబ్దమును విభీషఁడని యొక రుపయోగించిరి. మన తెనాలికవి విరూరివేదాద్రిఁగా జేయలేదా? ఇఁకఁ జాలు! ×

ఇట్టి గణయతిప్రాస శృంఖలల విముక్తిఁ గోరువారు గద్యమున రచన సాగించవచ్చు. యతిప్రాస నిర్బంధములేని సంస్కృతకవితలోఁ బొల్లుమాటలు తుహిచవై అపీత్యాది నిరర్థకపాదపూరణ శబ్దములు కోకొల్లలు లేవా! వ్యాస భగవానునికి చకారకుక్షియను సుగృహీతనామధేయ ప్రాప్తికిఁ గారణమందరెఱిగినదే; యతిప్రాసములయు గణక్రమముయొక్కయు నిర్బంధములేని యనుష్టుప్పులో వ్యాసభట్టారకుఁడెన్ని చకారములు పాదపూరణ పూజాకుసుమము

లుపయోగించెనో కదా! 'తుహిచస్మహవై పాదపూరణే' అని యమరసింహుఁడీ పాదపూరణ శబ్దగణము నేకరువు పెట్టి భావి సంస్కృతకవులకుఁ గవితారచనా సులభమార్గమును జూపలేదా? కవితకు యతిప్రాస నిర్బంధము కారాదనువారు భాషకు వ్యాకరణ నిర్బంధము గూడదనువారు నౌక్కకోపకుఁ జెందిన వారన వలె. ఇది నవ్యకవితాయుగము.

¹ (యతిప్రాసలు ఆంధ్రభాషాపరవర్ధిసికి మంగళసూత్రములవంటివి. అవి తెలుఁగు వ్యాకరణశాస్త్రమునకు జీవగఱ్ఱ. తెలుఁగులో శబ్దస్వరూపనిర్ణయమునకు యతిప్రాసలే ప్రబల ప్రమాణసాధనములు. తెలుఁగులో శబ్దముల రూపనిర్ణయము చేయునపుడు యతిప్రాసస్థలస్థిత ప్రయోగములనే యాధారముగాఁ బ్రమాణముగా నాఁడు నేఁడు గ్రహించెదరు.) తెలుఁగు వ్యాకరణములు యతి ప్రాసస్థల ప్రయుక్త శబ్దరూపములనే శాసించెడి. ఈ యంశముఁ బ్రదర్శింపఁ గతి పయోదాహరణములఁ దెల్పెద. ఈ క్రిందివి యతిస్థానములోనివి. :—

దూతుఁడు-దూ, తుని బంపుట నరకమౌట + ధ్రువమనిరార్యుల్ (భార-శాంతి)
రాయలు-కృష్ణరా, యబాహా....సాం + ద్రాలేప పంకంబునన్ (మను)
ఒక్కొండు పాండవులవలనఁ గీడౌ. కొక్కండును లేరధిపనీదు + కొడుకులఁ
(శ్రీ-1-83)

కూడికొను-కూ, డికొనినఁ జూచియంతయు వ-డిన్ (కర్ణ)
అందుకొను-అం దుకొన నిగుడ్చుటన్ వికచ-దోర్లత (కవికర్ణ-6-83)
ఉయ్యాల-ఉ, య్యాలయును బోలె నూఁగడక-యెంతయు (అరణ్యపర్వము)
ఉయ్యల-ఉ, య్యల నూఁపుచుఁ బెనుపఁదొడఁగె-నావరశిశువున్ (కళా)
పయ్యెద-యానవేగమునఁ బ-య్యెద (షోడశ)
పయ్యెద-ప, య్యెదలోని గుబ్బ పా-లిండ్లు (యయాతి)
గొజ్జఁగి-చంద్రకాంతపు గిండి గొ-జ్జంగి పీడి (విజయ)
గొజ్జెఁగ-శ్రీమించు చెవుల గొ-జ్జెఁగలు మెఱయ (ఆముక్త)
దీవన-దీ. వనలెసఁగఁగ ధర్మసుతుఁడు + వానవలీలన్ (భార-అరణ్య)
దీవెన దీ,వెనలెన్నే నియు నొసంగి + వేడ్కొల్పుటయున్ (అప్పకాయ-406)
నమలి-నాకాధినాథుండు + నమలి వీక్షించి (రంగనాథ)
నానావిధంబుల + నమలి పిండు (భీమ 3-23)
నెమలి-మేపులొఁసగి రక్షించునె + మిళ్ళు (జైమిని-4-79)
నెమలి-నెమలి సోఁగలఁగేరు + నెఱికురుల్ (భీమ-4-75)
ఈ క్రిందివి సంస్కృత శబ్దములు—
ధారుణి, (సంస్కృత నిఘంటువులలో 'ధారణి' అనురూప మొసఁగఁబడినది. ధారణి, ధారిణి అను రూపములు సంస్కృతమునఁ గలవు అందు 'ధారుణి' అను రూపము గానరాదు; తెలుఁగునఁ బ్రయుక్తము.)

ధా,రుణి ప్రజ గూర్చగా విగ్ర + రోషుఁడనై (ఆది-7-123)
ధా,రుణియుం గప్పుచుఁ బ్రోచిరోలిఁ దొలుకా + రుంబోలెఁ
(నన్ని-కుమా-11-705)
ధారణి-రక్క-సివలెనె ధా + రణి పిక్కటిల్ల (ద్విపద-సారంగ)
సౌదామని-సౌదా, మనివోలె నడంగె దృష్టి + మార్గము (ఆది-7-184)
సౌదామిని సౌదా, మినితోఁ జెలువొందునీల + మేఘముపోలెన్ (సింహా-2-146)
బాలకి (బాలిక యనుటకు) బా,లకి తనబోటితోడ నట + లాయిది (భోజ-3-175)
నిరసించన్-సరసత్వంబని బ్రాజ్ఞులార నిరసిం + చంబోకుఁడీ (కంకంటి-ఉరా)
ముష్టాముష్టి (ముష్టీముష్టి-పాణినీయమతము)
భీమాసురవీరులు ముష్టాముష్టి రణచ్ఛటచ్ఛ + టాశబ్దంబుల్ (భార-ఆర.3-395)
నరిబోరాడిరి క్రైదువుల్ సమయము + ష్టాముష్టికిం జొచ్చి (భా.రా-యు 5-25)

ఈ క్రిందివి ప్రాసలోనివి:—

హల్లోహల-మనుచరిత్రలోని 'ఉల్లలదలకా — 'పరిమళలహరీహల్లోహల మదబంధర (2-61)' అనుచోట 'లహరీ + ఈహత్ + లోహల' అని పదచ్ఛేదము చేసిరి పూర్వ టీకాకారులు ఇది హల్లోహలశబ్దము. దీనిని నిర్ణయించుచున్నదీ ప్రాసస్థలఖచితప్రయోగము-

'సాహిత్యాపర కాళిదాస శయపూజా గౌరవవ్యాస. గంగాహల్లోహల
వాగ్విలాస...(పాండు-4-ఆ)

కంసాలి-అంసాలంబిత-హంసాలస-కంసాలవఘాటి (శ్రీనాథునిచాటువు)
కల్హారము-బిల్హణ కవీంద్రుఁడనెరా, టక్కల్హార ప్రియ (యామినీ-2-34 పుట)
మల్లురు-అరేయయ్యలు వీరారి మ, ల్లురకున్ (రామాభ్యు-1-59)
మల్లులు-వలసిననేలు-జెట్టిమ ల్లుల విజితున్ (విరాట)
మొగము-మొగమున కొకవింత + కిగిదొలంకె (పారి)
మొకము-వికవికనవ్వి.... మొకమున బుస్సుమంచు (హరవిలాస)
ఊహించ-ఊ. హించ నొక నాల్గు గడియల, సంచారము (కళా-3-59)
మార్కొండు (మార్కొందు-అనుటకు)
గాండీవధన్వ-పాండిత్యము-మా. ర్కొండు (ఉద్యోగ)
గుంభనము (గుంపన మనుటకు)
కుంభీనసములు బ్రేలిన, గుంభనమున (కవికర్ణ-6-29)

సంధిరూపములకు:—
ఇ : ట్లు దపంబు సేయు (నిర్వ-ఉరా-6-7)
కమ్మని లతాంతములకు మ్మొనసి (ఆది-5)

మఱియు లఘురేఫ శకటరేఫ నిర్ణయమును, సార్థ బిందుకశబ్ద నిర్ధారణమునకు యతిప్రాసస్థలములే ప్రధానాధారములనుట విద్వాంసులకు విదితచరము. ఇంతటి మహాప్రయోజనము కలిమిచేతనే 'తెనుగునకుఁ బ్రావళ్ళుం గదు న్వన్నియల్' అని యుగ్గడించినాఁడు కొఱవి గోపరాజు. ఉభయకవిమిత్రుఁడు కవిబ్రహ్మ తిక్కన నిర్వచనోత్తర రామాయణములో వ్రాసిన క్రింది పంక్తులు ప్రతిపక్షులకుఁ దగ్గ సమాధానము.

'తెలుఁగు కవిత్వము చెప్పం దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా, టలు గొని వళులం బ్రాసం, బులు నిలుపక మొగిని బులిమిపుచ్చుట చదురే'

ఈ తెలుఁగు వళిప్రాసవిషయములో నిప్పటి కొండఱవలె నప్పుడు కొందఱకు నన్యభావముండెడిదేమో! అందుచేతనే సంస్కృతాంధ్రోభయకవిమిత్రుఁడగు తిక్కన చక్కని బుద్ధిసెప్పె. (పింగళిసూరన, విశ్రాంతి విహతి గావింపక పరఁగుకవి యశము బడయునని యుగ్గడించినాఁడు.) వేదసూక్తులను దెలుఁగు ద్విపదలలోఁ గూర్చినపుడు 'బేసిగా విరచించు ద్విపదకు వళ్ళుఁ బ్రాసంబులును బొందువడఁ దాపపలయు' ననుచుఁ దెలుఁగు బాసతోని విలక్షణ వళిప్రాస విషయమెత్తి చూపినాఁడు సోమన 'పండితారాధ్య చరిత్రలో'. సుభద్రాపరిణయములో (గూచిమంచి జగ్గకవి వడిప్రాసములేని కవితవ్రాయువాఁడు కాకవియని పేర్కొనెను.) 'వడియుం బ్రాసము నుజ్జగించి కపటవ్యాపారమే.... దుర్లక్షణం బడరం' గాకవిరీతి నుండె (సుభద్ర-2-40)
ప్రావడులు గోరిన భంగిక వచ్చి మట్టి నాద్యుల క్రియ జెప్ప నేర్చెనృప ధూర్జటి భీమయపండఁడు. (చేబోలు శాసనము)

బిల్వేశ్వరీయములో నితర భాషలయుఁ దెలుగుభాష
యు యతిప్రాసల విషయమిట్లు ప్రవచింపఁబడియె. (1-189)

'ప్రాస మంత్యంబయౌ మహారాష్ట్రభాష, నాద్యమౌనది గన్నడమందు, నఱవమందును యతియును గల దిందనిననౌ, యతులు బ్రాసంబులధికము లాదినవెవి'

(ఆంగ్లభాషలోఁ గూడ నంత్యప్రాస నియమము గొన్నింటికి గలదు. వారు దానిని Rhyme అందురు. హిందీభాషా ప్రాచీన కవితలో అంత్యానుప్రాస నియతమై కానంబడును.)

'పరమ యతియోగ సంస్థాన పదమనోజ్ఞ వైభవోన్నతిఁ దగు సరస్వతి' అని చంద్రికా పరిణయమున శ్లేషమూలానఁ బ్రశంసింపఁబడినది.

వళిప్రాసములు లేకపోయినను సంస్కృతభాషా శబ్దస్వరూపము వేదకాలమునుండి నేఁటికి నెక్కువ చక్కఁగా నిర్ణయింపవచ్చును గదా యని పూర్వపక్షము. సంస్కృతమునఁ బాణినీయాదులవంటి బృహద్వ్యాకరణములుంటచేతను వేదవేదాంగాది సమస్త వాఙ్మయము శ్రుతులగుటచేతను గర్ణాకర్ణగా మాఱక నిలిచి యున్నది. తెలుఁగు వాఙ్మయము సంస్కృతమువలె శ్రుతిపరంపరగా నధ్యయనాధ్యాపనములచే రామిచేతను బూర్వము పుట్టిన నేఁడు పుట్టుచున్న ముందు పుట్టఁగల తెలుఁగు లక్షణ గ్రంథములు పూర్వ పూర్వగ్రంథములలోని వళిప్రాసస్థల ప్రయుక్తములై మార్పురాని లక్ష్యముల సాధనమువల్లనే రచియింపనై యుంటచేతను ప్రావళ్కి నీభాషలోఁ దర్జియింపవీలులేదు. తెలుఁగు వ్యాకరణమునకే కాక నిఘంటువులకును నీ ప్రయోగములే ప్రమాణములు. సంస్కృతము వ్యవహారభ్రష్టమైనది గాన నాఁటికి నేఁటికి మాఱకున్నది. తెలుఁగు జీవద్భాష గావున నానాఁటికి మాఱుచుండునని చెప్పఁబనిలేదు. నేఁడి కాలమునకే మండలమునకు మండలమునకు భాషా వ్యవహారాదులందు భేదము గలదు గదా: తెనుఁగునందు శబ్దస్వరూప నిర్ణయమునకు యతిప్రాసములకుమించిన సాధనములేదని ఫలితార్థము తెలుఁగుబాసకు వళిప్రాసము లనాదిసిద్ధములైన సహజాలంకారములు. మీఁదు మిక్కిలి యవి శ్రవణ సుభంగంభావుకములు, వళిప్రాసవిన్యాసమున సిద్ధహస్తుఁడు పోతన. కాననే యాతని ప్రాసభాసుర కవితకున్న మాధుర్య గాంభీర్యమును మఱే యితర కవితకునాస్తి యనుట సాహసోక్తిగాదు.

అనాదిసిద్ధములైన తెనుఁగు సామెతలలో నీ వళిప్రాసములు కొల్లలుగాఁ జూపట్టు.

ఉదా. అన్న చొరవేకాని అక్షర చొరవలేదు.
అందని మ్రానిపండ్లకు అఱ్ఱు చాఁచుట
అంగడిలో అన్ని ఉన్నవి అల్లుని నోటిలో శని యున్నది
ఆలివంక వారాత్మ బంధువులు, తల్లి వంకవారు దాయాదులు
అత్తమీఁద కండ్లు అంగడిమీఁద చేతులు
ఉత్తరచూచి యెత్తరగంప
పేదకోపము పెదవికిచేటు
కలిమిలేములు కావడికుండలు
ఆడేకాలు పాడేనోరు ఊరకుండదు.
దాసరి తప్పు దండముతో సరి
ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య

కుమ్మరికొక యేఁడు గుదియ కొక పెట్టు
రూకలేనివాఁడు పోక చేయలేఁడు
నక్కయెక్కడ నాగలోక మెక్కడ
తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచు
పదకవితయందెల్ల నిట్టి యతిప్రాస విన్యాసము గాంచవచ్చు.

తెలుగు యతిప్రాసముల ప్రభావము సంస్కృతముమీఁదను బ్రసరించి నందులకీ యుదాహరణములు :

క్రీ. శ. 980 ప్రాంతమున ఆరుంబాక శాసనము సంస్కృత శ్లోకాత్మకము, ఇందు సంస్కృతశ్లోకముల నడుమ దెలుఁగుపద్యములకు సహజలక్షణముగూడ సంస్కృతమునకుఁ గ్రొత్తయే. కానఁ దెలుగుపద్యమే సంస్కృతభాషలో రచితమైనదని యూహింపనగును. ఆ పద్య మియ్యది:

"ధవళగుణో ధవళయశో, ధవళితదిఙ్మండలోప + దమితారాతిః
భవభక్తో భవకరుణో, ద్భవభవభోగాన్వితో వి + భాతి + సుకీర్తిః"
శాసనరచయిత - అయ్యనభట్టు.

పంచదార్ల స్తంభశాసనము. ఇది కావ్యాలంకార చూడామణి కృతి కర్త విశ్వభూపతిచే నిర్మితము. క్రీ. శ. 1403. సంస్కృతపద్యమయము. శ్లోకముల నడుమ యున్నదీ క్రింది యాటవెలది; సంస్కృతభాషలో రచితము. దీనిలో యతిగలదు. ఆటవెలది శుద్ధ దేశీయచ్ఛందో జాతము. సంస్కృతీకరింపఁబడినది. శాసన రచయిత తెలుఁగు కవి కాఁబోలు. ఆ పద్యము—

"మహిత గండ వెండ మధ్యదేశాధీశ, జనకదత్తరాజ్యసమధికేన,
తేన కిం న్నృపేణ తృప్త చాతుర్వర్ణ్య, మమరతరు వితీర్ణ మపజహాస"

కన్నడ కవిత తెలుఁగు కవితకుముందే వెలసినను గన్నడ కవిత ననుకరించి తెలుఁగు కవులు వ్రాసినను దర్వాతఁ గన్నడకవులు గొంచఱచేఁ దెనుఁగులోని యతినియతి పాటింపఁబడినదని దెలియవచ్చెడు. కన్నడభాషలో 16-వ శతాబ్దివాఁడగు నీశ్వరకవి వడిని బాటించుటేకాక కాకుస్వర, సరస, ఎక్కటి, సంయుక్తాక్షర, వళ్ళ నైదింటిని బేర్కొనియె. తెలుఁగు ఛందములోని వళి భేదముల నాతఁడు గ్రహించి రచించెననుటలో సందియములేదు. ఇవ్వళ్ళు ప్రాచీన కన్నడ వాఙ్మయమున లేవు. అందుఁ గనకదాసకవియుఁ బ్రాసవళ్ళతోఁ బద్యములు వ్రాసెనఁట. తమ భాషలో దెలుఁగు యతి వంటిది లేమిని దిలకించియే కన్నడభాషాకవులు 'కన్నడక్కె యతి యిల్ల కోణక్కె మతియిల్ల'అను సామెతను సృష్టించిరి కాఁబోలు. దీనింబట్టి తెలుఁగులోని యతిప్రాసముల వైశిష్ట్యమెట్టిదో విజ్ఞులరయుదురు గాక.

---

# 3. అప్పకవి చెప్పిన యతి భేదముల పరిశీలనము

భీమన తొలుతఁ గవిజనాశ్రయములో 10 యతులఁ జెప్పెను. తరువాత అనంతామాత్యుఁడు ఛందోదర్పణమున 24 యతులను, ఆ వెనుక చిత్రకవి పెద్దన సర్వలక్షణసారసంగ్రహమున 27 యతులను జెప్పిరి. అప్పకవి బహుగ్రంథములఁ బరిశీలించి యందఱికన్న నెక్కువగ 41 యతిభేదములను దెలిపెను. ఈ విధముగ యతిభేదములు నానాఁటి కెక్కువ యయ్యెనని తెలియుచున్నది. కాలక్రమమున వాఙ్మయములో గ్రంథజాలము పెరుగుటచేఁ బ్రయోగ వైచిత్రి కవకాశము కలుగును. ప్రయోగవైవిధ్యమాధారముగ యతిభేద సంఖ్య యధికము కాఁజొచ్చెను. ఉపలభ్యమాన పద్యలక్షణగ్రంథములలో నప్పకవీయములోనే యెక్కువ యతులు గానవచ్చుచున్నవి. అప్పకవి పూర్వలాక్షణికులు పేర్కొన్న యొక్క యతినే కొన్నిపట్టుల రెండు మూఁడు యతిభేదములు గావించెను. అందుఁ గొన్ని యనవసరములు. కాని కొన్ని క్రొత్తవి లేకపోలేదు. మఱి కొన్ని యనవసరములుగాఁ దోఁచినను స్పష్టప్రతిపత్తికై యట్లు భేద పరిగణనము చేయక తప్పినదిగాదు. ఈ విషయము లాయా యతిభేదముల క్రింద మున్నే యించుక పరామర్శింపఁబడినవి. ఇందు వానినెల్ల సంగ్రహముగా సమాకలనముచేసి దెల్పుచున్నాను.

స్వరయతులు, వ్యంజనయతులు, ఉభయయతులు, ప్రాసయతులు అని నాలుగు ప్రధానభేదములు పేర్కొని యందంతర్భేదములఁ గల్పించి మొత్తము 41 యతులు చెప్పినాఁడప్పకవి.

స్వరయతులు-7, వ్యంజనయతులు-21, ఉభయయతులు-2, ప్రాసయతి-1-మొత్తము యతులసంఖ్య 41.

భీమనాదులు స్వరప్రధానవడిని బ్రత్యేకభేదముగాఁ జెప్పలేదు. భీమన స్వరయతిక్రిందనే దీనిని జెప్పెను. కేవల స్వరమైత్రివళికిని సంధిగత స్వరమైత్రివళికిని భేదము గలదు గాన స్వరప్రధానవళిని జెప్పుట యెంతేనియు నావశ్యకమనఁ జెల్లును. ఋకారవడిలో అనంతుఁడు రెండు భేదములఁ జెప్పె; అప్పకవి మూఁడు భేదములఁ గల్పించె ఋ-రి మైత్రి ఋవళి; వత్రువసుడికి-ఇ ఎ ల మైత్రి ఋత్వ సంబంధవళి; వత్రుసుడికి వత్రుసుడి మైత్రి ఋత్వసామ్యవళి; ఇందు మూఁడు భిన్నవిషయములున్నవి; ఇవి యన్ని యొకటిగావు. అప్పకవి ముత్తెఱఁగులుగా విభజించుట సముచితము. అప్పకవి ఋత్వసామ్యవళి క్రొత్తగాఁ జెప్పినాఁడు, స్వరప్రధానవడిచేతనే లుప్తవిసర్గక స్వరవళి వృద్ధివళి యను రెండు గతార్థములగునని కొందఱి తలంపు. దాసః + అహమ్-దాసోహమ్-ఇందు స్వరప్రధానవడి యందువలెఁ బరస్వరమునకే యతి చేయవలసి యున్నను, నిండలి స్వరము గూఢమై యోత్వమాదేశమై నిలుచును గాన స్పష్టప్రతిపత్తికై దీనిని జెప్పవలసివచ్చె. అనంతుఁడును దీనిని జెప్పెను.

ఇఁక వృద్ధివళిలో స్వరప్రధానవడి యందువలెఁ బరస్వరమునకేకాక యాదేశ స్వరమునకును అనఁగా నుభయస్వరములకు యతి చెల్లును గాన నిందుఁ గ్రొత్త యంశము గలదు. ఇది ప్రత్యేక యతిభేదముగాఁ జెప్పుట తప్పనిసరి. అనంతుఁడు చెప్పలేదు; చిత్రకవి పెద్దన చెప్పెను. అప్పకవి చేసిన స్వరయతిభేదము లన్నియు యుక్తములైనవే. పూర్వలాక్షణికు లెవ్వరును జెప్పని దొక ఋత్వసామ్యవళి.

వ్యంజనాక్షరయతులలోఁ బ్రాసయతి యొక ప్రత్యేకభేదముగాఁ బూర్వలాక్షణికులు పేర్కొనలేదు. వ్యంజనయతిభేదములన్నింటిలోను స్వరమైత్రి యుండవలయునను సామాన్యవిధి గాన నియ్యది ప్రత్యేక భేదము గాదందురు. కాని వ్యంజనయతుల కియ్యది ముఖ్యలక్షణమగుటచేఁ బ్రథమముననే యప్పకవి దానిని పేర్కొన్నాఁడనవలె. సరసవళినే న-ణ లును, బిందుయతిచే నకారమునకు బిందుపూర్వక త థ ద ధ లును ణకారమునకు బిందుపూర్వక ట ఠ డ ఢ లును జెల్లుబడి యగుటంజేసి న-ణ లకుఁ గ్రమముగ బిందుపూర్వక టాదులు తాదులు చెల్లుచుఁ దన్మూలమున బిందుపూర్వక ట వర్గ త వర్గాక్షరములు పరస్వరము మిత్రములగుట కవకాశము గలుగును గాన అనునాసికాక్షరయతి అనుస్వారసంబంధయతి వేర్వేఱఁ జెప్పఁబనిలేదు. పు ఫు బు భు లు విభక్తి మకారమునకుఁ జెల్లుట మువిభక్తి యతియని, స హ జ మకారమునకు జెల్లుట ముకారయతి యని రెండు వేర్వేఱఁ జెప్పుట వ్యర్థము. ఒక్క ముకారయతిలోనే పు ఫు బు భు లు చెల్లునన్నఁ జాలును. పరిభాషలో భేదమే కాని రెండు భేదములలో మువర్ణ మొక్కటే కలదుగదా? అట్లే వ బ ల కభేదవిరతి ప ఫ బ భ వల కభేదవర్గయతి యని రెండు భేదములు చెప్పుట యనవసరము. అభేదయతియను నొక్క భేదమే పేర్కొని యందే ప ఫ బ భ వలు చెల్లునన్న జాలును. సరసవళిలో 'అ య హ లు' 'చ ఛ జ ఝ శ ష స లు' చెల్లునని చెప్పఁబడుటచే మఱల య హ లకు ఋజు యతి, శ ష స ల కూష్మవిశ్రాంతి చెప్పుట నిష్ప్రయోజనము. అప్పకవి ఋజూష్మయతుల ముందుఁగ జెప్పి తరువాత సరసవళిని బేర్కొన్న పద్ధతి రమ్యమే కాని యియ్యది పునరుక్తి, అనవసరము; వృథాపెంపకము. కొందఱు తద్భవవ్యాజ విశ్రామము (జ్ఞ-న), 'విశేషవళి (జ్ఞ-క) చేర్చి జ్ఞావడి యను పేర నొకటిగానే చెప్పనగునందురు. ఇందు నకారము కవర్గము భిన్నములు. కాన వీనిని వేర్వేఱఁ జెప్పుట యొప్పిద మనక తప్పదు. విశేషవళి యప్పకవి క్రొత్తగాఁ బరిశీలించి చెప్పినది. ప్రత్యేక భిన్న యతులఁ బ్రత్యేక యతిభేదములుగాఁ జెప్పనక్కఱలేదు. 'చేతిది-ధరించు' అను రూపములందు వ్యంజనమునకు 'చేతియది-ధరియించు' అనుచో స్వరమునకు యతిచేయవలెనని చెప్పకే తెలియుచున్నది. కాని- 'చేతిది-ధరించు' అనుచోట స్వరప్రధానవడి చెల్లు నను భ్రాంతిని వారింపనెంచి యీ యతిభేదములఁ జెప్పుట యావశ్యకమైనదనవలె. 'చేతిది' అను శబ్దవిషయమెట్లున్నను 'ధరించు' ఇత్యాదించుగాగమ ధాతురూపములలో నుభయయతి చెల్లవచ్చు

నని ప్రయోగములఁబట్టి చెప్పనగును. అప్పకవి కట్టిది సమ్మతముగాదు. సులక్షణసారమున 'ధరించు' ఇత్యాదులం దుభయయతి యుపదేశింపఁబడినది. ర-అ యతి సాంకర్యవిముఖుఁడగుటచే ర-అ యతి నిషేధమును స్పష్టపఱుపఁదలచి యేకతరయతి నుపదేశించె. అంత్యోష్మసంధియతి (వాగ్ఘరి), వికల్పవిరమణము (సన్మని) ఉభయరూపము లుండుట చేతనే యుభయాక్షరములకు (గ, హ: త - న) యతి చెల్లుబడి చెప్పబడినది, వికల్పరూపములున్నపు డిట్టి యతులఁ జెప్పుట వ్యర్థము. మీఁదుమిక్కిలి యట్లు చెప్పఁదలచినను రెంటిని జేర్చి యొక వికల్పవిరమణముననే చూపవచ్చును, కాని యవి భిన్నసంధులకుఁ జెందినవను తలంపున నప్పకవి యట్లు చెప్పినాఁడనవలె.

ఇఁక నుభయయతులు-స్వరసంధిగల సమస్త శబ్దములలో సంధిస్థలమున నిలచిన వ్యంజనమునకు యతి గూర్పవచ్చునని యఖండ యతి చెప్పును. స్వర సంధి యుంటచే స్వరమున జెల్లునని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. అఖండ యతి యొక్కదానియందే యుభయయతులన్నియు నంతర్భూతములగును. అఖండ యతిని జెప్పిన నుభయయతి భేదములఁ జెప్పుట వ్యర్థము. అఖండయతితోఁబాటు ఉభయయతి భేదములను జెప్పినవారు భీమన చిత్రకవిపెద్దన ప్రభృతులున్నారు. అఖండయతి సమ్మతింపనివాఁడు గాన అప్పకవి యుభయ యతిభేదములఁ గొన్నింటిని బేర్కొనెను.

ఉభయయతులలోఁ జేరఁదగినవి యింకను గొన్ని గలవు. ఏవార్థకివడి (పర్వంబ-పర్వంబు + అ) మానార్థకవడి (గంపెఁడు) ఇంచుగ్వడి (భిన్నయతి కైయతి (చతుర్థీవిభక్తి), సహార్థకవడి - మొ. నిత్యసమాసవిశ్రాంతులలో నుప సర్గసంధివడిని జెప్పుటకన్న దానిని ప్రాదియతులలోఁ జేర్చుటయు, మఱియందే నఞ్సమాసశబ్దములఁ బేర్కొనుటకన్న నఞ్సమాసయతి యని ప్రత్యేకముగాఁ జెప్పుటయు యుక్తము. కాకుస్వరపరిచేతనే ప్లుతయుగవిశ్రామము గతార్థమగును.

ప్రాసయతి యొక యతిభేదము గాదు. గీత సీసాదులలో యతికి మాఱు ప్రాసమైత్రి చేయవచ్చు. ఇది యతిభేదము గాదనవలె. యతికిమాఱు ప్రయుక్త మగునను కారణమున నప్పకవి యతిభేదములలోఁ గడపట దీనిని బరిగణించెను. దీనికి ప్రాసమైత్రి నియమమే కాన దీనితర్వాతఁ బ్రాసనిర్వచన ప్రాసభేద నిరూపణములు చేయఁబడెను. ప్రాసయతి చెప్పుటలో నప్పకవికిఁ జిత్రకవి పెద్దన మార్గదర్శకుడు.

ప్రయోగదృష్టములైన ఔవడి యిత్యాదులు నప్పకవి సంగ్రహింపలేదు. మొత్తముమీఁద అప్పకవి యతిసంఖ్యను గొంచె మధికముచేసిన వాఁడనక తప్పదు. స్పష్టప్రతిపత్తి కని యెంత వాదించినను ము విభక్తి, అభేదవర్గ, ఋజు, ఊష్మ, ప్రత్యేక యతు లనవసరము లనక తప్పదు.

# 4. ప్రాసభేదపరిశీలనము

ఇందు సైత మనవసరభేదములు గొన్ని గలవు. సమప్రాసములోనే అర్ధబిందు, పూర్ణబిందు, సంయుతాక్షరప్రాసములు మూఁడు నంతర్గతములగును. మూఁడు భేదము లనవసరము. సంయుతాసంయుతప్రాస చెప్పినప్పుడు రేఫయుతప్రాస కవకాశములేదు. వికల్పవిరమణమువలె వికల్పప్రాస యుభయరూపములున్నప్పుడే చెల్లును గాన దీనిని జెప్పుటలోఁ బ్రయోజనము శూన్యము ప్రాసవైరము ప్రాసభేదము గాఁజాలదు. ఇది యేకతరయతివంటిది. స్వరసంధిఁ జెందునపుడు హల్లు దానప్రాసమగునని ప్రాసాక్షరమైత్రిలోఁ దొలుతఁ జెప్పఁబడినది గాన లఘు యకారప్రాసముల నొకభేదముగాఁ జెప్పుట యనవసరము. అవియునుగాక దీనిని సంధిగతప్రాసలోనైన జేర్చవచ్చు.

ప్రయోగముల కలిమిచే స-శ లకు, ం-డ లకు ల-ర లకు సభేదప్రాస చెల్లునని చెప్పవలెను. అప్పకవి కియ్యది యిష్టము గాదనవలె.



# 5. అప్పకవి చెప్పని యతిప్రాస విశేషములు

యతిప్రాస భేదములను వివరించు పట్టుననే యప్పకవి చెప్పక విడిచిన కొన్ని యతిమైత్రీవిశేషములు సూచింపబడెను. ఇఁక నిందుఁ బ్రత్యేకముగ మఱికొన్నియుఁ జూపఁబడును.

ఌకార యతి :-

ఈ యతిభేద మనంతుఁడు మాత్రము చెప్పెను.

'ఘన లకారంబ యగును ఌకార విరతి
క్లృప్తిలేదు శౌరి గుణావ + శికి ననంగ.' (ఛందోదర్పణము-1-90)

ఋకారమునకు రి వర్ణము చెల్లునట్లు ఌకారమునకు లివర్ణము చెల్లునని యనంతుని మతమగుట తెలియుచున్నది. దీనికిఁ బ్రయోగము మృగ్యము.

ఌత్వయుక్తమైన దొక్కటే-క్లృప్తశబ్దమే వ్యవహారమున నున్నది. అప్పకవి సంయుతాసంయుతప్రాసలో క్లృప్తశబ్దమును సంగ్రహించెను. యతిలో ననంతుఁడు చెప్పియుండఁగా నప్పకవి యేల యుపేక్షించెనో?

ఌకార వడిగల ప్రయోగము లీ క్రిందివి గానవచ్చెడు—

సీ. వినవయ్య కృతవీర్యుఁడను జనపతి.........
కృతవీర్యు ధనమెల్లఁ + గ్లృప్తినేసి (భారత-ఆది-7-133)

సీ. ఘృతపయోరాశి సం + క్లృప్తావధికమైన
చంచత్కుశ ద్వీప జగతిఁజేరి (కాశీ-5-281)

గీ. క్లృప్త పట్టాభిషేక మం + గీకరించి (చంపూ రామా-8-165)

ఉ. కేవల భోగయోగ్య పరి + క్లృప్తి (ఎఱ్ఱన-హరి-ఉత్తర-4-314)

కృత్రిమాంభో మహ + క్లృప్తిహా భాగుర (కవుచె వీరరాజ వచన భారత పర్వాంత పద్యము)

ఈ ప్రయోగములఁబట్టి ఇకార స్వవర్గముతోఁ గూడిన క ఖ గ ఘ లు క్లృవర్ణముతో యతిమైత్రి నందునని యేర్పడుచున్నది. అప్పకవికిఁగాని మఱే లాక్షణికునికిఁగాని యధునాతన పరిశోధకులకుఁగాని యీ ప్రయోగములం దొకటియు గోచరము గాకుండుట వింతగా నున్నదనవలె.

ఏకార్థక యతి—

అ-ఎ-ఏ-లు తెలుఁగున ఏకార్థకములు-క్రింది ప్రయోగములఁబట్టి వీని కుభయయతి చెల్లునని తెలియుచున్నది.

పంద్రెండవ పర్వం, బ కడున్ మేలనఁగ శాంతి + పర్వము వెలయున్
(పర్వంబు + అ: భార-ఆది-158)

తా, న కడంకన్ హరివచ్చినం జెపుమని + న్నానంగ (నృసింహ-5-87)

మహనీయ సంయమం + బ మహాధనంబుగా (శృ-శాకుంత-4-112)

ర-లయతి—

అభేద యతిలో ర-లల మైత్రి చెప్పలే దప్పకవి. రలయతి చెల్లదని యగ్రాహ్య విరామములలో విమర్శించెను.

రాయంచ కాళ్ళఁ దౌ + అకయ మున్ను (వసు-4-25)
లీలాహాస్య కళా ప్రసంగముల ను + ద్రేకించి (కాశీ-6-20)
ఇత్యాది రలయతి ప్రయోగములు గానఁవచ్చెడు.
'రలయో రభేదః' అను ప్రమాణముగలదు గాన నిది గ్రాహ్యము.

సంయుక్త విశేషయతి—

(స్నాన శబ్దము.)

సంయుక్త యతినిబట్టి స్నానశబ్దా ద్యక్షరమునకు సకార నకారములు యతి చెల్లును; కాని యీ క్రింది పద్యములలో 'స్నాకు' తకారములో యతి గూర్పఁబడ్డది.

ధారాంబువులఁ గృత + స్నాతులై (పండిత-పర్వత-291 పుట)
స్నానమొనర్చి ధౌత పరి + ధానముఁగట్టి (హర-237)
స్నానమొనర్చి ధౌత పరి + ధానములన్ (రుక్మాంగ-195)
స్నానంబు దీర్చి ధౌ + తములైన వస్త్రముల్ (మత్స్య)

'స్నా'లో తకారములేదు. స్నానశబ్ద వైకృతము తానము. ప్రకృతిలో లేని తకారము వికృతిలో నున్నది. 'స్త్నానము' అనురీతి నుచ్చారణలో వినఁబడును. ఉచ్చారణనుబట్టి జ్ఞ కారమునకు నకారమునకు (దద్భవవ్యాజమున కకారమును జెల్లినట్లు) ఈ స్నానశబ్దమునకు తకారముగూడఁ జెల్లుఁబడి కాఁదగు నని యూహింపనగును.

ఋ-రు వడి—

'ఋ-రి' పదములు ఋవళిచేఁ జెల్లును, కాని 'ఋ-రు' లు చెల్లవు. ఋ రు వడి యేలాక్షణికుఁడును జెప్పలేదు. ఋకారము ఇకార స్వరగణము లోనిది, ఉకార స్వరసంబంధిగాదు. తెలుఁగువారి యుచ్చారణలో ఋషి-రుషి యను రీతి వినవచ్చును. ఈ యుచ్చారణనుబట్టి ప్రమాదవశమునఁ గొందఱు ఋ-రు లకును ఉత్వ ఋత్వములకును యతిగాపించిరి.

ఇట్టి ప్రమాదమును వారింపఁదలచియే కావలయు ననంతామాత్యుఁడు రీ విరమముతోఁబాటు రేఫయుతయతి నుపదేశించెను.

ఋ-రు వడి, దానింబోలిన ఉత్వ ఋత్వ స్వరవిశిష్ట వ్యంజనయతిగల ప్రయోగములు కొన్ని గ్రంథములలోఁ గానవచ్చుచున్నవి. అందు గొన్ని యీ క్రిందఁ జూపఁబడును.

క్రూరార్క చంద్రాస్త్ర + కృత్తోరుబాహులై (భాస్కరరామా-యుద్ధ) (1448)
సురనది నీచులంబడియు + శృంగములన్ ( ,, ,, 2527)
దురువర్ణ దేహంబు + ఋగ్వేదమునకు (పండిత-వాద-523పుట)
గృహధర్మ విరతులు + కొనివచ్చి (భో॰జ-3-27)
పుండరీక నేత్రుని నిజధామ వైభవ స + మృద్ధికి (భాగవత-10-ఉ5317)
ముక్కౌ సౌరాష్ట్ర భూ + భృతుకాలాధీశుండు (కవికర్ణ-2-86)

ఇది యప్రశస్తయతిలోఁ జేర్పఁదగినదని తోఁచినను నిందఱుకవులు ప్రమాదమునఁ బ్రయోగించిరనఁజెల్లునా? ఈ యతి సమ్మతినిగూర్చి పరిశీలింప వలయు.

ఉ-వు యతి...

ఉ-వుల యుచ్చారణ సామ్యమునుబట్టి తెలిసియో తెలియకయో కొందఱు కవులు వీరికి యతిమైత్రిఁ గూర్చిరి. అట్టి ప్రయోగములు గొన్ని చూపఁబడును.

గో,వుల గణియింప ధాతయును + నోపఁడు (భాగవత 10-ఉ-462)
ఉంది రాముండు కపిపుంగ + వులనుగూడి (వేంకటాచల-1-213)
దే,వునకు ననుంగు వాఁడనని + యుత్సుకతన్ (వృషాధిప-98)
ఒక్క,ని డించి పో + వుటయు భీతిల్లి (నవనాథ-92పుట)
ఓజమై జరయు జా + వున్ను దేవుల్లేని (ద్విపద భారతము-227పుట)

శ-స ప్రాస...

అప్పకవి యుభయప్రాసలో 'ష-స' లకు మాత్రమే మైత్రిని జెప్పినాఁడు. శసల ప్రాసమైత్రి యప్పకవి సమ్మతముగాదని స్థలాంతరమున నాతఁడే వ్రాసిన యీ క్రిందిపద్యములవలనఁ దెలియవచ్చెడు. (2ఆ-258, 259)

'శ స లెఱుఁగక చదువంగాఁ, బొసఁగదు.... ....
సింగంబు సింగిణి సెవమును సెలగోల వీ సెఁడు పసిగొనఁ జేసిరనఁగ
భీష్మ సన్నుతయని తృతీయోష్మలిపులు, గాని ప్రథమోష్మవర్ణముల్గావు వీనిఁ
దెలియకరచించి కృతులు ధాత్రితలమునఁ బ్రాసభంగంబులై నగుఁబాటుఁజెందు"

అప్పకవి దీనినిట్లు నిరాకరించినను ప్రాచీన ప్రయోగములు చాలఁగలవు.
కస్తూరి రంగకవి రంగరాట్ఛందమున శకార ప్రాసను జెప్పెను.
భసితంబుఁ జల్లి షో+డశు నెత్తివైచి (పండిత-497 పుట)
వ్రేసియుఁ జీలియున్.......కీశులు భీతిఁజెంది (భా-రామా-యుద్ధ)
సంసార భ్రమ—వంశం బీపరిపాటి (హర 2-111)
కంసునిబాధల—ద, ధ్వంశము (ఎఱ్ఱన హరి-పూర్వ-9-87)
ఏసియు వైచియుఁ గేశా, కేశియు (నన్ని-కుమార-12-169)
నాసానసాంగ దృ+గ్భ్రూశిరోజ (భాగవత-2-158)
బిసరుహగర్భు వ్రాఁతయును-దశరథరాము బాణము (భీమకవి చాటువు)

సంయుక్త విశేషప్రాస—

సంయుతాక్షర ప్రాసలో సంయుక్తములో నెన్ని హల్లులే క్రమమున జేరియుండునో యన్ని పాదములం దా రీతిగానే ప్రాసస్థానములో నుండవలెనని నియమము. శివకవుల కవితలోఁ బ్రచురముగఁ గతిపయ హల్సామ్యముగల ప్రయోగములు గాననగును.

ఇక్ష్వసుమతి-పువ్వు-సర్వజ్ఞ ఎవ్వాడు (శివతత్త్వ-196)
భర్గుఁడు-తర్గంగా—నుగ్గాడ-మ్రుగ్గింతు (నన్ని-కుమార-11-84)
మర్త్యలోకమునకును – కర్తయున్నాఁడె (బసవ)
లక్షణంబునఁ బంచ - భక్ష్యముల్ (బసవ)

పూర్ణార్ధ బిందుప్రాస—

అప్పకవి మతమునఁ బూర్ణబిందుప్రాస సమప్రాసలోనిది. ఖండాఖండ ప్రాసనుబట్టి యర్ధబిందుప్రాస యసమప్రాసగావచ్చును. అట్లుగాక ప్రాసాక్షర

మునకు ముందొకచోఁ బూర్ణబిందువును ఒకచో నర్ధబిందువును నిలుపుట లాక్షణిక సమ్మతముగాదు. దీనిని బూర్ణార్థ బిందుప్రాసయని యర్వాచీనులు పేర్కొనిరి. నన్నిచోడ పాల్కురికి సోమనాథాది శివకవు లిట్టి ప్రాస నధికముగ వాడిరి.

పోఁడిగ నగజ తపశ్శిఖి, మూఁడు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన, ఖాండము క్రియఁదాల్చె దత్ప్రభాభాసి
తమై (నన్ని-కుమార-6-157)

ఈ స్థలమందుఁ గొందఱు 'పోండిగ, మూండు' అనురీతిఁ బూర్ణబిందు రూపముతోఁ బఠించి సమప్రాసగ సరిపుత్తురు. ప్రాచీనకాలమున 'పోండి, మూండు' అను తెలుఁగున నిండు సున్నయుండి కాలక్రమమునఁ దేలిపోయి యరసున్నలు నిలిచెనందురు.

ఏఁగు—వా, మాంగము-లోఁగిన-వే, దాంగు (నన్ని-కుమార-1-4)
పాండురాంగంబైన పడఁతిగర్భమున పోఁడిగా వెలుఁగుచు (బసవ)
'పాఁడి ద్రచ్చఁగ నిమ్ము నా-తండ్రి కృష్ణ' అను నప్పకవి సంయుతా సంయుత ప్రాసలక్ష్యము దీనింబోలినది.

వర్గప్రాస—

అప్పకవి ద ధ లకు థ ధ లకు మాత్రమే యీ ప్రాస చెప్పెను.
క-ఖ, ట-ఠ, డ-ఢ, బ-భ లకుఁగూడఁ బ్రయోగములు గానవచ్చెడు.
శ్రీకరమై తగు నీశశి, రేఖాపరిణయము (శశిరేఖ)
కంటకాహిత కంఠ+లుంఠనోద్ధత లీల (కృష్ణరాయ-3-58)
గూఢ వేదాంత....రత్న, రూఢి (పండిత-దీక్షా-52 పుట)
కంబకట్లను...గంభీర పుష్పకా (బసవ)

......

# 6. యతిభేదముల సంగ్రహ వివరణ

## 1. స్వరయతులు—

1. స్వరమైత్రివళి—

అ-ఆ-ఐ-ఔ— ఇ-ఈ-ఋ-ౠ-ఎ-ఏ—ఉ-ఊ-ఒ-ఓ

ఇంకొక్కొక్క వర్గములోని యక్షరములు తమలోఁదాము యతిమైత్రి నందును. ఇట్లే మీఁద నెఱుఁగునది.

2. స్వరప్రధానవళి—

అచ్సంధిగల శబ్దములలోఁ బరపదాద్యచ్చునకు యతిమైత్రి గూర్చుట అతుల-వంశాబ్ధి (వంశ + అబ్ధి)-ఇందు సంధిలో నుత్తరపదాదిస్వరమునకు యతి.

3. లుప్తవిసర్గక స్వరవళి—అకారముమీఁది విసర్గకు అకారము పరము కాఁగా వచ్చు ఓకారమునకు అకారములోయతి....తమోర్క- (తమః + అర్క) అకారమునకు యతి.

4. ఋవళి.... ఋ—ృ = రి-రీ-రె-రే. (ృ = వట్రసుడి)

5. ఋత్వసంబంధవళి—ృ (వట్రసుడి) ఇ-ఈ; ఋ-ౠ-ఎ-ఏ.

6. ఋత్వసామ్యవళి-ృ-ృ. (కృ-వృ)

7. వృద్ధివళి-వృద్ధిసంధియం దుభయ స్వరమైత్రి
(లోక + ఏక-లోకైక-ఏ-ఐ)
(భక్త + ఓఘ-భక్తౌఘ-ఓ-ఔ)

## II. వ్యంజనాక్షరయతులు—

8. ప్రాణివిరామము:—హల్లునకు యతిగూర్చుటయందు హల్లునకే కాక దానిమీఁది యచ్చునకును మైత్రి యుండవలయును.
క-కా-కై - కౌ;-కి-కీ-కృ-కౄ-కె-కే; కు-కూ-కొ-కో మొ॥

9. వర్గజయతులు :-
క ఖ గ ఘ - చ ఛ జ ఝ - ట ఠ డ ఢ - త థ ద ధ - ప ఫ బ భ. అనునాసికములు తప్ప దక్కిన నాల్గక్షరము లాయా వర్గములలో మిత్రములు.

10. బిందుయతులు :-
ంక-ఙ-ంచ-ఞ- -ంట-ణ- -ంత-న-ంప-మ.

ంక = ంక-ంఖ-ంగ-ంఘ — అని వర్గాక్షర చతుష్కము గ్రహింపవలయు, ఇట్లేతక్కినవి.

11. తద్భవవ్యాజ విశ్రామములు-జ్ఞ-న-ణ.

12. విశేషవళి-జ్ఞ-క—ఖ—గ-ఘ.

13. అనుస్వార సంబంధయతి-ంట వర్గము-ంత వర్గము.

14. అనునాసికాక్షరయతి - ంట వర్గ - న: ంత వర్గ - ణ.

15. ముపిభక్తియతి - (విభక్తి) ము - పు ఫు-బు-భు.

16. ముకారయతి - (సాధారణ) మువర్ణ - పు ఫు బు భు.

17. మువర్ణవిరామము-ంయ-ంర-ంల-ంవ-ంశ-ంష-ంస-ంహ-మ.

18. ఋజుయతి - య-హ.

19. ప్రత్యేకయతి - చేతి + అది-చేతియది-స్వరమైత్రి.
చేతిది-వ్యంజనమైత్రి

20. భిన్నయతి - ధరియించు - స్వరమైత్రి; ధరించు - వ్యంజనమైత్రి
(పెఱయతి)

21. ఏకతరయతి - ర - ర—ఱ - ఱ—(ర - ఱ లు
తమలోఁదాము చెల్లవు)

22. అభేదవిరతి - వ-బ; ల - డ; ల - ళ.

28. అభేదవర్గయతి-ప-ఫ-బ-భ-మ.

24 ఊష్మవిశ్రాంతి-శ-ష-స.

25. సరసవళి-అ-య—హ — చ-ఛ-జ-ఝ-శ-ష-స — న-ణ.

26 సంయుక్తయతి-సంయుక్తాక్షరములలో నేదే నొక హల్లునకు మైత్రి.
క్ష్మ-క, ష, మ - (ఏదో యొకటి చెల్లును)

27. అంత్యోష్మ సంధివడి - వాక్ + హరి-వాగ్ఘరి-క, హ

28. వికల్ప విరమణము—
అనునాసిక సంధియందుభయ హల్లులకు యతిమైత్రి.
సత్ + మతి - సన్మతి - త - న

III. ఉభయ యతులు

యుష్మత్ - ఆజ్ఞ - యుష్మదాజ్ఞ — మున్నగు అచ్సంధిగల శబ్దములలో సంధ్యక్షరములోఁ గేవల స్వరమునకుఁగాని వ్యంజనమునకుఁగాని మైత్రి గూర్పనగు. ఇట్లే యీ క్రింది యుభయ యతులకు స్వర వ్యంజనోభయ మైత్రి చెల్లునని యెఱుఁగునది.

29. యుష్మదస్మ చ్ఛబ్దయతులు - యుష్మదాగమనము, అస్మదాజ్ఞ (ద-అ)

30. పరరూపయతి—

శకంధు, కర్కంధు, కుద్దాలాది పరరూపసంధిగతశబ్దములం దుభయవళి.

31. ప్రాదియతి (ప్ర + ఆరంభము) - ప్రారంభము-ఇత్యాది-ప్రాద్యుప సర్గయోగముగల శబ్దములలో నుభయయతి.

32. నిత్యసమాసయతులు (అఖండ విశ్రమములు)
జనార్దన, నారాయణ, కర్ణాటాది నిత్యసమాస శబ్దములం దుభయయతి.

33. దేశ్యనిత్యసమాస విశ్రాంతులు—
రూపఱు, కర్చట్టు, క్రిక్కిఱియు-ఇత్యాది దేశ్య శబ్దములలో నుభయయతి.

34. నిత్యయతి, కూర్రకర్మ దేని-ఏని శబ్దసంధిలో నుభయయతి.

35. రాగమ సంధివళి-జవరాలు (జవ + ఆలు). రుగాగమ సంధిలో నుభయయతి

36. విభాగవళి-ఏసి సంధి-నాలుగేసి-ఉభయ యతి.

37. నామాఖండ విశ్రమములు - అన్నాది సంధియం దుభయయతి— రామన్న, సీతమ్మ ఇత్యాదులు.

38. పంచమీవిభక్తి విరామము - రాముని కన్న, రామునికంటె (రాము నికి + అన్న, అంటె-అని ఛేదము.

39. కాకు స్వరవళి – దూరాహ్వానాదులందలి తుది దీర్ఘాక్షరమున కుభయ యతి రామా: - మ. అ.

40. ప్లుతయుగ విశ్రామములు-పాదాది యతిస్థానములలోఁ బ్లుతస్వర మైత్రి రా, వే ....... రఘుప + తీ.

IV. ప్రాసయతి :—

41. గీత సీసపద్యములందు యతికి మాఱు ప్రాసమైత్రి గూర్చుట.

# 7. ప్రాసభేదముల సంగ్రహ వివరణ

1. అర్ధబిందు సమప్రాస-వీఁక-తాఁకి (అరసున్న ప్రాస)
2. పూర్ణబిందు సమప్రాస-పొందు-బృంద-ఇందీ-నందన
3. ఖండాఖండ ప్రాస-బోఁటి, పాట, తీఁగ, నాగ
   (అరసున్న కలిగిన యరసున్న లేని యక్షరములకుఁ బ్రాస)
4. సంయుతాక్షర ప్రాస-గర్గ, భర్గ (ప్రాసలో సంయుక్తాక్షరము)
5. సంయుతా సంయుత ప్రాస—
   క్రారవడి కలిగిన సంయుక్తాక్షరముతో క్రారవడిలేని
   వర్ణమునకుఁ బ్రాస, శ్రీకర-ఈక్రియ
6. రేఫయుత ప్రాస-క్రారపడి ప్రాస-శ్రీ క్రొమ్ముడి వాక్రువ్వ
7. లఘుద్విత్వ ప్రాస-విదుర్చు-అదుర్చ
   (ఇందు సంయుక్త పూర్వాక్షరములు లఘువులు)
8. వికల్పప్రాస-దిఙ్మహిత-యుగ్మ
   (అనునాసిక వికల్పసంధ్యక్షరమునకుఁ బ్రాస)
9 ఉభయప్రాస-న-ణలకు, స-ష లకుఁ బ్రాస
   ప్రాణ, దాన, వసుధ, విషమ
10. అనునాసిక ప్రాస-తమ్ములు-భక్తిమ్మురసంహర
    భక్తిన్ + మురి-ఇందలి ద్విత్వము బిందుపగును. (భక్తింముర)
11. ప్రాసమైత్రి ప్రాస-మ్మ-ంబ లకు బ్రాస
12. ప్రాస వైరము-ర-ఱ లకుఁ బ్రాస చెల్లదు.
13. స్వవర్గజప్రాస-థ ధ; ద,ధ లకుఁ బ్రాస
14. ఋప్రాస-ఋ-ర లకుఁ బ్రాస, ఆ ఋషి.... చీరలు.
15. లఘు యకారప్రాస-ఆ యజుఁడు, శాయి.
    (ఆ + అజు-ఆ యజు-ఇందలి యకారము లఘువు)
16. అభేద ప్రాస-ల-ళ లకు, ల-డ లకుఁ బ్రాస
17. సంధిగత ప్రాస సంధ్యక్షరమునకు సమప్రాస.
    సింగము-వ, చ్చెంగుంతి (వచ్చెను + కుంతి)



# 8. యతుల పట్టిక

| భీమన కవిజనాశ్రయము 10. | అనంతుని ఛందోదర్పణము 24. | చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము. 27. | అప్పకవీయము. 41 |
|---|---|---|---|
| 1. స్వరయతి | 1. స్వరయతి | 1. స్వరయతి | 1. స్వరమైత్రి వడి |
| | | | 2. స్వర ప్రధానవడి |
| | 2. గూఢ స్వరయతి | | 3 లుప్త విసర్గక స్వరవడి |
| | 3. రీ విరమము | 2. రివడి | 4. ఋవళి |
| | 4. ఋకార స్వరూపయతి | 3. ఋవడి | 5. ఋత్వ సంబంధవళి |
| | | | 6. ఋత్వ సామ్యవళి |
| | 5. ఔకారయతి | | |
| | | 4. వృద్ధియతి | 7. వృద్ధివళి |
| | | | 8. ప్రాణి విరామము |
| 2. వర్గయతి | 6. వర్గయతి | | 9. వర్గయతి |
| 3. బిందు యతి | 7. అనుస్వారయతి | 5 వర్గవడి | 10. బిందుయతి |
| | 8. తద్భవ వ్యాజయతి | 6. అనుస్వారయతి | 11. తద్భవ వ్యాజయతి |
| | | 7. జ్ఞావడి | 12. విశేషవడి |
| | | | 13. అనుస్వార సంబంధయతి |
| | | | 14. అనునాసికాక్షరయతి |

| | | | |
|---|---|---|---|
| 4. పోలిక వడి | 9. పోలికవడి | 8. పోలిక యతి | 15. మువిభక్తి యతి |
| | | 9. చక్కటి యతి | 16. ముకారయతి |
| | 10. మకారయతి | 10. మావడి | 17. మువర్ణ విరామము |
| | | | 18. ఋజుయతి |
| | | | 19. ప్రత్యేకయతి |
| | 11. భిన్నయతి | 11. భిన్నయతి | 20. భిన్నయతి |
| 5. ఎక్కటి వడి | 12. ఎక్కటి వడి | 12. ఎక్కటి యతి | 21. ఏకతరయతి |
| | 13. అభేదవిరతి | 13. అభేద యతి | 22. అభేద విరతి |
| | | | 23. అభేదవర్గయతి |
| | | | 24. ఊష్మ విశ్రాంతి |
| 6. సరసవడి | 14. సరసయతి | 14. సరసయతి | 25. సరసవడి |
| 7. సంయుక్త యతి | 15. సంయుక్త యతి | 15. సంయుక్త యతి | 26. సంయుక్తయతి |
| | 16. వికల్పయతి | | 27. అంత్యోష్మ సంధివడి |
| | 17. యుక్త వికల్పయతి | 16. వికల్పయతి | 28. వికల్ప విరమణము |
| | 18. రేఫయుత యతి | | |
| | | 17. ఉభయ యతి | 29. యుష్మదస్మచ్ఛబ్ద యతి |
| | | 18. శకంధ్వాది యతి | 30. పరరూపయతి |
| 8. ప్రాదియతి | 19 ప్రాదియతి | 19. ప్రాదియతి | 31. ప్రాదియతి |
| | 20. నిత్యసమాస యతి | 20. నిత్యసమాస యతి | 32. నిత్యసమాసయతి |
| | | 21. ఆదేశయతి | |
| | | 22. దేశీయ యతి | 33. దేశ్య నిత్యసమాసయతి |

| భీమన కవిజనాశ్రయము | అనంతుని ఛందోదర్పణము | చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము. | అప్పకవీయము |
|---|---|---|---|
| | 21. నిత్యయతి | | 34. నిత్యయతి |
| | | | 35. రాగమ సంధివడి |
| | 22. విభాగయతి | 23. విభాగయతి | 36. విభాగవళి |
| | 23. ప్రభునామాంత యతి | 24. ప్రభుయతి | 37. నామాఖండ విశ్రమము |
| | | | 38. పంచమీవిభక్తి యతి |
| 9. ప్లుతయతి | 24. కాకుస్వరయతి | 25. కాకుస్వరయతి | 39 కాకు స్వరవడి |
| | | 26. ప్లుతియతి | |
| | | | 40. ప్లుతయుగ విశ్రామము |
| 10. అఖండవడి | | 27. అఖండయతి | |
| | | | 41. ప్రాసయతి |

ఇందు అప్పకవీయములోని యతిభేదములు భీమనాదులు చెప్పిన యతిభేదములతోఁ బోల్చి చూపఁబడినవి.



## 9. ప్రాసభేదముల పట్టిక

| అప్పకవి | అనంతామాత్యుఁడు (ఛందోదర్పణము) |
|---|---|
| 1. అర్ధ బిందు సమప్రాస<br>2. పూర్ణబిందు సమప్రాస<br>3. సంయుతాక్షర ప్రాస | సమప్రాస (1) |
| 4. ఖండాఖండ ప్రాస | అర్ధబిందు ప్రాస (9) |
| 5. సఁయుతాసంయుత ప్రాస | త్రిప్రాస,<br>ఉభయ ప్రాస (10) |
| 6. రేఫయుత ప్రాస | సంయుతప్రాస (11) |
| 7. లఘు ద్విత్వప్రాస | సమలఘు ప్రాస (6) |
| 8. వికల్ప ప్రాస | వికల్ప ప్రాస (7) |
| 9. ఉభయ ప్రాస | ప్రాది ప్రాస (5) |
| 10. అనునాసిక ప్రాస | ... ......... |
| 11. ప్రాసమైత్రి ప్రాస<br>16. అభేద ప్రాస | ప్రాసమైత్రి ప్రాస (2) |
| 12. ప్రాస వైరము | ............ |
| 13. స్వవర్గజ ప్రాస | .... ......... |
| 14. ఋ ప్రాస | ఋ ప్రాస (3) |
| 15. లఘు యకార ప్రాస | ............. |
| 17. సంధిగత ప్రాస | సంధిగత ప్రాస (12)<br>బిందు ప్రాస (8) |

ఇందు అనంతాప్పకవులు చెప్పిన ప్రాసభేదములు పోల్చి చూపఁబడినవి.

---

# *10. అప్పకవి ఉదాహరించిన గ్రంథములు

అథర్వణాచార్యుని విరాటపర్వము
అనంతుని ఛందము
(ఛందోదర్పణము)
అష్టమహిషీ కల్యాణము
ఆది పురాణము
ఆముక్తమాల్యద (విష్ణుచిత్తీయము)
ఉత్తర హరివంశము
కవికర్ణ రసాయనము
కవిజనాశ్రయము
కళాపూర్ణోదయము
కాళహస్తి మాహాత్మ్యము
కావ్యచింతామణి
కావ్యాలంకార చూడామణి
కాశీఖండము
కాకుత్స్థవిజయము
కూర్మపురాణము
చంద్రికా పరిణయము
చమత్కార మంజరి
చమత్కార రామాయణము
చారుచర్య చరిత్రము
చిత్రభారతము
జైమిని భారతము
త్రైశంకవోపాఖ్యానము
దేవకీనందన శతకము
దేవీ విజయము
నృసింహ పురాణము

భాస్కర రామాయణము
భాస్కర శతకము
మధుసేనము
మనుచరిత్రము
మరుస్నందన శతకము
రంగనాథ రామాయణము
రాఘవ పాండవీయము
రాజశేఖర చరిత్రము
రామాభ్యుదయము
రుక్మాంగద చరిత్ర
వజ్రపంజర శతకము
వరాహ పురాణము
వసంత విలాసము
వసుచరిత్ర
వాసిష్ఠ రామాయణము
విక్రమార్క చరిత్రము
విజయ విలాసము
విజయసేనము
వీథినాటకము
శమంతకమణి చరిత్రము
శృంగారషష్ఠము
శేషధర్మము
శ్రీరంగ మాహాత్మ్యము
సర్వలక్షణసార సంగ్రహము
(చిత్రకవి పెద్దన)
సాంబవిలాసము

---

* ఈ తృతీయాశ్వాసము లోనివి.

నైషధము
పద్మపురాణము
పరమయోగి విలాసము
పారిజాతాపహరణము
ప్రభావతీ ప్రద్యుమ్నము
భారతము (కవిత్రయము)
సాంబోపాఖ్యానము
సుదక్షిణాపరిణయము
హరిశ్చంద్రుని కథ
హరిశ్చంద్రోపాఖ్యానము
చాటుపద్యములు

* శ్రీ రేకము రామానుజ సూరిచేఁ బరిష్కరింపఁబడి సూర్యాలోక ముద్రాక్షరశాలలో ముద్రితమైన యప్పకవీయప్రతిపాఠములు వావిళ్ళవారి ప్రతి పాఠములు నిందు సంప్రతింపఁబడెను.



## 11. అప్పకవీయ భావప్రకాశికలో నుదహరించిన గ్రంథములు

| గ్రంథము | గ్రంథ కర్త | సంకేతము |
|---|---|---|
| అచ్చ తెనుగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి | అచ్చ-రామా |
| అథర్వణ కారికావళి | అథర్వణాచార్యులు | అథర్వణ |
| అథర్వణఛ్ఛందము | ,, | |
| అనుభవసారము | పాల్కురికి సోమన | |
| అప్పకవీయ వివరణము | వేదుల రామశాస్త్రి | |
| అమరకోశము-గురుబాల ప్రబోధిక | అమరసింహుడు | అమరము గురుబాల |
| ,, సుధావ్యాఖ్య | | |
| అష్టమహిషీకల్యాణము | తాళ్ళపాక తిరువేంగళనాథ | అష్టమహి |
| అహల్యాసంక్రందనము | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు | అహల్యా |
| అహోబల పండితీయము | అహోబల పండితుడు | అహో |
| ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము | వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి | |
| ఆంధ్రశబ్ద చింతామణి | నన్నయ భట్టు | చింతామణి |
| ఆనంద రంగరాట్ఛందము | కస్తూరిరంగకవి | రంగ |
| ఆముక్తమాల్యద | కృష్ణరాయలు | ఆముక్త |
| ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు | కంకంటి-ఉ-రా |
| ఉత్తర హరివంశము | నాచన సోమన | ఉ-హరి |
| కళాపూర్ణోదయము | పింగళి సూరన | కళా |
| కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహకవి | కవికర్ణ |
| కవిచింతామణి (అముద్ర)* | వెల్లంకి తాతంభట్టు | |
| కవిజన సంజీవని | ముద్దరాజు రామన | |
| కవిజనాశ్రయము (భీమన ఛందము) | వేములవాడ భీమకవి | కవిజన, భీమ |
| కవిరాజ మనోరంజనము | కనుపర్తి అబ్బయ | కవిరాజ |
| కవిసంశయ విచ్ఛేదము | అడిదము సూరన | కవిసంశయ |
| కాళహస్తి మాహాత్మ్యము | ధూర్జటి | కాళ-మా |

* అముద్రితము.

| గ్రంథము | గ్రంథకర్త | సంకేతము |
| --- | --- | --- |
| కాళహస్తీశ్వర శతకము | ధూర్జటి | |
| కాళిందీ కన్యాపరిణయము | అహోబల పండితుడు | కాళిందీ |
| కావ్యాదర్శము | దండి | |
| కావ్యాలంకార చూడామణి | విన్నకోట పెద్దన | కావ్యా - చూడా |
| కాశీఖండము | శ్రీనాథుఁడు | కాశీ |
| కుమారసంభవము | నన్నిచోడుఁడు | నన్ని - కుమార |
| కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి | కృష్ణరాయ |
| క్రీడాభిరామము | శ్రీనాథుఁడు | క్రీడా |
| గరళపురీఛందము (అముద్ర) | నైషధము తిమ్మయ | గరళపురి |
| చంద్రరేఖా విలాపము | కూచిమంచి జగ్గకవి | చంద్రరేఖ |
| చంద్రికా పరిణయము | మాధవరాయలు | చంద్రిక |
| చంపూరామాయణము | ఋగ్వేదకవి వేంకటా చలపతి | చంపూ రామా |
| ఛందోదర్పణము (అనంతుని ఛందము) | అనంతామాత్యుఁడు | ఛందో |
| జైమిని భారతము | పిల్లలమఱ్ఱి పినవీరన | జైమిని |
| తత్సమచంద్రిక | సన్నిధానము సూర్యా నారాయణశాస్త్రి | |
| తెలుఁగుభాషలో ఛందోరీతులు | రావూరి దొరసామిశర్మ | ఛందోరీతులు |
| త్రిపురాంతకోదాహరణము | పాల్కురికి సోమన | |
| దశకుమార చరిత్ర | కేతన | దశకుమార |
| దశావతార చరిత్ర | ధరణిదేవుల రామమంత్రి | దశావ |
| ద్విపద భారతము | | |
| నరసభూపాలీయము | మూర్తికవి | నరస |
| నవనాథ చరిత్ర | గౌరన | నవనాథ |
| నానార్థ రత్నమాల (సంస్కృతము) | | |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి | నిరంకుశ |
| నిర్వచనోత్తరరామాయణము | తిక్కన | నిర్వ-ఉ-రామా |
| నృసింహ పురాణము | ఎఱ్ఱన | నృసింహ |
| నైషధము | శ్రీనాథుఁడు | శృం-నై |
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి | పంచ |

| గ్రంథము | గ్రంథకర్త | సంకేతము |
|---|---|---|
| పండితారాధ్య చరిత్ర | పాల్కురికి సోమన | పండిత |
| పద్మపురాణము | మడికి సింగన | పద్మ |
| పల్నాటి వీరచరిత్ర | శ్రీనాథుడు | పల్నాటి |
| పాంచాలీ పరిణయము | కాకమాని మూర్తి | పాంచాలి |
| పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | పాండు |
| పాణినీయ శిక్ష, సూత్రములు | | |
| పారిజాతాపహరణము | నందితిమ్మన | పారి |
| పింగళాచార్యచ్ఛందము | (సంస్కృతము) | |
| ప్రబంధరాజము | గణపవరపు వేంకటకవి | ప్రబంధ |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన | ప్రభావతి |
| ప్రౌఢవ్యాకరణము | బహుజనపల్లి సీతారామాచార్యులు | ప్రౌఢ |
| బసవపురాణము | పాల్కురికి సోమన | బసవ |
| బసవోదాహరణము | ,, | |
| బాలవ్యాకరణము | చిన్నయసూరి | బాల |
| ,, గుప్తార్థప్రకాశిక | కల్లూరి వేంకటరామశాస్త్రులు | |
| బాలసరస్వతీయము | బాలసరస్వతి | |
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నం పంతులు | బిల్వ |
| భర్తృహరి సుభాషితములు | ఏనుగు లక్ష్మణకవి | |
| భాగవతము | బమ్మెర పోతన | భాగ |
| భారతము | కవిత్రయము | భార |
| భాస్కర రామాయణము | భాస్కరాదులు | భా-రామా |
| భీమఖండము | శ్రీనాథుడు | భీమ |
| భోజరాజీయము | అనంతుడు | భోజ |
| మనుచరిత్ర | అల్లసాని పెద్దన | మను |
| మత్స్యపురాణము | హరిభట్టు | మత్స్య |
| మార్కండేయ పురాణము | మారన | మార్క |
| మొల్ల రామాయణము | మొల్ల | |
| యయాతి చరిత్ర | పొన్నిగంటి తెలగన | యయాతి |
| యాప్పరుంగలము (తమిళ ఛందము) | | |
| యామినీ పూర్ణతిలకావిలాసము | చెళ్ళపిళ్ళ నరసకవి | |
| రంగనాథ రామాయణము | రంగనాథుడు | రంగ-రామా |
| రసాభరణము | అనంతుడు | రస |
| రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మన | రసిక |

| గ్రంథము | గ్రంథకర్త | సంకేతము |
|---|---|---|
| రాజశేఖర చరిత్ర | మాదయగారి మల్లన | రా-శే-చ |
| రాజశేఖర విలాసము | కూచిమంచి తిమ్మన | రా-శే-వి |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని | రాధిక |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు | రామాభ్యు |
| రుక్మాంగదచరిత్ర | ప్రౌఢకవి మల్లన | రుక్మాం |
| లక్షణదీపిక (అముద్రి) | వార్తాకవి రఘునాథయ్య |  |
| లక్షణశిరోమణి (అముద్రి) | పొత్తపి వేంకటరమణకవి |  |
| లక్షణసారసంగ్రహము | చిత్రకవి పెద్దన | ల-సా-సం |
| వచనభారతము | కళువె వీరరాజు |  |
| వరాహపురాణము | నంది మల్లన ఘంటసింగయకవులు | వరాహ |
| వసుచరిత్ర | రామరాజభూషణుడు | వసు |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి | విజయ |
| విజ్ఞానేశ్వరీయము | కేతన | విజ్ఞాన |
| వృత్తరత్నాకరము (సంస్కృతము) |  |  |
| వృషాధీపశతకము | పాల్కురికి సోమన | వృష |
| వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమ్మ | వేంకట |
| వైజయంతీవిలాసము | సారంగు తమ్మయ | వైజయంతి |
| వైయాకరణపారిజాతము | వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి |  |
| శతకంఠరామాయణము | మర్దనకవి | శతకంఠ |
| శబ్దకల్పద్రుమము (సంస్కృతనిఘంటువు) |  |  |
| శబ్దరత్నాకరము | బహుజనపల్లి సీతారామాచార్యులు | శబ్దరత్న |
| శశిరేఖాపరిణయము (అముద్రి) | వేంకటరంగకవి | శశిరేఖ |
| శివతత్త్వసారము | మల్లికార్జున పండితుడు | శివ |
| శృంగారశాకుంతలము | పినవీరన | శృం-శా |
| శ్రీరంగమాహాత్మ్యము | భైరవకవి | శ్రీరంగ |
| షోడశకుమారచరిత్ర | వెన్నెలకంటి అన్నయ |  |
| సమీరకుమారవిజయము | పుష్పగిరి తిమ్మన | సమీర |
| సర్వలక్షణసారసంగ్రహము | కూచిమంచి తిమ్మన | సర్వ-సా-సం |
| సారంగధర ద్విపద | ,, |  |
| సింహాసనద్వాత్రింశిక | కొఱవి గోపరాజు | సింహ |

| గ్రంథము | గ్రంథకర్త | సంకేతము |
| --- | --- | --- |
| సిద్ధాంతకౌముది (సంస్కృతవ్యాకరణము) | | |
| సుకవిజనమనోరంజని (ఆము) | కూచిమంచి వెంకట్రాయకవి | |
| సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయ | సుదక్షిణ |
| సుభద్రాపరిణయము | కూచిమంచి జగ్గకవి | సుభద్ర |
| సులక్షణసారము | లింగమగుంట తిమ్మకవి | సులక్షణ |
| సూర్యరాయాంధ్రనిఘంటువు | | సూర్య-ని |
| హరవిలాసము | శ్రీనాథుఁడు | హర |
| హరివంశము | ఎఱ్ఱాప్రెగ్గడ | హరి |
| హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి | హరిశ్చంద్ర |



కౌముదీ శరదాగమము

(సిద్ధాంత కౌముది పూర్వార్ధమునకు

శ్రీ అప్పల్ల జోగన్నశాస్త్రిగారి వివరణము)

కౌముదీ శరదాగమము (తద్ధిత భాగము)

శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారి వివరణము

శ్రీమద్భాగవతము (వచనము) — 3 భాగములు

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

శ్యామశాస్త్రి కీర్తనలు - సంకలనము : శ్రీ భావరాజు నరసింహారావు

ముత్తుస్వామిదీక్షితుల కీర్తనలు ,,

త్యాగరాజు కీర్తనలు — 3 భాగములు ,,

జగచ్చంద్రిక

(శ్రీ భట్టోత్పల దీక్షిత ప్రశ్నశాస్త్రమునకు

విద్వాన్ చింతలపాటి లక్ష్మీ నరసింహశాస్త్రిగారి అనువాదము)

త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్

మచిలీపట్టణము - 521 001

**APPAKAVEEYA BHAVAPRAKASIKA** **Price : Rs. 20-00**